# ఓటి పడవ






రచన

అన్నాప్రగడ కామేశ్వరరావు

ఓటి పడవ

(నవల)

రచనాకాలం : 1930

వెల : అమూల్యం

ప్రతులకు :

1.డాక్టర్ అన్నాప్రగడ రోశయ్య
నారాయణగూడ,
హైదరాబాదు,
సెల్. 9849021029.

2. అన్నాప్రగడ సౌదామిని,
4సి, ఐ.సి.యస్ కాలనీ,
పూనా -7.
సెల్. 919822464279.

# అంకితం

ఎక్కడో గుజరాత్‌లో పుట్టి విప్లవ పంథాలో స్వాతంత్ర సంగ్రామం సాగిస్తున్న లోకం చుట్టిన తెలుగు విప్లవ వీరుడు అన్నాప్రగడ కామేశ్వరరావు గారికి అర్థాంగి అయి భర్త అడుగు జాడలలో నడుస్తూ, పోరాటం సాగిస్తూ...



క్విట్ ఇండియా ఉద్యమంలో

"గుంటూరు కదనరంగంలో గుజరాతీ వీరవనిత"

అని పత్రికలచే కీర్తించబడిన సరళాదేవి గారికి....

అన్నాప్రగడ సరళాదేవిగారి త్యాగం అనితర సాధ్యం. ఎక్కడో గజరాత్ లో సంపన్న కుటుంబంలో పుట్టి దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడుతూ జలియన్‌వాలా బాగ్ దురంతాలకు కారకుడైన సాండర్స్‌ను భగత్‌సింగ్ బృందం సంహరించడం అందులో అన్నాప్రగడ కామేశ్వరరావు గారి ప్రమేయాన్ని ప్రభుత్వం శంకించి వాళ్ళ కోసం అన్వేషణ ప్రారంభించగా కామేశ్వరరావుగారి విప్లవ పోరాట స్ఫూర్తిని మెచ్చి వరించి అతని అర్ధాంగై వరకట్నానికి భిన్నంగా కన్యాశుల్కంగా ఒక కృపాణాన్ని పొంది వివాహ వేదిక మీదనే స్వాతంత్ర్యోద్యమ కొనసాగింపుకు ప్రతిన బూనిన ధీశాలి శ్రీమతి అన్నాప్రగడ సరళాదేవి. గుంటూరులో కాపురం వుంటున్న సమయంలో పలుమార్లు ప్రభుత్వం తన భర్తను ఖైదు చేసి, కనీసం డిటెన్యూ పెన్షన్ కూడా సకాలంలో అందించకపోతే ముగ్గురు పిల్లలను పోషిస్తూ చదువులు కొనసాగిస్తూ ఎన్ని ఇబ్బందులకు గురైనదో వర్ణనాతీతం. ఆర్థిక బాధలకుతోడు భోజనం వేళకు తరలివచ్చే కాంగ్రెసు కార్యకర్తలు, ఖద్దరు వ్యాపారులు అజ్ఞాతంలో ఉన్న వాలంటీర్లు రావటం వాళ్లకు వండి వార్చి కడుపులు నింపటం తలకుమించిన భారంగా పరిణమించేది. నిజానికి స్వాతంత్ర్య పోరాటంలో పలుమార్లు జైళ్ల పాలైనా ఆ బాధ అయనకు ఆనందం అనిపించింది కాని సంసార సాగరాన్ని ఈదటంలో శ్రీమతి సరళాదేవి అనుభవించిన బాధలకు అవధులెక్కడ?

# ఓటిపడవ

"యావండోయ్...బాబుగారూ! ఈ పేటలో మేం బతికేట్టు లేం...మీ మేనల్లుడు మా ప్రాణాలు తీసేట్టున్నాడు...కుయ్యో మొర్రో అని ఎంత మొత్తుకున్నా మీ వాడికేం...మీరు అదుపు చెప్పేట్టులేరు. మొన్న మట్టసానికి మొన్న వాడు నిర్భయంగా మిట్టమధ్యాహ్నం నడి చెర్లో ఈతలు కొడుతుంటే చూసి వచ్చి మీతో చెప్పినందుకు ఇప్పుడు నేను నీళ్లకు పోతుంటే నడివీధిలో నా వెంబడి పడి రాళ్ళు రువ్వుతూ "ఓసి ముండా ఈత కొడుతున్నానని సాడీలు చెప్పి కొట్టిస్తావుటే పాచిపీనుగా! ఈ తడవ నా జోలికి వచ్చావా చూడు బుర్ర రామకీర్తన పాడిస్తా బోడి ముండ" అని నానా అపభ్రంశపు మాటలు కూసి నోటి కొట్టినట్లుగా తిట్టి నలుగుర్లో నన్ను అభాసు చేశాడు. ఆ రాళ్ళే తగలరాని చోట తగిలితే నా బతుకేం కావాలి చెప్పండి? ఇంత ఉపద్రవంటండీ! ఆర్నెల్లు సాము చేసి మూలనున్న ముసలమ్మను కొట్టినట్లు నా జోలికే రావాలా వాడు? పుణ్యానికి పోతే పాపమెదురైనట్టుంది. ఆ నిండు చెర్లో ఉద్దుగుడుచుక చస్తాడేమో మీరు కాస్త భయం చెబుతారని చెప్పినందుకు ఇదేనటండీ ఫలితం? దిక్కులేని దాన్ననా వాడీ పాటుపడటం. నాఖర్మకాలీ? నేనే దొరికానా వాడికి! వ్రేలెడు లేని వెధవ కుంకకు అంత మిడిసి పాటండీ?" అని పెద్దగా గుక్క తిప్పుకోకుండా వెర్రి కేకలు పెట్టి అరుస్తూన్నది వెంకమ్మ.

లోపల అరుగు మీద కూర్చున్న పేరయ్య శర్మ తన మేనల్లుడు ఇంటి మీదకు తగూలు తెస్తున్నాడనే కోపావేశంతో నెత్తుటి ముద్దయి ఎగాదిగా ఆ వెంకమ్మ వంక చూస్తున్నాడు.

అప్పుడే వచ్చి నడివాకిట్లో గడప దగ్గర నిల్చున్న సీతమ్మ ఇదెక్కడి పీడ తెల్లవారిందీ వెంకమ్మ ముండకి! అని మనసులో అనుకుంటూ "ఏమమ్మా వెంకమ్మ పొద్దున్నే లేచినప్పట్నించి నీకిదే పనా! అ అబ్బాయి మాత్రం దిక్కులేని వాడనా నీ అభిప్రాయం! పిల్లలకు కరువాచి ఏదో ఇంత చదువు చెప్పించి ఒక ఇంటివాడిని చేద్దాం గదా అని ముచ్చటగా తెచ్చుకున్న మా అడపడచు కొడుకు. ఎవరనుకున్నావో నీవతన్ని. ఇంట్లో నిలవనిచ్చేట్టు లేదే? సాడీలకు తెల్లవారిందా? కృష్ణారామా అని కాలం గడుపుకోక ఎందుకమ్మా ప్రొద్దున్నే పనిబడా తగుదునంటూ ఇంటిమీది కొచ్చి కొండేలు చెప్పి ఆ కుర్రావాణ్ణి కొట్టిస్తావు? అంత పెద్దదానివైనా పాపభీతి దయాదాక్షిణ్యాలు ఏ కోశానా ఉన్నట్టు లేవే

నీకు! పోవమ్మా పో" అని పెద్దగా అని నడుమున చేతులు పెట్టుకొని ఠీవిగా నిల్చొని చురచూరా ఆమె వంక కోపంతో చూస్తున్నది....ఇంతలోకి అరుగుమీద కూర్చున్న పేరయ్యశర్మ ఛడేలున శివమెక్కిన వాడిలా లేచి గుడ్లురుముతూ "ఏమే ఏందే...గాడిదా! ఇంత ఒళ్ళు పొగరా నీకు! నేనిక్కడుండగానే నీ కేకలు! వాడామెను ఏడిపించి ఎర్రమన్ను చెయ్యటం నీ కిష్టంటే? భయభక్తులు లేకుండా వాడట్లా మిడిసిపడుతూ ఇంటిమీదకు తగూలు తెస్తుంటే ఆమెనంటావేమే? వాడింటికి రానీ చెమడాలొలుస్తానో లేదో! అదుపు ఆజ్ఞ ఉండక్కర్లే! పెద్దదాన్ని బజార్లో పట్టుకొని బండబూతులు తిట్టి కొట్టబోతే ఆమె వచ్చి చెప్పటం తప్పయిందటే? బుజాలెగరేసుకుంటూ గొల్లభామలా చేతులు తిప్పుకుంటూ ఇంకా ఆమెమీద తగూలాడుతున్నావా? పో ఇంట్లోకిపో, పో ఇంట్లోకని పళ్ళు పట పటా కొరుకుతూ చేతులు పొడుచుకుంటూ పెండ్లాం మీదికి కొట్ట బొయ్యేటట్లు పోయినాడు.

సీతమ్మ కండ్ల నీళ్ళు కుక్కుకుంటూ మొహానికి పవిటె చెంగడ్డం పెట్టుకుని తానేడుస్తున్నది. ఈయన ఎక్కడ చూచి పోతాడో ఇంకా ఎం శాపనార్థం పెడతాడో పరువు తక్కువని దొడ్లో బావి దగ్గర స్నానం చేయడానికి పోయింది.

వెంకమ్మ వలవలా వగలేడ్పులేడుస్తూ ముక్కు చీదుకుంటూ కొంచెం బిగ్గరగా "నాయనా! దేవుడంటి వారు, మీరింకా ఈ ఇంట్లో వుండబట్టే మేం బతికిపోతున్నాం. లేకపోతే వాడు నన్ను పెట్టే బాధలకు, నా కొడుకును కొట్టే దెబ్బలకు, నాకూతుర్ని పెట్టే అల్లరికి, ఏ నుయ్యో గొయ్యో ఈ పాటికి చూచుకో వలసి వచ్చేదే. నూరేళ్ళు బతుకు బాబూ" అంటూ అటు మొహం తిప్పుకొని బుర్రమీద చెంగు కొంచెం మొహం మీదికి లాక్కొని చేతిలో బిందె చంకన పెట్టుకొని "ఇక ఆ కుర్ర గాడిద నా జోలికి రాకుండా అట్టకు అట్ట తాటకు తాట ఊడేట్టు కొడతాడు. కోపం వస్తే ఆయన మనిషే కాదు" అని మనసులో అనుకుంటూ ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ మడి నీళ్ళు తెచ్చుకోడానికి శివుడి బావి తట్టుతగిలి పోయింది వెంకమ్మ.

పేరయ్య శర్మ మనసుకేదో స్ఫురించి వీధి వాకిట్లోకి గబగబా బారదేసి అంగ లేసుకుంటూ పోయి ఇంటి ముందరి పెద్దరగు మీద చతికిలపడ్డాడు. ఎదురుగా యాభై గజాల దూరంలో ఉన్న వెంకయ్య గారి వీధి వాకిలి తట్టు చూచి తన్మయత్వంలో పడ్డాడు. తాననుకున్నట్లే అక్కడ తలుపు చాటున వెంకమ్మ కూతురు కాంతమ్మ ప్రత్యక్షమైంది. ఆమె కునుచూపు హఠాత్తుగా ఈయన మీద పడ్డట్టుంది. ఇద్దరి చూపులు ఏకమైనవి.

పేరయ్య పిచ్చిబాగులవాడి మాదిరి గుడ్లు మిటకరించుకోని ఆ కాంతమ్మ వంక కండ్లు మిరుమిట్లు కమ్మేట్లు కరువార చూస్తున్నాడు. ఆయనను చూచి పరవశురాలై ఈయన అరుగుమీది రాకకై ఎదురు చూస్తూ, అంతలో వచ్చే పోయే వాండ్లను వార చూపులతో చూస్తున్న కాంతమ్మ సిగ్గభినయించి చిరునవ్వుతో తలుపుకొంచెం ఓరగా వేసి కొంగు మొహం పెట్టి తలుపు చాటు నుంచి తొంగి చూస్తున్నది.

కాంతమ్మది మంచి బంగారు వంటి పసిమి గల శరీరం. వయసు 20 ఎండ్లకు లోపే. చంద్రబింబం వంటి చక్కని మొహం. విల్లువంటి నల్లని కనుబొమ్మలు, చుక్కాని వంటి ముక్కు. నవనవలాడే చిరుబుగ్గలు. ముత్యాలవంటి పళ్ళు. దొండపండులాంటి పెదవులు. నల్లని దట్టమైన జుట్టు. మొహం మీదికి తుమ్మెదలావాలే ముంగుర్లు. వెడల్పాటి నొసలు. బండి కుండలలాంటి పిరుదులు. సన్నని నడుము. కొబ్బరిచిప్పల లాంటి బిగుతైన చనుగుబ్బలు. చూడటానికి ఎంతో అందంగా వుండేది. కేవలం ఏ అప్సరసో ఆకాశం మీది నుండి ఊడిపడ్డట్టుగా ఉండేది. పరికించి చూస్తేనే గానీ చేతులకు గాజులు మొహాన బొట్టు లేదని ఎవరైనా తెలుసుకోవటానికి వీలు లేకుండా నిండు ముత్తయిదులా కనబడేది కానీ, పెనిమిటి పోయి రెండో యేడు. కర్మాంతరాలప్పుడు గాజులు బద్దలు గొడితే ఊరుకున్నది గానీ, నెత్తి జుట్టు బ్రాహ్మణుల ఆచారం ప్రకారం గొరగబోతే పెద్దపెట్టున ఏడ్చి గోల చేసింది.

"ఆ జుట్టు తీసేసి నన్ను కురూపిని చేసేదానికన్నా తలకాయే తెగనరక రాదట్రా" అని కేకలు బొబ్బలు పెట్టింది. తల్లికూడా ఆ రోదనకు తట్టుకోలేక "జుట్టుంటే ఏంచేసిందిలే" అని కూతురిని సమర్థించింది. కూడిన బంధువులు పురోహితులు గూడా "పోనీయ్" అని ఊరుకున్నారు. అప్పట్నించి తల దువ్వుకొని వేలు ముడేసుకొని తనకున్న పాత చీరలే ఎప్పుడూ కట్టుకుండేది. రంగు రంగుల జరీ రవికెలు కూడా తొడుగుతుండేది. అందువల్ల హఠాత్తుగా చూచిన వాళ్లెవరూ ఆమెను వితంతువనుకుండే వాళ్ళు కారు.

పేరయ్య శర్మ తదేక దృష్టితో కండ్లార్పకుండా ఆమె వైపు చూస్తూ పచ్చి ఆనందం పొందుతున్నాడు. కాంతమ్మ వలపులు గుక్కే వార కన్నుల కోర చూపులు ఆయన హృదయానికి బాణాలుగా తగులుతున్నాయి. అవకాశం చిక్కినప్పుడల్లా వాండ్లకిదే పని. ఆమె వాకిలి దగ్గర ఈయన అరుగుమీద. ఆమె అక్కడ ఈయన ఇక్కడ! ఒకరి హృదయాలు ఒకరు దొంగిలించుకోవటానికి

కొంత కాలం నుంచి విశ్వ ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇరుగింటి పొరిగింటి వారు ఎమనుకొని పోతారో అనే భయం గూడ ఇద్దరికీ తీరిపోయింది. పొద్దు గూకంగానే మిఠాయి పొట్లాలు, పండ్లు, ఫలాలు, అడపాదడపా ప్రేమలేఖలు ఇంట్లో పాచిపనిచేసే మంగి ద్వారా ఎవరికీ తెలియకుండా పది పదిహేను రోజుల క్రితం నుంచే శర్మగారు దొంగతనంగా కాంతమ్మకు పంపించటం ప్రారంభించారు. వీండ్లిద్దరు ఎబ్బెరికంగా ఒకర్నొకరు చూచుకోవటం వీధు లెంబడి వస్తూ పోతూ గమనించిన అమ్మలక్కలప్పుడే "ఈ విడ్డూరం ఏందమ్మా" అనే గుసగుసలు ప్రారంభించారు. ఇదిగో తోక అదిగో పులి అనే రకం వదంతులు నానాటికీ ఆ వీధిలో కాపురముండే వాండ్లింండ్లలోకి ఎగబాకి పోతున్నాయి. ఆయనకూ ఆమెకు ఏదో సంబంధం ఉన్నదని చిన్నా పెద్ద అనుకోసాగారు. కర్నాకర్నిగా ఈ వదంతులు విన్న భార్య, తల్లి కూడా పేరయ్య శర్మనేం అనలేక ఇదెక్కడి అప్రదిష్టరా స్వామీ అని లోలోపల పిసుక్కు చస్తున్నారు. వాండ్లల్లో వాండ్లు కూడా ఈ విషయం హెచ్చరించుకోకుండా ఇటువంటి విషయాలు అనేకం జరుగుతున్నా తెలియని వాండ్లలా ప్రవర్తించే గొప్ప ఇంటి ఆడవాండ్ల మాదిరి, ఏం తెలియని వాండ్లలా ప్రవర్తిస్తూ కాలం గడుపుతున్నారు. కాని, అవకాశం చిక్కినప్పుడల్లా ఒకరికి తెలియకుండా ఒకరు శర్మగారిని సూటి పోటీ మాటలనడం ప్రారంభించారు.

వెంకమ్మ కూతురికి తన భర్తకీ సంబంధం వున్నదనే వదంతులు వినుతుండటం బట్టే ఎన్నడూ నోరెత్తి పల్లెత్తు మాటైనా ఇంకొకర్ని అని ఎరగని సీతమ్మ ఆరోజు వెంకమ్మ మీదికి అలా తగూకు పోయింది.

శర్మ కాంతమ్మలు చూపుల తోటే హృదయాలలో ఉత్పన్నమైన ప్రేమను వెల్లడి పరచుకుంటూ కాలం గడుతున్న కొంతసేపటికి బండప్పలస్వామి గిరజాలు దువ్వి కోరమీసం మెలేసుకుంటూ కూనిరాగాలు తీస్తూ "ఛో... ఛో..." అని ఎద్దును అరల్చుకుంటూ ఒంటెద్దు బండి తోలుకొని వచ్చి కాంతమ్మగారి వాకిట్లో ఆపాడు. "ఏమండోయ్ కాంతమ్మగారూ! ఆస్పత్రికి రారూ" అని అటూ ఇటూ తేరిపార చూస్తూ అన్నాడు.

కాంతమ్మ అనుభవిస్తున్న ఆనందం భగ్నమైంది."వస్తున్నా అప్పలసామీ" అని తలుపు చాటునుంచి మెల్లిగా ఇంట్లో గదిలో చదువుకుంటున్న తమ్ముడ్ని పిలిచి "ఒరే అబ్బాయ్!నేను ఆస్పత్రికి పోతున్నా. మడినీళ్లకని పోయిన అమ్మ ఇంకా ఇంటికి రాలేదు. ఎక్కడ పెత్తనాలు చేస్తున్నాదో.. రాగానే పెందలాడే

ఇన్ని మెతుకు లొండెయ్యమను. ఇప్పుడే ఆకలిట్లా మండి పోతున్నది. కడుపులో పేగులు గుర్రుమంటున్నాయి. వచ్చేటప్పటికి సోషొచ్చి పడిపోతానేమో” అని సీసా పట్టుకొని బయటకు పోయి బండిలో కూర్చున్నది.

పేరయ్యశర్మ అరుగుమీద నుంచి నిశ్చేష్టుడై చివాలున లేచి నిల్చున్నాడు. తన ప్రేమమయానందాన్ని భగ్న పరచిన బండప్పలస్వామిని లోలోపల తిట్టుకుంటూ కాంతమ్మ కనుమేర చూపుకు కనబడేంత వరకు అక్కడ నిల్చొని బండి వీధి మలుపు తిరిగి పొయ్యేవరకు కండ్లు చించుకొని ఆమెవంక తొంగి తొంగి చూశాడు. ఆమె కూడా తన కామ కిరణాలు రెండు కండ్ల పాపల నుంచి కురిపిస్తూ దొంగ దొంగ చూపులు చూస్తూ దాగలిమూతలాడుతూ దాక్కోబోయిన పిల్లల మాదిరి శర్మగారి దృష్టినుంచి దూరమైపోయింది.

శర్మగారు గభాలున గిర్రున తిరిగి ఇంట్లోకి పోయి గబగబ నాలుగు చెంబులు నీళ్లు పోసుకొని, తిరుచూర్ణపు నిలువు బొట్టు తీర్చి పెట్టుకుని అదరాబదరా అవుపోసన పట్టి ఉడుకుడుకు మెతుకులు నోట్లో వేసుకొని అర్ధాకలితో లేచి అనువయిన దుస్తులు ధరించి “మన వారసత్వపు దావా విచారణ వింటానికి కోర్టుకు పోతున్నానే అమ్మా” అని తల్లితో చెప్పి ఉరుకులు పేరాలతో వీధిన పడి దబదబ వెళ్లిపోయినాడు.



నిర్మలరావు చివుక్కున మంచంమీది నుంచి లేచి మొహం తుడుచుకొని కాసేపు పాఠాలు చదువుకున్నాడు. తెలతెల వారేటప్పుడు దొడ్లో చల్ల చేసుకుంటున్న సీతమ్మ దగ్గరకెళ్ళి “అత్తయ్యా అన్నం పెట్టు. మా లెక్కల పంతులు గారు పెందలాడి లెక్కలు చెబుతామన్నారు. ఆపేటకు నడిచి వెళ్ళేటప్పటికి అరగంటైనా పడుతుంది” అని ముద్దు ముద్దు మాటలతో అన్నాడు.

సీతమ్మ చిలికే కవ్వం ఆపి చేతులు కడుక్కొని వచ్చి కంచంలో అన్నంపెట్టి రాచిప్పలో రాత్రి మూసుంచిన కంది పచ్చడి తీసి వేసింది. నిర్మలరావు రెండు ముద్దలు తిన్నాడు. మళ్లీ చల్ల చేసుకోటానికి కవ్వందాకా వెళ్లిన సీతమ్మ కేదో జ్ఞాపకం వచ్చి గోడ గూట్లో దబరా గిన్నెలో దాచుంచిన పెరుగుమీద మీగడ తెచ్చి కంచంలో వేసి ఆ చెయ్యి కంటుకున్న మీగడ అన్నంలో కలిసేటట్టు కలుపుతూ “నాయనా, నిర్మలరావూ! వారం రోజుల నాడు మీ మామయ్య మీ ఊరెళ్లినపుడు మీ అమ్మ ఆయనతో పోట్లాడిందట. మీ కోసం మేమెక్కడన్నా ఆడపిల్ల నొకదాన్ని తెచ్చి పెంచి నీవు మిటిక్లేషనులోకి

రాగానే పెండ్లి చేయాలట. శలవుల్లో గూడా నిన్ను మేమిక్కడ ఉంచుకోగూడదట. ఆమె పిల్లలంతా ఒక ఏత్తూ మీవొక ఎత్తట. నిన్నింత గారాబంగానే పెంచు కుంటుంటే పండక్కి గూడా నిన్నింట్లో ఉంచుకోటానికి నే నోచుకోలేదట. మీ నాయన మట్టసానికి వీలున్న ఈ ఉరొచ్చినపుడు నాతో హోరాహోరీ పోట్లాడి పోయినాడు.

"వాడంటే మాకెంతో ప్రేమ. వాడినొక నిముషమనైనా ఎత్తిన చంక దించకుండా మా అరచేతుల్లో పెంచాం. వాడికేం కొరత లేకుండా చేశాం. కొండమీది కోతిని కావాలన్నా తెచ్చిచ్చాం. చిన్నప్పుడు వాడు కావాలె అని మారాం చేస్తే బుట్టెడు బూరెలు, మానడు గారెలు వాడి ముందర పోసి ఊరుకుండే వాళ్ళం. తిన్నన్ని తని మిగిలినవి అందరికీ పంచేవాడు. వాడికి నేత తప్పాలెడు నెయ్యి ప్రతి పూట భోజనానికి ఉండాల్సిందే. నేటికి వాడిని మీ పాలు చేశాం. నీ పెంపుడులో ఏం లోపం లేకపోయినా నీ పెనిమిటి మాత్రం వాడ్ని చీటికి మాటికి తెగ కొడుతుంటాట్ట. మేం మాచేతులార చిటుక్కుమని ఇంతకాలం ఒక దెబ్బయినా కొట్టెరగం. ఇకమీద మా ఆయన మాడ్ని కొట్టాడని తెలిస్తే నేనూరుకోను. మా వంశం అసలే ఒడిదుడుకుడు వంశం. కోపమొస్తే వారు వీరనే విచక్షణుందదు మాలో. ఎంతవాళ్లయినా ముందు ఎగిరి మీద పడి కొడతాం. చేయి జారిన తర్వాత అనుకొని లాభంలేదు. అంతంత మాత్రం చదువు చెప్పించుకోలేకనా వాడిని మీ ఇంటికి పంపింది. పిల్లలకు కరువాచి పోతున్నారనీ వాడ్నన్నా పెంచుకొని పిల్లల మోజు తీర్చుకుందురుగాననీ పంపాను గాని, అంతగా అయితే అక్కడే ఏ పంతుల్నో పెట్టి వాడికింత చదువు చెప్పిస్తా. ఏం మీరేగతా? గంతకు తగ్గ బొంత లేకుండా పోతుందా. మీరెక్కువ భాగ్యవంతులైతే మీ భాగ్యం మీకే వుండె. భగవంతుని దయవల్ల వాడు బతికి బాగుండి కాళ్లు చేతులు చల్లగా ఉంటే ఇంటి దగ్గర వ్యవసాయము చేసుకోనన్నా బతక గలడు. చూడు సీతమ్మ "ఇకమీదట వాడి వీపు మీద దెబ్బ పడకుండా చూడు" అన్నది.

నిర్మలరావును చిన్నతనం నుంచి అతిగారాబంగా పెంచి పోషించిన తల్లి దండ్రులు తలుపుకొచ్చారు. చిన్నప్పుడు తను చేసిన అల్లరి తను పెట్టి మారాము జ్ఞాపకం వచ్చింది. మూడు రోజుల క్రితమే చెర్లో ఈతలు కొడుతున్నానని వెంకమ్మ వచ్చి చెప్పిన సాడీలకు తమ మేనమామ చితక గొట్టిన దెబ్బలు జ్ఞాపకమొచ్చి తను కూడా తలకాయొంచి కండ్లనీళ్లు పెట్టుకుంటూ

"అత్తయ్యా! ఇంకే వియోగమైనా సహించవచ్చును గానీ తల్లిదండ్రుల వియోగం సహించటం ఎంతో కష్టంగదా! పూర్వజన్మాన ఏ పాపం చేసుకుంటేనో ఈ వియోగం సంభవించింది. ఇంకా నీవనే ఒకవ్యక్తివి ఇక్కడ ఉండబట్టే ఈ ఇంట్లో ఇన్నాళ్ళుండగలిగా. లేకపోతే చదువు గిదువూ కట్టిపెట్టి గంపెడు చీకటి నెత్తిన వేసుకొని ఈ పాటికి మా ఊరు చేరకుండే వాడ్నే. ఆయన కొట్టే దెబ్బలకు నేను కాబట్టి తట్టుకున్నా గాని ఇంకోళ్లయినట్లయితే ఏ అర్ధరాత్రపుడో ఆయన బుర్ర బద్దలు కొట్టి పలాయనమై పారిపోయేవాండ్లే..."అని అంటూ కళ్లనీళ్ళు తుడుచుకుంటూ, కన్నీటి ధారలు కారుస్తూ ఏడుస్తున్న సీతమ్మ వంక కన్నెత్తి చూసి "అత్తయ్యా! నీవేడవమాకు. నాగతి ఎట్లా తెల్లవారాల్సుందో అట్లా తెల్లవారుతుంది. నీ ఏడ్పు నన్ను మరింత అధైర్యపరుస్తుంది." అని గద్గద స్వరంతో అన్నాడు. సీతమ్మ పమిటచెంగుతో కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ..

"పట్టు ఈ ముద్ద పట్టు నాయనా" అని నిర్మలరావు తెరిచిన నోట్లో మీగడన్నం ముద్ద పెట్టి "నాయనా, ఈ నోటితో మాట్లాడే మాటలు ముద్దులొలుకు తుంటయి గదా. ఏవెట్టా జరగాలో అట్లా జరుగుతుంది. విధికృతం ఎవరు తప్పిస్తారు. నీవు మాత్రం ఏ అల్లరి అఘాయిత్యం చేయవాకు. ఆ పాడుముండ వెంకమ్మ జోలికి పోవాకు. లేచి చెయ్యి కడుక్కొని పంతులుగారింటికి పోయేప్పుడు మాత్రం మీ మామయ్యతో చెప్పి మరీ పో" అని చల్లచేసుకోటానికి పోయింది.

నిర్మలరావు మజ్జిగన్నం తిని లేచి లాగూ చొక్కా తొడుక్కొని పుస్తకాలు చేత పట్టుకొని లోపల పెద్ద బల్ల మీద కూచొని పాత పత్రికలు తిరగవేస్తున్న పేరయ్య శర్మతో "మామయ్యా! నేను పంతులుగారింటికి పాఠాలు చెప్పించు కొవటానికి పోతున్నా" అని మెల్లగా చెప్పి పిల్లడుగులు వేసుకుంటూ ఇల్లు దాటి బయట పడ్డాడు. దారిలో నీళ్లకు పోతున్న వెంకమ్మ కనబడితే ఆమె మీదికి పులిపిల్లలా దూకి నోటికొచ్చినట్లుగా తిట్టి రాళ్ళు రువ్వి, కడుపులో ఉన్న కసి తీర్చుకున్నాడు.

ఈ కథ జరిగిన కాసేపటికి వెంకమ్మ వచ్చి ఇంటి ముందర కేకలెయ్యటం సీతమ్మకు వళ్ళు మండి మొహాన కొట్టినట్లు జవాబు చెప్పటం పేరయ్యశర్మకు కోపం రావడం సంభవించింది.

సూర్యకిరణాలు దారెక్కుతున్నాయి. వేడి గాల్పులు వీస్తున్నయి. తెల్లటి సూర్యరశ్మి సృష్టి నైజాన్ని చురచుర లాడిస్తున్నది.

బండలప్పస్వామి బండిన బహు మెల్లగా నడుపుతున్నాడు. చేతిలో చర్నకోల ఝూడిస్తూ బండి శర్మగారింటికెదుటి వీధి మూల తిరుగుడు తిరగంగానే మెల్లంగా కాంతమ్మతో ఇట్లా అన్నాడు“కాంతమ్మా... అదేం సిత్రమోగాని కోడి కూయంగానే నీకాడినుంచి పోయినాల నుంచి గుండెల్లో ఏదో గుబులు గుబులుగా వుంది. సల్లగాలికి యాడు సెట్టుకింద కుక్కి మంచంలో దుప్పటి కప్పుక కూకోని కునికిపాట్లు పడుతుంటే యాడిట్టా లోకానికెరిపి తృప్తిలేని ఈ దొంగలాడి రంకులాడే దానికన్నా ఇద్దరం పట్నం లేసిపోతే బాగనే బుద్ది నా బుర్రకు తట్టింది. దేశంగాని దేశంలో మనం మొగుడు పెళ్లాంలాగ గుట్టు సక్కంగా బతుకుదాం. సంబోగ సుగం తృప్తి తీరా అనుభవిద్దాం. పిల్లలు పుడితే సాక్కుందాం. సంసారం ఏలుకుందాం.. ఏమంటావు”అన్నాడు

కాంతమ్మ ఏదో ఆలోచిస్తూ పలక్కపోతే “నీకు తెలుసుగా నేనింకో ఆడదాని మొగమెసుమంటిదో ఎరగనని, నెల్లాల నాడు నీవు రమ్మంటే నా గండెలు గబగబా కొట్టుకున్నయి. తల్లి గర్భంలో నుండి బయట పడ్డేల నుంచి బహు నిట్టగా వున్నవాడ్ని. నీసు సయితం సయించేదే గాదు. కల్లుసారాయిలంటే సికాకు. ఏ జల్మాన్నో బాపనింటో బతికి తప్పేమో చేసి ఈ జల్మలో కాపు కులంలో తప్పిపుట్టా. లేకపోతే నాకు, నీకు నెల్లాలనుంచి ఈ సంబంధం ఏంటి? మా కులంలో పండంటి పిల్లలెంతమంది ఉండారు. తూర్పున మా వూళ్లో ఉన్నపుడు కట్టాలిత్తాం, కానుకలిత్తాం మురుగులు మొళతాళ్ళు పెడతాం. ఇల్లెటం తీసుకుంటాం. భూమి సదివిత్తాం అని ఎన్ని మనుములొచ్చినా నాకు పెళ్ళోద్దని తిరగ్గొట్టాం. ఇంతలోకే అయ్య అమ్మ పోలేరమ్మ పోసి పోతే ఇరక్తి పుట్టి బతుకుతెరువు కోసం పొట్ట శాత పట్టుకొని ఈ ఊరోచ్చా. ఈడగూడా ఈ అయిదెండ్ల దనకా నిట్టగా ఉండా. ఆ బమ్మదేవుడు ఈ బొమ్మలో ఊపిరిపోసి బూదేవి మీద బతికేందుకు నెట్టేప్పడే మొహాన కదుళ్లు కాల్చి మూడు వంతులుగా ఇట్టా రాసుండబట్టే ప్రేమంటే ఏందో ఎరగని నా బోటి మోటోడికి అందకత్తె ఈ కాలానికి దాపురించింది. అలప్పుడందుకనే పెండ్లి మీదకి బుద్ధి దొర్లకుండా సేశాడు దేముడు. లేకుంటే ఈ పాటికి బిడ్డల తండ్రినయేవాడ్నికదూ. ఇదంతా జల్మజల్మాల సేసుకుండ సుకృతం గాక మరేంటి. నేను పడుసోడ్ని. నీవు పడుసు దానివి. అని ఇంకా ఏమో చెప్పబోతూ కాంతమ్మ వైపు కన్నెత్తి చూశాడు.

కాంతమ్మ కళ్లంబడి బొటబొటా నీళ్ళు కారుతున్నయి. చేతిలో గడ్డి పొర ఒకటి చిక్కించుకొని తుంపులు తుంపులుగా తుంచేస్తున్నది.

"అయ్యో ఇదేంటి ఏడుస్తుందావే. నీ ఏడుపు నేను సూళ్ళేను. దాపరికం లేకుండా ఉండదుండట్టుగా సెప్పు. అమ్మ తోడు. ఆ కాలికామ్మోరి తోడు. నీవేం సెపితే అది సేత్తా. " అని గజగజా వొణుకుతూ అన్నాడు. కాంతమ్మ కాస్త నిబ్బరం తెచ్చుకుని కండ్లు తుడుచుకుంటూ కీచుగొంతుతో..

"అప్పలస్వామి! మనంచేసింది పాపం. కులంగాని కులస్తుడివి. పోనీయ్ ప్రేమకు కులం లేదనుకుందామా ఇది నిజమైన ప్రేమ కాదు. కేవలం కామ తృప్తి కోసం ఏర్పడ బాదరాయణ సంబంధం. నీవు అందగాడివి. వయసులో ఉన్న వాడివి. మీ కులంలోనే మంచి పిల్ల నెతుక్కొని పెండ్లి చేసుకుంటే మంచిది. మీ కల్మషం లేని ప్రేమకు నేనెంతో మెచ్చుకుంటున్నాను. కానీ, లోకానికి వెలవాలె. కామాంధకారంలో మనం కన్నూ మిన్నూ గానకుండా ప్రవర్తించాం. జరిగిపోయిందేదో జరిగిపోయింది. ఇక మనమిట్టా ఉండటం మంచిది గాదు" అని చెబుతుంటే అప్పలసామి

"ఇప్పుడెందుకూ ఈ సారంగనీతులు! పేమలో నిండా మునిగి కొట్టుకుం దేప్పుడు సిక్కాలు పెట్టి బిగించినా మన మనసు లాగుతయి గనకనా! ఇంత బుద్ధుండోళ్లం ఈ బెడదలో దిక్కుండా ఉండాల్సింది. పట్టుమని నిన్ను ప్రేమిస్తూ ఇంకో పిల్లను పెండ్లి సేసుకోటమెట్టా! అది నావల్ల కాని పని" అన్నాడు.

కాంతమ్మ "సరే ఏదో కారణార్థం వల్ల కలిగిన సంబంధానికి మనమేం చేస్తాం! ఇప్పుడు మటుకు మించిపోయిందేముంది? తెగతెంపులు చేసుకో కూడదా!" అన్నది నవ్వు మొహంతో.

"ఓ సబ్బీ ఈ మాటలకేంలెస్తూ ఆడోండ్ల మగోండ్లను ఎర్రెక్కిస్తానికి ఏసే ఏసుబులే ఇయి. నన్నేడిపించటానకి ఇట్టా అంటుందావు లెస్తూ. నీ నవ్వే సెబుతుంది. నా శంత సేరుకోవటానికి నీ మనసు కొట్టకలాడుతుండట్టు.... అయితే కట్టు సీరెల్తో లేసొస్తావా, పెట్టె బేడతో పయనమవుతావా" అన్నాడు.

కాంతమ్మ మూతి గంభీరంగా పెట్టి "అప్పలసామీ! రాత్రేం జరిగిందో తెలుసునా? పిల్లి కండ్లు మూసుకుని పాలు తాగుతూ ఎవరూ చూట్టం లేదను కుంటుంది. మనం దొడ్లో నారింజ చెట్టుక్రింద పడుకోనుండగా ఆ పాపిష్టి కుంక నిర్మలరావు చూడనే చూశాడు. అప్పుడేమల్లరి చేస్తావో అని నీతో చెప్పటానికి వెరిచా. వాడేమో నారింజ కాయలు దొంగతనంగా కోసుకోవటానికి మదురు మీదుగా చెట్టెక్కినట్టున్నాడు. నేను నీ గొడవలో పడి మొదట పరికించి చూడలా కానీ వాడు దిగిపోయేప్పుడు మాత్రం కొమ్మ చప్పుడువుతుంటే

తలుపు సందులో నుంచి పొడుచుకొస్తున్న దీపపు వెల్తుర్లో చూస్తే అతని మొహం కాస్తా కనపడ్డది. అప్పుడు నీ మొహాన దుప్పటి కప్పి నోటి మీద వేలేసి ముద్దుల శబ్దం చేయవద్దన్నదందుకే. దొడ్లోకి ఇంట్లోకి ఉన్న వాకిలి బైటి గొళ్ళెం వేసుకొని మా అమ్మగాని తమ్ముడుగాని వస్తారనే భయం లేకుండా ఉన్నాం. కానీ లోపల దీటిలాగు వెలుగుతున్న దీపపు వెల్తురు ఇటూ అటూ మళ్లినప్పుడల్లా తలుపు సందుల్లో నుంచి మన మొహాలమీద పడుతున్నదనే సంగతి గమనించకుండా మైమరచి పడుకున్నాం. తెల్లంగా తెల్లవారి లేచి ఇట్లా బైటికి పోదును గదా వీధి గుమ్మం దగ్గర తెల్లటి సున్నం కొట్టిన గోడ మీద కాంతమ్మ బండప్పలసామి పండుకున్నారని వ్రాసున్నది. నయం నాకన్నా ముందు లేచి చూసి తుడిచెయ్యటానకి తడిగుడ్డ తేవటానికని అప్పుడే లోపలికి పోయి బయటకు వచ్చిన మా అమ్మ అఘాయిత్యానికి ఆ నిర్మలరావే ఈ పిచ్చి కూతలు వ్రాశాదని వాడిని తిట్టి పోసింది. నిజంగా ఆమెకు ఏమాత్రం సందేహం కలిగినా నా కొంప మునిగేదే. వెంటనే మా అమ్మ, నేను తడిగుడ్డతో మా మాటలు తుడిచెయ్యబట్టి సరిపోయింది. ఇంకెవరన్నా చదివి చూచు కున్నట్లయితే ఏం గోలయ్యేదో" అన్నది.

అప్పలసామి " అమ్మ గుంటడు..అంత పనిచేశాదా! ఇయాల నడి బజార్లో లంకించుకొని పాత చెప్పొకటి తీసుకొని తుక్కుమూడి పుంజాలుగా దంచొదిలి పెడతా.. కాంతమ్మ జోలికి పోవుగా పోవుగా అని ముచ్చ తీసుకొని మూతి పండ్లు రాలగొడతా. మళ్ళీ మన తెరువుకొస్తే నోట్లో గుడ్డలు కుక్కి గొంతు పిసికేస్తా... ఓసి ఎర్రిదానా! ఎందుకు నీకింత బయం. ఈ బండప్పల సామి బొందిలో ఊపిరుండంత దనక నీ మీద ఈగ వాల్నియ్యడు. పల్లెత్తు మాటైనా పడ్నియ్యడు. ఏందో అనుకుందావు గామాలె. ఓసి ఆ పిల్ల నాయాలుకే బయపడుతుందావా! సూడు రేపీయాల్టికి వాడికేం బుద్ది సెబుతానో.

కాంతమ్మ మనసులో ఈ అప్పలసామిని కొన్నాళ్లయినా ఏ విధంగానైనా వదిలించుకుంటేగాని ఆ పేరయ్య శర్మ అంతేమిటో తెలియదు. ఆయనకూ నాకు పొత్తు కుదిరితే కులస్థులం కాబట్టి మా రంకు బైట పడ్డా అంత ఫరవాలా... పొరపాటున బుద్ధి గడ్డితిని ఈ కాపతనితో సంబంధం కల్పించుకున్నా. చివరకు ఇంట్లో నుంచి లేపటానికే ఎత్తేస్తున్నాడు. ఏ రోజుకు ఏట్లా పోయి ఏట్లా వస్తుందో! ఇందాక అప్పలసామి కులంగాని కులస్థుదని నాకు దుఃఖం రాలేదు గాని ఈ

మాటవిన్నా, అతనితో లేచి పోయినా మాఅమ్మ ఏ బావిలో పడుతుందో అని దుఃఖం వచ్చింది. ఇదివరకా రైలుపేటలో కాపురముంటే పొరుగింటి ఆచారికి నాకూ సంబంధం వున్నదని గోలపుడితే కదూ మా అమ్మ గుండెలు గుండెలు బాదుకుని ఒకటే మోయిన ఏడ్చి ఆ ఇల్లు ఆ పేట మార్చింది. ఇప్పుడీ గొడవెట్లా తప్పించుకోటం? ఆవీరేశలింగం పంతులుగారి వితంతాశ్రమంలో చేరి మళ్లీ పెండ్లయినా చేసుకుందామా అంటే సమాజం, అమ్మ అడ్డొస్తుందే! పోనీయ్ బుద్ధికలిగుందామా అంటే పట్టపగ్గాలు పెట్టి కట్టినా పడుచుతనపు ప్రేమ పిచ్చిని కామోద్రేకాన్ని ఆపుకోలేక పోతిని. ఏదిరా తెరువు స్వామీ! అని అనుకుంటూ దీర్ఘాలోచనలో పడి కొట్టుకుంటున్నది.

అప్పలసామీ కాంతమ్మ జవాబుకు ఎదురు చూసి "ఏంకాంతమ్మా! బెల్లంకొట్టిన రాయిలాగా కూచున్నా? నోరు పెకలటంలేదా? ఏందా ఆలోచన? మర్మమిప్పి సెప్పరాదూ? నీ పానానికి నాపానం అడ్డం. ఆబుడ్డోడి నోరు రేపీ యాలకి కట్టేస్తా! సంయ్ అంటే ఎల్లుండీయాలికి పట్టం సేరుకుండే బందోబస్తు సేత్తా. సెప్పు సెప్పేదేదో దబ్బున సెప్పు" అన్నాడు.

కాంతమ్మ "నీవు ఒట్టి కపటంలేని కాపువు. కనేదాని కష్టం గొడ్డుబోతు దానికేం తెలుస్తుందన్నట్లు నీకేం తెలుస్తుంది నేననుభవించాల్సిన బాధ. ఫలానా వారి బ్రాహ్మణింటి పిల్ల సూద్రతనితో లేచి పోయిందని మనం లేచిపోయిన మర్నాడే ఊరంతా గప్పుమంటుంది. కుల పెద్దలు కూడి నన్నేగాకుండా మా ఇంటిల్లిపాదిని కులం నుంచి వెలేస్తారు. ఆ అప్రదిష్ట భరించలేక మా అమ్మ ఏ నుయ్యే గొయ్యే చూసుకుంటుంది. మా తమ్ముడికి పెండ్లి కాదు. నీకేం లింగు లిటుకుమంటూ ఏకాకివి కాబట్టి ఏంతకయినా తెగిస్తావు. నేనెట్లా తెగించేది? ఏదో అవకాశం చిక్కినప్పుడల్లా అడపా దడపా మనం కలిసినా ఇహ నీ క్షేమానికి నా క్షేమానికి గూడా మనం ఎంత దూరంగా ఉంటే అంత మంచిది. నేను చెప్పినట్లు చేస్తానని ఒట్టు పెట్టుకున్నావు కాబట్టి నామాట విని కొన్నాళ్ళు నన్ను మరిచిపో! ఏమో చెప్పానని వేదన పడమాకు" అని అప్పలసామి వెనుక మళ్ళా గడ్డి మీద మోపుంచిన చేతి మీద తన అరచేయి గట్టిగా వత్తుతు చెప్పింది.

అరండల్‌పేట పిచికలగుంట దగ్గర నుంచి బయలుదేరిన బండి కొత్తపేట దగ్గర రైలు వంతెన కింది రోడ్డు మీదుగా గుంటూరు వారి తోట దాకా పోయింది. పార్సీ షాపు దారిన మునిసిపల్ రోడ్డు మీదుగా పోవచ్చునని బండి మలిపి

"కాంతమ్మా నీకోసం నే బలవుతా. నీకంత కట్టంగా ఉంటే ఆ వూసే ఎత్తనిక. ఈ గడియ కాడ్నుంచి నేనింక బండి అప్పలసామిని. నీవింక బాపనోరి బిడ్డవు కాంతమ్మయి...నీకు నాకు ఎటువంటి సంబంధం లేనట్టుగానే ఉందాం. ఇక నీఊసెత్తితే ఒట్టు. నీకాపతొత్తే నే సచ్చిపోతా. ఆపోలేరమ్మ తోడు. కాకితో కబురెట్టినా వచ్చి నీవాకిలి ముంగలోల్తా. నీపాదాలకాడ పామిత్తా సూడు. పరీచ్చ సేసి సూడు. నాది బమ్మాండమైన పేమో కాదో! సచ్చిందాకా ఇట్టా కన్నెత్తి ఇంకో ఆడదాని సూస్తే నే పాపాన పోతా. ఇంతటి తోటే మూన్నాల పట్టపగటి ఆపేమ సరి. ఇంత దనక మనం అనుబయించింది కామాతీతం పేమ. ఇక నా పచ్చాన్న పచ్చి నిస్కామ పేమ తెలిసిందా" అని ఆవేశంతో అల్లల్లాడుతూ బెదిరిన లేడి పిల్లలాగు గడగడ ఒణుకుతూ అన్నాడు అప్పలసామి.

అతని మొహం లేత తమలపాకు లాగు వాడిపోయింది. కండ్లెర్ర బడ్డాయి. హృదయవేదన మొహం మీద తాండవమాడుతున్నది. చెరచెర "ఛాయ్...ఛాయ్.. నీఎద్దుగాల" అని ఎద్దు నదుల్చుకుంటూ బండి తోలుకొని పోయి మునిసిపల్ ఆఫీసు మీదుగా ఆస్పత్రి వైపుకు పోతున్నాడు.

కాంతమ్మ ఏమీ మాట్లాడలేక ఊరుకున్నది. మనసులో మాత్రం ఎంత పొరపాటు చేశానురా భగవంతుడా! ఈ అమాయకుపు అప్పలసామీతోనా కామ తృప్తికోసం ఎక్కడలేని ప్రేమాగ్నిని రగుల్కోల్పానే! అర్పటం నా చాత గాకుండా ఉందే! ఓరి దేముడా ఎంత పనైంది. ఈ అప్పలసామి ఈ వెర్రిలో ఏమి అఘాయిత్యం చేసుకుంటాడో గదా! తన ప్రేమ పాశాన్ని పుటుక్కున తెంచాననే కసితో అకస్మాత్తుగా ఏ అర్ధరాత్రో వచ్చి నా గొంతు కోయదు గదా! మోటు వాళ్ల ప్రణయ కలహాల ఫలితం కూనీలో కదా. ఈ రోజుల్లో... తీరా గొంతు మీదికొచ్చినప్పుడు చూసుకోవచ్చు. ఇప్పుడెందుకు నాకా ఉలికిపాటు? ఉపాయం తెలియని దాన్నయితే గదా! అని అనుకొంటుండగా బండి ఆస్పత్రి గేటులోకి పోతున్నది.

వెనుకనించీ అప్పలసామీ! అప్పలసామీ! అని ఎవరో వేస్తున్న కేక వినపడింది. తిరిగి చూస్తే పేరయ్యశర్మ ప్రత్యక్షమైనాడు ఆశ్చర్యంతో ఒ చిరునవ్వు

నవ్వింది. శర్మగారు పండ్లికిలించి ఒక పిచ్చినవ్వు నవ్వాడు. " ఏం అప్పలస్వామీ పలకవేం? అమెనిక్కడొదిలి పెట్టి కోర్టు దాకా వస్తావా?" అని కొంచెం పెద్దగా అన్నాడు.

అప్పలస్వామి తిరిగి చూశాడు. "అయ్యా మీరటండి శర్మగారూ! బాదుగున్నది. చమించాలె" అని ఎద్దు పగ్గం లాగి కొంచెం బండాపి అన్నాడు.

"సరే పోనీయ్" అని కాంతమ్మ కల్లింకో చూపు చూచి బండి గేటు దాటిందాకా వుండి చివరకు దారి పట్టాడు. రాని కాళ్ళు సాగటంలా!

శర్మగారు ఇంటి దగ్గర్నుంచి మళ్లీ కాంతమ్మను ఆస్పత్రి దగ్గర చూద్దామనే ఉద్దేశ్యంతోనే వచ్చాడు. రోగులను దించి బయట విడుచున్న బండ్లలో చూస్తే అప్పలస్వామి బండికనబడలా. రోడ్డుకవతల వేపచెట్టు క్రింద పదినిముషాలాగి చూచాడు.

కాళ్లకు కిర్రుచెప్పులు, చేతిలో గొడుగు, బిళ్లగోచీ పెట్టి పింజుపోసి కట్టిన పెద్దాపురం జరీ ధోవతి, మెడదాకా గుండీలు పెట్టున్న కళ్ళీకోట చెక్కుకోటు.. వల్లెవాటేసుకున్న కుప్పడ మంచు ఉత్తరీయం... నున్నగా దువ్వుకొని వేలు ముడేసుకున్న జుట్టు, అమర్చి దువ్విన ఆ వంకర గిరజాలు చూస్తే ఇంకొంచెం అందంగా కనబడాలనే దృష్టితో తయారై వచ్చినట్లు కనబడు తున్నాడు.

ఇంతకూ తనొచ్చిన పనైంది. అంతసేపు కాచుకోనున్నందుకు కాంతమ్మను చూడగలిగాడు. నిరాశ చెంది పోదామనుకుందప్పుడు అప్పలస్వామి బండి దూరంగా కనిపించింది. అందులో తన ఆశాజ్యోతి వస్తున్నదనే ఆనందంతో బాడుగకనే నెపంతో అప్పలస్వామిని పిలిచి అమె దృష్టిని ఆకర్షించాడు. ఆమె కన్నెత్తి చూచిన చూపుకే నవ్విన చిరునవ్వుకే శర్మ హృదయం పొంగిపోయింది.

కోర్టుకుపోయే దారి పొడుగూతా మళ్లీ ఒక తడవ ఆమెను చూడగలిగాననే వెర్రి సంతోషంతో ఆ జుట్టు,ఆకట్టు,ఆ సౌందర్యం, ఆ పసిమి, ఆకండ్లు, ఆ చూపు, ఆ నవ్వూ, ఆ వునికి, ఆ శరీర పొందిక, ఆగుబ్బచనుగవలు, పెద్దపిరుదులు, సన్నటి నడుము, పరిపరి విధాల వర్ణించుకొంటు కోర్టు చేరాడు. వకీళ్లతో మాట్లాడుతూనే ఉన్నాడు. తన కేసు పక్షాన వాదించే ప్లీడరు వాదన వింటూనే ఉన్నాడు. కాని మనసు మాత్రం కాంతమ్మ మీదనే ఉన్నది.

శర్మగారు ఒక మోస్తరు అందగాడు. మనిషి పొడగరి. బలిష్ఠుడు గాక పోయినా బక్క చిక్కి మాత్రం ఉండడు. చామంచాయకన్నా ఒకవన్నె మించిన పసిమిగా ఉంటాడు.

గుండ్రటిమొహం, కాటుక కండ్లు, నిడుచెవులు, వెడల్పాటి నొసలు, పెద్దనోరు, సన్నటి పెదిమలు, భుజకీర్తుల లాంటి భుజాలు, పొడుగాటి చేతులు మటుకు చూస్తే అందంగా ఉన్నట్లే ఉంటాడు గానీ, చువ్వకాళ్లు, దిట్టంలేని తొడలు, అయన అందానికంత హంగివ్వవు. ఈడుకు మించిన ఏండ్లున్నట్లు కనపడ్డా 40 ఏండ్ల కన్నా ఎక్కువ లేవు.

ఒకప్పుడు నాటకాల్లో ఆడవేషం వేసిన వాడని ఆ నడకలో చేతులు పిర్రలు తిప్పటంలో మాట్లాడే మాటల్లో ఇంకా కనపడుతూనే ఉంటుంది.

పర్వత పంక్తులను పోలిన ఆ నీలంపు మేఘ పంక్తులు మధ్య అస్తమిస్తున్న రవి కాంతుని వెలుగు పడమటి దిక్కుగా ఏదో గొప్ప అగ్ని పర్వతంలా నిప్పులు గక్కుతున్న చందంగా భీకరంగా కనపడుతున్నది. కానీ ఆ మేఘాలు సందు నించి ప్రసరిస్తున్న బంగారు కిరణకాంతులు మాత్రం సృష్టి నైజాన్ని అలంకరించి పడుచు కన్యల మొహారవిందాలలోని సహజ సౌందర్యాన్ని రసిక మహా లోకానికి దివిటీ పెట్టి చూపినట్లు చూపుతున్నాయి. ఆ సుందర కిరణ కాంతులలో ఒక్క తడవ తన ప్రేమ పిపాసి కాంతను చూద్దామనే ఆదుర్దాతో పేరయ్య శర్మ పెందలాడి కోర్టు పని ముగించుకొని సాయంకాలం ఆరు గంటల కల్లా ఇంటికొచ్చాడు.

వాకిట్లో మంగి సంధ్య కసువలు చిమ్ముతున్నది. దాన్ని చూడగానే ఆయనకొక విధమైన భయంతో గుండెలు దడదడ కొట్టుకున్నయి. ఈ ముండ నలుగురితో ఎక్కడ చెప్పినా కొంప ముంచుతుందో, దీన్ని కొంచెం సంజాయిద్దాం ముందు తర్వాత చూసుకోవచ్చు అనుకొని " ఏం మంగీ బాగున్నావా? ఇవాళ నాటకానికి పోతావా, పంపుతాను" అన్నాడు నవ్వుతూ

మంగి చుట్టుపక్కల తేరిపార చూచి, ఎవరూ లేరనే ధైర్యం తెచ్చుకుని "అయ్యాగారూ ఇంకేం నాటకానికి పోతా...ఇయాల మీ నాటకంతో సరిపోయింది. కాంతమ్మ ఆస్పత్రి కాడ్నించి రాంగనే బువ్వదిని పండుకుందిట. పయటాల కాడ లేచి పేగులు బిరబిగుసుకుండవని గిరిగిరాలు తిరిగిపోతూ సోకాలు పెట్టి ఏడిసిందట. పట్టేమన్నా ఏస్తుందేమో మంగినన్నా పిలయ్యే అన్నదట వాళ్ళమ్మతో. ఆమె లగేసుకుంటూ మా ఇంటి కాడికొచ్చింది. ఇట్టా

సూతును కదా కాంతమ్మ మెలికలు తిరిగిపోతుండది. అదేందమ్మా అంటే పేగేమో పట్టినట్టుందే అంది. బరువు పనులు చేయని దానికి పేగెట్టా పడుతుందిలే అనుకుంటూ అయినా ఏమో అని పేడ కుదురు బొడ్డుపైన పెట్టి అందులో ఆవిదం ఎలిగించా. ఆకుసెంబు బోర్లేశా.

అది పొట్టకు బిర్రుగా కురుసుకుండే టాలికి ఏం హాయిగా ఉందే అంది. వాళ్లమ్మనటు పోనిచ్చి మంగీ ఈ మందులకేంగాని నిన్నెందుకు రమ్మంది తెలుసుకున్నావా అంది. నేనేం సోది చెప్పే సింగినటమ్మా నీ పొట్టలో వుంది తెలుసుకోవటానికి అన్న. అబ్బా ఏం నంగనాచి తుంగ బుర్రవే! దినం పువ్వులు, పొట్లాలు, చీటి ముక్కలు పవిట కొంగులో దాపెట్టి చెచ్చిచ్చే దానికి నీ కర్థం కాకుండా ఉంది లెద్దూ అంది. అయితే ఏమంట అంటి. ఆయనగార్నొచ్చి సూసి పొమ్మనయే అంది. సచ్చిపోతున్నా అని సెప్పమంది. రాత్రికి రాకుంటే శివుదు బావిలో దూకుతా నంది. ఆపాపం మీకు మెడకు సుట్టుకుంటుంది. సామీ ఎందుకొచ్చినట్టు పొయెుద్దురూ! ఆమె రోగానికి మీ వైయిద్యమే పారాలా గాని ఆడముందను నా సేతేమవుద్దిలే సామీ" అన్నది చతురుగా

"మంగీ మెల్లెంగా మాట్లాడవే గోదలకు చెవులుంటయి. ఎవరన్నా విని పోతారు. ఇంకేమన్నా అన్నదిటే? అన్నాడు పేరయ్యశర్మ.

"ఇంతకన్నా అనాల్సిందేముంది? తపిత్తున్నా అంది. తప్పకుండా రమ్మంది. ఇదిగో ఈ సీటీ ఇమ్మంది" అని మంగి పమిట కొంగున మూట విప్పి చీటీ శర్మగారికి ఇచ్చింది.

శర్మ "సరే ఇక్కడుండు జవాబు తీసుకెళ్లుదువు గాని... పైకం తెచ్చిస్తా పండక్కేమైనా కొనుక్కో" అని చీటీ చూచుకుందామనే సంబరం మీద అరుగు మీద కూచుని కాంతమ్మని చూద్దామన్న సంగతి మర్చిపోయి ఇంట్లోకి పోయినాడు.

శర్మగారి చెప్పుల చప్పుడు వినంగానే రామకోటి రాసుకుంటున్న సీతమ్మ పమిట సర్దుకుంటూ లేచొచ్చి కాళ్లకు నీళ్లిచ్చి తాగటానికి, మంచినీళ్ళు తెచ్చిచ్చింది.

శర్మగారు " ఏం పిల్లా ఇంకా మడి కట్టుకోలా?" అన్నాడు ఆయన ఉల్లాసంగా ఉన్నప్పుడల్లా పెండ్లాన్ని పిల్లా అని పిలిచేవాడు.

"అప్పుడే మడేంటండీ. ఊరపొద్దుగూక్కముందే" అన్నది సీతమ్మ

"సరే! ఇవాళ నాటకానికెళ్ళాలె. ఆకలి మండిపోతుంది. పొద్దున తిని

పోయిన పచ్చడి మెతుకులింకా అరక్కుండా ఉన్నాయనుకున్నావా? గదిలో నా కోర్టు వ్యవహారాల కాయితాలు ఒకమారు తిరగేసి చూచుకొనొచ్చేలోగా వంటి కానీయ్" అన్నాడు

"సరేలేండి వంటెంతలో అవుతుంది. అత్తెసరు పెట్టి ఇన్ని బంగాళ దుంపలు నేతిలో వేయించి అప్పడాలు కాల్చి చారు పెడతాలేండి. మధ్యాహ్నాము చేసిన మినప పచ్చడి మీ కోసం మడిలో మూత పెట్టుంచా" అన్నది సీతమ్మ.

"ఒసేయ్, మరచిపోయినా ! వాడేడి?" అన్నాడు శర్మగారు

"ఇప్పుడే అన్నంతిని తెలుగుపంతులు శాస్త్రుల్లగారింట్లో పిల్లలతో పాటు పాఠాలు చదువుకొని పడుకుంటానని పోయినాడు"

"వాడల్లరి ఎక్కువైంది. ఊరంతా ఒక కొలుక్కు తెస్తున్నాడు. ఎల్లకాలం బుల్లబ్బాయా గారాబంగా చూట్టానికి! నీవు కాస్త భయమన్నా పెట్టవు. బొత్తిగా చెడగొడుతున్నావు. లేకపోతే చెప్పుక్రింద తేలులాగా పడుండేవాడు గదా" అన్నాడు శర్మ

సీతమ్మ ఈ మాటకేం జవాబు చెప్పకుండా "మీరు పనికానిచ్చి సంధ్యావందనం చేసుకునేలోగా వంటవుతుంది. మీ ఆలస్యమేగాని నా ఆలస్యమే ఉండదు" అని చెప్పి వంటింట్లోకి పోయి మడి కట్టుకొని వంట ప్రారంభించింది.

మంగి వాకిట్లో తారట్లాడుతున్నది. పాపాయమ్మ పెత్తనాలకు పోయి ఇంకా ఇంటికి రాలా. సీతమ్మ అటుపోగానే శర్మగారు గదిలోకెళ్లి కుర్చీ మీద కూచొని మంగి తెచ్చిన ఉత్తరం విప్పాడు.

" ప్రేమాప్రియా! మీరు పుంపుతున్న బహుమతలు, లేఖలు నా కందుతూనే ఉన్నాయి. ఇన్నాళ్లనుంచి వితంతువును నా కెందుకీ బెడద? ప్రేమ పాశం బహుచెడ్డది బురద గుంట లాంటిది. కాలు పెట్టిం తర్వాత పెకళించుకుని బయట పడటం కష్టం. పాడు కూపంలో పడటమెందుకా అని ఊరుకున్నా కాని ఇవాళ మిమ్మల్నాసుపత్రి దగ్గర చూసినప్పటినుంచి మీమీద నాకో విధమైన జాలి పుట్టింది. మీమొహారవిందంలో ప్రతిబింబిస్తున్న ప్రేమ, విరహం, తపన నా కప్పుడే అర్థమైంది. నాలో అంతర్గర్భితంగా మీ దర్శన భాగ్యం కలిగినప్పట్నించి మీమీద ఉదయించిన ప్రేమ పెకలించుకొని నా హృదయంలో వెల్లువగా పారింది. అప్పట్నించి ఎన్ని కష్టాలకైనా ఓర్చి మీ అభీష్టం నెరవేరుద్దామని బుద్ధి పుట్టింది. ఇప్పుడు మీ కోసం కేవలం తపించి పోతున్నా. బాహ్య ప్రపంచానికి వితంతువు నేమోగాని ఆంతర్యంగా

ప్రేమమయానందలో ఓలలాడటానికి నేనెక్కడి వితంతువును! మీరీ రాత్రి పది కొట్టగానే దగ్గరేసుంచిన దొడ్డి గుమ్మం ద్వారా వచ్చి నా అభీష్టం నెరవేర్చి మీ అభీష్టం గూడా నెరవేర్చుకోమని ప్రార్థన.... ఇట్లు మీ రాకకోసం ఎదురుచూస్తున్న ప్రేయసి... కాంత" అని చదువుకున్నాడు.

ఉత్తరం చదవటం ప్రారంభించగానే ఆయన హృదయము పులకరించింది. వళ్లు గగుర్పొడిచింది. చేతులు గజగజ వొణికినయి. గుండె గుభ గుభ ఉరవడిగా పోయే రైలింజను లాగు కొట్టుకొసాగింది. కండ్లలో ఆనంద బాష్పాలు గిర్రున తిరిగినయి. రుధిరం పొంగిచల్లారుతున్నది. అపాద మస్తకం చెమటలు గమ్మినయి. కండ్లు తుడుచుకుంటూ ఒకటికి రెండు తడవలు ఉత్తరం సాంతం చదువుకోంగానే కండ్లు మూసుకుని ఆతురత, ఆవేశం, ఆనందాలతో మిళితమై హృదయంలో ఉత్పన్నమైన ఒక కొత్త అవ్యక్తానుభవం కొంతసేపనుభవించాడు.

ఆహా! నా పూర్వజన్మసుకృతం మంచిది కాబట్టే ఈ రెండు వారాల నుంచి చేసిన ఘోర తపస్సు నేటికి పండి ఫలించింది. అటువంటి లావణ్యకత్తే నాకు లభించింది. నా సంకల్పం సాఫల్యమైంది. రూపులావణ్య రేఖలలో ఆ వరూధినిని మించిన కాంత ఏ కోటి పుణ్యాలో జన్మజన్మాలలో చేసుకోనుండబట్టే నా పాలిట బడ్డది. నా అంత అదృష్టవుంతుడింకొకడుండడు అని ఉవ్విళ్ళూరాడు. జవాబుగా

"ప్రియకాంతామణి! నా ప్రేమారాధన ఫలితంగా నేటికి మీ మనసు కరిగినందుకు ఎంతో ఆనందం. గ్రహచార వశాత్తు వయసులోనే వితంతువైనంత మాత్రాన నీ రూపులావణ్యరేఖలకు కొరత ఏమొచ్చింది? మగవాండ్లు ఆధిక్యతను నిరూపించుట కొరకై ఏ కాలంనాడో ఏర్పాటు చేసిన కఠిన కట్టుబాట్ల వల్ల పునర్వివాహం చేసుకుండే ధైర్యం నీకు చాలనందున స్వతసిద్ధమైన కామోద్రేకాన్ని చంపుకోవలసినంత ఖర్మమేం పట్టింది? "ఆనందో బ్రహ్మ" అన్నారు పెద్దలు. అనుభవించవలసిన భోగసౌఖ్యాలోవో అనుభవించి ఆనందిద్దాం. బ్రహ్మాన్ని పొందుదాం. కాన తప్పక ఈ రాత్రి ఆరునూరైనా నూరు ఆరైనా వచ్చి నీ వొళ్ళో వాలతాను...ఇట్లు సదా నీ ప్రేమ మాధుర్యాన్ని చూరగొన కోరు ప్రియుడు..శర్మ అని వ్రాసి మంగి చేతికిచ్చాడు. దానితో పాటు రెండు

రూపాయలు గూడా దానికి బహుమతిగా ఇచ్చాడు.

"మంగీ! జాగ్రత్త సుమా.. ఈ ఉత్తరాల సంగతి నరమానవుడికి తెలియనియ్యగూడదు. రహస్యంగా ఉంచు. లేకుంటే కొంపలు మునుగుతాయి. అన్నాడు.

"అయ్యగారూ! మీకెందుకా బయం. ఈ బొందిలో గుట్టు ఈ బొందిలో పోవాల్సిందే. బమ్మదేవుడు కయినా తెలియనిత్తానా" అని రూపాయలు కోక కొంగున భద్రంగా పీట ముడేసి కట్టుకొని బొడ్లో దోపుకున్నది.. శర్మగారు ఇంట్లోకి పోయినాడు.

మంగి అటుఇటు దొంగచూపులు చూస్తూ పోయి దొడ్డి గమ్మం తలుపు చాటున నిల్చొని మంగి కోసం ఎదురు చూస్తున్న కాంతమ్మకి పేరయ్యశర్మ వ్రాసిచ్చిన జాబు నిచ్చింది. ఆ ఉత్తరం విప్పి చదువుకొని ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ

"మంగి ఎంత మంచిదానివే! రాయబారం ఎంత చాకచక్యంగా నడిపావే" అని ఇంట్లోకి వెళ్లి పాత చీరొకటి తెచ్చిచ్చింది కాంతమ్మ. అది తీసుకొని మంగి మురుసుకుంటూ ఇంటికి పోయింది.

కాంతమ్మ ఆ ఉత్తరంలో చివరి పంక్తి ఒక తడవ మళ్లీ చదువుకొని "ప్రేమ పిచ్చెక్కిన పక్షి ఈ రాత్రికి నావొళ్లో కాదు నా వలలో పడుతుంది." అని చంకలు కొట్టుకొని సంతోషించింది. దీపాలు పెట్టగానే అన్నంపెట్టి తమ్ముణ్ణి "పాఠాలు చదువుకొని అక్కడే పడుకోరా" అనిచెప్పి సూరిశాస్త్రిగారింటికి పంపింది.

భోజనాలైన తర్వాత ఎప్పట్లాగ మంచాలేస్తుంటే తల్లి "ఎందుకు నేనింట్లో ఉడికి చావటం! కుర్రవాడు శాస్త్రిగారింటికి చదువుకోటానికి పాయె. నా మంచం కూడా దొడ్లోనే వేయవే" అన్నది.

" నీదంతా విచిత్రమే అమ్మా. ఉడికిపోవటానికి రోజులేని ఉక్క ఇవాళ కొత్తగా పోస్తున్నదిటే? ఉన్న చెంబు, తప్పేల, బియ్యపుగింజలు కాస్త అటునుంటి ఎవరన్నా కన్నం వేసి తీసుకపోతే కరువులో అధికమాసం మన్నట్లవుతుంది. నీవెప్పట్లాగు ఇంట్లోనే పడుకోవే. నే దొడ్లో పడుకుంటా. దొంగ తోడుకు ఎందుకైనా మంచిది. అని ఎప్పట్లాగే 9 గంటలకల్లా మంచాలేసి పక్కలేసింది. కొంచెంసేపు ఇంట్లో తల్లి పక్కమీద కూచోని దాశరథీ శతకంలోని పద్యాలు

చదివి వినిపించింది. అవి వింటూ వెంకమ్మ ఆవలిస్తూ కునికిపాట్లు పడుతుంటే

"అమ్మో అప్పుడే నిద్రొచ్చిందిటే? ఇదే మలవాటే పాదలవాటు. ఎవరన్నా చదివి వినిపిస్తుంటే సరి పెద్దమ్మ వూనుకొస్తుంది. సరే తలుపు వేసుకొని పడుకో! దీపమెందుకు దీటీలాగు వెలిగించావు? ఎలికలేమన్నా పీక్కతింటాయిటే నిన్ను? అని తనే దీపం బాగా తగ్గించి దొడ్లోకి పోయింది. వెంకమ్మ వాకిలేసుకున్నదే తడవుగా పడుకొని గురకలు పెట్టి నిద్ర పోయింది.

పక్కవేయగానే గుట్టి చక్కంగా తెచ్చి పరుపుకింద దాచుంచిన అలంకార వస్తువులు బైటికి తీసింది కాంతమ్మ. కొర్నాటి చీర కట్టింది. పట్టెపట్టెల పట్టురవికె తొడిగింది. వాసన సబ్బు పెట్టి రెండు తడవలు మొహం బాగా రుద్దుకొని కడుక్కొంది. ఆ చీకట్లోనే పాపట చెదరకుండా రెండు వేళ్ళతో తడువుకుంటూ కొమ్ము దువ్వెన పెట్టి జుట్టు నున్నంగా దువ్వుకొని ముచ్చట ముడేసుకున్నది. సాయంకాలం కోసి దాచుకున్న పారిజాతపు పూలిన్ని పక్కమీద పరచుకున్న తెల్లటి చలువ దప్పటి మీద వెదజల్లి గుప్పెడు పూలు జుట్టు ముడిలో దోపుకున్నది. పక్కమీద కూచోని, పదప్పుడు కాడలారా అని ఎదురుచూస్తున్నది.

శర్మగారొస్తే ఏ విధంగా ఆహ్వానిద్దామా అని పరిపరి విధాల ఆలోచించుకుంటూ పక్కమీద దిండు కాసేపు తలాపికి కాసేపు కాళ్ళకూ మారుస్తూ కొంతకాలం గడిపింది.

ఆ నిర్మలరావు పిల్లలు సూరిశాస్త్రి గారింటికి ఇవాళ ఎట్లాగో చదువుకోని పోతారు. మా వాడు కూడా అక్కడుంటాడు కాబట్టి ధైర్యం చేసుకొని ఇవాళెవరూ చెట్టెక్కటానికి రారు. మధ్యాహ్నం నాకు అతనికి సవాలక్ష గ్రంథం జరిగింది కాబట్టి ఆ అప్పలసామి అసలే రాడు. పైన ఆకాశం, చుక్కలు, పక్కన నారింజ చెట్టు. చుట్టూ గోడలు తలుపులు, భూదేవి తప్ప నేను, శర్మగారు పడుకోనుండటం ఇక చూచేవాండ్లెవరూ ఉండరు. ఆయన తప్ప ఇంకెవరూ రారు అని కాసేపు ఏమో శర్మగారికి బదులు ఆ ప్రేమ పిచ్చెక్కిన అప్పలసామి వస్తాదేమో? చివరి ఘడియకు మనసు మార్చుకొని ఆ శర్మగారు రానే రాడేమో? దొడ్లోకి మంచం తెచ్చేటప్పుడు పిల్లెదురైంది. ఏం దుర్ఘటన సంభవిస్తుందో? ఒకవేళ ఇటు శర్మగారు, అటు అప్పలసామి ఒకరి తర్వాత ఒకరొచ్చినా ఇద్దరూ ఒకేసారి తలుపు కొట్టినా చేసేదేమిటి? అనే ఆలోచన తట్టగానే కాంతమ్మ గుండె గుభేలుమన్నది.

వేటగాడికి దడిసి దడదడ లాడుతూ పొదలచాటున దాక్కున్న కుందేలు చందంగా ఒక క్షణం గజగజ లాడింది. ఒళ్ళు జలదరించింది. ‘ ఓరి దేవుడో అంత పని జరిగితే చచ్చానే” అని అప్రయత్నంగా రెండు చేతులు కలిపి తల పైకెత్తి దణ్ణం పెట్టింది.

అకాసేపు నిజంగా ఇద్దరూ వచ్చి తలుపు కొట్టినట్లుగానే తోచింది ఆమెకు. కాని, మరుక్షణం ఒట్టొట్టి ఉలికిపాటేగాని నిజంగా ఆ అప్పలసామి ఎందుకొస్తాడు లేస్తూ. అంత నీతిపరుడు ఇంకోడ్లేడు. ఏదో ఖర్మం చాలక నా వల్లో పడ్డాడు గాని.

గొప్పవారమని విర్రవీగే వారిండ్లన్నీ వ్యభిచారపు పుట్టలే గదా! పేరు పెద్ద ఊరు దిబ్బ. తప్పుడు సాక్ష్యాలకు నిధులు గదా! కొంపలు ముంచటానికి ఘనులు గదా! ఏందో కడుపు చించుకుంటే కాళ్ల ముందర పడుతుంది. అనుకొనేం లాభం? నా ఊసెత్తుకోనని ఒట్టు పెట్టుకున్న అప్పలసామి సూర్య చంద్రాదులు తల్లకిందులైన రాడు. నా బెదురుపాటు తప్ప ! అని మనసు కుదురు పరచుకుంది. శర్మగారొస్తారని రారో అని కాసేపటు ఇటు కాలుగాలిన పిల్లిలాగూ పచారు చేసింది.

ఇవాళ ఆ మునిసిపాలిటీలో గంటలు కొట్టే ముండాకొడుకు తప్పతాగి పడుకున్నట్లుంది. రోజు ఈ పాటికే ఖంగు ఖంగుమని పది గంటలు కొట్టేవాడు. ఇంకా కొట్టకుండా ఉన్నాడేం. అని వెళ్ళి పక్కమీద ఎల్లికలా పడుకొని ఆకాశంలో చుక్కలు కొంతవరకు లెక్కపెట్టి అబ్బా ఇన్ని చుక్కలు లెక్కపెట్టడానికి నన్ను పుట్టించిన బ్రహ్మదేవుడు దిగి రావాల్సిందే... అయిన ఆ చుక్కలు ఎంత అందంగా ఉన్నాయో. వజ్రాలు మెరిసినట్లు మెరుస్తున్నయి. ఆచుక్కలు లేని ఆకాశం ఎంత శూన్యంగా ఉంటుందో! పురుషుడు లేని స్త్రీ జీవితం అంత శూన్యం గదా! స్త్రీ పురుషులకు కామమే లేకపోతే సృష్టంతా శూన్యమే గదా! సృష్టికి మూల కారణమైన ఈ కామాన్ని అనుభవించకుండా అణిచిపెట్టుకోవటం ఎంత పాపం! అని అనుకొంటుండగా దూరాన గంటలు కొడుతున్నాడు. అవి లెక్కబెడదామని లెక్కబెడుతుంటే తలుపు కొట్టిన చప్పుడు వినపడ్డది. ఉలిక్కిపడి లేచి కూచుంది.

శర్మగారు మెల్లగా మునికాళ్లమీద చప్పుడు చేయకుండా లోపలికొచ్చి తపుపేశాడు. గొళ్ళెం వెయ్యలేక తడబడుతున్నాడు. కాంతమ్మ చప్పున వెళ్ళి ఆయన పక్కగా నిల్చుని గొళ్ళెం వేసింది. ఆమె చీరచెంగు ఆయన మొహానికి

రాచుకుంది. ఆయన శరీరం మీద ఆమె దేహం వాలింది గజగజ లాడుతూ గబుక్కున వాటేసుకుని ఆమె నాయన బిర్రుగా కావిలించుకున్నాడు. ఇద్దరూ పరవశులై కొంతసేపలా కదలకుండా మెదలకుండా కౌగిలింతలో ఉన్నారు.

శర్మగారు బెదిరిన లేడి మాదిరిగా వణికిపోతుంటే వీపు చరిచి "ఇదేమండి ఇట్లా వణికిపోతున్నారు" అంది కాంతమ్మ

శర్మగారు మాట్లాడటానికి ప్రయత్నిస్తే నోటెంబడి మాట రాలేదు. కాంతమ్మ మెడ కరుచుకొని ఆయన తల కింది కొంచి గట్టిగా పెదవుల మీద ఒక ముద్దు పెట్టింది. ఆయన "హో! అబ్బా" అని ఇంకో ముద్దు పెట్టుకున్నాడు. కాంతమ్మ కౌగిటి విడిపించుకొని ఆయన చేయి పట్టి లాగి మంచం మీదకి గుంజక పోయింది. ఎదురు మాళ్లా కూచో పెట్టుకొని "ఏమండీ మాట్లాదరేం?" అన్నది.

శర్మగారు గుటకలు మింగుతూ గుండె సర్దుకుంటూ "నేనెప్పుడూ పరస్త్రీ మొహం ఎరుగను. అందుకని వళ్ళు దడదడలాడుతున్నది. కొంచెం దడ ఆగంగానే మాట్లాడుకుందాం" అన్నాడు

కొంతసేపటికి ఇద్దరూ సిగ్గు బిడియాలిడిచి గుసగుసలుతో ముచ్చట్లాడు కోటం ప్రారంభించారు. కాంతమ్మ ఆయన్ని తలపట్టి క్రిందకు లాగి తన తొడమీద పడుకోబెట్టుకుంది. తల మీద నొసట మీద చేయి నిమురుతూ "మీకు నాకు ఏనాటి బంధమో ఉండబట్టి గాని లేకపోతే నా బోటి వితంతువుకు మీ బోటి శ్రోత్రియ కుటుంబీకులకు ఈ ప్రేమ ఏవిటి? అంతా మాయ...ఈ ప్రపంచమే మాయదారిది. ఇందులో అన్నీ సంభవమే. అయినా ఏ కట్టుబాట్లయినా మానవ నిర్మితాలు గాని భగవన్నిర్మితాలు కావు గదా! పురాణాలల్లోనే పరస్త్రీ, పరపురుషుల ప్రేమ గాథలెన్నో ఉన్నాయి గదా! అన్నది కాంతమ్మ.

శర్మగారు ఆమె రాపిడికి స్థిరచిత్తుడై కాళ్ళు పారజాపి ఆమె ఒడిలోకి తలదూర్చి నిశ్చింతగా పడుకొని " మన ప్రేమ ఎటువంటిదో చెప్పి వర్ణించటానికి నాకా వర్ణన లేమన్నా తెలిస్తేగా! కొన్నాళ్ళు నాటకాల్లో ఆడవేషం వేశా, కానప్పుడు గూడా నాకు ఎవరో వ్రాసిచ్చిన పుస్తకాల్లో వున్న ఏ మాటలో, పాటలో, పద్యాలో కంఠోపాఠంగా వల్లేసి స్టేజి మీద రోకటి పాటగా అందం చందం లేకుండా అప్పజెప్పేవాడ్ని. సహజంగా కొంచెం వినసొంపుగా వుండేది. అంతకుదప్ప ప్రేమనేదేమిటో, ఆప్రేమకోసం ఈ జీవుడింత ఎందుకు కొట్టకలాడాల్నో అర్థమయ్యేది కాదు. అంతా అగమ్యగోచరంగా ఉండేది. నా ఇరవైఐదో ఏట

నాకో ఎనిమిదేళ్ల ఆడపిల్లను అంటగట్టారు. ఆ పిల్లకాపురాని కొచ్చేటప్పటికే ఆరేండ్లు పట్టింది. ఈ ఎనిమిదేండ్ల నుంచి కాపురం చేస్తున్నా. ఆ తాళిగట్టిన పెండ్లాం మీద ఇంత ప్రేమ ఎప్పుడూ ఎరగ. అదేం చిత్రమో గాని నిన్ను చూచినప్పట్నించి నీ ప్రేమ చూరగొనాలె. నీ ఒడిలో వచ్చి పడాలె. నీ కౌగిలి కావలించుకొని తరించాలె, నీ అధర మాధుర్యం ఆరగించాలె. నీ చేయి తాకితే చాలు. నీపు కన్నెత్తి చూస్తే చాలు నీవు "ఊ" అంటే చాలు అని పుట్టింది! నీవేదో మోహనాస్త్రం ప్రయోగించి నన్నీ స్థితికి తెచ్చినట్లున్నావు. లేకపోతే నీమీద నాకెందుకింత వ్యామోహం? ప్రేమ? పురాణాల ప్రేమగాధలకే మెచ్చెగాని నీ గాధ నీవు చెప్పుకుందూ" అన్నాడు మెల్లమెల్లని తడబడే మాటలతో

కాంతమ్మ "ప్రేమ జీవితానికి ప్రతిబంధాలు, వైరాగ్య జీవితానికి పురాణాలే గదండి మనకు మార్గదర్శకం! ఇహ నా గాధంటారా, మీగాధకన్నా మరీఘోరమైనది. పెండ్లి చేసుకున్న పెనిమిటి బతికున్నంతకాలం సరిగా చూసే ఎరగడు. పడక గదిలో వున్న కాసేపు గూడా పశుపాత్రుడిలా ప్రవర్తించేవాడు. ఎప్పుడూ సున్నితమైన ప్రేమతో చూసిన పాపాన పోలా. చీవాట్లు, చెప్పుదెబ్బలు, శాపనార్ధాలతోటే ఆ కాస్త దాంపత్య జీవితం గడిచిపోయింది. ఆయన చనిపోయిన రోజున అందరూ ఏమనుకోని పోతారో అని ఏడ్చాగాని, లోలోపల మాత్రం నాపాలిటి యుముడి పీడ వదలిపోయినాడని సంతోషించా. మా కాపురం మన్ను దమ్ముగానే యేడ్చి మంటగలిసింది. తోలు బొమ్మలాటలాగు ముగిసి పోయింది. మీరు కాస్త కాకపోతే కాస్తన్నా కుటుంబ సౌఖ్యం అనుభవించారు. నేనదీలేదు.

శర్మ "ఏం అనుభవింపులే. పిల్లా మేక పుట్టినట్లయితే ఎట్లా వుండేదో? నా పెండ్లాం గొడ్డుబోద్ది. రోగిష్టిమార్ది. ప్రేమకవకాశముంటేగా? మా పెండ్లేదో బొమ్మలపెండ్లిలాగ జరిగిపోయె. ప్రేమానురాగాలతో చేసుకున్న పెండ్లయితే సౌఖ్యం అనుభవించే వాడ్నేమో. ఒకర్నొకరు మోహించుకోని ప్రేమలో పడ్డాం కాబట్టి ఆ అనుభవించే సౌఖ్యమేదో ఇహ అనుభవించాలె. అయినా ప్రేమకు మొహమాచి ఉన్న మనిద్దరం కలుసుకున్న ఈ మంచి ఘడియల్లో పూర్వగాధలు తవ్వుకోవటం తప్పే. అవి మన మనసులో లేనిపోని వ్యాకులం పుట్టిస్తయి. ఇంకా మనం అనుభవించబోయే ప్రేమమయ జీవితానికి గూడా అడ్డురావచ్చు." అని కాంతమ్మ మొహం కళ్లు ఆ చుక్కల వెలుతుర్లో కండ్లు చించుకొని చూస్తూ

"ఆహా ఏమి నీ అందం కాంతా. నీకోసం ఘోర తపస్సు చేశా.

తపించా. చివరకు నీ ప్రేమ జూరుకోగలిగా. దేశంలో ఏంతోమందో అందగత్తెలు లేరు? కానీ, నీబోటి సుందరిని ఎక్కడా చూడలా. నీ అందమంతా నీ లేడి కండ్లలో ఉంది. కాంతా, కోటి రూపాయలు ఖర్చు చేసినా ఈ ఘడియల్లోనే ననుభవిస్తున్న సుఖం, ఆనందం, ప్రేమ ఎప్పుడు అనుభవించలేదు. చిరకాలం మన ప్రేమ శాశ్వతబ్రహ్మ కల్పంలా సజీవమై ఉండాలని ఆ భగవంతుడ్ని ప్రార్థిద్దాం. కావలించుకో...గట్టిగా కావిలించుకో కాంతా" అని చివ్వున లేచి కూర్చున్నాడు. కాంతమ్మ ఆయన అధరానికి అధరం ఆనించి బిర్రుగా కరుచుకొని గట్టిగా కావలించుకుంది.

పేరయ్యశర్మ " హోకాంతా! ఓ భగవంతుడా!" అని మాత్రం ఉచ్చరిస్తూ ఆమె మెడనిండా మొహం నిండా ముద్దుల వర్షం కురిపిస్తున్నాడు.

కాంతమ్మ "అబ్బా వుండండి. ఇదే నా ప్రార్థన. మనమిట్టా వుంటే కడుపైతే ఏం చేయాలె. మీ అవసరం తీర్చుకొని నన్నఘాతంలోకి ముంచి మీ పాటికి మీరు రాకుండా పోతే నా గతేం కావాలి? వెనకటికెవరో మగవారిని నమ్మరాదే చెలీ అన్నారు. మీకేం ఈ కాసేపు ఎన్ని మాటలయినా చెబుతారు. బతిమిలాడి భంగపడతారు. ఎక్కడలేని ప్రేమ చూపిస్తారు. చివరకా ఘడియ వచ్చేటప్పటికి కండ్లకు కనపడకుండా మాయమవుతారు"

శర్మ " అయ్యో పిచ్చిదాన! నీకెందుకాభయం? అటువంటి సమయమే వస్తే కాన్పయిన దాకా ఏ చెన్నపట్నంలోనో నీచేత కాపురం పెట్టిస్తా. బిడ్డ నీకు పుట్టినా ఎక్కడో దత్తతు తెచ్చుకున్నానని మా ఇంట్లో వుంచి సాకుతా. లేకపోతే ఏ బ్రహ్మసమాజంలోనన్నా చేరి నిన్ను పెండ్లి చేసుకుంటా. నాకున్న ఆస్తంతా తెగనమ్మయినా నీకు మాట రాకుండా చేస్తా. నేనందరి మాదిరి వాడ్నికాను. నీకోసం ప్రాణమైనా అర్పిస్తా. ఇంకా నాసంగతి నీకు తెలియదు. తెగిస్తే ఎంత పనైనా చేస్తా. కావాల్సుంటే రేపే నా ఆస్తి నీపేరపెడతా. ఏమంటా?"

కాంతమ్మ "ఈ మాటలకేం లేండి. ఇప్పుడున్న ఉద్రేకంలో అట్లాగే అంటారు. తీరా ఆస్తి పేర పెట్టాల్సొచ్చేప్పటికి అమ్మలక్కలెవరో అడ్డువస్తారు. ఇప్పుడున్న పొంగు చల్లార్తుంది. ఏదో నెపం పెట్టుకొని అంతార్ధానమవుతారు. ఆస్తి రాసిచ్చినంత, పెండ్లి చేసుకున్నంత ఫలం కష్టకాలంలో నన్ను బొందన తోసి పోకుండా ఆదుకుంటే అదే పదివేలు! కావలసిన కారణార్థములు లవంబున దప్పునె అన్నారు. కానివ్వండి. ఏంకావాల్సున్నదే అదవుతుంది. నొసటన్ వ్రాసిన వ్రాలుకన్న కలదా నూరేండ్లు చింతించినన్? నేను మాత్రం మాట సామెత

కంటున్నానే గాని కష్టాలొస్తాయని ఈ సౌభాగాన్ని చెడగొట్టు కుంటానా? ముంతెడు నీళ్లకే దడిస్తే కడివెడు నీళ్ళకేం కావాలె? ఈ ఒక్కరోజు భాగ్యానికే ఇంత భయపడితే మన జన్మంతా ఎలా కడతేరాలే? సుఖానికి ఒడి పట్టినప్పుడు కష్టానికి ఒడి పట్టకుండా తప్పుతుందా?" అని అతి సరసంగా అని సరస సల్లాపాలు ప్రారంభించింది.

ఆ ప్రశాంత స్థలంలో చల్లటి పిల్లగాలుల వీచికలతో పచ్చని నారింజ చెట్టు క్రింద గుమగుమలాడే పారిజాత పరిమళంలో మత్తెక్కి మెత్తటి దూది పరుపుమీద మైమరచి పడుకొని భోగ సాగరంలో మునిగి బుడకలేస్తున్నారు శర్మ కాంతమ్మలు.

నిర్మలరావు నందిపాడు కరణం నారాయణయ్య కొడుకు. ఆయనకు ముగ్గురు కొడుకులు, నలుగురు కూతుళ్ళు. అవూరు ఆరు వందల గడపగల ఒక పల్లెటూరు. గుంటూరుకు 20 మైళ్ళుంటుంది. అక్కడుండేది ఎక్కువగా పెద్ద కమ్మలు. వీర్నే ఇల్లొదలని కమ్మలని గూడా అంటారు. వెనుక వీరి ఆడవాండ్లు ఇల్లోదిలి బైటికి రాకుండా ఘోషా పాటిస్తుంటే ఈ పేరొచ్చింది. ఇప్పుడు వాండ్లు గడ్డీ గరపకు, పనిపాటలకు పొలాలు పోతున్నా ఇంట్లో కావలసిన నీళ్ళు మాత్రం మగవాళ్ళు కావిళ్ళేసుకొని వూరిబైటికి చేదుడు బావుల నుంచి తోడి తెచ్చి పోసే పద్ధతింకా పోలేదు. కొంతమంది పెత్తనదార్ల ఇంటి ఆడవాండ్లు ఇప్పటికీ ఇల్లొదలి బైటికి పోరు.

అవూళ్ళో నుంచి ఎవరూ గొడుగేసుకొని, గుఱ్ఱమెక్కి చెప్పులు తొడుక్కొని పోరు. అవూరి వాడ్లు పోనివ్వరు. అదేంటంటే పెద్ద కమ్మవారికి జరగాల్సిన మర్యాద అని అంటారు. అట్లా ఎవరైనా మర్యాద తప్పాదారా పోతుంటే వాండ్లను కుర్రకారు పట్టుకొని చావమోదేవాండ్లు.

ఒక తడవ మతం పుచ్చుకున్న మాదిగతనొకడు పంతానికి కిర్రుచెప్పులు తొడిగి గొడుగేసుకొని "ఏంది మీరు నన్ను చేసేదని వీధులెంబడి తిరుగుతుంటే అతన్ని చావ చితక కొట్టారు. పోలీసులు కేసుపెట్టి ఒకరిద్దరికి ఆరేసి నెలలు శిక్షలు, పదిమందికి జరిమానాలు వేయించేప్పటికి ఈ దుడుకుతనం తగ్గింది. కానీ ఇప్పటికి పై వూళ్ల నించి వూళ్ళో గుండా పోయే బాటసారులు ఈ ప్రథ పాటిస్తుంటారు.

నీరుకావి పంచలు కట్టి, మల్లు తలగుడ్డలు చుట్టి, మెల్లెకర్రలు చేత పుచ్చుకొని తిరిగే పెద్ద మనుషుల సంఖ్య ఎక్కువే ఆ వూళ్ళో. చొక్కాలేసుకుండే

వాళ్ళు అరుదే. ముడి జుట్టు తప్ప క్రాఫింగు లెరుగరెవరూ. కుర్రకారు గూడా తెల్లపంచ కట్టి చొక్కాలేసుకున్న పాపాన పోరు. చదువా శూన్యం. పెద్ద బాలశిక్ష చదువులు చదివిన వాండ్లొకరిద్దరున్నా ఇంగ్లీషు చదివిన వాండ్లసలే లేరు. మూడు వేల జనాభాకు పైగా ఉన్నా ఒక ప్రయిమరీ బడి తప్ప లేదక్కడ.

చదువు సంధ్యలు లేకున్నా మొండి పట్టుదలలు భేషజాలు మెండు, పెద్ద చిన్నకు గూడా. నోరులేని కూలి జనంమీద చలాయిస్తుంటారు వారి అధికారమంతా. పనిపాటలు చేసుకొని బతికే బీద బిక్కిని, తక్కువ కులం వాండ్లను వేధించుకు తింటారు. ఎక్కడాలేని వెట్టిచాకిరి వాండ్ల చేత చేయించుకుంటారు. పిచ్చికుంచాలతో కూలిస్తుంటారు. జమీందారీ వ్యవస్థ, నాటు పూర్వచారాలకు పుట్టినిల్లావూరు. నవనాగరికతను ఆ వూరికళ్లు తొంగయినా చూడనివ్వరావూరివారు.

ఊళ్ళో శైవ, వైష్ణవ దేవాలయాలు రెండున్నాయి. వాండ్లలో వాండ్లు ఎన్ని పార్టీలు పడికొట్టుకుంటున్నా వీటికి సంబంధించిన తిరునాళ్ళు, గరుడసేవలు, సంతర్పణలు, పూజలు, పునస్కారాలు, చిల్లదేవతల కొలుపులను గూడా లోటులేకుండా జరుపుతారు. అంతా ఉమ్మడిగా చేరి ఏ ఎన్నికలొచ్చినా కులాభిమానంతో కులస్తులకు మాత్రం ఓట్లిస్తుంటారు. కొన్ని చోట్ల కమ్మ బ్రాహ్మలు బయలుదేరి పురోహితుల నోట మట్టిగొట్టి బ్రాహ్మణార్థాలు చేయిస్తున్నా అక్కడ మాత్రం మాన్యాలు లొక్కొని బ్రాహ్మలను వెళ్లగొట్టలా. అందుకని కరణాల కొంపలు కొద్దైనా, వైదీకుల ఏపదిండ్ల వాండ్లో ఉండే వాండ్లు. పెండ్లిండ్లకు, పురుడు పుణ్యాలకు, కార్యక్రమాలకు అనువైన ఆసాములంతా వీరికి బాగా మోయన్లు, సంభావన్లు ఇచ్చి పోషిస్తుండేవారు. గోదాన భూదానాలివ్వటం గూడా మానలా. చిన్నకారు కుర్రవాండ్లెపుడన్నా బ్రాహ్మల్ని విమర్శిస్తుంటే పెద్దవాళ్ళు "ఓరేయ్ బ్రహ్మద్వేషం, అన్నద్వేషం పుట్టిం తర్వాత బతకటం కష్టం. ఎంతచెడ్డా బ్రాహ్మలు అగ్రజాతివారు. మనం తరతరాలనుంచి ఎంతో అన్యోన్యంగా ఉన్నాం. ఈనాటికి మాయచదువులు వచ్చి నాజూకులు పెరిగిం తర్వాత వాండ్లను తిట్టిపోయటం ధర్మంకాదు. వర్ణాశ్రమ ధర్మాలను ఊరెకొచ్చినయా? అంతా అందలమెక్కేవాండ్లయితే మోసే వాండ్లెవరు? చాకలి, మంగలి, జోగి, జంగం అనే గిరులు గీసి ఎవరి విద్యుక్త ధర్మాలు వాండ్లు చేసుకుండేట్లు పెద్దలు నియామకం చేయబట్టి లోకం గిరి తప్పకుండా నడిచిపోతున్నది. ఇవాళ మీరు బర్రె పలుపుల్లాంటి జంధ్యాలేసుకొని తిరిగి

బ్రాహ్మణార్థాలు మొదలు పెడితే దున్నించి పండించెదెవరురా?" అంటూ ఉండేవాండ్లు.

తండ్రి చిన్నతనంలోనే చనిపోతే నారాయణయ్య 18వ ఏట కరణీకాని కొచ్చాడు. దస్తరం పుచ్చుకున్నప్పటినుంచి ఊళ్లో పెద్ద గుఱ్ఱమెక్కి తిరగటం, పెత్తనదారులను లక్ష్యపెట్టక 'ఏమండీ' అని పిలిచే ప్రథ పోగొట్టి 'ఏమయ్యా' అని పిలవటం వల్ల ఊరంతా ఒకటై ఆయన్ను సాధించాలని చూచారు కాని, ఆయన కాలికి పెడితే వేలికి, వేలికి పెడితే కాలికి ముడి వేసి ఉన్నవి లేనివి కల్పించి కేసులు పెట్టేవాడు. మకాం వచ్చిన అధికార్లకు పంచభక్ష్య పరమాన్నాలతో విందులు పెట్టి వాండ్ల ప్రాపుతో పెట్టిన కేసల్లా గెలుచు కొస్తుండేవాడు.

నారాయణయ్య అసాధ్యుడు. ఆయన జోలికి పోయిన వాండ్లు మసే అన్న పేరు ప్రతిష్ట జిల్లా అంతటా సంపాదించాడు. అయనంటే అందరికీ హడల్. పెద్దలు సంపాదించిన అస్తంతా పేరు ప్రతిష్టలకే ఖర్చుపెట్టాడు. అప్పు లెక్కువైనయి. కాపురం పెద్దదయింది. వచ్చిపోయే చుట్టపక్కాలు అతిథి అభ్యాగతుల సంఖ్య మితిమీరింది. క్రమేణ ఆస్తిపాస్తులు ఏనుగు మింగిన ఎలక్కాయలా కరిగిపోయినయి. కొష్టంనిండా వుండే ఎద్దులు, ఆవులు, పాడి బర్రెలు తగ్గ ప్రారంభించినయి. కాలక్రమేణ పొలం బొట్ర అమ్మజూపి చేసిన అప్పులు తీర్చసాగినాడు.

బాపట్లలో పూట కూలింట్లో వుంచి చదువు చెప్పిస్తున్న ఇద్దరు పిల్లలను గూడ ఖర్చు భరించలేక సగంలో చదువు మాన్పించి పెద్దతనికి ఎట్లాగూ కరణీకం ఉన్నదని, రెండో అతను వ్యవసాయానికి అక్కరకొస్తాడని ఇంటికి తెచ్చాడు. నిర్మలరావును మాత్రం ఎట్లాగయినా బి.ఏ. వరకు చదివించాలనుకున్నాడు. అతను ఏకసంథాగ్రాహి. ఒకసారి చదివిన పాఠాలు వల్లేసినట్లు అప్పజెప్పేవాడు. లెక్కలలో మంచి మేధావి. పరీక్షల్లో ఫస్టు మార్కులొచ్చేవి. చదువులో ఎంత చురుకో అల్లరిలో గూడా అంతే. గుఱ్ఱాలెక్కటంలో, ఈతలు కొట్టటంలో మొనగాడు. ఆటలు అద్భుతంగా ఆడేవాడు. గోలీలు, బిళ్లంగోడు, కోతి కొమ్మం చులంటే బహు ఇష్టం.

నారాయణయ్యకిచ్చింది పేరయ్యశర్మ అప్పనే. చెల్లెలొకతి చిన్నప్పుడే ముండమోసి అప్పను కనిపెట్టుకొని ఉండేది. కాని, సంవత్సరం క్రిందనే చనిపోయింది. శర్మ తండ్రి సాంబయ్యగారు తహసీల్దారు పనిచేసి పిల్లికి బిచ్చం

పెట్టకుండా బోలెడంత ఆస్తి సంపాయించి అరండల్‌పేట పిచ్చికలగుంట దగ్గర ఒక పెద్ద భవంతీ ఇల్లేసి శర్మగారి చిన్నతనంలోనే కాలం చేశాడు. తల్లి పాపాయమ్మ వచ్చే ఆదాయంలో తన భాగానికి మితిమీరి ఖర్చు పెట్టినా ఉన్న అస్తి మటుకు పోగొట్టకుండా కాపాడుకొచ్చింది. పైపెచ్చు ఉఁటుఉదయంగా వారసత్వపు ఆస్తులు కూడా కలిసొచ్చేవి.

మొత్తంమీద ఒక లక్షరూపాయల కవిల, 20వేల రొఖ్ఖం, మెట్ట మాగాణి సహితం ఒక లక్షరూపాయల విలువ గల భూస్తితి ఉండేది. భూములన్నీ ఒక చోట కాకుండా తెనాలి, నరసరావుపేట తాలూకాలలో అక్కడక్కడ ఉండేవి. భూముల మీద వరుంబడి ధన ధాన్యాల ద్వారా రైతులే గుంటూరు తెచ్చి అప్ప జెప్పిపోతుండేవారు. గుంటూరులో మాత్రం గొడ్ల మేతకు సరిపోయే 5 ఎకరాల మెట్ట. ఒక రెండెకరాల మల్లె తోట ఉండేది.

పేరయ్యశర్మకు 30 ఎండ్లొచ్చిందాకా పెత్తనం తల్లే చేసింది. బీడీలకు డబ్బుకావాలన్నా ఆమె చేతిమీదిగా ఇచ్చింది. పాపాయమ్మకు 25వ ఏట పెనిమిటి చావటం, పిల్లలు చిన్నవాండ్లు కావటం, ఇంటికల్లా ఆమె పెద్దకావటం, మస్తుగా డబ్బుండటం వల్ల సాధారణంగా అటువంటి పరిస్థితులలో అలవడే చాటుమరుగు దుర్గుణాలన్నీ అలవడ్డవని, మత్తుపదార్థాలు ముఖ్యంగా నల్లమందు వాడేదని గిట్టినవాండ్లు, గిట్టనివాండ్లు అనుకుండేవాండ్లు, పాపమేంటో పుణ్యమెంతో ఆ భగవంతునికే తెలియాలి. పెద్దతనం రాగానే ఇనపపెట్టె తాళపు చేతులు కొడుక్కిచ్చి వృద్ధ నారీ పతవ్రత అన్నట్లు కథా కాలక్షేపాలతో కాలం గుడుపుతుండేది.

అల్లుడికి తనకు గిట్టనందువల్ల పాపాయమ్మ తరచు నందిపాడు పోయేది కాదు. శర్మ మాత్రం పోయొస్తుంటాడు. ఒకసారి సతీసమేతంగా ఆయన నందిపాడు వెళ్లినపుడు అప్ప హనుమాయమ్మ "ఓరే తమ్ముడూ, నిర్మలుడికి బాగా ఇంగ్లీషు చదువు చెప్పించాలని ఉంది. అందరిలోకి వాడే ఎక్కువ తెలివైనవాడు. ఈయన్ను నమ్ముకుంటే అయ్యేటట్టేంలేదు. అదిగాక ఒకడ్నే ఏ పూటకూలింట్లో ఉంచి చెపిద్దామనుకున్నా పోకిరి పిల్ల సావాసం పట్టి అదుపులో పెట్టే వాండ్లు లేక చెడిపోతాడేమో అని భయంగా ఉంది. మధ్యాహ్నం సీతమ్మతో హెచ్చరిస్తే 'అయ్యో అంతకన్నానా అతనిని తీసుకెళ్లి పెంచుకుందామని అని నాకెన్నాళ్ల నుంచో ఉంది. అయితే నీవు ఎమంటావో అని అడగలా.. నా పిల్లల్ని పెంచుకోలేక ఇంకోరికప్పజెపుతానా అని మీ ఆయనెక్కడనిపోతాడో అని గూడా ఊరుకున్నానన్నది. పాపాయమ్మ, నేను ఆయనకేం అట్లాగే

అంటాడు. పెండ్లి కావాల్సిన ఆడపిల్లలున్నారు. ఈ కాపరం ఎట్లా ఈదటమా అని నాకే భయంగా ఉంది. ఆయన మట్టు మదుపు తెలియకుండా ఖర్చు పెడతాడు. రాబడి తగ్గింది. ఖర్చుమెండయిందన్నా. సీతమ్మ నాకు మాత్రం ఇష్టమే. మీ తమ్ముడు గారిని అడగమన్నది. అందుకని నిన్నడుగుతున్నా ఏమంటా" అన్నది.

పేరయ్యశర్మ "వాడసలే శొంఠికాయ. శుద్ధ పోకిరి. ఇక్కడే ఇట్లా బదుద్ధాయిలా తిరిగి ఇంటి మీదికి తగూలు తెస్తూ అల్లరి చేస్తుంటే అక్కడెట్లా వాడితో ఏగటం? దానికేం చెపుతుంది. ఏం తంటా వచ్చినా మగవాడ్ని నాకే గదా?

హనుమాయమ్మ "అడక్కడక్క నోరు తెరిచి అడిగినందుకు మంచి జవాబె చెప్పావురా. పైగా వాడ్ని వంక పెడుతున్నా. పోకిరంటావేమిరా? చిన్నతనంలో పోకిరిగా తిరిగిన పిల్లలే పెద్దతనంలో గొప్పవాండ్లయ్యేది. అంతా నీమాదిరి ముచ్చులా వుంటారా? వాడికి ఇప్పుడున్న తెలివితేటలు చిన్నప్పుడు నీకుందేవట్రా? నీకంత ఇష్టం లేకపోతే పోనీయ్ " అని నిష్టూరంగా

శర్మ "ఎందుకే అంత నిష్టూరపడతా. అల్లరికుంక గదా అక్కడ సరిగా ఉంటాడో ఉండడో అని అన్నాగాని లేకపోతే వాడికింత అన్నం పెట్టి చదువు చెప్పించే శక్తి లేదటే? అయినా ఆలనాపాలనా చేసి పోషణ చేసేది అదే సరేనంటే నేను మటుకు కాదనటమెందుకు? ఈ తడవ నారాయణ బావ గుంటూరొచ్చే టప్పుడు అట్లాగే పంపు. ఎప్పుడు వాడితో ఏగలేక పోతే అప్పుడే తీసుకొచ్చి దిగిడిచి పోతా"

హనుమాయమ్మ "ఎప్పుడో ఎందుకు రేపే మంచిరోజు. ఇక్కడ చదవాల్సిన చదువులేవో పూర్తయినయి. అక్కడే రెండ్నెల్లు ఇంగ్లీషు ప్రయివేటుగా చెప్పించి ఈ ఎండాకాలపు సెలవలు వెళ్లంగానే బళ్ళో వేయొచ్చు. మీతో తీసుకుపోతారా?"

శర్మ " సరేలే నీ ఇష్టం. రేపే పంపు" అన్నాడు

ఆ సాయంకాలం నారాయణయ్య ఇంటికి రాగానే హనుమాయమ్మ దొడ్లో స్నానానికి నీళ్ళు తోడి ఆయన స్నానం చేసేపట్టుడు ఈ మాట చెప్పింది.

నారాయణయ్య "నీకేం చాదస్తంటే? మీ అన్న సంగతి తెలిసుండే వాడ్నక్కడికి పంపుతాననంటావు? ఎందుకు ఆ నరకకూపంలో వాడ్ని తీసుకపోయి పారెయ్యటం? శ్రద్ధగా చూస్తారా పాడా. ఆస్తి ఉండగానే సరా, తాము తింటం

ఒకరికి పెట్టటం చాతకావద్దూ! ఏంత సన్నిహితులైనా భాగ్యవంతులు ఇండ్లలో పేద చుట్టాలంటే ఎట్టి చాకిరి చేయించుకొని ఈ పనికి ఆ పనికి వీధులెంబడి తిప్పుతారు గాని విద్య అబ్బనిస్తారటే? అన్నగదా ఆస్తి వీడి పేరపెట్టి ఆడపిల్లలను పెంచి పెండ్లి చేస్తారనుకున్నావు గామాలె. నీకెందుకా పిచ్చాశ? వాడసలే పిసినికట్టె. మీ అమ్మ గయ్యాళిని."

ఏదో నత్తగుల్లలో ముత్యంలా నీ వాయింట్లో పుట్టి అదృష్టవశాత్తు నా పాలపడ్డావుగాని, నీదంతా ఒట్టి భ్రమ. అటువంటి ఆశలేం పెట్టుకోవాకు. అయినా అన్యాయార్జితం విత్తం. ఎంతమంది నోళ్లు కొడితేనో ఎన్ని కుటుంబాలు కూలి కలిసొస్తేనో కూడిన ఆ పాపిష్టి ఆస్తి మనకెందుకే నీకై నీవడగటం అయనగారు సరేనంటం బాగానే వుంది. మనకేం గతిలేకనా వాడ్నక్కడికి పంపటం" అని ఏష్ట పడ్డాడు.

హనుమాయమ్మ దీనతగా "అట్లా అంటారేమిటండీ? ఎంత పరాయిదైనా మన పిల్లలంటే ఆప్యాతగా చూసుకునే సీతమ్మ ఉండే ఆ ఇల్లు నరకకూపం అంటారు? వాడ్ని చూశా పంపటం. ఆమెను చూసిగాని. వాడు పీనాశని నాకు తెలియదూ? నిర్మలుడు ఒట్టి ఒడిదుడుకుడు పిండం గదా అని పంపుదామన్నా. మనకేం గతిలేదని, మా అన్నే దిక్కని, ఆస్తి అబ్బాయి పేర పెడతాడనా పంపటం. రేపు మధ్యాహ్నం పోవాలని వాండ్లు ప్రయాణం కట్టుకున్నారు. ఎట్లాగూ వాండ్లను బండి కట్టి పంపదలుచుకున్నాము గనక ఆ బండ్లోనే అబ్బాయిని పంపుదాం. ఒక తడవైనా నా మాట వినండి. నిర్మలుడికి కూడా పోవాలని ఉంది." అన్నది.

నారాయణయ్య కొంచెం ఆలోచించి "అట్లా అంటే నేనేం చెప్పేది? నీ ముచ్చట గూడా తీర్చుకో. నీ యిష్టం. రేపే పంపేట్టయితే పెద్ద గుఱ్ఱం మీద పంపుదాం. వాడికి గుఱ్ఱం ఎక్కటమంటే సర్దా. మళ్ళీ ఎన్నాళ్ళకెక్కుతాడో! మొహతాదును పంపితే గుఱ్ఱాన్ని వెనక్కు పట్టుకొస్తాడు" అన్నాడు.

మధ్యాహ్నం హనుమాయమ్మ సీతమ్మతో విషయం చెప్పింది. ఆమె సాయంత్రం వీధిలో ఆడుకుంటున్న నిర్మలరావును పిలిచి ఒళ్ళో కూచో పెట్టుకొని "ఏం అబ్బాయి నాతో గూడా వస్తా? మాయింట్లో వుండి చదువుకుందువుగాని. మీ అమ్మ నిన్ను నా కప్పచెప్పింది. రేపు నిన్ను తీసుకెళ్తా. ఇక్కడ చేసినట్టు అల్లరిచేయకుండా ఉంటా నాదగ్గర? పదో ఏడు వచ్చింది. గోచీ అయినా పెట్టుకోవు. మొండిమొలతో గడేభారులాగు తిరుగుతుంటావు. అది బస్తీ.

అక్కడిట్లా దిగంబర స్వామిలా తిరిగితే అంతా ఎగతాళి చేస్తారు. ఏమంటా, వస్తావా?" అని బుగ్గన ముద్దు పెట్టుకుంది.

నిర్మలరావు " వస్తా అత్తయ్య. చదువంటే నాకెంతో ఇష్టం. పెద్దబారిస్టరు పరీక్ష పాసయి ఉద్యోగం చేయాలని ఉంది. అక్కడెప్పుడూ లాగేసుకు తిరుగుతాలే లేకపోతే గోచైనా పెట్టుకుంటా" అన్నాడు.

సీతమ్మ "బంగారుతండ్రివి గదూ! బుద్ధి గలిగుంటావు గదూ!" అని చెక్కిళ్ళోత్తుతున్నది.

నిర్మలరావు" అది సరేగాని అత్తయ్యా! అమ్మ నాన్నని ఒదిలిపెట్టడం ఎట్లా? నాకు నీళ్ళు పోసేదెవరు? రాత్రిపూట నన్నొంటేలుకు తీసుకు పోయేదెవరు?

సీతమ్మ "ఓరి పిచ్చితండ్రీ నేను లేనూ? మీ అమ్మనాయనకన్నా ఎక్కువగానే చూసుకుంటా?"

నిర్మలరావు "ఊరికే అట్లా అంటావుగాని నీవు మా అమ్మ నాయనతోటి సాటా?" అని గర్వంతో సీతమ్మ మొహంకళ్ళి కళ్ళార్పకుండా మిర్రి చూపులు చూస్తూ అన్నాడు

సీతమ్మ "అబ్బో!అబ్బో! వేలెడంత లేవు ఎంత మాటన్నా. అంత గర్వమా నాయనా. ఏం మీ అమ్మ నాయన పొడుచుకొచ్చారా నేపొడుచుకు రాలేదా? వాండ్ల కన్నా నేనే నిన్ను బాగా పెంచుకుంటా. రోషమొచ్చిందే అయ్యకు" అని అతని మొహం నిండా ముద్దుల వర్షం కురిపించింది.

నిర్మలరావు "నేనింకా ఆడుకోవాలె పోతున్నా" అని విడిపించుకొని పరుగెత్తుక పోయినాడు. ఆడుకునే పిల్లలందరితో " రేపు నేను మా అత్తయ్యతో గుంటూరు పోతున్నా. ఇంగ్లీషు చదువుకుంటా. శలవులిచ్చినప్పుడల్లా ఇంటి కొస్తుంటా. ఒచ్చినప్పుడల్లా ఎప్పట్లా మీ అందరితో ఆడుకుంటా. గోలికాయ లాడతా. గుహాంతరాలు గాలిస్తా. తేనె తట్టేలు దులిపి తేనె జుర్రుకుంటా మీ అందరికి పెడతా. ఏమంటారోయ్" అని చంకలు కొట్టుకుంటూ లొట్టలేస్తూ ముద్దు ముద్దు మాటలతో చెప్పాడు. సాయంకాలం దాకా సంతోషంతో ఆడుకున్నాడు. పొద్దుకూకంగానే ఇంటికొచ్చి

"అమ్మా రేపు నేను అత్తయ్యతో గుంటూరు పోతానే. దబ్బున నీళ్ళు పోసి అన్నం పెట్టవే. ఎముకలిరిగేటట్టు ఆడుకొనొచ్చా. నిదరొస్తున్నది తొందరగా పడుకోవాలె" అన్నాడు.

హనుమాయమ్మ నీళ్ళు పోసి వళ్ళు రద్దుతూ "నాయనా అక్కడేం మారాం చేయకు. పాపాయమ్మ అమ్మమ్మ పెద్దదయింది. అస్తాయిస్తంలో పడ్డది. ఒక వేళ కస్సుమన్నా గదిమినా ఊరుకో. ఆమెనేం అనకు. మీ సీతమ్మ అత్తయ్య నిన్ను బాగా చూసుకుంటుంది. ప్రేమగా పెంచుతుంది. నీకేం కావాలన్నా ఆమెనే అడుగుతుండు. అక్కడ పిల్లలతో అటకాయితనంగా తగాదాలు పెట్టుకోని ఇంటి మీదకి తగూలు తేవాకు. మీ మాయయ్య తగని ముక్కోపి. కోపమొచ్చి రెండు కొట్టినా ఊరుకో. జాగ్రత్తగా ఉండు సుమా" అన్నది.

నిర్మలరావు "అట్లాగే ఉంటాలేవే. ఇక్కడున్నట్లు అక్కడెందుకుంటా. అతి జాగ్రత్తగా ఉంటా. ఎవరేమన్నా పడతా. నీవు దిగులు పడవాకు. శలవులిచ్చి నప్పుడల్లా వచ్చి చూచి పోతుంటా" అన్నాడు ఎంతో నిబ్బరంగా

నీళ్ళు పోయటం కాగానే హనుమాయమ్మ మీగడ పెరుగేసి అన్నంపెట్టి తండ్రి మంచం వసారాలే వేసి పక్కేసి పడుకోబెట్టింది. నిర్మలరావు ఎప్పుడూ తండ్రి పక్కలో తప్ప ఎవరి దగ్గరా పడుకుండేవాడు కాదు.

మర్నాడు ఉదయమే నారాయణయ్య పెద్ద గుర్ఙాన్ని కాడెద్లను బీట్లో మేపటానికి పశువులతో పాటు పంపకుండా కొష్టంలో కట్టేసి మేత వేయించాడు. గుర్రానికి దిట్టంగా ఉలవ గుగ్గెళ్ళు దానా పెట్టించాడు. బండి ఇరుసుకు తారు వేయించి తయారుగా పెట్టాడు.

ఇంట్లో పిండివంటలతో సహా వంటయింది. మధ్యాహ్నానికంతా షఢ్ర సోపేతంగా భోంచేశారు. నిర్మలరావు మొహం కొట్టిందాకా గారెలు, బూరెలు తెగ తిన్నాడు. కొత్త లాగూ చొక్కా తొడుక్కున్నాడు. ఊరంతా చెలికాండ్రతో చెప్పొచ్చాడు. హనుమాయమ్మ నిర్మలరావు పుస్తకాలు, గుడ్డలు సర్ది ఒక జాజి చెక్కల పెట్టెలో పెట్టి తాళం వేసి తాళంచెవి సీతమ్మ కిచ్చింది. పొద్దు ఏట వాలంగానే ఇరుగు పొరుగు అమ్మలక్కలంతా ఇంటి నిండా గుమి కూడారు. అన్నలు, చెల్లెండ్లు, చెలికాండ్లు నిర్మలరావు చుట్టూ మూగారు.

చిన్నప్పటినుండి అతన్నెత్తుక తిరిగిన గవంళ్ళ కోటి "మా వరాలయ్య సదుకోను పోతుండాడు. పెద్దొడై ఏ తాసిదారుడి ఉద్యోగమో చేసుంటే నేను ముసలి దొక్కునై ఆయన పంచనీడ్నే పానాలిడుత్తా" అన్నాడు. అంతలోకి చాకలితాయారు "మా బాబు ఉద్యోగంలో కొత్తే ఆయన బట్టలు నేనే

ఉతుకుతా. నేరాలిపోతే ఆయన చాకిరి నాకొడుకున్నా సేసుకుంటాడు. అయ్యా నిర్మలయ్యా నన్ను మరువాకు బాబూ" అన్నాడు. ఇంట్లో పనిచేసే ఉప్పరనాగి " అయ్యా సామి నన్ను మరుగాక సూమా. సదియే సతుకులు సక్కంగా సదివి సుకంగా ఉండే రోజుల్లో నాకొక కాట్టీడు కోక మాత్రం పెట్టయ్యా బుజ్జిబాబు" అంది.

మొహతాదు హుస్సేను పెద్ద గుఱ్ఱానికి కళ్ళెం పెట్టి జీను కట్టాడు. కుచ్చుల కొరడా చేత పట్టుకొని గుఱ్ఱాన్ని తెచ్చి వాకిట్లో నిలిపాడు. జీతగాడు ఎద్దులకు మువ్వల పట్టెలు పెట్టి తెచ్చి వాకిట్లో బండి కట్టాడు. ఇంకో జీతగాడు శర్మ సీతమ్మల సామాను నిర్మలరావు పెట్టె తెచ్చి బండ్లో పెట్టాడు.

వాకిలి దగ్గర తల్లి ఒళ్ళో జొరబడి నిల్చోని ఈ ప్రయత్నాలన్నీ వింతగా చూస్తూ చుట్టూ మూగిన పిల్లల మీద అప్పుడప్పుడు వార చూపులు ప్రసరిస్తున్నాడు నిర్మలరావు. ఒక ఎదురు బుట్ట నిండా గారెలు, బూరెలు పెట్టి, పాత ధావళి ఒకటి పైన కప్పి ఆ మూట చేత పట్టుకొని కొడుకును దగ్గరకు తీసుకున్న హనుమాయమ్మ ప్రయాణ సన్నాహాలు పూర్తయిందాకా వాకిట్లోనే నిల్చున్నది.

నారాయణయ్య "ఓరేభద్రం పాపాయ! బండిబోల్తపడకుండా రాళ్లు గట్లు చూసి తోలకపో. బుర్రున పోయే మోటారు బండ్ల శబ్దం వినగానే బండాపుకో, లేకపోతే ఎద్దులు బెదుర్తయి. హుస్సేను జాగ్రత్తరోయ్! గుఱ్ఱాన్ని వాడి కొదిలిపెట్టి ఊరుకున్నావా గ్యాలపు కొట్టిస్తాడు. ఏ గట్టుకో, చెట్టుకో పుట్టకో పట్టిస్తుంది. కళ్ళెం పట్టుకొని బండెంబడి నడిపించకపో" అన్నాడు

హనుమాయమ్మ బండి సాగబోయేముంది పిండి వంటల మూట బండ్లో పెట్టి "ఉంటా సీతమ్మ, ఉంటారా తమ్ముడూ" అన్నది. శర్మ సీతమ్మలు "పోయొస్తాం" అని శలవు తీసుకొన్నారు. నారాయణయ్య నిర్మలరావును చంకనెత్తుకుని, తీసుకొచ్చి గుఱ్ఱం ఎక్కించిందాకా ఊరుకున్నది హనుమాయమ్మ ఎక్కి కూచోగనే పెద్దపెట్టున ఏడ్చింది. నిర్మలరావు గూడా ఏడవడం మొదలు పెట్టాడు.

గుఱ్ఱం సాగగానే హనుమాయమ్మ కండ్లు తుడుచుకొని "ఏడవాకు నాయనా! ఫర్వాలేదులే నేనుంటా" అన్నది. అతనుగూడా వెనక్కు తిరిగి తిరిగి చూస్తూ ఏడుపాపుకొని "ఉండవే అమ్మా! నే పోయొస్తానే" అని రెండు మూడు

తడవలన్నాడు.

ఈ విధంగా నిర్మలరావును గుంటూరు పంపేటప్పుడు అత్తగారింటికి ఆడపిల్లను పంపేటప్పుడు ఎట్లా అంపకాలు జరుగతాయే అట్లా అంపకాలు జరిగినాయి. ఊరి బైటదాకా తండ్రి మొహతాదులు, ఎట్టివాండ్లు వెళ్లారు. నౌకర్లు, చాకర్లు వరవకట్టదాకా పోయినారు. కూడిన అమ్మలక్కలు ఇల్లు దాటిందాకా ఉన్నారు.

బండి గుట్టం ఇంటి మూల తిరుగుడు తిరగంగానే ఇంట్లోకి పోయి పమిట చెంగు కండ్ల కడ్డం పట్టుకొని కంటికి మంటికి ఏడ్చింది హనుమాయమ్మ. ఇండ్లకు పోంగా మిగిలిన అమ్మలక్కలు "ఏడవాకు హనుమాయమ్మ ఊరుకో. పిల్లగాడు నిక్షేపంగా చదువుకొని వస్తాడు. అద్దాలనాడే బిడ్డలు గాని గద్దాలనాడు బిడ్డలా? ఎదిగే పిల్లల్ను ఎల్లకాలం ఇంట్లో పెట్టుకు కూర్చుంటే ఎట్లా? ఏవో ఇన్ని చదువులు చదివి, మనకు పెట్టినా పెట్టకపోయినా వాండ్ల పొట్టయినా పోసుకొని సుఖంగా ఉంటే మనకు సంతోషమే. శుభం అని పిల్లవాడ్ని బుద్ధి పూర్వకంగా పంపించి అట్లా ఏడవకూడదు" అని ఓదార్చారు.

ఇంకొంచెం సేపటికి ఊరిబైటిదాకా సాగనంపబోయిన నారాయణయ్య నౌకర్లు ఇంటికి తిరిగివచ్చారు.

రోజులు గడుస్తున్నయి. ఇల్లంతా బోసికొట్టినట్టుగా ఉంది. కలకల ఖంగు ఖంగున నవ్వుతూ, టిక్కు టిక్కున నడుస్తూ పొలికేకలు పెట్టి మాట్లాడుతూ హఠమేసి చెవులు పూడక పోయేట్లు అప్పుడప్పుడు ఏడుస్తూ నానా అల్లరి గోల చేసే నిర్మలరావు ఇంట్లో లేని కొరత తీర్చేదెవరు?

ఇంటిల్లిపాది అతన్ని తలచుకోని ఘడియ ఉండేది కాదు. నారాయణయ్యకు కొన్నాళ్ళు అన్నమే సయించలా! ఇస్తరి ముందు కూచున్నప్పుడల్లా "వాడుంటే పొత్తున కూచుని తినేవాడు కదా. కలిపి కొంద ముద్దలు పెట్టేవాడ్ని కదా! కొరపోతే నెత్తిన నీళ్ళు చిలకరించి పైకి చూడమనే వాడ్ని కదా! తుమ్మితే దశతాయస్సు, నూరేండ్లాయస్సు అని నెత్తి చరిచే వాడ్ని గదా" అని ఎన్నో విధాల అతనిని తలచుకుంటుండేవాడు.

హనుమాయమ్మ మరీ చిక్కి సగమయింది. ఎటు మెసిలినా నిర్మలరావు కొంగు పట్టుకుని తన వెంట తిరుగుతున్నట్లుగా ఆమెకు తోచేది. దుఃఖం పొర్లిపొర్లుచ్చి ఎక్కడ పడితే అక్కడ పేడ కుప్పలా కూలబడి ఏడ్చేది. వారం

రోజులు జ్వరంతో నాసిల్లింది. నిర్మలా!నిర్మలా! అని నిద్రలోకూడా పలవరించేది.

పదిరోజులు గడిచింతర్వాత నారాయణయ్య ఒక్కతూరి గుంటూరు వెళ్లి పిల్లవాడికి కొత్త చొక్కాలు, లాగులు కుట్టించిపెట్టి మిఠాయి పొట్లాలు కొనిపెట్టి పోయినాడు. ఇంటికి పోంగానే భార్యకు ధైర్యం చెప్పి ఓదార్చాడు. అతనెంతో కులాసాగా ఉన్నాడని, కొద్ది రోజుల్లోనే ఇంటికొచ్చి చూచి పోతాడని చెప్పాడు. ఆమె నిదానం మీద మనసు కుదుట పరచుకొని ఊరుకున్నది.

నిర్మలరావు గుంటూరు చేరుకున్నప్పటి నుంచి అప్పుడప్పుడు అమ్మ, నాయన తలపుకొచ్చి కాసేపు దిగులు తీరిందాకా ఏడ్చేవాడు. నందిపాడు వదలి వచ్చేటప్పుడు వరసగా అన్నలు. చెల్లెండ్లు "పోయిరా తమ్ముడూ, పోయిరా అన్నయ్యా" అన్న మాటలు జ్ఞాపకం వచ్చిప్పుడల్లా కండ్లనీళ్లు పెట్టుకునేవాడు.

సీతమ్మ ఎంతో ప్రేమగా పెంచుతూ గారాబంగా చూసుకుంటూ, కాస్త వేళ తప్పి వచ్చినప్పుడల్లా వీధి వాకిట్లో నిల్చొని వచ్చేపోయే పిలకాయల్నల్లా మా నిర్మల రాలేదబ్బాయి అని అడుగుతుండేది. ప్రతివారం నలుగుపెట్టి తలంటి పోస్తుండేది. వేళకు దగ్గర కూచొని తన చేతి మీదిగా అన్నం పెడుతుండేది. రెండునెలలు ప్రయివేటు చెప్పించుకున్న తరువాత అరండల్‌పేట టవును హైస్కూలు బ్రాంచిలో అయిదో తరగతిలో చేరాడు. బళ్లో ప్రవేశించే ముందు నందిపాడెళ్ళి అందర్నీ చూసొచ్చాడు.

ఆర్నెల్ల పరీక్షల్లో ఇంగ్లీషు, లెక్కలు, తెలుగు, భూగోళం, దేశచరిత్రలలో ఫస్టు మార్కులు తెచ్చుకున్నాడు. పంతుళ్ళందరూ ఇతని తెలివితేటలకు ముగ్ధులై ఎంతో మెచ్చుకుండేవాళ్ళు. "చూడండిరా, నిర్మలరావెంత చక్కగా చదువు కుంటున్నాడో ఇచ్చిన లెక్కలన్నీ తప్పులు లేకుండా చేస్తాడు. వేసిన ప్రశ్నల న్నింటికి టంకంపాడిలా అతికే జవాబులు చెపుతాడు. వాడిని చూసన్నా బుద్ధి తెచ్చుకోండిరా" అని అతని క్లాసు పిల్లలతో అనేవాండ్లు. అయిదో తరగతి, ఫస్టుఫారం ఫస్టుమార్కులతో పాసయి మూడో ఏట సెకండు ఫారంలోకొచ్చాడు. అంత బాగా చదువుకుంటున్నా ఇంట్లో శర్మగారి చేతుల్లో దెబ్బలు మాత్రం తప్పేవి కావు. తేపా ఏదో ఒక వంక పెట్టుకొని బర్రెను బాదినట్లు పంబరేగ బాదొదిలి పెట్టేవాడు. ఒక తడవ ఇంట్లో పాలకుండ దొర్లించాడని, ఇంకో తఫా పొరుగింటి పిల్లవాండ్లను కొట్టివచ్చాడని, మరో తఫా చెర్లో ఈతలు కొడుతున్నాడని, ఏ యల్లమ్మో, పుల్లమ్మో చెప్పిన మాటలు విని కొట్టని రోజుండేది

కాదు. నిర్మలరావు దెబ్బలు తిన్న రోజునల్లా సీతమ్మ దగ్గరికితీసి ఓదార్చేది.

నిర్మలరావు సెకండు ఫారం ప్రవేశించినప్పుడు వెంకమ్మగారి కుటుంబం ఎదురింట్లో అద్దె కుండటానికొచ్చింది. అప్పట్నించి తరచుగా ఆమె పనిబడా వచ్చి ఏవో సాకులు చెప్పి పోతుండేది. పేరయ్యశర్మ ఇతనికోసం ప్రత్యేకంగా ఒక పేంబెత్తం కొనితెచ్చి బాగా నూనెరాసి పెట్టుంచేవాడు. చీటికి మాటికి అది ప్రయోగించేవాడు ఆ పసికుర్రవాడిమీద. శలవుల్లో ఇంటికి పోయినప్పుడు వాండ్లమ్మ తోటి "అమ్మా ఇక నేనా దెబ్బలు తినలేను. ఒట్టి పుణ్యానికి మామయ్య తెగకొడుతుంటాడు. అత్తయ్య ఉండబట్టి ఇన్నాళ్ళు ఆ ఇంట్లో ఉండగలిగా. నన్నింకేబస్తీలో నన్నా ఉంచి చదువుచెప్పించమని నాన్నతో చెప్పవే" అనేవాడు. ఆమె బుజ్జగించి ఏదో మాయమాటలు చెప్పి మళ్లీ ఎట్లాగో అట్లా గుంటూరే పంపుతుండేది.

అవకాశం చిక్కినప్పుడల్లా నారాయణయ్య గుంటూరొచ్చి చూసి పోతుండేవాడు. ఒచ్చినప్పుడల్లా నిర్మలరావు "నాన్న నన్నింకెక్కడన్నా ఉంచి చదువు చెప్పించరాదటే? దెబ్బలు తిని తిని ఒళ్లు కాయలు కాసి పోతున్నది" అనేవాడు.

ఆయన కడుపు తరుక్కుపోయి సీతమ్మ మీద తుస్సాయి బుస్సాయి అని ఎగిరి శర్మను ఏమంటే ఏమనుకొని పోతాడో, పిల్లవాడి చదువు చెడిపోతుందేమో అని ఆయన్నేం అనకుండా నిర్మలరావుతో

"ఇంకా కొన్నాళ్ళు చూడరా. ఇప్పుడు నేనెన్నో చిక్కుల్లో ఉన్నాను. ఒచ్చే ఏడు ఇంకెక్కడన్నా ఉంచి చదువు చెప్పిస్తాలేరా. ఈ ఏటికి ఓర్చుకో" అని కొనుక్కు తింటానికి నాలుగు డబ్బులు చేతిలో పెట్టి ఓదార్చి పోతుండేవాడు. నిర్మలరావు దిన దిన గండం నూరేండ్లాయువుగా గడుపుతున్నాడా ఇంట్లో.

ఆరోజు ఉదయం లెక్కల పంతులుగారింటికి లెక్కలు చెప్పించుకొను పోయొస్తానని నిర్మలరావు చెప్పిపోయింతర్వాత వెంకమ్మ వచ్చి సాడీలు చెప్పిన సంగతి మధ్యాహ్నం అన్నానికొచ్చినప్పుడు అతనితో సీతమ్మ చెప్పింది. పెనిమిటి కొడతాడని భయమేసి ఆ సాయంకాలం పెందలాడి భోజనం పెట్టి తెలుగు పండితుడు సూరిశాస్త్రుర్లు గారింట్లో అతన్ని చదువుకోను పంపింది. రెండు రోజులు పిల్లవాడు అయన కంటపడకుండా ఉంటే దెబ్బలు తప్పుతాయి కదా, వెంకమ్మ చెప్పిపోయిన మాటలు మరచిపోతాడు గదా అని అనుకున్నది.

శాస్త్రిగారు గొప్ప పండితుడు. హైస్కూలు కమిటీ వారి నాశ్రయించి ముప్పతిప్పలు పడి ఆ తెలుగు పండితుడి ఉద్యోగము ఎట్లాగోట్లా సంపాయించి అప్పటికి అయిదేండ్లయింది. అన్నదానం కన్నా విద్యాదానం మంచిదని, ఖర్చు లేనిదని ఇంటికొచ్చిన పిల్లలకన్నా కష్టపడి పాఠాలు చెబుతుండేవాడు. అయనకు పిల్లలంటే మహా సరదా. పిట్టకథలు కట్టుకథలు ఎన్నో చెప్పి వాళ్ళను పొట్టొబ్బ నవ్విస్తుండేవాడు. ఎన్ని తప్పులు చేసినా కసురుకునేవాడు కాదు. అందుకని వాండ్లింటికి పోవటమంటే పిల్లలకు గూడా సరదా.

అయన ఒక్కగానొక్క కొడుకు రమణయ్య పండిత పుత్రుడే! చదువులో ఒట్టి మొద్దు. చెప్పిన పాఠాలే పది తడవలు చెప్పినా అతని బుర్రకెక్కేవిగావు. పిల్లలతో పాటు కలిసి చుదువుకుంటే నన్నా ఏమన్నా గుడ్డిలో మెల్లగా పాఠాలు వంటబడతాయేమో అని మీరారండి, మీరారండి అని పిల్లల్ను ఆహ్వానించి ఇంటికి పిలుచుకు పోతుండేవాడు. రాత్రి గూడా పాఠాలు చదువుకొని అక్కడే పడుకుండే వాళ్ళు ఆపేట పిల్లలు ఏ అయిదారుగురో.

నిర్మలరావు రమణయ్యకు మంచి స్నేహం. అల్లర్లో ఒకిరిని మించిన మేటి ఒకరు. చుట్టుప్రక్కల వారి దొడ్లలో చెట్లకు పండే మామిడి పండ్లు నారింజ కాయలు ఏ అర్థరాత్రి పూటో దొంగతనంగా కోసుకొచ్చి తాము ఎగటేసిందాకా తినటం, ఇంకోండ్లకు పంచి పెట్టటం వాండ్లకలవాటు.

రమణయ్యకు పదునాలుగోఏడు. నిర్మలరావుకు పన్నెండో ఏడు. అయినా నిర్మలరావు ఉక్కుతుందులా ఉండేవాడు. పల్లెటూరి పైరగాలికి అనువైన పోషణ క్రింద పెరిగిన చిహ్నాలు, చిన్ననాటినుంచి సృష్టి నైజంలో ఎగిరిన ఎగుర్లు, ఆడిన ఆటలు, ఎక్కిన కొండల శరీర పటుత్వము, గుఱ్ఱాలెక్కి, ఈతలు కొట్టి, గోడలు దూకి, కోతికొమ్మచ్చిలాడి, కుప్పబలిగూళ్ళాడి సంపాయించిన ఆ శరీర కందరాలు, మూడేండ్ల బస్తీవాసం వల్ల, శర్మగారి నిరంతర చీవాట్లు చెప్పుదెబ్బల వల్ల గూడా చెక్కుచెదరుకుండా నిలబడి పోయినవి. ఈడొస్తున్నకొద్దీ పుస్తకాలు చదివి జ్ఞానం సంపాయించిన కొద్దీ, మనోబలం ఎక్కువై చురుకుదనం జాస్తయింది. శారీరకంగా మానసికంగా కూడా దినదినాభివృద్ధి చెంది మెరుపు తీగలా మెరుస్తూ పిల్లలందరిలో ఒక ప్రత్యేకత, గౌరవము సంపాయించి బుద్ధి కశలతలలో పైపైకి నెట్టుకొస్తున్నాడు నిర్మలరావు.

రమణయ్య చూడడానికి భారీగా 18 ఏండ్ల వాడి మాదిరి కనబడతాడు.

బూడిద గుమ్మడి కాయలంత పిర్రలు, బొతబొతలాడే శరీరం పొంగు బూరెలలాంటి బుగ్గలు,ఎక్కడో గోతుల్లో మిణుకుమిణుకులా వెల్గుతున్న చీకిరి కండ్లు, చప్పమొహం, చిన్నగడ్డం, పిల్లిచెవులు, సన్నని పెదవులు, గొగ్గిపండ్లు, బుర్రముక్కు, బోడిగుండు, పిలకజుట్టు, అప్పటికే చిన్నబొజ్జ, బొంది తొడలు, దెందు పిక్కలు, సన్నపాదాలు, అచ్చుబోసిన మట్టి విఘ్నేశ్వరుడిలా మూడు మూర్తులా తన తండ్రి శాస్త్రిగారి లాగా ఉండేవాడు. ఔదార్య ప్రేమలలో తండ్రికన్నా పదిరెట్లెక్కువే. పైకి చూస్తే అందవికారంగా పోతపోసిన విగ్రహం లాగున్నా స్నేహపాత్రుడని కొద్ది పరిచయంలోనే తెలుసుకోవచ్చు. తండ్రి మాదిరి పీనాసి మటుకు కాదు. తను తినటం ఒకరికి పెట్టటం అంటే బహు సర్దా, ఉల్లాసం గూడా.

శాస్త్రుల్లవారిది పెద్ద భవంతీ ఇల్లు. వాండ్ల తాత, తాత ముత్తాతలు పురోహితాలు చేసి పురాణాలు చెప్పి అనువైన ఆస్తే సంపాయించి పెట్టి పోయినారు. మొదటి నుంచి ఘనంగా బతికిన కుటుంబం. ఈయన హయాంలో దేహి అను ఒకర్ని అడక్కుండా గడిచిపోయే ఆస్తి ఉంది. పాడీ పంటలకు కొదవే లేదు. ఇంటి ముందరి కొష్టంలో ఎప్పుడు పాడి పశువులు తియ్యకుండా ఉన్నై. ఎక్కువ అట్టహాసానికి పోయే మనిషే కాదు శాస్త్రి. మట్టు మదుపు తెలుసు. ఇంట్లో ఒక బుడ్డోడ్ని మాత్రం పశువులను తన బీట్లోను, బంజరు భూముల్లోను, చెరువుగట్టుల పంచను మళ్ళేసుకు రావటానికి వాటికి మేతేసి నీళ్ళు పెట్టటానికి అన్నం పెట్టి సంవత్సరానికి రెండు జతల బట్టలు, రెండు వరహాలు ఇచ్చేట్లు కుదుర్చుకొని జీతానికి పెట్టుకున్నాడు. తన స్కూల్లో వచ్చే జీతం వెనకేసుకుంటూ ఉన్న ఆస్తి పోగొట్టుకోకుండా, పైపెచ్చు కొడుకోసం ఆస్తి కూడబెడుతూ కాలం గుడుపుతున్నారు శాస్త్రిగారు.

ఆరోజు వాండ్లింటికి నలుగురు పిల్లలు చదువుకోను పోయినారు. అందులో కాంతమ్మ తమ్ముడు కూడా ఒకడు. రోజుటిలాగు పిల్లలు శాస్త్రిగారి చేత శానసేపు పాఠాలు చెప్పించుకున్నారు. పడుకోబోయేముందు ఆయన చేత పల్నాటి బాలనాగమ్మ కథ చెప్పించుకుంటూ ఊ కొడుతూనే నిద్ర పోయినారు. ఆయనకు విసుగెత్తి మీరుకూడా పడుకోండిరా అని మేలుకున్న నిర్మలరావు, రమణయ్యలకు చెప్పి ఇంట్లోకి పోయి పడుకున్నాడు. అయన ఇంట్లో పిల్లలు పంచలో పడుకుంటుంటే వాండ్లు ఎప్పుడూ ఆయన్నటు పోనిచ్చి

నిర్మలరావు కూచొని కూరెపాట్లు పడుతున్న రమణయ్యతో

"ఒరే రమణయ్య నిద్రాదేవత నిన్నావరించెగదరా నిర్భాగ్య దామోదరా అని,ఏమిట్రా నిద్ర. రేపు లేదు ఎల్లుండి భోగి. ఆమర్నాడు దీపావళి. మనం రేపే ఆ వెంకమ్మ వధ పట్టి ఎల్లుండి నరకాసుర వధకు సిద్ధంకావాలె...ఇంతా ఎడ్చి మనం తయారు చేసింది నేల టపాకాయలేగా. పువ్వొత్తులకు చేసిన కాయితపు గొట్టాల్లో సురేకారపు మందుకూరాలె. శాన పనుంది లేవరా నిద్రమొహమా - దా పోదాం" అని రహస్యంగా చెవులో అని పక్కన రాగి పంచపాత్రలోని నీళ్ళు చేతార తీసి మొహాన కొట్టాడు.

అతను మొహంచేత్తో తుడుచుకుంటూ" అబ్బా ఉండరా ఒకటే రంధి. రేపు చేసుకోగూడదు పువ్వొత్తులు" అన్నాడు.

నిర్మలరావు" నీపాడె, నీ పచ్చిబద్దలు, రేపేమిటిరా చేసుకునేది? నీకున్న తెగులే ఇదిరా. ఒకరు చెపితే వినవు, నీకు తోచదు. సాయంకాలం వేసుకున్న ప్లానేమిటీ, ఇప్పుడు నీవు కూసే కూతలేమిటి? ఆ నోటికి సుద్ధంబద్ధం ఉండక్కర్లా సమయానికి పుట్టి ముంచే రకంరా నీది. తమాషా చూట్టానికి కాయలు కోసుకోవటానికి మళ్లీ మదురెక్కాల్సిన సంగతి మరచిపోయినావురా?" అని నిష్ఠూరంగా అన్నాడు

రమణయ్య ఉలిక్కపడి కూచోని కండ్లు నలుపుకుంటూ " అవునురోయ్! మరచిపోయినా. పోదాంలె. నా నోటికి శుద్ధంబద్ధం ఎట్లా వుంది? ఎముకలేని నాలుక ఎట్లా బడితే అట్లా తిరిగితే నేనేం చెయ్యనురా? వాండ్లను కూడా లేపు మెల్లెగా" అన్నాడు

నిర్మలరావు "నీబొంద! ఆ వెధవ రాంభద్రాయనెందుకు ఇవాళ మీ ఇంటికి పిలిచా? కొరివితో తల గోక్కున్నట్లే. వాడు కూడా లేచి నే నొస్తానంటే? మనం చదువుకుండేప్పుడు పుస్తకాలు పట్టుకొని పిల్లి చూపులు చూస్తూ చుంచులు పట్టే ఎరుకుల వాడి లాగు వాడు ఇంట్లో కొస్తుంటే నా వళ్లు చిరచిరలాడింది. లేచి నాలుగు ఉతుకుదాం అనుకున్నా మీ నాయనే లేకపోతే అంత పని అయ్యేదీ.."

రమణయ్య "వాడ్ని పసిపట్టావెందుకురా? వాడొట్టి అర్భకుడైతే ఎక్కడున్నావే గొంగడి అంటే వేసిన చోటనే అన్నట్లు కూచున్న చోటునుంచి లేవలేని ఆ వెధవ మీద నీకెందుకురా కసి? నీ జోలికొచ్చాడా, నీ తెరువుకొచ్చాడా"

నిర్మలరావు “అబ్బా వాడేం నంగనాచుకున్నా? చూట్టానికట్లా ముచ్చులా ఉన్నాడుగాని రెక్కలున్న పిల్లిలాంటి వాడురా వాడు. ఎఱ్రతేలంటి ముండాకొడుకు. నేనింట్లో దెబ్బలు తినేది వాడి వల్ల గదఱ్ఱా. పిల్లలం పిల్లలం మనం ఏమనుకున్నా ఏ అల్లరి చేసినా కింద బడ్డా మీద బడ్డా పెద్దవాళ్లకు పోయి చెప్పటం ఎందుకురా? వాడి తల్లి ముండ మా ఇంటి మీదకు తగూకు పోనిరోజుండదు. ఇవాళ గూడా పోయి యేమేమో చెప్పొచ్చిందట. మా మామయ్య మా అత్తయ్యమీద తారా మండలం లాగా ఎగిరాట్ట. నన్నామె చెడగొడుతున్నదని, ఈ వెధవను ఈ చెంప ఆ చెంప గట్టిగా వాయించి స్థంభానికి పెడరెక్కవిరిచి కట్టేసి కొడితే గాని ఇంట్లో సాడీలు చెప్పటం మానడు. ఏమన్నా గానియ్ ఇవాళ చస్తే రేపటికి రెండు. నేలటపాక్కాయలెట్లాగో తయారుగా ఉన్నాయిగా. ఆ ముండ భర్తం, ఈ ముండాకొడుకు భర్తం రేపు పట్టేదే”

రమణయ్య “సరే, లేవరా పోదాం ఆకోటయ్యను కృష్ణుడ్ని గూడ మెల్లగా లేవు. నేను లాంతరు తీసుకుంటా. చప్పిడి గాకుండా కొష్టంలోకి పోయి మన పని మనం చేసుకుందాం. రేపటి సంగతి రేపు” అని లేచి లాంతరు పట్టుకున్నాడు. నిర్మలరావు కోటయ్యను, కృష్ణుడ్ని కండ్లమీద నీళ్ళ జల్లి చేత్తో అటు ఇటు పొర్లించి లేపాడు. మాట్లాడొద్దని సైగచేసి చేయి పట్టుకు లాక్కెళ్లాడు. అందరూ వాకిలి దాటి బైటికి రాంగానే రమణయ్య వీధి తలుపు దగ్గరేశాడు. అంతా దిక్కులు చూసుకుంటూ చప్పుడు చేయకుండా కొష్టంలోకి కెళ్లారు. లాంతరు కింద పెట్టి దాని చుట్టూ నలుగురు కూచున్నారు. నిర్మలరావు తనూ ఆ మధ్యాహ్నాం బడెగగొట్టి తయరు చేసి చూరులో ఉంచిన నేల టపాక్కాయల మూట ముందు రమణయ్య తీసి కింద పెట్టి లెక్కపెట్టాడు.. పెద్దవి 20, చిన్నవి 102 ఉన్నయి. “ అరే అబ్బాయిల్లారా వీట్లో పెద్ద బాగం నిర్మలరావుది రెండో భాగం నాది. మీ ఇద్దరివి చిన్న బాగాలు తెల్సిందా?” అన్నాడు.

కోటయ్య ఉగ్రుడై “ అన్నీ మీరే దొబ్బెయ్యండోయ్. న్యాయానికి కాలం కాదు. కోటయ్య తోడు లేదు కోటయ్యంతోడు లేదని ఉబకేసి రూపాయ నూకి ఈ పనా మీరు చేసేది?” అన్నాడు

రమణయ్య “మొత్తానికి మొరటు ముండాకొడుకనిపించావురా కోటయ్యా! రూపాయి ఇయ్యంగానే సరఱ్ఱా? చేసిన చాకిరంతా నిర్మలరావు నేనే గదరా”అన్నాడు

"దానెక్కఇంతే గదూ అని కోటయ్యయోమే అనబోతే రమణయ్య "నీ దుంపతెగా నోరు గదిపితే బూతులట్రా కోటయ్యా" అన్నాడు

కోటయ్య" మీ బాపనోండ్ల కుండే దొబ్బుతెగులే ఇదిగా, తియ్యంగా మాటలు చెప్పి తడిగుడ్డల్తో గొంతులు కోస్తారు. బురిడీ చెయ్యటానికి మొనగాండ్లు. అదేంటంటే దాబులు. పైగా బూతులు మాట్లాడుతున్నా నంటా వేరా? నీ మొహం మొహమేనా, వెధవముండలేని పెండ్లి వెలవెల లాడినట్లుంది"

రమణయ్య " నీశార్థం సామెతలు గూడానా? ఎందుకేడుస్తావు. లేరా, పువ్వొత్తుల్లోకి బొగ్గుపొడి చేయటానికీ, కందికట్టె దొంగలించకొచ్చినందుకు, నేలటపాక్కాయల్లోకి రాళ్ళేరుకొచ్చినందుకు ఇంకోభాగం ఇస్తాంలేరా"

కోటయ్య" అట్లారాదారికి, ఇందాకనే ఆ మాటంటే ఇన్ని దొబ్బులు తినే వాడివి కాదుగా. నిర్మలరావుకి ఇయ్యాల్సిందే పెద్దభాగం. పెట్టుప్పు, తుందూరం నూరి కలపటంలోనే ఉంది యుక్తంతా. అతనెంతో నేర్పుగా వేరే వేరే నూరి కలిపాడు. నేను మొన్నిట్లాగే మీరు లేనప్పుడు తెలియక రెండు గురివింద గింజలంత తీసుకొని రాతిమీదేసి గుండ్రాయి పెట్టి ఇట్లా అందును గదా చెవులు బద్దలయ్యే మోత మోగింది. ఆ దెబ్బకు గుండే గుభేలు మని ఎల్లికలా పడి అరగంట సేపటికి తెప్పరిల్లుకున్నా. చెవులు దిమ్మెక్కి చెవటలు గమ్మినయి. నా సామిరంగా బతికించావురా దేవుడా అని లేచి ఇంటికి అదే పరుగు తీసా"

ఈ మాటలకంతా పకా పకా ఇరగబడి నవ్వారు. రమణయ్య కొంచెం నవ్వాపుకొని" అరేయ్ మెల్లెంగా నవ్వండిరా. మా నాయన లేచొస్తే నవ్వులల్లా నువ్వులవుతాయి" అన్నాడు.

కోటయ్య ఇంకా నవ్వుతూ" నవ్వండిరా నవ్వండి నవ్విన నాపచేనే పండుతుందంటారు " అన్నాడు

రమణయ్య " చిలుమొదులతేగాని చీద్రం వదలదంటారు. దెబ్బలు లేక చిలుము పట్టి కొట్టుకుంటున్న వాడివి నువ్వే నవ్వరా. మానాయనొచ్చి ఆ చిలుము కాస్త వదిలిస్తాడు." అన్నాడు

నిర్మలరావు "ఒరే తగూలాడుకోవాకండిరా. నేను న్యాయంగా పంచి పెడతా ఉండండిరా" అని టపాక్కాయలు తన వైపు గుంజుకుని పెద్దవి 6 ఒక తట్టు, 2 ఒక తట్టుపెట్టి మిగిలిన 12 నాలుగు భాగాలు చేసి కుప్పగా పెట్టాడు.

చిన్నవి సమానంగా పాతిక పాతిక ఎంచి ఆ కుప్పల్లో పోసి "ఎత్తుంకోండిరా మీ కుప్పలని మిగతా ఉన్న రెండు కోటయ్య కిచ్చి వేరే ఉంచిన 6 ఒక పని కోసం నా సొంత డబ్బుతో చేయించా. మిగతా రెండు నేపడ్డకష్టాని కొచ్చిన భాగం" అన్నాడు.

అంతా కుయ్ కయ్ మనకుండా ఊరుకున్నారు. కంది పుల్లలుపెట్టి పువ్వొత్తులు గూర్చటం ప్రారంభించారు. కొంతసేపటికి కోటయ్య" ఉండండోయ్ ఉండండి ఒక మాట మరిచిపోయినా" అని ఒకటే నవ్వుతున్నాడు.

రమణయ్య "ఎందుకురా అట్లా నవ్వుతావు పిచ్చిముండాకొడుకా గచ్చచెట్టుకింద గొల్లభామలాగు" అన్నాడు. కోటయ్యగూర్చే పువ్వొత్తి కింద బడేసి నేలమీదబడి పొర్లి పొర్లి నవ్వుతున్నాడు.

నిర్మలరావు" ఏందిరా చెప్పరా, పొట్టపగిలిచచ్చేవ్" అన్నాడు. కోటయ్య కొంచెం నవ్వు ఆపుకొని " కిందటేడు చేసిన అల్లరి జ్ఞప్తికొచ్చిందోయ్. మనం దీటీలు తిప్పుతూ ఆ ఇల్లు కాలె ఈ ఇల్లు కాలె కోమటి రత్తమ్మ... అని ఏమో అందుకోబోయాడు.

రమణయ్య మొహం చిట్లించుకొని" నీ పిండాకూడు, ఎన్నిసార్లు చెప్పాలెరా బూతులు కుయ్యొద్దని. ఇట్లా అయితే మా ఇంటికి రావాకు. మా నాయనతో చెబుతా ఏమనుకున్నావో. ఎలుగుబంటి తోలు ఎన్నాళ్లు ఉతికినా నలుపు నలుపేగాని తెలుపురాదన్నట్లు ఎంత చదువుకున్నా సూద్రపు మాటలు ఎక్కడికి పోతాయి" అన్నాడు కోపంతో

కోటయ్య నోటిమీది చెయ్యదిమి నవ్వాపుకొని "అబ్బా, ఏం అమాయకుడివో! వినాయకుడి బొడ్లో వేలు పెట్టిన దొంగ లాగు ఎం తెలియ నట్టుగా మాట్లాడుతున్నా? ఆ పాట మా అందరికి నేర్పి అల్లరి చేయించింది నీవు కదూ. నా నోటి మీదుగా వస్తే అది బూతయింది. ఇన్నేండ్లు ముడ్డి కింద కొచ్చినై. గుజ్జం అని పలకలేవు గల్లం అంటావు నావాసూద్రపు మాటలు నీవా? ఆ మాట మళ్లీ అన్నావా అంటే మొహం పగులుతుంది. జాగ్రత్త ఏమనుకున్నావో" అని కోపంతో చివ్వున లేచి చెయ్యెత్తాడు.

రమణయ్య" కూచోరా కోటాయ్! ఎందుకురా అంత కోపపడతావు ఎప్పుడూ మనం చిన్నవాళ్ళంట్రా? ఈ ఏడు ఆ దీటీల పని పెట్టుకోవద్దు. ముందటేడు మిఠాయి దుకాణపు కోమటి రత్తయ్య మనం వెంబడిపడి ఆ పదం పాడుతుంటే ఉగ్రుడై అమ్మనాలి బూతులు తిడుతూ దుడ్డు కర్రొకటి

తీసుకొని కొట్టటానికి మన వెంట బడితే మా నాయన గదరా అప్పుడొచ్చి అతన్ని సర్ది పంపింది. అడుసు తొక్కనేల కాలు కడగనేల? అని ఆపాదు పని చేయటమెందుకు ఎవరిచేతనో తిట్లుతినటం ఎందుకు? శుభ్రంగా టపాకాయలు, పువ్వొత్తులు కాల్చుకోక. వద్దురా బాబు వొద్దు. ఈ ఏడాది అల్లరి చేయొద్దు"

నిర్మలరావు " వద్దకపోవటమేం? ఈ యేడు వెంకమ్మ ముండ వెంటబడి దాని భర్తం పడదాం"

రమణయ్య "నీమొహం. ఆపడం ఎట్లా కుదురుతుంది లేరా ఊరుకో. చేయాల్సి పని ఉండనే ఉందిరా"

కోటయ్య కోపం చల్లారింది. అంతా కూచోని పువ్వొత్తుల పని పూర్తి చేయటంలో నిమగ్నులైనారు. ఆకాశం నిర్మలంగా ఉంది. వాతావరణ కాటుకలు కమ్మి ఉన్నవి. అమావాస్య చీకటి అంతటా ఆవరించుచున్నది. సన్నటి పైరుగాలి చల్లగా వీస్తున్నది. చుక్కలు తళతళలాడుతూ నిక్కబొడుచుకొని భూదేవి వంక చూస్తున్నాయి. వాటి వెల్తురు యొక్క మహిమ నారింజ చెట్టుకింద సరస సల్లాపాలాడుకుంటున్న శర్మ, కాంతమ్మలకు తెలుస్తుంది గాని ఈ కుర్ర కుంకలకేం తెలుస్తుంది.

అప్పలసామిది మంచి కండగల శరీరం. మనిషి ఎత్తాంటి మనిషి. ఆ ఎత్తుకు తగినట్లు పొందికైన కట్టు. పొడుగుమొహం. కోటేరంటి ముక్కు. చారెడేసి కాటుక కండ్లు వాటిపైన కంచెలంటి కనుబొమ్మలు.. యవ్వన రసంతో గ్రుగ్గి మోగి మెరుస్తున్న ఆ నున్నటి బుగ్గలు, బుజ్జిగడ్డం, వెడల్పాటినోరు. ఆనోరుకు తగ్గ మదిపైన ఎర్రటి పెదిమలు, ముత్యాలహారం లాంటి ఆ పండ్ల వరసకట్టు, నిడువైన నొసలు, వికసించిన బొండు మల్లెల లాంటి చెవులు, కాయకష్టం చేస్తే కండలు బారిన ఆ దండ చేతులు,తొడలు, పిక్కలు, బండి కుండలాంటి పిర్రలు, పొడుగు పాటి పాదాలు, మోకాళ్లకు బెత్తెడు పైగా తాకే ఆ చేతులు, కాయలు కాసిన ఆ అరచేతులు, సన్నటి పొడుగైన వేళ్ళు, ఎండకు ఎండి వానకు తడిసి ఎర్రబారిన కండరాలలో మెలికలు తిరిగి పైకి బాగా కనబడుతున్న పచ్చటి రక్తనాళాలు, ఆ కాటిక రంగు జుట్టు జులపాలు నవనవలాడే కోర మీసం, అతని వన్నె చిహ్నాలకెంతో వన్నె తెచ్చినాయి.

మనిషి పురాణాలలో వర్ణించే వీరుల విగ్రహానికి మించిన విగ్రహంలా కనపడతాడు. అట్టివాడిని కాంతమ్మ ఆమె కామ తృప్తికోసం మోహించిందంటే ఆశ్చర్యమేముంది? ఎంత రూపమో అంత విశాల హృదయుడు. మనో

నిబ్బరుడు. గ్రహచార వశాత్తు మేనక బారిన విశ్వామిత్రుడు పడ్డట్టు కాంతమ్మ బారిన అతడే పడ్డాడు. అమాయకంగా ఆమెను ప్రేమించాడు. మునగానాం తేలానాంగా ప్రేమలో మునిగి దిక్కుతెలియక కొట్టుకుంటున్నాడు. కేవలం కామ తృప్తితో ప్రారంభమైన ప్రేమ అతని పక్షాన పెద్ద బ్రహ్మాండమైన ప్రేమగా మారింది. కాంతమ్మ ఎందుకైనా మంచిదని శర్మగార్ని వరించి అతనిని కాలదన్నింది. ఉపాయంగా ఉచ్చువేసి అతన్ని తాత్కాలికంగానన్నా బలి దీసుకున్నది.

ఆరోజు ఆస్పత్రికి పోయేటప్పుడు ఆమె మాట్లాడిన మాటలు అతని హృదయాన్ని ఛేదించినయి. మనస్సును ఎక్కువగా కలవరపెట్టినై. తిరిగి ఆమెను ఇంటి దగ్గర ఒదిలిపెట్టటానికి కొచ్చేటప్పుడు దారిలో ఆమెతో ఒక మాటైనా మాట్లాడలా.

కాంతమ్మ గూడ కొత్త ప్రేమికుడైన పేరయ్యశర్మనెట్లా ఇంటికి రప్పించటమా అనే రంధిలో పడి, పెదిమలాడించకుండా ఇంటిదగ్గర బండాగగానే దిగి "డబ్బులస్తాఉండు అప్పలసామి" అన్నది.

"డబ్బొద్దు, గిబ్బొద్దు. నేను డబ్బు కోసమేం మొహమాయలా" అంటూ బండి తోలుకొని తానున్న గూడానికి పోయినాడు. పొద్దున్నే వంట చేసి పెట్టక పోయినా అన్నం తినబుద్ధి కాకపోతే, కడుపు నిండా ముంతెడు నీళ్లు తాగి బాడిగలు తోలుకోవడానికి ఊళ్లోకి పోయినాడు.

ఆ గూడెం కాంతమ్మ ఇంటికి ఫర్లాంగు దూరంలో పిచికలగుంట కవతల ఉన్నది. అక్కడంతా కూలినాలి చేసుకుండే వాండ్లు లాగుడు బండ్లు లాక్కునే వాండ్లు ఉన్నారు. శర్మ గారింట్లో పనిచేసే మంగి, ఈ అప్పలసామి గూడా అక్కడే ఉన్నారు. కాపులు, బలిజలు తప్ప ఇంకో జాతివాండ్లు లేరక్కడ. ఆ గూడెం ఒక కాపుది. స్థలం ఊరికే పడుంటే గుడిసె లేసి అద్దెకిచ్చాడు. వాటి మీద సగటున నెలకు 25రూపాయలు అద్దెలుగా ముడుతుంటయి. గుడిసెను బట్టి అద్దె పుచ్చుకుండేవారు. అతడు మాత్రం రోడ్డు కాంట్రాక్టుల మీద పక్కన ఒక దాబా వేసుకున్నాడు. రూపాయకు నెలకు బేడల బేడల వడ్డీలతో చుట్టుపక్కల బీదసాదలకు అప్పులు పెట్టి, లేనిపోని లెక్కలు రాసి, పద్దులు పెంచి రూపా యిచ్చిన చోట పదిపాయలు దాకా వసూలు చేసుకొని, పదేండ్ల క్రితం రెక్కల కష్టం చేసుకొని బతికే వాడల్లా భాగ్యవంతుల దర్జాలోకి అడుగుపెట్టాడు. ఎట్లాగైతేనేం బీదసాదలను పీడించి వాండ్ల రక్తం దాకి బొజ్జ పెంచి, చేతికి

బంగారు మురుగులు తొడిగి మల్లు పంచెలు కట్టి సిల్కు చొక్కాలు తొడిగి తనూ ఒక పెద్ద పెత్తనదారుడయినాడు.

ఆపేటలో మునిసిపాలిటీ ఎలక్షన్లలో ఆ గూడెంలో ఉన్న 30 ఓట్లు నిల్చున్న అభ్యర్థుల కమ్ముకుండేవారు. ఎవరు గూడెం ఓట్లు కొంటే వారు గెలిచేవారు. కారణం ఆపేటలో నియోగులు, వైదికులు సరిసమానంగా ఉండటం వల్ల వారిలో ఒకరు వీరిలో ఒకరు అభ్యర్థిగా నిల్చుంటే ఆ గూడెం ఓట్లు కొన్నవారు మాత్రం గెలిచేవారు. ఈ ఎన్నికల కోసమని నియోగి, వైదికి కక్షలు పూర్తిగా పెంచారు పెద్దలు. ఆ పేటలో దీని ఫలితంగా ఇతర కులాల వాండ్లలో గూడా నియోగి కాపులని, నియోగి కమ్మలని, వైదికి కాపులని, వైదిక కమ్మలని కొత్త కులాలు బయలుదేరినవి. ఆఖరికి బజార్లెంబడి తిరిగే పందులను గూడా నియోగి పందులని, వైదికీ పందులని పిలిచే గతి పట్టించారు. పెద్ద చదువులు చదివిన పెద్దలు, ఇట్లా ఓట్ల బజారు గిరాకీగా ఉండటం వల్ల కాపు కుప్పయ్య పంట పండుతుండేది. ఆ పేట వకీలు మహాశయులు 30 ఓట్లకు ఒక్కోక్కప్పుడు మూడ వందలకన్నా పోసి కోనేవాండ్లు ఎవరో ఒకరు. ఇది కాకుండా అటీస్తానని ఇటీస్తానని అటు ఇటు ఇద్దరి దగ్గర కాజేయటం కద్దు. కుప్పయ్య ఇహ మెంబర్లయిన వారి నాశ్రయించి రోడ్ల కాంట్రాక్టులు సంపాయించేవారు. ఓట్లు కొని గెలిచిన మెంబర్లు ఛెయిర్మన్లు ఎలక్షనపుడు తమ ఓటమ్ముకొని తాము ఓట్ల కోసం ఖర్చుపెట్టిన ఆ భర్తీ పూడ్చుకుండేవారు. ప్రజాపరిపాలనకు పునాదైన ఓటుహక్కుకు ఈ గతి పట్టించారు అన్నీ తెలిసిన ఆ పేట నాయకులు. ఖర్మం చాలక అటువంటి వారు చేతులలో పడ్డ స్వరాజ్యాన్ని వారు ఏ విదేశీ వీధులలో పెట్టి వేలంపాట పాడతారో తమ స్వార్థం కోసం! అందుకే కష్టజీవుల ప్రభుత్వం కావాలని ఘోష పెదుతున్నారు ప్రపంచ కార్మిక, కర్షకులంతా.

మంగి కుటుంబం మూదేండ్ల క్రితమే ఒంగోలు దగ్గర అద్దంకి నుంచి గుంటూరు వచ్చింది. వచ్చిన కొన్నాళ్లకే ఈ గూడెంలో చేరారు. మంగికి యాభయ్యోపడి. దాని మొగుడు దానికన్నా 5 ఏండ్లు ఎక్కువ. మంగి మొగుడు కూలినాలి చేసుకుండేవాడు. అందువల్ల డొక్కశుద్ధిగా తాగుతుండేవాడు. బిడ్డలు లేరు. కాని, అద్దంకిలో ఉన్నప్పుడు ఒక విచిత్రమైన కథ జరిగింది! మంగి మొగుడు చన్నాయ సారాయి దుకాణం అప్పుడు ఊరిపైట ఒంగోలు రోడ్డు పక్కనే వుండేది. దానికి పాతిక గజాల దూరంలో అన్నీ నాగజెముడు పొదలే.

ఊరికి దుకాణానికి అరమైలు దూరముండేది.

ఒకరోజు తెల్లవారుఝామున ఎక్కడో ఒక చిన్న బిడ్డఏడుస్తున్నట్లు మొగుడికి, పెండ్లానికి వినబడ్డదట. "మంగ్యా మంగ్యా లెగవేమే అదేందశా ఏడనో బిడ్డ క్యార్ క్యార్ అని ఏడుస్తున్నట్టుంది. ఆలకించే" అన్నాడు. మంగి కూడా లేచి కొంచెం ఆలకించి "అవును నాకూ ఇనబడుతుంది. ఏందీ మాయ?" అని ఇద్దరూ కలిసిపోయి వెతకటం ప్రారంభించారు. ఎంత వెతికినా ఏడుపు వినపడ్డది కానీ బిడ్డ కనపడ్లా. ఏందబ్బా మాయ అని తెల్లవారిందాకా వెతుకుతూనే ఉన్నారు. ఒక పొద దగ్గర మాత్రం బిడ్డ ఏడుపు బాగా వినపడు తున్నది. అప్పుడప్పుడే తెల్లవార్తున్నది. నాలుగు తడవలు ప్రదక్షిణంగా తిరిగి చూచారు. బిడ్డ కనబడలా. చివరకు చెన్నాయకు ఉపాయం తోచి "మంగ్యా నీవు కూకోవే. నీ బుజాల మీదెక్కి సూస్తా అగపడుతందేమో" అని మంగిని కూచోపెట్టి దాని భుజాల మీదెక్కి నాగజెముడు పొదలలోకి కండ్లు మిటకరించి చూచాడు.

మధ్యబరువుకు ఒంగి ఉన్న మట్టలమీద ఒక నెత్తురు మూట కనబడ్డ దతనికి.ఆమూట మధ్య చిన్న తలకాయ మాత్రం కొద్దిగా కనబడుతున్నది "ఉంది ఉందసేవ్" అని కేకవేస్తూ. కాళ్లు చేతులు ఇదిలిస్తున్నది ఆమూటలో ఉన్న బిడ్డ.

ఈ దృశ్యం చూసేసరికి చన్నాయకు గుండె జారింది "చంపారే బిడ్డని" అని కెవ్వున కేక పేసి మంగి భుజాలమీద నుంచి ఎగిరి దూకాడు. పరుగెత్తుకుంటూ ఇంట్లోకి పోయి కొడవలి తీసుకొచ్చి ఒక పక్కనుంచి మట్టలు తెగగొట్టడం మొదలుపెట్టాడు. చేతులు కాళ్లు గజగజ వొణుకుతున్నాయి.

మంగి ఆదుర్దాగా ఆకోసిన మట్టలు ఒక తట్టేస్తూ "ఓరి బాబో ఎంత పని జరిగింది. కనిపారేసినట్టుంది చేతులెట్టా ఆడినయో ఆ పాపిష్టిదానికి" అని మొగుడి తట్టు మళ్లీ " అట్టా చేపలా తన్నుకుంటుందదాబిడ్డ. నీవంతకన్నా ఒణికిపోతుండావు. తాలు నువు తొలుగు. ఇక చాల్లే మట్టలు కొయ్యటం. చేతికందుద్దేమో ఉండు" అని మొగుణ్ణి చేత్తో అవతలికి నెట్టి, ఒంగి మెల్లగా రెండుచేతులు ఆ ముళ్లలో గుండా మూట కిందికి దూర్చి, ఆ మూట అమాంతం పైకెత్తి ఆబిడ్డ నొసట మీద అంటి అంటని ముద్దు పెట్టుకుంటూ ఇంట్లోకి పోయింది.

మూట కిందపెట్టి బిడ్డని జాగ్రత్తగా బైటికి తీసి ముళ్ళేమన్నా ఇరిగినవేమో

అని తేరిపార చూసింది. ఎక్కడా ముళ్ళిరిగినట్లు కనపడలా. పక్కన నిల్చున్న మొగుడు "ఇదంతా మన అదురుట్టమే మంగ్యా, బిడ్డలకు మొహమాచున్నాం గదంటే, అందుకనే అండాలోరు కటాచ్చిచ్చి మన కందుబాట్లో ఈడ పెట్టి పోయుంటాడే. అండాలోరి మయిమ గనుకనే సూడవే సెక్కుసెదరకుండా వుంది బిడ్డ" అన్నాడు.

మంగి "ఎవరు కనేత్తే ఏమి బంగారవంటి బిడ్డ. మొగతునకైతే బాగుండేది. కాని ఇంతే మన అదుట్టం. ఇదైనా బిడ్డేగా. సాక్కోటానికి మగదైతేనేం, ఆడదైతేనేం? బూములుంటేగా దున్నుకోటానికి, ఏం లేనోండ్లకి ఆడపిల్లే సయి" అన్నది.

అతిముచ్చటగా పెంచుకొస్తున్న అండాలుకు అప్పుడే పదహేనో ఏడోచ్చింది. మంగి ఈ పిల్లకు మొదటి పేరి అని పేరు పెడదామనుకుంది. కాని చన్నాయ ఆది పదనియ్యల. అండాలయ్య ప్రసాదం గాబట్టి ఆండాళ్లమని పెట్టాల్సిందే అని పట్టు పట్టాడు. నోరు తిరిగి అండాళ్లమ్మ అండాలయింది.

ఆరోజు పొద్దు గూకంగానే తప్పతాగి ఇంటికొచ్చాడు చన్నాయ. "మంగ్యా మసిలే నీలిచ్చి బయటేసి బువ్వెట్టవే. తానమాడి తిని తొంగుంటా" అన్నాడు.

తాగొచ్చినప్పుడల్లా ఇట్టా అంటాడని మంగికి తెలుసు "నేను పంచలో బువ్వేసుకుండా. పిల్లను పిలు అదేదుందో" అన్నది. చన్నాయ "నా శాతగాదే నేతూలి తూలి పోతుండా. కూసింతసేపు కుక్కి మంచంలో కూలపడతా పిలయ్యే, అశా నీవే పిలు" అన్నాడు.

మంగి కంచం మీద చాట మూతేసి చేయి కడుక్కొని సూత్తుండి కుక్క ముట్టుకుంటదేమో బువ్వ" అని బైటికి పోయి "ఆండాలు" అని పెద్దగా కేకేసింది. జవాబు రాలేదు." ఈ పిల్ల ఇప్పుడేడకి పోయిందబ్బా సందే సీకట్లు కమ్మిపోతే" అని ఇంకొంచెం అవతలకిపోయి మళ్లీ కేకేసింది. జవాబు లేదు.

అవతల వేపచెట్ల కింద మునిసిపాలిటీ లాంతర్ల వెల్తుర్లో పిల్లలెవరో ఆడుకుంటున్నారు" సింతాకు సిగురాకు పయిడికొమ్మల పయిరాకు సింతాకు సిగురాకు" అని గుక్క తిప్పుకోకుండా కూత కూస్తున్న శబ్దం వినబడ్డది. ఆపిల్లోండ్లాడ బలిగూడాకుంటుండారు. ఈ పిలేడికి పోయిందబ్బా! అని పిల్లలాడుకుంటుండే వైపు పోయింది.

నడిఈడు మగవాండ్లు కొంతమంది చుట్టలు కాలుస్తూ చెట్టుకింది

కూచున్నారు. అందులో ఒకడు “గవల్ల మంగమ్మ కూతురు కదు సందంబని సూతురు బరి సూతురు సూతురు” అని తొడలమీద దరువేస్తూ చిందులు తొక్కుతున్నాడు.

వీండ్లకేం పోయేకాలం మాపిల్లను పసి పట్టుకున్నారు అని అనుకుంటూ రెండడుగులు ముందుకేసింది. “జొన్నసేలో నిన్న సొగుసుకత్తెను సూస్తి దాని నన్నూ గూరిపి దయసేతు మాదవా పొన్నపూల తోటి పూజలేసేతూ” అని కూనిరాగాలు తీస్తూ “ఒరే ఆ మంగి కూతురు బలే సొగసుకత్తెరా” అంటున్నాడు ఇంకొకడు చంకలు కొట్టుకుంటూ

ఈడొచ్చిన పిల్లను ఏ అయ్యకన్నా కట్టిపెట్టక ఇంట్లో పెట్టుకుంటే ఉండే బాధే ఇది. ఆ అప్పలసామికన్నా ఏదో యిదంగా ముడిపెడితే బాగుండు. ఈ పిల్లకూ అతడి మీద ఇట్టముండట్టుంది. కులంలో అసమంటోడు దొరకడు. పల్ల కథ ఇంటే కాపైనా అతడు చేసుకోవచ్చు! అని అనుకుంటూ పిల్లకోసం ఇటూ అటూ ఎతుకుతున్నది.

బహూశా వాండ్లయ్యకు పొగాకు అగ్గిపెట్టె తేటానికి పొయోస్తున్నదేమో అని పిచికలగుంటకు పోయేదారిన కొంచెం దూరం పోయింది. బాట పక్కన ఎవరో వెనక చేతులు కట్టుకొని తిరుగుతున్నట్లు మాత్రం కండ్లు పొడుచుక చూస్తే కనబడ్డది. “ఎవరక్కడా...పలకరేం?” అని ఇంకొంచెం దగ్గర కొచ్చి చూస్తే అప్పలసామి ఉనికిలా వుంటే “ఏందయ్యా అప్పలసామీ”అంది. “అవునన్నాడు” అప్పలసామి “నీకు నూరేండ్లాయుస్సు తలుసుకోగానే పత్యచ్చమయినావ్. ఏం అట్టా వుండావబ్బీ? ఏందా తిరగటం? అన్నది మంగి.

“ఏంలేదు మంగమ్మా తోసకపోతే సల్లగాలికి తిరుగుతుండా. నీవే తల్లివి తండ్రివి నీవే నా తోడునీడ! అని ఆ బగవంతుడ్ని ప్రార్థిత్తుండా. ఆ పుట్టిచ్చిన పిచ్చిముండాకొడుకు దిక్కులేని నా బోంట్లందరిని తీసకపోరాదూ. ఏందో ఈ జల్మ. పట్టెడు కూటికి మూరెడు బట్టకే కదా ఈ బతుకు. చిన్ని నాపొట్టకు శ్రీరామరచ్చ అని పొద్దున లేచినాల నుంచి పొట్టకూటికి పాకు లాట్టమేగా పని? పున్నెమా పురుసార్దమా” అన్నాడు అప్పలసామి

“ఈయాల యేదాంతంలో దిగావే పిచ్చోడ. నారేసినోడు నీరేయటంలా? ఎతుక్కుండే దేముండది? కాత్తోకూత్తో కట్టబడి అంబలోగంజో అంతా తాగుతూనే వుండిరి. నీవెట్టా దిక్కులేనోడివే? ఏ పిల్లనో కట్టుకొని ఒకింటోడివి కాకుండా ఎల్లకాలం ఇట్లా ఉంటవుటే? పిల్ల మేక కలిగితే ఒసినంత బలగం. దేవుడి

ధర్మాన అన్నీ సక్కపడతయి. పో, బువ తిని పడుకో" అని అన్నది మంగి.

అప్పలసామి "మంగమ్మా పెద్దదానియి అన్నీ తెలిసిన దానియి. నా యేదన యెవరకి సెప్పేది? ఇయాల మద్దెనాల నుంచి ఎందుకనో బతకాలని లేదు. గుండెల్లో రాయెత్తినట్టుంది. అర్చే వవండ్లా తీర్చేవాండ్లా. ఈపాపిష్టి గటం పోతే చితుకుసేన్నా తగలేసేవాండ్లు లేరాయె. పోయు మీద కుండెక్కిచ్చటానికి పానమొప్పటంలా.

మంగి "అప్పలయ్యా ఎందుకంత బాధపడతా. ఈయాల లేసినేలను మంటిది. దా, మాఇంటికి. ఏడేడి నీలు పోసుకొని బువ తిందువుగాని"

అప్పలసామి" ఎందుకులే మంగమ్మా, నేపోయి పోయరాజేసుకుంటా"

మంగి " రాఅబ్బీరా! నన్ను సంపుకుతిన్నంతొట్టు. నిన్నొదిలి నేపోను. ఒకిరికొకరం అండగా లేకుంటే ఎట్టా? ఇయ్యాల నుంచి ఎరుగుదువుగంద, నీవంటే నాకు పానమని. ముసలాయనకు ముందటేడు పాము గరిత్తే లగెత్తుకుంటా పోయి టేసను మాట్టరు పాముల నరసయ్యకు తంతిచ్చి రచ్చిత్తివి గదా. ఆ ఉపకారం మరుత్తానా. అయనకు నీ వంటే ఎంతో పేమ. అప్పలసామి దేవుడసంటోడు అంటాడు. ఇంతలో పొయ్యేదేముంది? కుండలో బువ్వుంది. పొంతలో నీలున్నయి" అని చేయి పట్టిలాగుతున్నది.

అప్పలసామి ఈ మంగమ్మ వదిలేట్టు లేదు. పోక తప్పేట్టుండలా. పోనీయ్ అట్టా అన్నా మనసు కుదుట పడుతుందేమో. పొరాటున మనసులో నున్నది ఎళ్లగక్కా. ఆ పిల్ల ఎక్కడుందో చెప్పినట్టయితే పోయేద అని మనసులో అనుకుని బిగ్గరగా "మంగమ్మా, మీ పిల్ల కుప్పయ్యగారింటెదురుగా గంపెడు పిల్లల్తో ఆడుకుంటుండగా ఇందాకనే సూసా. నే నొత్తా పదా పిల్లను పిలు... నే పోయి ముసలాయన దగ్గర కూకోనుంటా" అని నాలుగు అడుగులు ముందుకు వేశాడు.

దూరాన్నించి "చెమ్మచెక్క చారెడేసి మొగ్గ అట్లుపోయింగా ఆరగించంగ ముత్యాల చెమ్మచెక్క ముగ్గులేయంగ " అని శ్రావ్యంగా పాడటం పారగాలికి చెవులకు వినసొంపుగా వినబడుతున్నది.

ఆహా ఎంత స్వచ్ఛంగా పాడుతున్నదా పిల్ల. ఆకిన్నెరగొంతు ఆందాలుదే! ఇంకోరట్లా పాడ్లేరు. ఆ పిల్లందానికి ముందు ఎయ్యికాంతమ్మలు బలాదూరు. ఈ తాగుబోతు చన్నాయకు, పిచ్చిబాగుల మంగికి పుట్టాల్సిన బిడ్డా అది!

సందకాడ నా బండెంబడి అడ్డుకాడ "బావ బండెక్కిత్తావ? అయ్యకు

సుట్ట పుగాకు అగ్గిపెట్టె తీసుకరాను పోయినా. ఇంటికల్లే పోతుందావుగా? అని బండెక్కి "బావో ఎందయ్యా పేల మొహం పడ్డది? బాడుగలేం దొరకలా? ఎపుడూ ఎకసెక్కాలాడేవోడివి ముంగిలా మూత బిగబట్టి పోతుండావే. నామీద కోపమొచ్చిందా? మేం గూడెంలో ఉండటానికొచ్చినాల్నుంచి ఏయాలా పొట్లాలు తెచ్చి ఇదిగో అమ్మాయ్! అని ఇచ్చేవోడివి నెన్నాలనుంచి కంటబడ్డా పలకరించకుండా పోతుందావే! అంత కోపానికి నేనేం చేశా బావా? అనేలికి నా వల్లు సల్లబడ్డది. "ఏం లేదమ్మాయ్! నీవు పెద్దదానివయ్యావుగా, నీతో యిసేసం మాట్టాడ్తే ఏం సోదొత్తుందో అని మాట్టాట్టంలా.

కడుపులో వున్న కపటం దాచుకున్న నేరానికి ఏప్పుడూ అబద్ధ మాడ్నోడిని నాకు ఇలవేల్పులు తలపుకొచ్చారు. అట్టా అని కాంతమ్మ పేమలో పడి తన్నక లాడుతూ ఈ పిల్లను సూట్టానికి సమయం లేక సూడడం లేదని చెప్పటం ఆదేవతంటి పిల్లకు.." అని అనుకొంటూ అక్కడ్నే నిలబడి పోయినాడు అప్పలసామి

దూరాన "ఆండాలు ఆండాలు రావేమే ఇంటికి. ఏప్పుడూ ఆ ఆటలే? ఇల్లు వాకిలి లేదంటే నీకు? అని అరుస్తున్న మంగమ్మ మాటలు గాలి నాలుకు విశదం వినబడుతున్నాయి. ఆ మాటలు అప్పలాసామీ చెవున పడంగానే 'ఇదేందబ్బ ఆ పిల్ల పేరనంగానే ఒళ్ళు జలతరిస్తున్నదియాల' అని ఒళ్ళిదిలించు కొని, తల్లీబిడ్డ వస్తారిక. వాండ్లింటికి పోయి కూచుందామని బారెడేసి అంగలేస్తూ గబగబ వెళ్ళి మంగమ్మ ఇంటి ముందు మెండి గోడల మధ్య మెరాబాలో మంచం వాల్చుకొని కీనీడలో కూచున్నాడు "ఏం ముసలయ్యా! ఈయాల అట్టా పడుందా? ఇంతలోకే నిద్రా? లే! పిల్ల, మంగమ్మ వత్తుందారు" అని గురక పెడుతున్న చెన్నయ్యను సంబోధించి అంటుండగానే

"అయ్యోయ్! అయ్యోయ్! పుగాకు అగ్గిపెట్టె ఆ గూట్లో ఏసి అడుకుంటానికి పోతే అమ్మొచ్చి గదమాయించి పిలచకొచ్చిందే. మహా ఆడుకొంటే ఇంకోయాడాదాడుకొందేను, అంతే గదంటే. ఇప్పట్నించే ఎందుకే నన్ను పాశాలేసి బిగిచ్చటం?" అని గుక్కతిప్పుకోకుండా అంటూ లేడిలా ఎగురుకుంటూ వచ్చి కనిచీకట్లో మంచం మీద కూచున్నది. అప్పలసామి మంచు గడ్డ మాదిరి బిగుసుకు పోయినాడు. నోటంబడి మాటరాలా. "అదిగో అమ్మ అదిగో అమ్మ " అంటున్నది ఆండాలు.

మంగి వచ్చీరావడంతోనే " ఓసి నీ పాసుగూల, మీ బావొల్లో కూకున్నా

వేమే?" అని మూతిమీద వేలేసుకుని ఆశ్చర్యంగా చూస్తూ అన్నది లోలోపల బహు సంతోషిస్తూ

ఆండాలు "ఏందే నీ మతేమన్నా పోయిందంటే? బావెందుకొత్తాడే ఈడకి అయ్యగదంటే?" అని మెల్లగా తిరిగి మొహం కెళ్ళి చూసి గుర్తించి చెడేలున లేచి "ఓసమ్మో! ఎంత పనయింది. అయ్యనుకున్నా గదంటే. బావ నేడనుంచి పట్టకొచ్చావే? ఆయనకి నన్ను సూత్తేనే సిగ్గంట. పెద్దదాన్నగుతుండానంట. అందుకని నాకు పొట్టాలు గూడా తెచ్చియ్యటం లేదంటే. అంత సిగ్గుబోతోడ్ని మరులు మందేసి లాక్కొచ్చావంటే?" అని ఎతుక్కుంటూ పోయి వాండ్లయ్య పక్కలో కూచొని పొర్లి పొర్లి నవ్వుతున్నది.

మంగమ్మ " నీ ఎర్రి గూల ఎందుకే అట్టా ఎకిలిగా నవ్వుతా. మీ బావ అంటే అంత అలుసంటే. ఎప్పుడూ ఎగతాళి పరాశకంటే? ఆయనియాలెందుకో బెంగ పెట్టుకొని పిచ్చెక్కినోడిలా తిరుగుతుంటే పట్టకొచ్చానే? నీ కోసం ఎతకటానికి పోతి మీ బావ సిక్కాడు. లే లెగిసి నీలు తోదు మీ అయ్యకు, బావకూ యీపుతోంవే. ఈ నాలుగు కొరివికారం ముద్దలు నోట్లో వేసుకొని కంచాల్లో బువ తోడుతా"

చన్నయ్య పూర్వకాలపు మనిషి. అప్పలసామిని చూసి "మంగ్యా ఇయాలేం అప్పలయ్య మనింటి కొచ్చిండు? ఇయాలీడ బువ దింటే రేపాండ్ల కులత్తులు ఎలెయ్యరంటే? అన్నాడు. "చన్నయ్య మామ నీకెందుకా పిచ్చి? మా పక్కల మీఇండ్లలో తింటం అలవాటే. నాకా పట్టింపులేం లెవ్వు. అదీగాక పేరుకు తెరద్దమే గాని కులాలన్ని కలిసిపోందెక్కడ? ఆటీను, కలావరు, ఇస్పేటు, డయిమండ్ నాలుగు రంగుల చీట్లపేకాడేప్పుడు కలసిపోయినట్టు నాలుగు వర్ణాలు కలిసిపోయినయి. తక్కువ కులాన్ని దోచుకతింటానికీ తెలివిగలోళ్ళు పెట్టిన కులాల గద యియ్యి. గడియారంలో ముల్లు ముందుకు నదుత్తుండట్టు లోకం నడిసిపోతుంది. పెపంచమే మారుతుంటే మనం మారటానికేం మామా" అని నీళ్ళు పోసుకుంటూ జవాబిచ్చాడు.

ఆండాలు ఇద్దరికీ వీపు రుద్దింది. అప్పలసామి వీపు రుద్దిన తర్వాత ఎగతాళికి వీపున ఒక చరపు చరిచి నవ్వుతూ పోయి, చెట్టు నీడన నిల్చోని అప్పలసామిని వార చూపులతో చూస్తున్నది. మంగి బువ్వ కంచాల్లోకి తోడింది. వరుసగా ముగ్గురు కూచొని భోంచేస్తున్నారు. చన్నయ్య మధ్య కూర్చున్నాడు. ఆండాలు రెండు ముద్దలు నోట్లో పెట్టుకున్న తర్వాత అప్పలసామి బాగా

కనపడేట్టు కంచం లాక్కొని గొంతు కూచొని ముద్ద నోట్లో పెట్టుకున్నప్పుడల్లా అప్పలసామి వంక కోర చూపు ఒకటి చూచి తల వంచి కంచం కాళ్ల సందున పెట్టుకొని ముసి ముసి నవ్వులు నవ్వుతున్నది. మంగి ద్వారబందం దగ్గర మడత కాలేసి కూచొని "అమ్మ పిల్లా ఏమో అనుకుండా! సూడా పిల్ల శతురు. శతురైనా ఈ కాలపు పిల్లలంటే పిల్లలా! శకుముకి రవ్వలు గాని... అయినా అప్పలసామి దించిన తలన్నా ఎత్తకుండాతింటుండాడే. ఒక తూరన్నా దానొంక సూడ్డే? నా ఎర్రేగాని ఎందుకు సేసుకుంటాడబ్బా నాపిల్లని. అయినా 20వ దినంగానే కూకోబెట్టి ఎచ్చరిచ్చిసూత్తా. ఒప్పుకుంటే పండగెల్లంగానే లగ్నాలు పెట్టిత్తా అని దీర్ఘమైన ఆలోచనలో పడ్డది మంగి.

అప్పలసామి కొంచెం సేపటికి ఆండాలు వంక కన్నెత్తి చూశాడు. ఇద్దరి చూపులు ఎకమయినయి. మళ్ళీ తలొంచుకొని 'అబ్బా ఏందీ కర్మ? ఈ పిల్ల నియాల సూసినాల నుంచి ఎట్టాగో ఉందే. కాంతమ్మను పేమిస్తుండా నా మనసు ఈపిల్లనా? గుండెల్లో ఏందో కవ్వంబెట్టి సిలికినట్టుందే. కూసింత సేపు కాంతమ్మ కండ్లకెదుటంగా కట్టినట్టు కనబడుతుంది. యంటనే మనసీ పిల్ల మీద పోతుంది. ఇద్దర్నీ పేమిత్తుండానా? అదెట్టా సబబు? ఒక వర్లో రెండు కత్తులెట్టా ఇముడ్తయి. మంగమ్మ నన్ను మసి పూసి మారేడికాయ సేసి ఈ పిల్ల నెట్టన్నా నా కంట కట్టాలని లాక్కరాలేదు కదా? అయినా ఓర్నీ నమ్మే రోజులు కాయియి. కాంతమ్మ నన్ను మోసం సేసి కూసింతసేపు బోగానికై నాకు బురిడీ ఏసి పేమనే బురద గుంట లోకి లాగింది ఇప్పుడీ మంగమ్మ మటుమాయంగా పెండ్లనే ఇంకో రేగటి గుంటలోకి తోద్దామనే పన్నాగంతో లాక్కు రాలేదు గదా!

ఆముండది కాంతమ్మ శాకశక్కెం, తెలివితేటలు మంగమ్మకేడ నుంచి వత్తయి. కాంతమ్మ అతి తెలియగల్ది. జిత్తులమారిది. మాయదారి బంగారి లేడి. ఉపాయాలు తెలిసిన శాణ. అందులో సదువొచ్చింది. నాబోటి బుద్ధి గలోడ్ని ఏదే బేలేసి బోల్తా కొట్టింది.

మంగమ్మకేం తెలుత్తయి ఆ మరమాలన్నీ? నాకా కాంతమ్మ మీద పేముంటే ఆవిడకి నామీద పేముందదెట్టా? కులం పోతుందట. వాండ్లమ్మ బాయిలో పడుతుందట. తమ్ముడికి పెండ్లి కాదంట. అబ్బా! పేమే ఉండట్టయితే గుడ్డెద్దు సేల్లో పడ్డట్టు నాయెంట బడి పట్టం లెగిసొచ్చేది కదూ! యాడికాడ తెగదెంపులు సేసుకొని ఆ మాయలమారిది బూటకం సేసి ఏదో యిదంగా

నన్ను సెరిసింది గాని పేమా-బుగ్గా? అయిడకి లేనటువంటి పేమ పిచ్చోణ్ణి కాకపోతే నాకెందుకంట? నేను కుల్లి సావటమెందుకు అంట? నిచేపంగా అన్నెం పున్నెం ఎరగని ఈ అమాయకపు ఆండాల్ను సేసుకొని సుకంగుంటే పోదూ? పిలి జల్ల పుడతారు. అంతా అప్పలసామి సంతానమంటారు. ఇది అగ్గిసాచ్చిగా సేసుకున్న పెండ్లయితది. ఈ పిల్ల నా పెప్పుసేతల్లో ఉంటుంది. కాంతమ్మ సెప్పుకాళ్లకిందనే పడుండాల్సొస్తుంది. ఇంత తేడా తేటతెల్లంగా అగపడుతుంటే మంగమ్మ మోసం సేత్తుందనుకోవటం పాపం గదూ! ఎవరు సేసినా మంగమ్మ నన్నేయాలకు మోసంసేయదు. నా ఉలికిపోటే గాని అనే తరంగాలు అప్పలసామి మనసులో ఊచి ఊచి కొడుతున్నాయి. తలెత్తి ఒక తడవ మళ్లీ చూసాడు. ఆండాలు కళ్లు గుచ్చి గుచ్చి చూస్తూ చేతులో ఉన్న ముద్దా ఇలా చూపి "నీ కంచంలో ఏసేదా" అని కనుసైగ చేసింది. అప్పలసామి మాట్లాడలా. పెదిమలు బిగబట్టి ఒక నవ్వు నవ్వాడు. ఆండాలా ముద్ద కంచంలో వెయ్యనే వేసింది. చప్పున అతనా ముద్ద నోట్లో వేసుకన్నాడు. ఓసి ఎంత దానివే అన్నట్లు కనుబొమ్మలు పైకెత్తి ఆశ్చర్యంతో చూశాడు.

ఆండాలు తలకాయొంచుకొని తెప్పరిల్లుకోకుండా పొర్లి పొర్లి నవ్వుతున్నది. కానీ ?ఆ పిల్ల మొహంలో దురద్దేశుపు చూపులేం లేవు. తను చేస్తున్న చిన్నతనపు చేష్టలకు లోకం ఇంకో అర్థమిస్తుందనే ఊహ గూడ లేకుండా వరసకు బావ గదా అని ఎకసెక్కాలాడుతున్నది. ఆండాలు అమాయకపు చెల్లాటలు మంగికి కూడా అర్థంకాలా. అప్పలసామి సహనం గూడా ఇంగో విధంగా అర్థం చేసుకొని తప్పక ఆండాలును చేసుకుంటాడనే ఉద్దేశ్యం గట్టి చేసుకున్నది మంగి.

" ఏందే పిల్లా ఆ నవ్వు? మజ్జిక్కయిందా? అని లేచి మజ్జిగ పోసింది. మసలాయన అదివరకే తిని లేచిపోయి పడుకున్నాడు. అప్పలసామి, ఆండాలు కూడా మజ్జిగన్నం తిని లేచారు. అప్పలసామి చేయి కడుక్కుంటుంటే ఆండాలు దబ్బున అదలా బదలా చేయి కడుక్కోని చేతిలో ఇన్ని నీళ్లు పోసుకోని అప్పలసామి మీద చల్లింది. నవ్వుతూ పోయి వాండ్లయ్య మంచం మీద పడుకున్నది.

అప్పలసామి ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ ఆండాలు పోసిన నీళ్లు తుడుచుకుంటూ "పోయొత్తా మంగమ్మా" అన్నాడు.

"పోదువు గాని కూకోవయ్యా, నీకో సంగతి చెపుతా" అన్నిది మంగి.

ఆడుకోనొచ్చిన ఆండాలు మంచం మీద కూలబడి పడుకున్నదే తడవుగా నిద్రపోయింది. మంచం మీద కూలబడి అప్పలసామి మంగమ్మ ఇల్లు సర్దుకున్న దాకా ఏదో ఆలోచిస్తూ కూచున్నాడు.

మంగమ్మ కొంతసేపటికి మంచం దగ్గరికి వచ్చి కింద కూచోని "ఇప్పటికి మనసు కుదుటపడ్డదంటయ్యా అప్పలసామీ? నేనోమాట సెబుతా యింటా?" అన్నది మంగి

"ఒకటికాదు వంద సెప్పు ఇసుకులేకుండా ఇంటా"అన్నాడు

"నీవు పడుసోడివి. పెళ్లిసేసుకోకుండా ఎన్నాల్లుంటవు? సేసుకో రాదంటయ్యా. నీవేం అనుకోకపోతే ఒక మాట సెబుతా. మా పిల్లని సేసుకోరా దంటాయ్యా? అంతకంటే అందగత్తెను తెత్తావంటా?" అని వెలవెల బోయిన అప్పలసామి మొహం కళ్లి చూసి "ఎందుకట్టా ఎల ఎల బోతా? మా పిల్ల ఎవరనుకుండా వేం? ఆ ఆండాలయ్య ప్రసాదం. నాకడుపున పుట్టింది కాదు. ఎన్నాలనాడో సెబుతా మనుకుండా. కాని ఏమనుకుంటావో అని సెప్పలా. ఇప్పుడు నీ ఏదన సూడ్లేక ఒకింటోడివైతే బాగుందని తోసి సెప్పదల్చా. మా పిల్ల ఏ బాపనమ్మకో పుట్టిన బిడ్డ. అద్దంకిలో ఉండప్పుదు అటాత్తుగా ఆండాలోరు ఆ బిడ్డను మా చేతుల్లో పెట్టాడు."అని అపుడు జరిగిన వృత్తాంతమంత పూస గుచ్చినట్టు చెప్పింది. అప్పలసామి ఊ కొడుతూ సాంతం విని "మంగమ్మా నీవు చెప్పిందంతా బాగానే వుంది. ఆండాలు మంచి అందగత్తె. సింపిరి బట్టలు సుట్టుకుంటే సరా. సరైన పోసన లేక పిల్లట్లా ఉండా అసలందం యాడికి పోతుంది. చంద్రబింబంలాంటి సక్కదనాల సుక్క. ఆ పిల్ల వర్చస్సు వర్నన సేయటానికి నా శాతనవుతుందా? ఇలాంటి బిడ్డ మీకెట్టా పుట్టిందా అని ఎన్నిసార్లు ఆనుకుండా. అయినా ఇదంతా దేవుడి మాయగందా! ఏ పుట్టలో ఏ పాముందో! ఎవరద్దుట్టం వారిది. ఏజల్మలోనో నువ్వు సేసుకుండ నోములు ఫలించుంటయి గందా! పుట్టు కురూపోండ్లకు నిచ్చేసమంటి బిడ్డలు కలుగు తుండారుగందా! అందాల జంటకు కురూపోండ్లు పుదుతుంటారు గందా! నీ కడుపునే పుట్టింది గామాల్సీబిడ్డ కూడా ఏబాపనమ్మ పొట్టనో పుట్టిందనుకోలా మనిండ్లలో మటుకు ఇల్లాంటి బిడ్డలు పుట్టరా. ఏం! పైకులాల్లో పుట్టి రూపం లేని పిల్లలకు ఎంత పోసనున్నా మాత్రం రూపమొస్తుందంట లేస్తూ. నువ్వెరగవు ఆ బిడ్డంటే ఎంత పానంగా సూసుకుండే వాడ్నో" అని అటుండగా మంగమ్మ మనసులో 'అమ్మా దారికొత్తుండాడు.' పిల్ల మీద పేముందతడికి. నే సేసిన

యత్తం వుదాపోలా! అను అనుకుంటూ పైకి "అయ్యో నేనెరగనా అప్పలయ్యా ఆ పిల్లంటే నీకుపానమని. ఏయాలకాదన్నా ఏంటో ఒగటి తింటానికి తెచ్చిపెట్టే వోడియ గదంటయ్యా! పోయిన ఉగాదికి లంగాలు కుట్టిచ్చిచ్చి, పప్పుచెక్క, కొబ్బరిబెల్లం, సెరుకుగళ్ళు మోసినన్ని తెచ్చి ఇంట్లో ఎందుకులేబ్బీ అన్నకొద్దీ ఏసిపోతియే. తిన్నకడుపు ముందరెట్టుకొని లేదనే గునం నాది కాదు. అప్పటాల నుంచే మీ ఇద్దరికి ఈడు జోడనుకుండా. పండగెల్లంగానే బాపనోరింటికెల్లి లగ్గాలు పెట్టిద్దాం. ఈ కాస్త గుడిసె అవి సున్నాలు కొట్టిత్తా. అదెంతలోకి. ముందుండ మొండి గోడలకు సున్నప్పట్టెలు ఎర్రమన్ను పట్టెలు నిమిసంలో పెట్టొచ్చు. వీటికో కేటు పెట్టి ముదురు పోత్తే మీరిక్కడే ఉండొచ్చు. బండి సెట్టుకిందిడిసి ఎద్దును దొడ్లో కట్టెయ్యొచ్చు. అంతగా అయితే మోపెడు తాటాకొల్తో పందిరేత్తే దానికి నీడుంటుంది. మాకేం మీరు పెట్టక్కర్లలేదు గందా. ముసలాయన బొందిలో ఊపిరున్నంతదనక బయంలా. పావలా దుబ్బు లెట్టయినా రోజు కళ్ల సూత్తాడు. శర్మగారు బతికుండంతకాలం నాకేం ధోకాలా. ఇక మీరంటవ్. ఆపిల్ల ఏరుశనక్కాయల మరకెల్లితే మూడణాల దబ్బులొత్తయి. నీకు బాడిగలే ఉండే. ఇట్టమయితే పిల్లను పంపిత్తువు గాని, కట్టమయితే మానుకందు గాని. నాది శావబారిన శరీరం గందా! బతికుండంత కాలం మీకింత బువ్వోండి పెట్టలేక పోతానా" అన్నది. అప్పలసామేంచేయటమా అన్న సందిగ్ధలో పడ్డాడు. ఇదమిద్దమని తేల్చుకోలేకుండా ఉన్నాడు.

కాంతమ్మకు నా జల్మలో ఇంకో ఆడదాని మొహం చూడనని చెప్పిన మాటలు అతని చెవులలో గింగిర మంటున్నయి. అన్ని మాటలు చెప్పిన ఆనోరు అరక ముందే ఇంకో ఆడదాన్ని చేసుకుంటానని చెప్పటం ఎట్లా? తన మాట మీద తానే నిలవకపోతే ఎట్లా?

అప్పలసామి మాటు తప్పినవాడు. దగాకోరు. లుచ్చా, చెప్పిందొకటి చేసిందొకటి అని కాంతమ్మ తప్ప ఇంకెవరన్నా అనుకోరు గదా అని నీతి నియమం తప్పటమా? ఛీ. అటువంటి గటం కాదిది. ఎమన్నాగానీ ఆ ఏడుకొండల వెంకటేశ్వర్లు దయుంటే ఈ ఎర కోసం ఆశించను. ఉన్నదున్నట్లు స్పష్టంగా చెప్పేస్తా. ఈమంగమ్మకు ఆశ పెట్టటం ఎందుకు? ఆడినమాట తప్పకుండా ఉండటానికి ఆ హరిశ్చంద్రుడు ఎన్నగచాట్లు పడలా? అంతకన్నా గొప్పవాడ్నా! అనే ఆలోచనతో..

"నామనసింకోరికిచ్చా మంగమ్మా. అందాలు మీద పేముంది నాకు. లేదన్ను. ఆ పిల్ల మెళ్లో తాళి కట్టటానికి నా శాతగాదు. అందాలును యింకో యిదంగా నా బిడ్డలా పేమిత్తా. మంచి మనుము చూసి ముడి పెట్టిత్తా. నీకట్టానికి తోడవుతా. నేను పాపిట్టోడ్ని. ఆ పయిత్రమైన పిల్లను పెండ్లిసేసుకోలేను. మంగమ్మా శమాపనేడుకుంటుండా. నీ కాలకు మొక్కుతా" అని లేచి ఏడుస్తూ అమాంతం మంగమ్మ కాళ్ళమీద సాష్టాంగపడ్డాడు. అప్పలసామి. మంగమ్మ ఆశలు మంటగలిశాయి. కండ్లెంబడి నీళ్లు బొటబొటా కారాయి. ఇద్దరూ కన్నీళ్ల కాల్వలు కారుస్తున్నారు.

కాళ్లమీద పడి ఏడుస్తున్న అప్పలసామిని లేవ తియ్యాలన్న సంగతి కూడా మరిచిపోయి గుండె జారి కుంగిపోయింది మంగమ్మ.

చీకటి గాడాంధకారం. నడిర్ఘామైంది. ఊరంతా మాటు మణిగింది. ఆకాశంలో చుక్కలు మిణుకు మిణుకు మంటున్నాయి. చాలీ చాలని నూనెపోసిన వీధి లాంతర్లు కొరివి బారి ఆరిపోతున్నాయి. గస్తీ తిరుగుతున్న పోలీసుల ఈలలు బుర్ బుర్ మని వినబడుతున్నాయి. అక్కడక్కడ కుక్కలు బవ్ బవ్ అని అరుస్తున్నాయి. సూరిశాస్త్రి గారింటి ముందర ఒక కుక్క కుయ్యో కుయ్యో అని ఏడుస్తున్నది. వారి ఇంట్లో వసారాలో రెండు బల్లులు బుస్ బుస్ మని బుసలు కొడుతూ పోట్లాడుకుంటున్నాయి. పంచలో పడుకున్న రాంభద్రయ్యకు నిద్ర పట్టక అటుఇటు మసలుతున్నాడు.

నిర్మలరావు రమణయ్యను నిద్రాదేవత నిన్ను వరించె గదరా నిర్భాగ్య దామోదరా అన్నప్పుడే రాంభద్రయ్య మేల్కొన్నాడు. వాండ్లిద్దరికి జరిగిన సంభాషణంతా చెవులు నిక్కపొడుకుని నిద్రలో ఉన్న వాడిలా నటించి విన్నాడు. టపాక్కాయల, పువ్వొత్తుల మాట విన్నప్పుడు మాత్రం లేచి అప్పుడే మెలుకువ వచ్చినవాడిలా నటించి నిర్మలరావును క్షమాపణ వేడుకొని, రమణయ్యను కాళ్లు పట్టుకొనయినా సరే తన వంతు డబ్బిచ్చి ఆ మందు సామాన్లలో భాగం పంచుకొవటానికి వాండ్లతో పాటు పోదామనుకున్నాడు. కాని వాండ్ల సంభాషణ పూర్తికాగానే ఆ పని చేయొచ్చునని ఊరుకున్నాడు. నిర్మలరావు, సాయంకాలం వేసుకున్న ప్లానేమిటి అని మొదలు మదురెక్కాల్సిల్సినమాట అన్నంతవరకూ రాంభద్రయ్య విని 'ఈ గాడిదకొడుకులు మా ఇంటికే ఎసరుపెడుతున్నారు, ఆ చెట్టు కాయలింతవరకు నేనొక్కటైనా ముట్టుకోలా. అప్పుడే పల్చబడు తున్నాయి.

రోజూ ఈ వెధవలే గామాలు కాజేస్తున్నారు. ఏమన్నాగానీయ్ ఇవాళ పొంచేసి వీండ్లను పట్టుకోవాల్సిందే. వాండ్లు మదురు మీదుగా చెట్టెక్కుతుండగానే పరుగెత్తుకుంటూ పోయి మా అమ్మను, అక్కయ్యను లేపుతాను. ఇక్కడ్నుంచే దొంగలు, దొంగలను కేకలేస్తా. పోలీసులొస్తారు. వాండ్ల చేత దుడ్డుకర్ర విరిగేటట్టు ఆ కుంకలను బాదిస్తా. మరీ ఆ దొంగవెదవ నిర్మలాయను ఎముకల్లోకి సున్నం లేకుండా కొట్టిస్తా. ఆ వెధవే వీండ్లకు రెపెట్టింది. వాడే వీండ్లను రేపెట్టిందని చెప్తా. వాడే వీండ్లను లేపుకపోయిందని చెపుతా. పంతులుగారు, వాండ్ల మామ పేరయ్యశర్మ, చుట్టుపక్కల వాండ్లంతా నా కేకలకు లేచి రాక మానరు. ఒచ్చి తలా ఏటు ఎయ్యకమానరు. నా కసంతా ఇట్లా తీర్చుకుంటా. నిర్మలాయను కాలో చెయ్యో ఇరగ్గొట్టిస్తా. కోలుకొక్కరాయి తోసి జయిల్లో పారేస్తారు. నేనెంతో ధైర్యంగా దొంగల్ని పట్టుకున్నానని నన్నంతా మెచ్చుకుంటారు. నిర్మలాయ లేకపోతే రమణాయ మంచి ముండాకొడుకే. వీడు చదువులో ఎట్టాగో సున్న కాబట్టి వాడి ఫస్టు మార్కులు నాకొస్తాయి. నేను మానిటర్నవుతా. ఇటు ఈ పేట పిలల్లమీద అటు క్లాసులో పిల్లల మీద పెద్దరికం నేనే చలాయిస్తా. చిక్కాడులే ఆ దుర్మార్గుడు నిర్మలాయ. అదకత్తెరలో వక్క మాదిరి ఒత్తేస్తా. ఇవాళ వాడి భర్తం ఇట్లా పట్టేస్తే రేపు నా భర్తం, మా భర్తం వాడెట్టా పడతాడు?

ఇంతకూ నా బోటి అదృష్టవంతుడ్ని చెడగొట్టేవాడు లేడు. వాడి బోటి దురదృష్టవంతుడ్ని బాగుచేసేవాడు లేడు. వాండ్ల కాళ్లకూ, చేతులకూ బేడీలేసి పెడరెక్క విరచి పోలీసులు తీసికెళ్ళంగానే ఆ నేల టపాక్కాయలు, పువ్వొత్తులు నే కాజేస్తా. అవి కోష్టంలో పెట్టే పోతారుగా చెట్టెక్కటానికి అని షేకు చెల్లీ మాదిరి ఆలోచనలో పడ్డాడు.

కొంచెంసేపటకి నిర్మలరావు వాండ్లు బైటికి వెళ్లడం తోటే ముసుగు తెరచి చూచాడు. కస్సని రెండు పిల్లులు పోట్లాడుకుంటున్నాయి, దూరంగా. అప్పుడే లేచి వాండ్ల వెనకాలే వెళ్లదామనుకున్నాడు గాని పిల్లుల గోలకు భయపడి దుప్పటి నిండా కప్పుకొని బైటికి పోలేక నిద్ర పట్టక అగచాట్లు పడుతున్నాడు. పిల్లుల చప్పుడణగంగానే కొంతసేపటికి ధైర్యం తెచ్చుకుని లేచి కూర్చున్నాడు. నీవే తల్లివి దండ్రివి నీవే నా తోడునీడ అని మనసులో పద్యం చదువుకుంటూ ఉత్తరీయం తీసి నెత్తికి చుట్టుకొని మెల్లెగా లేచి ముని కాళ్ల మీద తలుపు దగ్గరకు వెళ్లి కొంచెం వారగా తెరచి చూచాడు.

కొష్టంలో మిణుకు మిణుకు మంటూ లాంతరు మాత్రం కనబదు

తున్నది. పక్కవీధిలో నుంచి వస్తున్న పోలీసుల చెప్పుల చప్పుడు వినబడుతున్నది. పోలీసులు తిరుగుతున్నారు గదా అని మరింత ధైర్యం తెచ్చుకున్నాడు కాని, మెట్టు దిగి వీధిలోకి పోవటానికి ధైర్యం చిక్కలా. నరశింహశతకంలో పద్యాలు గొణుక్కుంటూ అక్కడే నిల్చున్నాడు. అంతలోకే కొష్టంలో దీపం ఆర్పినట్లు కనబడ్డది. అక్కడున్న నలుగురు పిల్లలు బైటికొచ్చి వాండ్ల ఇంటికెళ్లి పోవటం చూచాడు. పోదామంటే కాళ్ళాడక, అరుద్దామంటే నోరాడక కొట్టుకుంటున్నాడు రాంభద్రయ్య.

అక్కడ రమణయ్య వెంకమ్మ గారింటి గోడ పక్కగా సందులో కింద కూచున్నాడు. అతని ఇరుపక్కల కృష్ణుడు. కోటయ్య నిల్లున్నారు. నిర్మలుడు చటుక్కున రమణయ్య భుజాల మీద కెగిరి నిల్చొని కోటయ్య కృష్ణులను రెండు చేతులతో పట్టుకున్నాడు. రమణయ్య అమాంతం ఒక బిర్రుతో పైకి లేచాడు. నిర్మలుడు నారింజచెట్టు కొమ్మ పట్టుకొని మెల్లెగా మదురు మీదుగా చెట్టెక్కాడు. గబగబా కాయలు కోసి కింద వేస్తున్నాడు. కింద ఉన్న ముగ్గురు ఆ కాయలు దబ దబ ఒళ్ళోకి ఏరుకుంటున్నారు. చెట్టుకింద పడుకున్నది ఒకరైంది ఇద్దరైంది తెలుసుకోవటానికి ఎంత ప్రయత్నం చేసి చూసినా నిర్మలరావుకు కనబడటంలా. కిందటి రోజు మాదిరి ఆరోజు లోపలి లాంతరు వెల్తురు తలుపు సందులలో నుంచి పైట పడటంలా. ఇంక చేతి కందిన కాయలు కోస్తూనే ఉన్నాడు నిర్మలుడు.

ఇక్కడ సూరిగారి ద్వారం దగ్గర నిల్చున్న రాంభద్రయ్యకు వళ్లు మండు తున్నది. ఎక్కడ లేని కోపం వస్తున్నది. చెట్టెక్కి కాయలు కోస్తున్నారని మాత్రం అప్పుడప్పుడవుతున్న కొమ్మల చప్పుడ్ను బట్టి గ్రహించాడు. అరుద్దామంటే ఇంకా నోరు పెగలటంలా. ఎదురుగా అరుస్తున్న కుక్కనెవరో రాయి తీసుకొని కొట్టారు. అది కుయ్ కుయ్ అని అరుస్తున్నది. వెంటనే ధైర్యం చేసుకొని మెట్లు దిగాడు. ఎదురుగా రోడ్డు మీద ఒక వ్యక్తి నడుస్తున్నట్లు కనబడ్డది. వెంటనే ఒళ్లు తెలియకుండా "దొ..దొ..దొంగ..దొంగలు.. దొంగలు అని అరుస్తూ వాండ్లింటి వైపు పరుగెత్తాడు. నోటెంబడి బాగా మాటలు రావటం ప్రారంభించగానే "దొంగలే... దొంగలు పడ్డారే" అని కేకలేస్తూ ఉరవడిగా పోయి వీధి వాకిలి తలుపు తప తపా గుద్దుతున్నాడు.

ఇంట్లో పడుకున్న వెంకమ్మ కొడుకేస్తున్న కేకలకు మేలకొని లాంతరు పెద్దది చేసి చేత పట్టుకొని ఇంట్లోకి దొడ్లోకి ఉన్న వాకిలి లోపలి గొళ్ళెం తీసి

గట్టిగా తట్టింది. "ఓసి పిల్లా మొద్దు నిదరేమే" అంటూ "గొళ్లెమేసుకున్నా వెందుకే? తియ్యవే తలుపు. దొంగలట్నే మనింట్లో దొంగలు పడ్డారే" అని కేక పెట్టింది. ఎంత తట్టినా తలుపు తీసినట్లు లేకపోతే, కాంతమ్మ నేం చేశారో దొంగలనే అదుర్దాతో తలుపు ఒకే తన్ను తన్నింది. పాత వాకిలి కావటాన గొళ్ళెం వూడి తలుపు వెనక్కి పడ్డది. అటు రోడ్డుమీద తిరుగుతున్న వ్యక్తి పరుగెత్తుకొంటూ వచ్చి దొడ్డి వాకిల్ని ఒక తన్ను తన్నాడు. అది గొళ్ళెం వూడి కింద పడ్డది. సందులో చెట్టు కింద వున్న ముగ్గురు పిల్లలు పరారయినారు. చెట్టుమీది నిర్మలరావు మాత్రం నిర్ఘాంతపోయి కొమ్మల చాటున దాక్కున్నాడు. ఇంట్లో నుంచి వచ్చిన వెంకమ్మ వళ్లు తెలియకుండా " మాకొంప ముంచారర్రో దొంగలు పడ్డారర్రో, మా పిల్లనేం చేశారర్రో, ఓపుల్లమ్మగారూ, యల్లమ్మగారూ, ఓ శాస్త్రుర్లుగారూ, ఓ శర్మగారూ" అని కేకలు వేస్తూ " ఓసి మొద్దు నిదరా ఏమే కాంతం? దొంగలేమన్నా చేశారా ఏమే కాంతం" అని మంచం దగ్గరి కొచ్చింది. దొడ్డి వాకిలి పగలదన్ని లోపలి కొచ్చిన వ్యక్తి ఈ గడబిడకు మంచం మీద ఉన్న కాంతమ్మ లేవకపోవటం, కదలకుండా ముసుగు కప్పిన మృత కళేబరంలా ఉండటం చూసి గడబిడ వణుకుతూ "ఓరి దేముడో, ఎంత పనైంది. ఆమె ముసుగు కప్పుకున్న దుప్పట్టి పట్టి చివ్వున లాగాడు.

ఇంతలో సూరి శాస్త్రులువారు ఇంకా కొంతమంది అప్పుడే దొడ్డి వాకిట్లోకి చేరారు. "ఎతకండి ఎతకండి. కన్నం ఎక్కడేశారో, ఏం ఎత్తకెళ్ళారో" అంటూ వెంకమ్మ లాంతరు పైకెత్తి నిజంగా కాంతమ్మను చంపారేమో దొంగలని చూచింది. పక్కమీద ఒక కాంతమ్మ కాదు, గజ గజా వణుకుతూ సగం ప్రాణాలు పోయిన పేరయ్య శర్మ, ఆమెను వలదలకుండా గట్టిగా కరుచుకొని కండ్లయినా తెరవకుండా పడుకున్నాడు.

కాంతమ్మ గూడా రెండు వైపులా తలుపులు కొడుతుండగానే చచ్చాన్రో దేవుడా..చిక్కనే చిక్కా ననుకొని ఎక్కడి ప్రాణాలక్కడ పోయి మూర్ఛ వచ్చినట్లు వళ్ళు తెలియకుండా పడున్నది.

ఈ దృశ్యం చూసేటప్పటికి వెంకమ్మ గుండె గుభేలు మన్నది. ఈ మేదో మంచం మీద చూస్తున్నదని వచ్చిన వారంతా చూట్టం మొదలుపెట్టారు. కొంచెంసేపు ఎవరి నోటి వెంటా మాటాలు రాలా. శాస్త్రుల్లవారు చూసి అర్థం చేసుకున్నారు. పక్కన గాబులో ఉన్న నీళ్లు చెంబెడు తీసి శర్మ, కాంతమ్మ మొహాన కొట్టాడు. "లేవయ్యా శర్మా" అని చేయి పట్టుకు లాగాడు.

శర్మగారు వణుకుతూ లేచి కూచోని బట్ట సర్దుకుంటూ మెల్లెగా మంచం మీద నుంచి లేచి నారింజ చెట్టు మొదలు పట్టుకొని నిల్చున్నాడు. కాంతమ్మ కండ్లు తెరచి చూచింది. ఎదురుగా ఉన్న అప్పలసామిని గుర్తించింది. తర్వాత శాస్త్రుర్ల వారిని ఇరుగు పొరుగు వారిని చూచింది. సిగ్గుతో మల మల నిలువునా మాడిపోయింది. మొహాన నెత్తురు చుక్క లేకుండా పోయింది. దబదబా పయట సర్దుకుంటూ లేచి, పెద్దపెట్టున ఏడుస్తూ ఇంట్లోకి పోయింది.

రాంభద్రయ్యకిదంతా ఏం అర్థంకాలా. కింద పెట్టున్న లాంతరు పైకెత్తి చెట్టుకాయలెన్ని పోయాయో అని చూడబోయినాడు. కొమ్మల మధ్యన కూచున్న నిర్మలరావు చొక్కా అతనికి కనపడ్డది. పెద్దగా "అదుగో ఆ వెధవ చెట్టుమీదనే ఉన్నాడు చూడండి పట్టుకోండి" అని అరిచాడు. అందిరి దృష్టి చెట్టు పైకి పోయింది. శాస్త్రుర్ల వారు "ఎవర్రా, ఒరేయ్ దిగరా గాడిద దిగు" అన్నాడు.

నిర్మలుడు "పంతులుగారూ నన్ను కొట్టవాకండి నే నిర్మలరావునండి. నేను నారింజ కాయలు కోసుకోటానికొచ్చానండి నాకేం తెలియదండి. కొట్ట వాకండి" అని అంటూ చెట్టు మొదట్లో కొచ్చి గబుక్కున దూకాడు...పడే పడటం వణుకుతూ నిల్చున్న పేరయ్య శర్మ మీద పడ్డాడు. ఆయన బొక్కబోర్ల పడి, బుక్కెడు మట్టి కరచుకున్నాడు మోకాళ్ళు మోచేతులు దోక్కపోయినయి. చర్రున లేచి నిల్చుని బిత్తర చూపులు చూస్తున్న నిర్మలరావును శాస్త్రులుగారు "ఓరి కుర్రవెధవా నీవట్రా ఇంతకూ దొంగవు. పో బైటికిపో" అని వెళ్ల గొట్టాడు. ఇక లౌకికముగా సర్దకపోతే బాగుండదని అందర్నీ పంపుతున్నాడు. అప్పల సామిని గూడా పంపుదామని చూస్తే కనబడలా. అతనెప్పుడు మాయ మైనాడబ్బా? అనుకున్నాడు మనసులో. రాంభద్రయ్యను "కుర్రవెధవవు నీవిక్కడ ఎందుకు, పో మా ఇంట్లో పడుకో పో" అని పంపించాడు.

అందరూ వెళ్లిపోయిన తర్వాత శాస్త్రిగారు కింద కూచొని మోకాళ్లు, మోచేతులు తడువుకుంటున్న శర్మగారి దగ్గరకెళ్లి "శర్మగారూ లేవండి" అని చెయ్యి పట్టుకొని లేపాడు. శర్మగారు చెంపలు రెండు గట్టిగా వాయించుకుంటూ లేచి తడబిడ మాటలతో "శాస్త్రులుగారు క్షమించండి. బుద్ధి గడ్డి తిన్నది. మీకు తెలియందేమున్నది. ఎన్ని మాత్రలు సేవించినా ఎన్ని వ్రతాలు చేసినా బిడ్డలు పుట్టలేదుగదా ఇంతవరకు. నా జన్మలో పరస్త్రీని కన్నెత్తయినా చూసెరగను గదా. ఇంతకు విధికృతం ఎవరు తప్పించగలరు. నేటి దుర్బుద్ధి పుట్టింది.

నిక్షేపమంటి కుటుంబానికి కళంకం తెచ్చిపెట్టా. పాలముంచినా నీట ముంచినా మీరే. నా పరువు కాపాడండి" అని ఆయన రెండు చేతులు పట్టుకొని "ఇవి కాళ్ళనుకోండి" అన్నాడు.

శాస్త్రులు గారు" శర్మగారూ! వెర్రివాడిలాగున్నావే! ఏ జన్మలోనే మీకు సంబంధం వుండబట్టే ఈ జన్మలో ఇలా కలిశారు. మహా మహా వారికే తప్పలా. ఇంతకూ మీ జాతకం అటువంటిది. భయపడవాకండి. మీకేం చింతించుట మెందుకు. గ్రహచారం చాలనప్పుడు అన్నీ ఇలాగే కలిసొస్తుంటాయి. మీరాడిన నాటకాలలో ఇదో ఘట్టమనుకోండి" అని శర్మగారిని ఓదార్చి ఇంటి దాకా సాగనంపి తనూ వెళ్ళిపోయినాడు.

శర్మగారు తలుపు తట్టి "అమ్మా అమ్మా" అని కేకవేశాడు. పాపాయమ్మ తలుపు తీసింది. "ఓరే అబ్బాయ్ దొంగలు దొంగలని ఎవరో కేక వేసినట్టుంది చూడరా" అన్నది. "దొంగలు లేరు గింగలు లేరు పడుకోవే" అన్నాడు. "అయితే ఆ వీధిలో జరిగిన గలభా ఏమిట్రా ఇంతసేపు" "ఏదో లెస్తూ నాకేం తెలుస్తుంది నేన్నాటకాన్నుంచొస్తుంటే' అని వెళ్ళి తన గదిలో పడుకున్నాడు.

చచ్చీచెడి శాయంగల విన్నపాల్తో ఎట్లాగోట్లా బైటపడ్డా. గణ్ణం తప్పింది. దేహశుద్ధి కాకుండా తప్పించుకున్నా. దొంగా దొంగని తలో దెబ్బేసినట్టయితే నా పనేమయ్యేది? గొడ్డెల్లి గోతిలో పడితే తలా ఒక దెబ్బేసినట్టయ్యేది గామాల. కుడిచి కూచొని నిక్షేపమంటి పెండ్లాంతో కాపరం చేయకుండా వ్యభిచారమెట్టా వుంటుందో అని రుచి చూడటానికి పోయినందుకు అడుగులో హంసపాదని తగిన శాస్తే జరిగింది. ఆ మంగిముండ ఆ చీటీ తేకపోయినట్టయితే నేనక్కడికి పోయే వాణ్ని కాదు గదా. ఓసి కాంతా ఎంత పనిచేశావే. పురాణ శ్రవణం చేసుకుంటూ కృష్ణ రామా అనుకుంటూ షడ్రసోపేతంగా తింటూ గుట్టుగా పడున్న నా బోటి పరమభాగవతోత్తముడిని కాసేపట్లో బోల్తా కొట్టించావే, అయినా నిన్ననాల్సిన పనేముంది? నేనే రోజూ వాకిట దగ్గర కూచొని నీకు సైగలు చేస్తుండాలె? ఎబ్బే, పాపం నీ తప్పేంకాదు. నాకు పుట్టిన వుండే ఇది. కాకపోతే అంతగా నీకోసం నేను తపించటమెందుకు? ఎన్నడూ పక్కింటి గడప ఎక్కెరగని వాడిని నీ ఇంటికి రావటమెందుకు? వచ్చాను సరిగదా, ఆ శొంఠెగాడు నిర్మలరావు గూడా అక్కడే దాపరించాలా? ఆ వచ్చిన వెధవ చివరకు చెట్టు మీది నుంచి సరాసరి నా నెత్తి మీదనే దూకాలా? శాస్త్రులుగారే లేకపోతే

వాడి పంజ అక్కడ్నే పట్టేవాడ్ని. ఇప్పుడు మటుకేం మించి పోయింది. వాడింటికి రాడా పేం బెత్తం యిరగదా. అయినా వాడి మొహం వాడిదేముంది. ఆ శాస్త్రి గారు చూశారే. ఎంత తియ్యని మాటలు చెప్పినా గోముఖవ్యాఘ్రం ఆయన! పైగా, ఆయన నోరసలే ఆంధ్రపత్రిక! రేపీపాటికి ఊళ్ళో గడప గడపకు పోయి చూశారా రాత్రేం జరిగిందో? ఆ సద్గృహస్తుడు శర్మగారు ముండమోసిన కాంతమ్మ పెరటిదొడ్లో పడుకో నుండగా పట్టుబడ్డాడని చాటించేస్తాడే. వంటింట్లో జొరబడి దానికి, మా అమ్మకూ, శర్మగారు చేసిన ఘనకార్యం విన్నార్టమ్మా?అని ఊది పోతాడే. రేపటికి ఊరంతా గబ్బు పుట్టి పోతుందే. తలెత్తుకొని తిరగటానికి ఆస్కారం లేకుండా చేస్తాడే. ఆయన నోరు కట్టెయ్యట మెట్టారా భగవంతుడా? అని ఆలోచన పరంపరలు దొర్లుతుంటే తెల్లవారిందాకా కూరుకు పట్టకుండా పక్కమీద దొర్లాతున్నాడు శర్మగారు.

నిర్మలుడు శాస్త్రిగారు పొమ్మన్నదే తడవుగా ఎగిరి గంతేసి ఒకే పరుగున పోయి వారింట్లో పడ్డాడు. వెళ్లంగానే అరుగుమీద గప్‌చుప్‌గా పడుకొని చచ్చానురా దేవుడా! రేపెట్టాగో మా మామయ్య చేతులో నాకు చావు మూడింది. చావగొట్టి చెవులు ముయ్యక ఊరుకుంటాడా ఇంత గ్రంథం జరిగింతర్వాత. ఎన్నిసార్లు నాన్నతో చెప్పినా ఇక్కడ్నుంచి పిలుచుకుపోడాయె. రేపట్నించి పిల్లల మొహం చూడటమెట్లా? ఆ రమణయ్య ఊరుకోడు కదా! పిల్లలందరికి చెబుతాడు గదా. మీమామ, రాంభద్రయ్య అప్పు...అని అందరు ఎగతాళి చేస్తారు కదా. పాపం, ఆయన కెంత పరాభవం జరిగింది. ఎంత చెడ్డా మేనమామ. ఆయనకు జరిగిన పరాభవం నాకు జరిగినట్టేగా. ఆ ముండ వెంకమ్మ ఈ పేటలో కాపూరానికి రాకపోయినట్టయితే ఇంత పని జరిగేదా? ఆయన కొచ్చిన ఈ మచ్చ ఎట్లా మాయటం? శాస్తుర్లగారి కడుపులో ఏ మాట దాగదే, ఊరంతా సాటింపు చేసొదిలి పెడతాడే. ఏదో యింత సంభావన ముట్ట చెబితే ఆయన ఊరుకున్నా ఆ ముండ కోమటి సుబ్బమ్మ అక్కడికొచ్చిందే, అది ఊరుకుంటుందా? తెల్లవారక ముందే పేదకళ్లకు పోయి ఒకతలి కలిపొస్తుందే ఊరంతా. రాత్రి జరిగిన ఇద్యూరం ఇన్నారటమ్మా అనుకుంటూ. అప్రతిష్ట పాలయిన ఆ ఇంట్లో ఇహ నేనుండను. ఉదయాన్నే అత్తయ్యతో ఈ రభసంతా చెప్పి రేపా ముండ వెంకమ్మ భర్తం పట్టి ఇంత అల్లరి పెట్టిన రాంభద్రాయ అంతుకనుక్కొని, ఎల్లుండి ఎవరికీ చెప్పకుండా లేచిపోతా.

ఎక్కడన్నా ఇంత మాధాకవళం ఎత్తుకొని బతుకుతా. ఎట్టికి చదువుకుంటా. అయితే నే కనబడకుండా పోతే అమ్మ, నాయన మంచాలెక్కుతారేమోనే. పోనీయ్ ఇంటికి పోదామా అంటే వాళ్లకివన్నీ ఏమర్థమౌతాయి? మాయచేసి మళ్లీ ఇక్కడికే పంపటానికి యత్నిస్తారు. ఏమన్నాగాని దేవుడి మీద భారం వేసి ఎటో అటు పోవాల్సిందే. ఈ రోజుతో ఈ ఊరికి నాకు ఋణం తీరింది. ఎలటానికి ఊళ్ళు లేవు గాని ఎత్తక తింటానికి లేవా? దిక్కులేని వాడ్నంటే ఎవరైనా దయదల్చక పోతారా? దేశం గొడ్డుపోయిందా? ఈ బీద పొట్టకి కూడేయ లేక పోతారా ఎవరన్నా? అని మనసు పరి పరివిధాల పరుగెత్తుతుంటే ఎప్పుడు పట్టిందో నిద్ర గాఢంగా పట్టింది ఆ నిర్భాగ్యుడికి.

శాస్త్రుర్లగారు పొమ్మన్నపుడు ఇంటిదాకాపోయి ఆయనా, శర్మగారూ అటు పోగానే కోమటి సుబ్బమ్మ వెంకమ్మగారింటికి మళ్ళీ ఒచ్చింది.

"వెంకమ్మా! ఎందుకట్టా ఏడుస్తా? ఏం మహామించి పోయిందని ఇంత దుఃఖ పడతా? రాంది రంకు పోంది బొంకు. ఏదో ఖర్మం చాలక మీ పిల్ల గుట్టిట్లా బైట పడ్డది గాని రంకులు, బొంగులు లేని కాపురాలున్నయ్యా? కూనాయ కూనాయ కూటికేడిస్తే అవ్వ రంకుమొగుడి కేడ్చిందనే సామెత ఊరకొచ్చింది? ఊప్పు, కారం తినే జన్మ ఊరుకుంటుందా? ఇంతకూ ఈ దొచ్చిన పిల్లలు ముండ మొయ్యటం తప్పు. చచ్చిన మొగుడుతోపాటు వాండ్లు చచ్చినట్టయితే ఏ చిక్కులేదు. వయసులో ఉన్న పిల్లలు చెడిపోక ఏమవుతారు? వాండ్లు గుట్టుగా వుందామనుకున్నా శర్మలాంటి చీడపురుగులు ఊరుకుంటారా? వాండ్ల మనసులు గుల్లయిందాకా తొలుస్తూనే ఉంటారు. అందుకనే ఉప్పెన బయల్దేరింది. ఇప్పుడు మాకులంలో గూడా వెధవముండలకు పెండ్లిండ్లు విచ్చలవిడిగా చేస్తున్నారు. జుట్టు గొరిగించుకున్న 30 ఏండ్ల ముండలు గూడా మళ్లీ జుట్టు పెంచుకుంటున్నారు. .తలలు బోడులైతే తలపులు బోడులైతాయా? ఈ శాస్త్రుర్ల వారి చెల్లెలు కూతురు చిన్నప్పుడే ముండమోసిందొకతే. మొన్న గదటమ్మా వాండ్ల అరుగు మీద మిషను కుట్టుకుండే సాయిబుతో లేచి పోయింది. అతనా అమ్మాయికి బురఖా వేసి కోడుగుద్దు సత్రం దగ్గర్నే కాపురం పెట్టాడు. వకీలు రామారావుగారి తల్లి మొగుడు చావంగానే కొడుకును, కూతుర్నీ ఒదిలి పెట్టి ఒక మాలతనితో లేచిపోయి, మన కండ్లెదటనే ఆ అస్పత్రిలో మంత్రసానిగా ఎన్నాళ్ళ నుంచి పడుంటంలా? ఆ శ్రోత్రియ మూర్తి సనాతన

ధర్మ రక్షకుదు త్రివిక్రమ శర్మ చెన్నపట్టణంలో ముండమోపులకు పిల్లలు పుట్టించి దిక్కులేని బ్రాహ్మల పిల్లలని ఇక్కడ వాండ్లు చుట్టాలిండ్లలకు పెంపుడు పంపుతున్న సంగతి నీకు తెలియదా? ఇటువంటి వెధవ పనులు చేసేకన్నా మళ్ళీపెండ్లి చేయటం ఉత్తమం కాదూ? వెధవముండల పెండిండ్లు మార్కెటు ఈ రోజుల్లో ఇంత గిరాకీగా ఉన్నదంటే ఉండదూ? మగవాండ్లు వెండ్లాం చచ్చిన పదోరోజు గూడా దాటక ముందే మనుములు కుదుర్చుకొని ముక్కపచ్చలారని పసికూనలను మళ్లీ పెండ్లి చేసుకుంటుంటే మన ఖర్మమేం కాలింది?" అని సుబ్బమ్మ అనేటప్పటికి అంతసేపటి దాకా మోకాళ్ల మీద చేతులు పెట్టుకొని తలకాయొంచుకొని ఏదుస్తున్న వెంకమ్మ ఒక చీదు చీది, చేయి దులుపుకొని ముక్కు కొంగుతో తుదుచుకుంటూ

"ఇక చాల్లే సుబ్బమ్మ, ఇహ చాలించు సిగ్గుచేటు మాటలు. ఇక నువ్వు నేను జుట్టు పెంచుకొని మళ్ళీ పెండ్లి చేసుకోవాలె. పెద్ద వాండ్లేదో గిరి గీసి మనముండాల్సిన చోట ఉంచితేనే ఇట్టా తగలడ్డది. ఆడదానికి స్వతంత్ర ముంటే కాపురాలు భగ్గుమన్నట్టే. ఈ పాపిష్టి ఘటం పోకుండా వచ్చింది. ముందటేదు పోలేరమ్మ పోసినప్పుడే పోయినట్టయితే ఈ పాపం కండ్లతో చూసే దాన్ని కాదు గాదా. ఆ పేరయ్యశర్మ ఇంత పని చేస్తాదని కల్లోనన్నా అనుకోలా. అతను చెప్పే వేదాంతం వింటే ఇంత దుష్టుదని అనిపించేదా? ఎంకమ్మగారూ అని ఎంతో మర్యాదగా పిలుస్తూ మంచి చేసుకొని నా కొంపకే ఎసరుపెట్టాడు. నా కూతుర్నే వ్యభిచారంలోకి దింపాడు. ఇంత నిలువెల్ల విషం గల వెధవని నేననుకోలా, పయోముఖ విష కుంభమేమమ్మా, వాడి పాదె గట్ట. వాడ్ని పోలేరమ్మ ఎత్తకపోను. వాడి కాపురం కూల" అని మెటికలు విరుస్తూ అన్నది.

సుబ్బమ్మ "ఆయన్నని మటుకేం లాభం లేదమ్మా. పెద్దలు చేసిన ఏర్పాట్లలో ఏక్కడో కీలు తప్పింది. ఈ లోకం అనే రథానికి. అది లొతుక్కు లొతుక్కుమని ఎగుడు దిగుడ్లుగా నడుస్తున్నది. ఈ సమాజం ఓటి పడవలా తూట్లు పడి దురాచారాలకు, దుష్ప్రర్తనలకు లోనై ప్రపంచమనే సముద్రంలో మునిగిపోయే స్థితిలో కొచ్చింది. ఈ తూట్లు పూడ్చి నీళ్లు లోపలికి పోయి పడవ మునగకుండా చేసే నాథుదు ఏనాదు పుదతాడో. దిగులు పడవాకు, పోయి పదుకో.. అన్నీ వాటంతటవే చక్కబడతయి. పొద్దుపోయింది. నే పోయొస్తా" అని వెళ్లిపోయింది.

చీకట్లో కాంతమ్మ కిందపడి పొర్లాడుతూ వెక్కి వెక్కి ఏడుస్తున్నది. వెంకమ్మ ఇంట్లోకి పోంగానే అమాంతం వచ్చి కాళ్లమీద పడి "అమ్మా! అఘాయిత్యం చేసుకోవాకే. బావో, చెరువో చూసుకోవాకే. పాషాణం తిని చావకే. నీవు చచ్చిన మర్నాడు నేను బతకనే. నేను ఉరేసుకుని చస్తానే. నేను ఏ పాపం ఎరుగనే. ఆయనొచ్చి అమాంతం నా పక్కమీద పడుకున్నాడే" అన్నది కాంతమ్మ.

వెంకమ్మ "ఓసి ఎంత అఘాయిత్యపు ముండవే! ఆ కర్నాటి చీర అయనే కట్టాడే? అయనొచ్చి నీ పక్క మీద పడితే ఉప్పిడి చప్పిడి చేయకుండా ఊరుకున్నావటే? ఏంత దానివైనావే? పదినెలలు మోసి, కని అల్లారుముద్దుగా పెంచి పెద్ద దాన్ని చేసిన ఫలితం ఇదటే? చావక బతికుందేదటే? తెల్లవారంగానే వీధిలో ఎట్లా తలెత్తుకొని తిరిగేదే? ఆ తుంటరి వెధవ నిర్మలాయ నారింజ కాయలకు రావటం, ఆ కుంక రాంభద్రుడు దొంగలు, దొంగలని కేకలెయ్యడం, ఇరుగు పొరుగు వారు కూడటం, చెట్టుకింద మంచం మీద అయన, నీవు పడుకోనుండటం అంతా విడ్డూరంగా చూడటం, ఆ పాపిష్టి దృశ్యం చూట్టానికి ఇంకానే బతికుండటం, ఏం సోయగా ఉందే? గొంతు పిసుక్కొని చావక నన్నింకా బతికుండమన్నావటే?" అన్నది నెత్తి నెత్తి బాదుకుంటూ, గుండెలు కొట్టుకుంటూ

"అమ్మా, నీవెందుకే చావటం నేనే చస్తా. తమ్ముడి చదువు పూర్తవం గానే ఏ పిల్లనో తెచ్చి వాడి కంటగట్టు. వాడో ఇంటివాడౌతాడు. ఇంత సంపాయించుకొని బతుకుతాడు. నీకొడుకు, కోడలు నీ ఘటం ఉన్నంతవరకు నీకు ఊడిగాలు చేస్తారు. నిన్ను పోషిస్తారు. నీ అల్లుడితోపాటు నేను గూడా పోయినాననుకో. ఇదిగో నీ కాళ్ల ముందర్నే ఇప్పుడే ప్రాణాలిడుస్తా చూడు" అని కర్నాటి చీర చెంగు గొంతుకు ముడేసుకొని రెండు కొనలు బట్టి గట్టిగా లాగుతున్నది కాంతమ్మ. వెంకమ్మ నివ్వెరపోయి చూస్తూ నిశ్చేష్టు రాలై స్మృహ తప్పి విరుచుకొని కింద పడ్డది.



చిన్నపురెడ్డి వాండ్ల దాడిలో గాయపడి కిందపడ్డ పోలీసు కమీషనర్ని ఖాదర్ అమాంతం ఆయన్నెత్తి బుజాలమీదేసుకుని కాలి బాటన చేలల్లో గుండా నడి ఝామును నరసరావుపేట జేరాడు. అక్కడ పోలీసుస్టేషన్లో పోలీసులు

లేరు. పక్కనున్న తాసిల్దారు గారింటికెళ్లి అయన్ను లేపాడు "జిల్లా సూపరెంటు గారికి కొండ దగ్గర కాయలు తగలినయి. అయనగార్నెట్టాగయినా గుంటూరు ఆస్పత్రికి చేర్చాలె" అన్నాడు. తాసిల్‌దారుగారు "చాల్లేపోవోయ్, ఇప్పుడు నా ప్రాణాలు ఎక్కడ పోగొట్టుకుండేది. ఆ చిన్నపురెడ్డి మనుషులు రాత్రి మా ఆఫీసు గూడా తగలబెట్టారు. పోలీసులంతా పరారైనారు. నీవే ఆయన్ను పొద్దుటి రైలుకు తీసుకెళ్ళు" అన్నాడు.

ఎట్లాగైతేనేం అయన్ను తెల్లవారేసరికి స్టేషనుమాస్టరు సహాయంతో ఒకు గూడ్సు బండిలో గార్డు పెట్టెలో ఎక్కించుకుని గుంటూరు ఆసత్రికి చేర్చాడు. కుడి కన్ను పోయిందే గాని ఇంకా ప్రమాదమైన గాయాలు తగలలేదు గనుక కొద్ది రోజులకే ఆయన కోలుకున్నాడు. మద్రాసు నుంచి వచ్చిన పోలీసు గూఢచారుల సహాయంతో తిరుగుబాటు దార్ల జాడాలు తెలుసుకున్నాడు. చిన్నపురెడ్డి ముఠాదార్లను చాలామందిని అరెస్టు చేశాడు. కేసు నడిపి చిన్నపు రెడ్డికి మరికొంత మందికి ఉరి శిక్షలు వేయించాడు. వాండ్లను ఉరితీశారు. కొంత మందికి దీపాంతరవాస శిక్షలు వేయించాడు. వాండ్లను అండమాన్‌కు పంపారు. మరికొంతమందికి సంవత్సరాల కొద్ది కఠిన శిక్షలు వేయించాడు. వాండ్లను రాజధానిలోని సెంట్రల్ జైళ్లకు పంపారు. ఈ అరెస్టులు కేసులు జరిగేటప్పుడు ఖాదర్‌ను తన ఖుద్దుగా పెట్టుకున్నాడు. తన ప్రాణాన్ని కాపాడిన ఖాదర్‌కు పోలీసు మెడలు ఒక గ్రేడు ప్రమోషన్, నందిపాటి వద్ద సుక్షేత్ర మంటి నాలుగుఎకరాల మాగాణి ఇప్పించాడు. ఖాదర్ పంట పండింది. తు అంటే త రాని ఖాదర్ మంచి తెలివితేటలు గల గూఢచారనే పేరు ఉట్ర ఉడియంగా సంపాయించాడు. పోలీసు అధికారులంతా బహు గౌరవంగా చూసేవారు. అప్పట్నుంచి గుంటూరు టౌను పోలీసు స్టేషన్‌లోనే సి.ఐ.డి. కానిస్టేబుల్ గా పనిచేస్తూ వచ్చాడు.

హెూంరూలు ఉద్యమం బహు తీవ్రతలో ఉంది. ఎక్కడ చూచినా బిసెంటమ్మ గారికి బ్రహ్మరథం పడుతున్నారు. కొందరు వకీళ్ళు విద్యార్థులు హెూంరూలు సంఘంలో చేరి తీవ్రమైన ప్రచారం చేస్తున్నారు. మన దేశానికి స్వపరిపాలన ఇస్తే గాని వీల్లేదని. ఈ మీటింగుల ఆచూకీ తీయటానికి వాటిలో ఎవరేం మాట్లాడింది ప్రభుత్వం వారికి తెలియపర్చటానికి ఖాదర్‌కు హెడ్ కానిస్టేబుల్ పదవిచ్చి ఇంకో ఇద్దరు పోలీసులను అతనికి సహాయం ఇచ్చి రాజాకీయాందోళన ఆరాలు తీసేందు కోసమే గుంటూరులో నియమించారు.

హెూంరూలు ఉద్యమంతో పాటు పొంగి చాల్లారిన వందేమాతరోద్యమం నాటి దేశభక్తుల కొందరు రహస్య విప్లవసంఘాలు కొన్ని ఏర్పాటు చేసి ఆంధ్రదేశ మంతటా పనిచేస్తూ వచ్చారు. బాంబుల వల్ల స్వరాజ్యం వస్తుందనే నమ్మకం వారికుండేది. గుంటూరు జిల్లా కతెవరంలో బాంబులు పేలటం, పోలీసులు కేసు పెట్టి ఒకరిద్దర్ని కఠిన శిక్షలు వేయటం అదివరకే తటస్థించింది.

ఆ కేసు సందర్భంలో కూడా ఖాదర్ అర్భాటంగా తిరిగాడు. కేసు తరఫునంతా చూసినట్టే సాక్ష్యం ఇచ్చాడు. ఆ రోజుల్లో బ్రిటిష్ సామ్రాజ్యమంతా తన చేతిమీద నడుస్తున్నంత ధీమాగా ఉండేవాడు ఖాదర్.

ఒకరోజు తెల్లవారకముందే స్టేషన్‌కొచ్చి సైకిల్ వేసుకొని బేడ్రస్సుతో ఎప్పట్లా తిరగటానికి పోయినాడు. తిరిగి తిరిగి బాగా తెల్లవారంగానే వచ్చి అరండల్‌పేట మెయిను వీధిలో ఒక కాఫీహెూటల్లో కూచొని కాఫీ తాగు తున్నాడు. ఒక పిల్లవాడు రోడ్డుమీద నేలటపాక్కాయ ఒకటి నేలకేసి కొట్టాడు. "అరే అల్లా వందేమాతరం వాళ్ళు బాంబులెయ్యనే వేశార్రా బాబు" అని గబాల్న బల్ల కిందకి దూరబోయినాడు. చేతులో కప్పు జారి కింద పడ్డది. వేడి కాఫీ కాళ్ల నిండా పడితే అది చేతి రూమాలుతో తుడుచుకుంటూ కూచొని బల్ల కింద దూరుతున్నాడు. పక్కబల్ల మీద కూచున్న పెద్ద మనష్యులు నవ్వటం మొదలుపెట్టారు. ఫలహారం అందించే పిల్లకాయలు ఫక్కున నవ్వి పండ్లికిలిస్తూ చూస్తున్నారు. గల్లా దగ్గర కూర్చున్న హెూటల్ యజమాని "ఇంతేనా సాయిబుగారూ! నేలటపాకాయమోతకే ఇంత భయపడితే నిజంగా బాంబే పేలితే గుండె పగిలి చచ్చేట్టున్నారే?" అన్నాడు

ఖాదర్ " అరే బిస్మిల్లా నేల టపాక్కాయలే అంత మోత మోగినయేం? ఎవరుబే చేసుంటారబ్బా?" అని వీపు చరుచుకుంటూ లేచి వచ్చి వాకిట్లో నుంచున్నాడు. పిల్లవాడు మళ్లీ ఒక టపాకాయ పేల్చాడు. ఒకక్షణం చెవులు మూసుకొని గబ గబా పోయి ఆ కుర్రవాడి చేయి పట్టుకున్నాడు. "ఎవరు నువ్వు? ఎవరు చేశారీ టపాక్కాయలు? పద స్టేషనుకు" అన్నాడు మనసులో ఈ టపాక్కాయలెవరో బుంబులు చేసేవాళ్ళు చేశారు. లేకుంటే ఇంత మోత మోగవు. ఆరా తీసి వాండ్లను పట్టుకున్నానా అంటే ఎల్లుండీపాటికి ఇనస్పెక్టరు పని దొరుకుతుంది. రోజులిట్లా కలసి రావాలె' అనుకుంటూ

ఆపిల్లవాడు అతని మొహంకల్లి చుర చుర చూస్తూ "ఎందుకు స్టేషనుకు రైలెక్కిస్తావా? పద పోదాం" అన్నాడు

ఖాదరు“ నీకేం చెతురుగా ఉందే కుర్రోడా! నేనెవరనుకున్నా పోలీసు ఖాదర్ను, కొట్టానా అంటే గింగిరాలు తిరుగుతయి. చెప్పు ఎవరు చేశారో?”

పిల్లవాడు“ చాలు చాల్లే నీవు పోలీసువైతే ఎవరికెక్కువ? కొట్టటానికి నేనేరింట్లో నన్నా కన్నమేశానా? ఎవరు జేబన్నా కత్తిరించానా?నేను మటుకు ఎవరుకున్నా? కాపు మల్లమ్మ కొడుకును. హైస్కూలో శెకండు ఫారం చదువుతున్నా. నాపేరు కోటయ్య”

ఖాదరు“ నీకు కాస్త గోరోజనం మున్నట్టుందే! చెప్పుతావా, చెప్పవా ఎవరు చేసింది టపాక్కాయలు?” అని చేయిచాచి గిట్టిగా చెంప పగిలేటట్టు కొట్టాడు. కోటయ్యకు చెంప చర్రుమన్నది. అయిదేండ్లటినయి. పొంగుబూరెలా పొంగుకొస్తున్నిది. బుగ్గ. కండ్లెంబడి నీళ్లు గిర్రున తిరిగినయి. దెబ్బకు దెయ్యం బారింది. ఇక చెప్పకపోతే లాభం లేదు. ఇంకా కొడతాడనుకొని‘ ‘నేనేం ఎరగనండి, కొట్టవాకండి. మా క్లాసులో పిల్లవాడు నిర్మలరావు చేశాడండి” అన్నాడు గుక్క మింగుకొని గొంతు సర్దుకుంటూ.

ఖాదరు “ అయితే నీకెట్లా వచ్చినయియ”

కోటయ్య “ నాకతనిచ్చాడండి”

ఖాదరు“ అయితే పద అతనెక్కడుండేది చూపించు” అని కొటయ్య చేయి పట్టుకొని లాక్కెళ్ళాడు. అతను పేరయ్యశర్మ గారింటికెదురుగా అగి “ఆపిల్లవాడిక్కడే ఉన్నాడండి. నన్నొదిలిపెట్టండి. మా అమ్మకు తెలిస్తే చమడా లొలుస్తుంది. మీకు దణ్ణంపెడతా నన్నొదిలిపెట్టండి” అన్నాడు.

“విచారించంది ఎట్లా ఒదిలిపెడతాను రాలోపలికి” అని ఇంట్లోకి లాక్కెళ్ళాడు “ఎవరండోయ్ ఇంట్లో?” అని కేకపెట్టాడు, వీధివాకిలి దాటి మధ్య మెరాబాలో నిల్చొని. లోపల పడక గదిలో కుర్చీ మీద కూచున్న శర్మగారు పోలీసు ఖాదర్ను చూసి నివ్వెరపోయినాడు.“ఓరి భగవంతుడా రానే వచ్చాడే పోలీసు ఖాదరు. రాత్రి జరిగిన కథ ఎవరు చెప్పుంటారబ్బా?” అనుకుంటూ ఉండగా, పోలీసు ఖాదరు “శర్మగారూ సలామండి” అన్నాడు శర్మగారు మనసులో బహుశా పండగ మామూలు కొచ్చుంటాడు. లేకపోతే సలామండి అనుకుంటూ మర్యాదగా ఎందుకొస్తాడు అని అనుకొని “ఏమండి ఖాదరు గారు ఏం పని మీదొచ్చారేం?” అన్నాడు బిగ్గరగా.

ఖాదరు “ఏంలేదండీ ఏదో పనిమీదనే ఒచ్చా అని మెల్లగా అంటుండగా

అతను చెప్పేది సాంతం వినకుండానే "ఓహో పండగ మామూలు కొచ్చినట్టున్నారే" అని అతనితో అని "ఎమేయ్ ఎక్కడున్నా? ఒచ్చి ఇనప్పెట్టె తాళంతీసి ఈ పోలీసువారికి పది రూపాయలియ్యి" అని నడింట్లో పని చేసుకుంటున్న సీతమ్మను సంబోదిస్తూ కేకేసి చెప్పాడు. ఇవాళతనికి ఎక్కువ దబ్బిచ్చి పంపిస్తే ఎందుకైనా మంచిది. ఒకవేళ రాత్రి సమాచారం విచారణ కొచ్చినా కప్పిపుచ్చటానికి పనికొస్తాడు. అని మనసులో అనుకుంటూ ఇంతలో ఖాదరు "అయ్యా! నిర్మలరావట ఎవరండి" అన్నాడు పేరయ్య శర్మ "నిర్మలరావా? నా మేనల్లుడే సంగతేమిటి చెప్పవయ్యా" అని వాడేదో అఘాయిత్యం చేసుంటాడు. చెమడాలొలవటానికి సమయం చిక్కింది కదా అని అనుకుంటూ అన్నాడు. ఖాదరు " ఏం లేదండీ ఆ పిల్లవాడు ఇతను కలిసి నేలటపాక్కాయయలు చేశార్ట. అమందుతో పాటు ఇంకా ఎదో మందు వందేమాతరం వాండ్లు బాంబులు చేస్తుంటారని ఊహించి నేలటపాకాయలు చెయ్యటానికి వీల్లేదని సర్కారు వారు హుకుం జారీ చేశారు. ఎవరన్నా చేస్తే పట్టుకొని కేసు పెట్ట మన్నారు." అన్నాడు అయన వంక ఒక పోలీసు చూపు చూస్తూ పేరయ్యశర్మ అప్పుడు గదిలోకొచ్చి ఇనప్పెట్టె తీస్తున్న సీతమ్మతో "చూశావుటే! నీ మేనల్లుడు చేసిన అల్లరి వింటున్నావా? నేల టపాక్కాయలు చేశాట్ట. అన్నీ అయినయి ఇహ ఇంటి మీదికి పోలీసులు గూడ వచ్చేట్టున్నారు. ఎన్ని చెప్పినా వింటావా? వాడ్ని నెత్తికెక్కించుకొని ఊరేగుతుంటివి. పిలువాడ్ని అప్పజెప్పు ఆ పోలీసులకు" అన్నాడు ఆవేశంతో రొప్పుతూ.

సీతమ్మ పెట్టెలో నుండి పదిరూపాయలు తీసి 'ఎందుకబ్బా ఏటా పండక్కి రెండు రూపాయలు ఇచ్చి పంపేది ఈ యేడు పది రూపాయలిచ్చి పంప మంటున్నాడు' పోనీయ్ అట్లాగే ఈ పైకం అతని చేతిలో పెట్టి మా నిర్మలరావు జోలికి పోవద్దని చెబుదాం' అని వెళ్లి రూపాయల బొత్తి మధ్య వాకిలి దగ్గర అరుగు మీద పెట్టి "తీసుకోవయ్యా పోలీసు" అన్నది సీతమ్మ

ఖాదరు కోటయ్యను ఒదిలిపెట్టి "పోఅబ్బాయ్ ఇహెప్పుడూ నేల టపాకాయలు చేయవాకు పో" అని అరుగు మీద రూపాయల బొత్తి చేతికి తీసుకుంటూ ఈ కాలపు పిల్లలంటే పిల్లలు కాదండి, సిసింద్రీ పిట్టలండి. అదేంటంటే ఊరుకోవోయ్ అగ్గిపుల్ల అంటారు మరీ వందేమాతరం, హోం రూలు గోల వచ్చినప్పటినుండి పోలీసులంటే ఇంతింత బుడ్డోళ్ళకి గూడా

అలుసైపోయింది. ఎవర్నీ కదిలించటానికి వీల్లేదు. మమ్మల్ని చూడంగానే వందేమాతరం మనదే రాజ్యం అని అరుస్తారు. ఇట్టా పిల్లకాయలు గూడా ఎదురు తిరిగితే ప్రభుత్వం సాగేదెట్టా? మా డ్యూటీ మేం చేసుకుండేదెట్టా? ఏమోలెండి ఇంతకూ అయ్యగారి దయుండాలే గాని మేం మటుకు మనుషులం కాదుటండీ మాకు మాత్రం పిల్లా మేక లేర్టండి? కాస్త బెదరు పెట్టినా ఆ పసి పిల్లల్నేమన్నా చెయ్యటానికి చేతులెట్లా ఆడతైలేండి మాకు మాత్రం. అయినా ఇంట్లో గూడా కొంచెం భయం చెప్పాలె. నేనేదో ఊరుకున్నా గాని మా ఇనస్పెక్టరు గారైతే మాత్రం అసలు ఊరుకోరు. వృధాగా కొట్లో ఏస్తారు తీసుకెళ్లి." అన్నాడు.

సీతమ్మ " మహా మహా పెద్ద వాండ్లే చేసే నేరాలకు, పాపాలకు మీరేం చేయలేరు గాని ఇక పిల్లల మీదనా మీ అధికారం చలాయించాల్సింది, పిచ్చుక మీద బ్రహ్మాస్త్రం మన్నట్లు? మీ ఇనస్పెక్టరుకు మాత్రం పిల్లల్లేరు? అయన మాత్రం మనిషి కాదూ? పిల్లల్ని కొట్లో వెయ్యటానికి అయనకు మాత్రం చేతలెట్లా ఆడితై. ఎందుకొచ్చినమాట. ఏదో పిల్లలు కాబట్టి ఆకతాయితనానికి ఏ అల్లరి చేసినా, ఒకవేళ నేలటపాక్కాయలు చేసుకున్నా చూసి చూడనట్లు ఊక్కోవాలి గాని, వాండ్ల మీద కారాలు మిరియాలు నూర్తే ఎట్లా? పాపం గదటయ్యా?" అన్నది కొంచెం తీవ్రంగా

ఖాదరు దంగై పోయాడు. ఈ చిన్న ఉపన్యాసం విని "అచ్చా అమ్మా పోయొస్తా దయుంచండి పంతులుగారు సలాం" అని చెప్పి వెళ్లిపోయినాడు. ఆరోజు తను లేచిన వేళ మంచిదని, పదిరూపాయలు ఉత్త ఉడియంగా ముట్టినవని అనుకుంటూ. సీతమ్మ ఇంకా నిర్మలరావు ఇంటికి రాలేదేమబ్బా, ఎక్కడన్నా టపాకాయలు పేలుస్తుంటే పోలీసులు అరెస్టు చేసి కొట్లో వేసుందరు గదా అని అనుకుంటూ మడి కట్టుకుందామని దొడ్లోకి పోయింది. దొడ్డి వాకిలి ఎవరో మెల్లిగా తట్టుతున్నట్లుంటే వెళ్ళి తలుపుతీసింది.

నిర్మలరావు బిత్తరచూపులు చూస్తూ "అత్తయ్యా- అత్తయ్యా" అని అంటున్నాడు.

సీతమ్మ "అయ్యో నాయన ఎక్కడికి పోయినా? ఇదేమిటి ఇట్లా ఉన్నా భూతంలా? ఆ బుగ్గలనిండా మసేమిటి? ఆ చింపిరి నెత్తి నీవు బాగానే ఉన్నావ్?

నిర్మలరావు" అత్తయ్యా! చెప్పటానికి నోరు రావటంలా రాత్రి ఎంత

పనైందనుకున్నా ఉన్నాడా మామయ్య ఇంట్లో?"

సీతమ్మ "ఉన్నాడు తండ్రీ ఆయన వళ్ళంత బాగాలేదు. రాత్రి నాటకాన్నుంచి పొద్దుబోయొచ్చాడు. ఇప్పుడే లేచి కుర్చీలో కూచోనుండగా పోలీసు ఖాదరు కోటాయ్యను పట్టుకొచ్చాడు. నేనెన్ని చెప్పినా వినకుండా నేలటపాక్కాయలు చేశావటగా అని అంటుండగా నిర్మలరావు "అత్తయ్యా నేల టపాక్కాయల మాటట్టా ఉంచు. రాత్రి మామయ్య నాటకానికి పోలో ఏంలా. కాంతమ్మ, తను వాండ్ల దొడ్లో ఒకే మంచంమీద పడుకోనుండగా శాస్త్రిగారు, నేను, ఇంకా ఎంతోమంది చూశారు. నేను వాండ్లింట్లో చెట్టెక్కి కాయలు కోస్తుంటే రాంభద్రాయ చూచి దొంగలు, దొంగలని కేకలేస్తే అంతా పోగైనారు. కావాల్నింటే శాస్త్రిగార్నడిగి చూడు. నేను చెట్టుమీద నుంచి దూకేప్పటికి సరాసరి మామయ్య నెత్తిన బడ్డా. ఇక నన్నాయన బతకనియ్యడు. నన్నెట్లాగన్నా మా ఇంటికి పంపత్తయ్యా. పొద్దుట్నించి ఆ వెంకమ్మ ముండ భర్తం పడదామని వాండ్లింటి దగ్గర పోంచేసుకుంటే ఇంతవరకు ఎవరు ఆ యింట్లో నుంచి బైటికి రాలా" అన్నాడు. అతనామాటలు చెబుతుంటే సీతమ్మ నీరై పోయింది. "అయ్యో, అయ్యో" అని మాత్రం అంటున్నది.

అంతలోకి అప్పుడే వచ్చి వంటి ఇంటి వాకిటి దగ్గర నిల్చోని ఈ సంభాషణ వింటున్న సూరిశాస్త్రిగారు "ఏమండోయ్ సీతమ్మగారూ" అన్నాడు సీతమ్మ ఉలిక్కిపడి బిక్క మొహంతో ఆయన వంక చూచింది.

శాస్త్రి "ఎందుకమ్మా అట్లా దిగిజారి పోతా? మనుష్యమాత్రులు తప్పు చేయకుండా ఉంటారా?" అని ఆమెతో అని, నిర్మలరావును "ఒరేయ్ పిట్టచిన్న కూత ఘనం అని నీవెందుకురా పెద్దవాండ్ల విషయాల్లో జోక్యం చేసుకోవడం పో" అని గదమాయించాడు. ఆమెను వంటింట్లోకి పిలుచుకుపోయి రాత్రి జరిగిన వృత్తాంతమంతా పూసగుచ్చినట్లు చెప్పాడు. "ఇంతకూ ఆయన మటుకేం చేస్తాడు? నీకే పిల్లలు పుట్టినట్లయితే ఆయన మనసింకొరి మీదికి పోయేదా? అన్నాడు చివరకు.

ఈ మాట ఆమెకు కర్ణకఠోరంగా తోచి మెత్తకానుకొని బొటబొట ఏడుస్తూ "ఇంతకు నే బతికుండటం వచ్చిందని" గుండెజారి కూలబడ్డది. శాస్త్రుల వారు కొంచెం సేపు ఏవో ఓదార్పు మాటలు చెప్పి శర్మగారిని పలకరిద్దామని వెళ్ళాడు. శర్మగారు గదిలో ముసుగు తనాయించి పడుకోనుండటం చూసి, ఇవతల నడింట్లో మంచం మీద కూర్చున్న పాపాయమ్మతో " నీకొడుకు

రాత్రి పెద్ద ఘనకార్యం జేశాడు. ఇప్పుడు సీతమ్మతో ఆసంగతి చెబితే ఆమె ఒకటేమైనా ఏడుస్తున్నది. వెళ్లి సముదాయించవమ్మా" అని చెప్పి వెళ్లి పోయినాడు. పాపాయమ్మ పడుతూ లేస్తూ వంటింట్లోకి పోయింది.

శర్మగారు అనుకున్నంత జరిగింది. ఆ శాస్త్రి చిచ్చంటించి పోనే పోయినాడు. అని ముసుగు తెరచి వార చెవి పెట్టి శాస్త్రిగారు పాపాయమ్మతో అన్న మాటలు విని అనుకొని, మళ్లీ ముసుకు మొహం మీదకు మరింత బిర్రుగా తణాయించి కండ్లనీళ్ళు పెట్టుకుంటూ పడుకున్నాడు. నిర్మలరావు శాస్త్రిగారటు పోగానే వచ్చి సీతమ్మ ఏడవటం చూసి భరించలేక అత్తయ్య ఏడుపుకు కారకులైన ఆ వెంకమ్మ ముండ ఇంటిల్లిపాది అంతు నేల టపాక్కాయ లతో ఇవాళ కనుక్కొని రేపు పారిపోదాం అనుకుంటూ వెళ్లిపోయినాడు.

పాపాయమ్మ వచ్చి సీతమ్మ దగ్గర కూచోగానే ఆమె ఏడుస్తూ అత్తగారికి తన కుమారుడు చేసిన ఘనకార్యం చెప్పింది. "అయ్యో ఎంత అప్రతిష్ట పాలైనామే కోడలు" అని సోకాలు పెట్టి ఏడుస్తున్నది. పేరయ్యశర్మ గారిల్లు దు:ఖ సాగరంలో మునిగిపోయింది.

 

ఆరాత్రి మంగమ్మ చాలసేపటికి తెప్పరిల్లుకొని కాళ్ల మీద పడ్డ అప్పల సామి రెండు చేతులు పట్టుకొని " లే అప్పలయ్య లే. బలవంతంగా నీ గొంతు కోసి కట్టన్లే నా బిడ్డని. దానికేం బంగారంటి బిడ్డ. నిచ్చేపంలా కళ్లకద్దుకొని ఏ మా రాజన్నా కట్టుకోక పోతాడా? పిల్ల తెలివికల్డి. చందమామ లాంటి సక్కదనాల్డి. దమ్మాపకుండా అద్దెదు జొన్నలు తొక్కేసే బలం కల్డి. ఈ యేడు కాకుంటే వచ్చే యేడవుతుందిలే పెళ్ళి. లే ! లేవయ్యా!" అని లేవదీసింది.

అతను కండ్ల నీళ్లు తుడుచుకుంటూ "మంగమ్మా నా అటుమంటి పాపిష్టోడికి అండాలసుమంటి పున్నాత్తురాలికి పోత్తేద? పోయొత్తా. బతికి బాగుంటే నా వల్లయిన సాయంసేత్తా. ఆపిల్లను మంచి సిన్నోడికి ముడిగట్టే ఏర్పాటు సేత్తా. బెంగ పెట్టుకోబాకు" అని చెప్పి వెళ్ళిపోయినాడు. తన గుడిశెలోకి వెళ్లంగానే మంచం మీదనుంచి ఇంత మేత తీసి ఎద్దు ముందరేసి. అదే తనకప్పుడు తోడు నీడైనట్టుగా దాని దగ్గరగా మంచం లాక్కొని పడుకున్నాడు. ఎంత ప్రయత్నం చేసినా నిద్దర పట్టటంలా. మనసు ఎన్ని చిక్కాలు పెట్టి బిగించినా ఆగకుండా ఆ కాంతమ్మ మీదకు పరుగెత్తుతున్నది. ఆమె నొకసారన్నా చూడాలన్న బుద్ధి పుట్టింది. మంగమ్మతో అండాలును చేసుకోలేను ఇంకోర్ని

ప్రేమిస్తున్నా అని చెప్పినప్పట్నించి తమ హృదయంలో ఉన్న కాంతమ్మ మీద ప్రేమ కార్చిచ్చులా రగుల్కొని భగ భగ మండి హృదయాన్ని దహించేస్తున్నది.

పొద్దుపోయిందని వాండ్లింటికి పోయినా తలుపుకొట్టిలేపంది ఆమెను చూడటం అసాధ్యమని అప్పలసామికి తోచలా. తనకు పట్టిన ప్రేమ పిచ్చిలో సాధ్యాలేవో, అసాధ్యాలేవో తోచే తెలివిలో లేడు. చివ్వున లేచి. దుప్పటి ముసుగు కప్పుకొని చేతులు వెనుక మళ్ళా మెలేసి పట్టుకొని చల్ల చల్లగా అడుగు లేసుకుంటూ కాంతమ్మ ఇంటి వైపు ప్రయాణమైనాడు. కొంత దూరం పోయి టక్కున ఆగి ఎంత పనికి తలపడ్డాను. ఒట్టుపెట్టుకొని నీ ఊసెత్తనని ఆవిడకు సేసిన శపదం తుంగలో తొక్కి తగుదునంటూ మళ్లీ ఆవిడ్ను సూద్దామని పోతుండానే. అప్పలసామి అబద్దాల కోరు.. మాట తప్పుటోడని అనిపిచ్చుకుంటే దానికన్నా ఊరేసుక సత్తే మేలు గదా. బుద్ధి గడ్డి తిందే ఛా... మల్లా , తప్పుడు ఎర్రిముండా కొడుకా ఎనక్కి మల్లు అని తన్నితానే తిట్టుకొని తన కాళ్ళ మీద తానే ఒక దెబ్బేసుకుని వెనక్కు మళ్లాడు. నాలుగడుగులు వెనక్కేసి మళ్ళీ అప్రయత్నంగా తిరిగి సూరి శాస్తుర్ల వారి యింటి దాకా వచ్చి అటువెనక్కు పోలేక ఇటు ముందుకు పోలేక అక్కడే రోడ్డుమీద అటూ ఇటూ పిచ్చెక్కిన వాడిలా తిరుగుతున్నాడు. పక్కన కుయ్యో అని ఏడుస్తున్న కుక్కను రాయి రువ్వి ఒకటేశాడు. అది తోక ముడుచుకొని కుంయ్ కుంయ్ మంటూ పరుగెత్తి పోయింది.

'అల్లా కుక్కముండ కుండ బుద్ధి నాకేడిది. ఒక్క ఏటుకే ఏడుపు మానేసి లగెత్తింది. కాంతమ్మ నన్నావిడ మరిసి పొమ్మని వొక తూరి సెబితే నాకు బుద్దుంటేగా. ఎనక్కి మల్లి పోదాం అంటే కాలు సాగదిదేందబ్బా? అని అనుకుంటుండగా రాంభద్రయ్య కేకలు వినబడ్డయి. ఓరి దేవుడా ఆకాంతమ్మ గారింటోనే దొంగలు బడ్డది. ఆ పిచ్చిబాగుల్ది దొడ్లోనే పడుకుంటుంది. ఆ దొంగముండాకొడుకులు గొంతు పిసికారో ఏం ఖర్మమో' అని ఎక్కడలేని ఆదుర్దాతో ఒక్క పరుగున వెళ్ల తలుపు పగలదన్ని లోపలికెళ్ళాడు.

కాంతమ్మ కదలకుండా మెదలకుండా ముసుకు తణాయించి పడుకో నుండటం చూసి ఆ దొంగలామె ప్రాణాలెక్కడ తీశారో అని చటుక్కున దుప్పటి లాగి, శర్మ, కాంతమ్మలు బిర్రు కౌగిళ్లలో ఉండటం చూచి నిర్ఘాంత పోయినాడు.

ఇంత పనైం తర్వాత బతికేం లాబం. నా అగ్గంటి పేమ మంటగలిసింది. కాంతమ్మ ఎంతకు తెగించింది. ఎంతమోసానికి తలపడ్డది. వగలేడ్చులేడ్చింది.

పేమించినట్టు నటన సేసింది. నా పేమ జుఱ్రుకుంది. నన్ను నట్టేట్లో ముంచి ఆ పేరయ్యశర్మను సేపట్టింది. ఆడోండ్లను నమ్మగూడదు గందా. శనగలు తింటూ ఉలవలు సేతుల్లో పెట్టే రకం గందా. అప్పలసామీ, నీకోరమీసం, నీ గిరజాలు, నీ కోలముఖం నీబుగ్గలు ఎంత బావుండాయోయ్ నా ఉదయేశ్వరా అని కనుబొమ్మలు విప్పుతూ కయిత్తం చెప్పి నీవు కురిపిన యేడి ముద్దులు సల్లారక తలికే ఆహా ఏమి నీ ఎదల్పాటి రొమ్ము, కండలు బారిన బుజకీర్తులు, నాసామిరంగా ఒక్క తడవ నన్ను కావలించుకో అని నీ కోమలమైన సేతులు నా మెడ మీదేసి నన్ను వరుసుకొని నీకౌగిట్లో నేపొందిన ఆనందం, నీవను బవించిన తీరని బమ్మానందం మరిచిపోక తలికే నిన్నా పాపిష్టి శర్మ సేతుల్లో సూడాల్సొచ్చేగందా. ఇంక బతికేం సచ్చేం ఈ నిర్భాగ్యపోడు అని తలపోసు కుంటూ నిర్మలరావు చెట్టుమీద నుంచి దూకి శర్మ మీద పద్ద గలభాలో విరక్తితో వెళ్ళిపోయినాడు.

ఏ పరిస్థితులలో గూడా ప్రేమించి వలచి పెండ్లి చేసుకుండే అధికారం గాని, మొగుడు పోతే మళ్ళీ పెండ్లి చేసుకుండే హక్కు గాని లేని సమాజంలో పుట్టి జీవంలేని శూన్యమైన ప్రేమ. బాల్య వివాహానికి గురై నిర్భాగ్యవశాత్తు వైధవ్యంలో మునిగి, మానవ సహజమైన మనోచాంచెల్యం వల్ల నిలకడలేని కామోద్రేక జీవితంలోకి దిగజారిన నిర్భాగ్యులు కాంతమ్మ లాంటి కాంతలు, తమ మనో వాంఛలు తీర్చుకునేందుకు అప్పలసామిలాంటి అమాయకపు పడుచువాండ్లను ప్రేమనే బెడదలోకి లాగి వాండ్ల నిర్మలమైన జీవితంతో చెల్లాటాలాడతారని, తమ్ము నిష్కల్మషంగా ప్రేమించిన వాండ్ల ప్రేమను చూరగొని వాండ్ల అలుసు కనుక్కొని అలా ప్రేమించిన వాండ్ల తల మీదనే ఆ ప్రేమను కొరడాలా ఉపయోగించి కోతులవాడు కోతులను ఆడించినట్టు ఆడిస్తారని తెలుసుకోలేక కాంతమ్మ మోసం చేసిందనే వ్యాకులంతో అప్పలసామి అంతులేని ఆవేదనలో పడి కొట్టుకుంటూ ఇంటికి చేరాడు. అతనికి జీవితం వీద మోజు పోయింది. హృదయం ముక్కచెక్కలుగా వక్కలయింది. ఎత్తివేసిన పల్చటి గాజు పెంకులా పొడైంది. అతనిలో నిరాశాజ్యోతి నాలుకలు జాపి ధగ ధగమని వెలగసాగింది. ఈ మాయదారి లోకమనే చీకటి తెరలో చిక్కొని బతికే కన్నా చావు మేలని నిర్ధారణ చేసుకొని తన ఎద్దుకు మళ్ళా యింత మేత వేసి దాని ముట్టె మీద ఒక ముద్దు పెట్టుకొని–

"ఓ ఎద్దా! నీకు నాకు రునం తీరిపోయింది. ఎవరికీ కొరగాని

వాడ్ని. నే బతికుండటం నాకిట్టంలేదు. కిట్టలో పడసావటానికి పోతుండా. నే సత్తే నిన్ను తలుసుకుండే వోండ్లు లేరని ఆ శీనయోండ్లకు నిన్నప్పసెబుతుండా. నన్నెంతో ఇదిగా పేమించిన ఆండాలుకు నా గేపకార్ధంగా నిన్నిచ్చి పోతుండా. నా కట్టానికి ఆదుకొని నాకింత సంపాయించిచ్చినట్టే వాండ్లకు ఇయ్యి. నిన్నోండ్లు నాకన్నా బాగా సూసుకుంటారు. శలవు ఎద్దా పోయొత్తా నిన్నెంతో కట్టపెట్టా. ఎర్రెత్తినప్పుడు వొల్లు తెలియకుండా బాదొదిలిపెట్టా. నో దోసకార్ని. నా తప్పులు సమించు. పాపంతో నిండున్న ఈ లోకాన్నొదిలి పోతుండా. సొరగానికెల్తానో, నరకానికో యాడకెళ్ళినా ఈడకన్నా అనాకష్టంగా బతికేది లేదు గంద. నా బోటి దిక్కులేని పచ్చికి కాంతమ్మ అండ దొరికిందనుకున్నా. ఆ కాంతమ్మ మీదకి మనసు పోయినట్టు ఈ జల్మలో యింకొరికి మీదకి నా మనసు పోలా. అవిడ్ని పేమిచ్చినట్టు అవిడ్ని పుట్టిచ్చిన బమ్మ దేవుడ్ని గూడ పేమించలా. నా జీయితంలో పట్టని పేమిచ్చిన నా మొట్టమొదటి పేమ పురిటిలోనే సంధి గొట్టి పోయినాక నా కేంటికి? మంగమ్మ, చసయ్య సల్లంగా ఉండాలని పోతూ పోతూ అమంగలగిరి పానకాలరాయుడికి మొక్కుంటా. కిట్టలో సత్తే పున్నెం వుంటుందని ఇంకేడ సచ్చినా అతులోరు కిట్టలో పడెయ్యరని, నా పంజీరమంతా ఆ కిట్టమ్మకే దార పోత్తుండా. ఓ కాలికామ్మోరూ, ఆ కిట్టదాకా నడిసి పోయి సచ్చేందకు నా కాళ్లకు సత్తువివ్వండి. నా ఎద్దును నా ఆండాలోండ్లను కాపాడుతుంది. నే మనసారా పేమిచ్చి ఆకాంతమ్మ దోసాలు మన్నించి రచ్చించండి. సుద్ధమైన ప్రేమ కోసం తపించి పొరపాట్లు మాయదారి పేమలో పడి పానాలిడిసిన ఈ అప్పలసామిని" అని కన్నీళ్ళు కార్చాడు. గుడిసె లోపలికి పోయి గూట్లో ఉన్న అముదపు దీవం ముట్టించాడు. కాళికామ్మ వారి పటానికి సాష్టాంగపడి లేచి,ఒక మూలన భూ స్థాపితం చేసి దాచిన రూపాయల ముంత గడ్డి పలుగుతో తొవ్వి బైటికి తీశాడు. అందులో వున్న తన జీవితాస్తి **250** రూపాయలు లెక్కపెట్టి ఒక చింపిరి గుడ్డ సంచిలో మూటగట్టాడు. బయలుదేరాడు.

 

అసలే వెంకమ్మకి గుండెనెప్పి రోగం. సంవత్సరానికి రెండసార్లయినా వస్తుండేది. గోరుచుట్టు మీద రోకటి పోటన్నట్లు శర్మ, కాంతమ్మలను మంచం మీద చూసేప్పటికి సగం చచ్చినట్లయింది. గుండెనొప్పి ప్రారంభమైంది. దానికి తోడు కాంతమ్మ ఈ అఘాయిత్యానికి మరింత చచ్చింది. విరుచుకొని పడటంతో

ఇంకా ఎక్కువైంది.

అప్పుడు వెంకమ్మ విరుచుకొని పడంగానే కాంతమ్మ తల్లిని వూపి చూచింది. ఆమె కొయ్యలాగు బిగసకపోతున్నది. "అమ్మని చంపాన్రాదేవుడా" అని గొంతుకేసుకున్న కొంగుముడి విప్పి లాంతరెత్తి చూచింది. నోటి వెంబడి నురుగు పడుతున్నది. నాడి ఎక్కడో నూతిలో కొట్టుకుంటున్నట్లున్నది. నీళ్ళు తెచ్చి నోట్లో పోసింది. లోపలికి దిగలా. ఆస్పత్రికి చేరిస్తే గాని బతకదని బండి కోసం వీధిలోకి పోయింది. ఒక బండిని కుదిర్చుక్ ఆస్పత్రికి మాట్లాడుకొని తల్లిని తీసుకొని పోయింది. ఇల్లు వదిలిపెట్టదానికి కారణం దొరికిందని నైట్ డ్యూటీ నర్సు దగ్గర సత్రంలో గదికి చీటీ తీసుకొని ఆ బండి మీదనే ఇంటి సామాన్లన్నీ అక్కడికి చేరవేసింది. రాంభద్రయ్యకు చీటీ వ్రాసి మెతుకులు పెట్టి అతికించింది తలుపుకు.

 

మిలటరీ ఆస్పత్రిలో ఏసుదాసును లోపల పడుకోబెట్టి బైట బీడీలు తాగుతున్న వాండ్ల దగ్గరికి వెళ్ళి "పశువుల్లాగున్నారే. ఇక్కడ బీడీలు తాగు తున్నారు. ఆఫీసర్లు వస్తుంటారు. బీడీలార్పండి." అన్నాడు. వాండ్లు బీడీలు ఆర్పారు. అంతలో ఒక అధికారి వచ్చి "మీరు ఇక్కడున్నారేం" అంటే "ఒక సిపాయి పడిపోతే ఏత్తుకొచ్చి లోపలేశాం. డాక్టరుకోసం ఎదురు చూస్తున్నాం." అన్నాడు కోటయ్య. ఆ ఇద్దరూ లోపలికి వెళ్ళి చూస్తే ఏసుదాసు స్పృహ తప్పి ఉన్నాడు. వాండ్లు ఏసుదాసు పొట్టకు బిర్రుగా బిగించి ఉన్న బెల్టు తీసి కాళ్లకున్న బూట్లు విప్పి చొక్క గుండీలు విప్పి మొహం మీద నీళ్లు చల్లితే కొంచెం సేపటికి తెప్పరిల్లాడు ఏసుదాసు. కండ్లు తెరిచాడు.

"ఎందుకు ఇక్కడున్నాను" అన్నాడు ఏసుదాసు. వాండ్లు "ఏంలేదులే కాసేపు పడుకో" అన్నారు. అంతలోకి డాక్టరు వచ్చాడు. ఏసుదాసును పరీక్ష చేసి "ఏం లేదులే ఇతను తెలియక మెద పట్టీలు బిర్రుగా బిగించాడు. ఊపిరాడలేదు. అదీగాక రాత్రి సరిగా అన్నం కూడా తిన్నట్టు లేదు" అన్నాడు ఏసుదాసు లేచి కూర్చున్నాడు.

కోటయ్య "ఎం రాత్రి అన్నం తినలేదా

ఏసుదాసు" ఎందుకిక్కడేశారు నన్ను

కోటయ్య " ఏమీలేదులే. కళ్ళు తిరిగిపడిపోతే ఇక్కడేశాం. అయినా

అంత బిగ్రుగా కట్టుకుంటారా పట్టీలు. కట్టుకోగూడదు మూర్ఛ వస్తుంది."

ఏసుదాసు" ఈరోజుగూడా నాకు భోజనం లేదుకదా. మాంసం నేను తినను. నీళ్ళు తాగి గడుపుతాను."

కోటయ్య" అయితే నీ భోజనం ఏర్పాటు నేను చేస్తాను. ఉర్లగడ్డ కూర చపాతీలు సిద్ధం చేస్తాను. ఏంతైనా మనోడివి. భోజనం చెయ్యకపోతే ఆకలితో చస్తావు"

ఏసుదాసు" చావటానికేగా సిపాయిల్లో చేరేది"

కోటయ్య " మా అమ్మ చావచితక కొట్టిందని కోపంతో వచ్చి ఈ పటాలంలో చేరా. హిందుస్తానీ కొద్దిగా వచ్చు కాబట్టి నెట్టకొస్తున్నా, రేపో మాపో యుద్ధానికి పోవాలె"

ఏసుదాసు "నన్నెపుడు పంపుతారు యుద్ధం చేసేకాడికి? చేతికి తుపాకి తూటాలిచ్చి పేల్చమంటే అడ్డదిడ్డంగా ఎవరైనా పేలుస్తారుగా. ఎందుకు ఇక్కడ కవాతు నేర్పటం. తుపాకి పేల్చటం నేర్పటం. దండగ కదా.

కోటయ్య " వెఱ్ఱివాడా! అన్నీ చక్కగా నేర్చుకుంటే గురి చూసి కొట్టొచ్చు. గుడేటుగా కొడితే మన వాండ్ల మీదికే తుపాకి తిరిగితే యేమౌతుంది. అందుకని ఇక్కడ మూడునెల్లన్నా నేర్పుతారు. తర్వాత ఇంకోదేశానికి పంపిస్తారు. అక్కడింకో మూడు నెల్లు నిజంగా యుద్ధంలో ఎట్లా యుద్ధం చెయ్యాల్సిందీ నేర్పుతారు. అక్కడింకో యుద్ధం జరిగే చోటుకి పంపిస్తారు. అదృష్టముంటే బ్రతికొస్తావ్. లేకపోతే యే కాలో, యే చెయ్యో విరగ్గొట్టుకోనో, కండ్లు పోగొట్టుకోనో, నిర్భాగ్యుడిలాగు తిరిగొస్తావ్. అదీకాకపోతే భూదేవికి ఋణం తీరిపోతావ్."

ఏసుదాసు "అబ్బా! అన్నాళ్ళాగుండటం యెట్లా కోటయ్యా. ఏదో ఒక ఉపాయం చేసి త్వరగా పంపించేట్టు చూడు."

కోటయ్య " వేరే ఏం ఉపాయం లేదు. నీవు తప్పకుండా హిందుస్తానీ భాష నేర్చుకో. లేకపోతే ఇక తెలుగు వాండ్లెవరూ లేరు. నేనూ పోతున్నా."

ఏసుదాసు" నీవు యాడికయ్యా పోయేది"

కోటయ్య "నన్ను గుర్రపుసవారీ తీయటం ఫిరంగులు పేల్చటం నేర్చుకోటానికి పంపుతున్నారు. అక్కడ కొంచెం చదువుకున్నవాండ్లు కావాలి. రెండు రోజుల ఈ ఆస్పత్రిలోనే వుండు. కాస్త ప్రయణపు బడలిక తీర్చుకో.

నేను పోయొస్తా" అని లేచి పోయినాడు.

రెండు రోజులక్కడే వుండి మూడోరోజు ఆస్పత్రినుంచి విడుదలై బ్యాంకాక్ పోతుండగా కోటయ్య వచ్చి కావలించుకొని "ఏసుదాస్, నేను వెళ్ళొస్తాను. బతికి బాగుంటే యెక్కడన్నా కలుద్దాం. జ్ఞాపకముంచుకో. జాగ్రత్తగా వుండు" అని హెచ్చరించి వెళ్లిపోయినాడు.

నెలరోజులు గడిచింది. ఏసుదాస్ కొంచెం హుషారైనాడు. కాస్త హిందూస్తానీ నేర్చుకున్నాడు. కవాతు కూడా పూర్తి చేశాడు. తుపాకితో కాల్చటం నేర్చుకుంటున్నాడు. మొదటిరోజు బోర్ల పడుకుని ఇసుక పోసి కట్టిన గోతం మీద తుపాకి పెట్టటం... గుర్రం లాగటం గురిచూసి కొట్టటం నేర్చుకున్నాడు.

హవల్దారు రెండోరోజు నిజం తూటాపెట్టి వందగజాల దూరంలో ఉన్న నిశానీ చూపించి గురి చూసి కొట్టమన్నాడు. ఏసుదాసు భూజానికి తుపాకి మడిమ ఆనించి జాగ్రత్తగా గురి చూస్తుండేప్పటికి ఎప్పుడు పొరపాటున వొత్తాడో గుర్రా వొత్తాడు. 'ధాం' అని మోత మోగింది. తుపాకీ వదులుగా పట్టుకున్నందువల్ల ఆ మోత అదురుకు తుపాకీ తోపుకు వెనక్కు పడ్డాడు. ఏసుదాసు తుపాకీ మడిమ పక్కన పడుకొని చూపిస్తున్న హవల్దారు మూతికి కొట్టుకొని ఆయన నోట రక్తం పడటం ప్రారంభించింది. ఆయన ఎల్లకిలా పడున్న ఎసుదానును "అరే సువ్వర్.. బద్మాష్" అని నానా తిట్లు తిట్టి బూటు కాలితో తన్ని, చేతి రుమాలు మూతికి అడ్డం పెట్టుకొని ఆస్పత్రికి పోయినాడు.

ఏసుదాస్ పడ్డ పాటుకు తిన్న దెబ్బలకు కొంతసేపటికి కోలుకొని లేచేప్పటికి పెరేడ్ మైదానంలో నరపురుగులేదు. మిట్ట మద్యాహ్నామైంది. అంతా ఎక్కడివారక్కడ క్యాంపులకు వెళ్లిపోయినారు. ఏసుదాస్ కొంచెం నీళ్ళు తాగి ఇక క్యాంపుకు పోతే బతకనియ్యరని మైదానానికి అడ్డంపడి దూరంగా కనబడ్డ రైలు పట్టాల మీదుగా నడిచి దేవలాలీ స్టేషనుకుపోయి ఎప్పుడు రైలొస్తుందా ఎక్కిపోదాం చచ్చేదేదో ఎక్కడనో చావొచ్చు అని ఎదురుగా ఉన్న ముసాఫిక్ ఖానాలో కూర్చున్నాడు.

అక్కడ క్యాంపులో మద్యాహ్నం రోల్‌కాల్‌లో ఏసుదాస్ లేడు. మూతికి కట్టు కట్టుకొని వచ్చిన హవల్దారు మైదానంలోకి పోయి చూడమని సిపాయిలను పంపించాడు. వాండ్లు తిరిగొచ్చి లేదని చెప్పారు. వెంటనే ఒక మెమో "7716

నెంబరు ఎసుదాస్ అను సిపాయి మైదానం నుంచి తప్పించుకు పాయినాడు. కనుక అతన్ని పట్టుకోవడానికి మిలటరీ పోలీసులను పంపి వెంటనే వెదికించ గోర్తాను. అతనికి సుమారు పాతికేండ్లు, చామనచాయ శరీరం. కోలమొహం గడ్డంమీద పెద్ద మచ్చ. హిందుస్తానీ కొద్దిగా వచ్చు" అని వ్రాసి కమాండింగ్ ఆఫీసరు దస్కతు పెట్టించి మోటారు సైకిళ్ల అర్డర్ల నిచ్చి స్టేషన్ దగ్గరికి పంపించాడు. సిపాయిలకు ఏసుదాస్‌ను వెదకటం అంత కష్టం కాల. ఆ మెమో చూచుకోంగానే వాండ్లు ఏసుదాస్‌ను పట్టుకున్నారు.

మి.పోలీస్ "ఎందుకు పరిగెత్తావు"

ఏసుదాస్ "కొట్టిచంపుతారని" అని చెప్పాదు హిందూస్తానీలో "రమ్మంటే వస్తా" అని కూడా చెప్పాడు.వాండ్లు అతన్ని మిలటరీ మోటర్లో ఎక్కించుకొని తీసుకెళ్లి క్యాంపులో అప్పజెప్పినారు. అక్కడ కమాండింగు ఆఫీసరు ముందు విచారణకు పెట్టారు. ఆయన ఎందుకు పారిపోయావంటే హవల్దారు మూతి పగిలి నెత్తురు కారటం తన్ను హవల్దారు తన్నటం... అంతా చెప్పాదు ఏసుదాస్. ఆయన అట్లాపారిపోకూడదని మందలించి తన ఇంట్లోనే ఆర్డర్లీగా వేశాడు. మాంసాహారం కాకుండా శాకాహారం ఇస్తున్నారు.

కమాండింగ్ ఆఫీసరు తన ఆర్డర్లీ ఏసుదాస్ ప్రస్తావన తెచ్చి భార్యతో ఒకరోజు "మనం మాంసం తినమని వాండ్లను బలవంతపెట్టకూడదు. మన మెంత ఉపాయంగా ఎవనితో ఎట్లా మెలగాలో అట్లా మెలుగుతూనే ఇన్ని కోట్లమంది మీద రాజ్యం చేస్తున్నాం ఇన్ని సంవత్సరాలనుంచి" అన్నాడు. ఇంట్లో నౌకరు మాంసం వండకుండా తినకుండా వుంటే చూస్తూ వూరు కోవాల్సిందేనా" అన్నది ఆమె. ఇంకా కోపం చల్లారక "ఈ నల్లవాండ్లను నరికినా పాపంలేదు. వట్టి మూర్ఖులు" అన్నది.

"వాండ్ల దేశంలో ఉంటూ వాండ్ల తిండితింటూ వాండ్లనలా అనకూడదు" అని భర్త అనగానే "మీరు ఇంగ్లాండు వదిలిపెట్టి వచ్చింతర్వాత చాలా ఉదారులైనట్టుందే! కార్మిక నాయకుడు మేక్డోనాల్డ్‌లా ఉన్నారే" అని భార్య అనంగానే "అవును ఈ దేశం వచ్చింతర్వాత వాండ్లు ఈ యుద్ధంలో చేస్తున్న సహాయం చూసిం తర్వాత వీండ్లను బానిసలుగా వుంచటం నాకెంత మాత్రం ఇష్టంలేదు. వాండ్లకు అధినివేశ ప్రతిపత్తయినా ఇవ్వవలసిందే. నేను బ్రతికి బాగుండి మళ్ళీ ఇంగ్లాండు వెళితే కార్మిక పక్షాన్నే పార్లమెంటుకు నిలుస్తా"

అన్నాడు. "అయితే నేను కన్సర్వేటివ్ పక్షాన నిలబడి మిమ్మల్నెదుర్కుంటా నల్లవాండ్లు పశుప్రాయులు. వాండ్లను బానిసలుగా వుంచాల్సిందేనని ఉపన్యాసం చేస్తా" అని నవ్విందామె.

అమె ఒకరోజు "సిపాయీ" అని పిలవగానే ఏసుదాస్ "హాజిర్" అన్నాడు. "ఇదరావ్" అన్నది. ఆమె పెనిమిటి డ్యూటీ మీద బొంబాయి పోతూ రెండు రోజులదాకా రానని చెప్పాడు. బార్యకేమీ తోచటంలా. ఇంట్లో వంటవాడు బజారుకెళ్ళాడు. ఏసుదాస్ మాత్రం ఉన్నాడు. ఆమె డ్రాయింగ్ రూమ్‌లో బల్ల దగ్గర నిల్చున్నది. ఏసుదాస్ "ఎందుకు పిలిచారు" అన్నాడు. "ఇంకా దగ్గరకి రావాలి. మీ నల్లవాండ్లలో కూడా అందంగా ఉన్నారు" అన్నది. ఏసుదాస్ సిగ్గు పడ్డాడు. నీకు తెలుసునా ఒకరంగు వాండ్లు ఇంకో రంగు వాండ్లను ఎక్కువగా ప్రేమిస్తారని! నల్లవాండ్లు తెల్లవాండ్లను తెల్లవాండ్లు నల్లవాండ్లను మోహిస్తారని" అన్నది.

ఏసుదాస్ మనసులో ఇదేంటబ్బా రోజు హారంకోర్, సువ్వర్ అని తిట్టిపోసేదామె. ఇవాళింత అప్యాయంగా అంటున్నదే. అనుకున్నాడు. ఆమెతో "ఫర్మాయియే" అన్నాడు. "యూసిల్లీ యాస్, సంజానహీ" అని వచ్చి గట్టిగా కౌగలించుకొని బుగ్గ మీద ఒక ముద్దు పెట్టి అతని చేతులు పట్టుకొని బల్ల దగ్గరకి లాగింది. ఏస్‌దాస్ నీరైపోయినాడు. పట్టు విడిపించుకొని పారిపోవటానికి యత్నించాడు. "సాహెబ్‌కు బోలేగా" అన్నాడు. "యూఫూల్‌హౌదేర్ రెఫ్యూజ్" అని వచ్చి మళ్లీ గట్టిగా కౌగలించుకోబోయింది. ఏసుదాస్ అట్లా కౌగలించుకో నియ్యకపోతే వళ్లంతా గీసిపెట్టింది.

'ఓ భగవంతుడా రక్షించు' అని కండ్లు మూసుకొని ఒక నెట్టునెట్టి ఒకే పరుగున పరుగెత్తి వచ్చి క్యాంపులో పడ్డాడు. హవల్దారుకు జరిగిందంతా చెప్పాడు. హవల్దారు తన జీవితంలో అలాంటివెన్నో అనుభవించినవాడు కాబట్టి నవ్వి "బేవకూఫ్ దిల్ ఖుష్ కర్నాధా" అన్నాడు. రెండురోజులైం తర్వాత కమాండింగ్ ఆఫీసరు వచ్చీ రాంగానే పెండ్లాం ఆస్పత్రిలో ఉందని చూడటానికి పోయినాడు. కాలు జారి బల్లమీద పడితే తలకాయ పగిలిందని చెప్పింది. ఏడ్చింది. హవల్దారు చలాకీగా ఏసుదాస్ తెలివితక్కువవాడు, అతను మీ ఇంట్లో వద్దని వేరేవారిని పంపాడు.

ఎసుదాస్ ఇంకో నాలుగు నెలల్లో కవాతు, తాపాకీ గురి, హిందీ శ్రద్ధగా నేర్చుకొని నాయక్ అయినాడు. కాంపు కొచ్చి ఆరో నెల పూర్తయిందో

లేదో ఒకరోజు హవల్దారు వచ్చి "నీవు బందర్ అబ్బాస్ వెళ్లాలి. గంటలో తయారవ్వు" అన్నాడు. "అదెక్కడుంది" అని ఏసుదాస్ అడిగేతే "పర్శ్యాలో, ఇవాళ బొంబాయి పోతే రేపు స్టీమర్లో నే వెళ్తాను. అన్నాడు. అక్కడికి యుద్ధం చేసే చోటు ఎంత దూరం" అని అడిగితే "దగ్గర్లోనే" అని హవల్దారు అంతా సర్దుకొని కిట్ పేరెడ్‌కు సిద్ధంగా నిల్చున్నాడు. మృత్యుదేవత నన్నెప్పుడు ఎత్తుకు పోతుందిరా దేవుడా"అనుకున్నాడు ఏసుదాస్ తన పెంపుడు పిల్లి తల చేత్తో నిమురుతూ. ఆపిల్లికి ఏసుదాస్ కు విడదీయరాని అనుబంధం ఉన్నది. మిలటరీలో పై అధికారుల ప్రాపు ఉన్నందువల్ల ఆ పిల్లిని పెంచుకోవటంలో ఏసుదాసు నెవ్వరూ అభ్యంతర పెట్టలేదు.

 

గుంటూరు హైస్కూలులో ప్యాసయిన పిల్లలు కొత్త పుస్తకాలు కొనుక్కుంటున్నారు. తప్పిన పిల్లలు మాస్టర్లను మార్కులు వేయలేదని తిట్టి పోస్తున్నారు. పుస్తకాల షాపులో ఎక్కడ జూసినా పిల్లలే. వంకసూరి శాస్త్రిగారి కుమారుడు రమణయ్య సెకండు ఫారమ్ ఈ యేడాదెట్టో ప్యాసయినాడు. తండ్రి తెలుగుపండితుడు కాబట్టి వాళ్లనాశ్రయించి వీళ్ళ నాశ్రయించి థర్డ్ ఫారమ్‌కు పనికొచ్చే పుస్తకాలు సంపాయించాడు కొడుకు కోసం. కొడుకు "నేనింతా కష్టపడి ఎట్లాగో అట్లా ప్యాసయితే నా మొహానికి పాత పుస్తకాలే గతా. ఇంగ్లీషు పుస్తకమైనా కొత్తది కొనిపెడతావా లేకపోతే బావిలో దూకేదా?" అని గోచీ పెట్టుకొని బావి పిట్ట గోడమీద నిల్చున్నాడు రమణయ్య.

శాస్త్రులుగారు తనకెక్కడ కోపం వచ్చి ఇంకో మాటంటే ఒక్కగాని ఒక్క కొడుకు నిజంగా బావిలో దూకి చస్తాడో అని పెండ్లాన్ని పిలిచి "చూడవే వీడి అఘాయిత్యం. ఈ కరువు రోజుల్లో రూపాయి మిగిలినా మిగిలి నట్లే, వాడికేం సంపాయిస్తాడా పెడ్తాడా. నీవన్నా చెప్పవే, నేను వెళ్తున్నా" అని వాకిట్లోకి వెళ్ళాడో లేదో పోస్టు జవాను "అయ్యా శాస్తుర్లుగారు మీ ఇంట్లో వంకా రమణయ్య ఎవరండి. నాట్ పెయిడ్ ఉత్తరం వచ్చింది. ఓ రెండు అణాలచ్చి తీసుకోండి. "అన్నాడు.

"ఓరి వీడితాడు తెగ. వీడికి ఉత్తరాలు రాసే వాళ్లుకూడా పోగైనారా. సరే, సమయానికొచ్చింది. ఈ మాటింటేనన్నా బావిమీద నుంచి దిగుతాడేమో?" అని దొడ్లోకి వెళ్లి "ఓరేయ్ రమణాయ్, నీకేదో ఉత్తరం వచ్చిందిరా" అని పై విలాసం పెద్దగా చదివాడు.

"ఈ ఉత్తరం మహారాజశ్రీ వంకా సూరిశాస్త్రులుగారి ఇంట్లో శ్రీ వంకా రమణయ్యకు ఇచ్చేది. అరండల్‌పేట, పిచికలగుంట,గుంటూరు - నిర్మలరావు నుంచి

రమణయ్య " ఆ వట్టిదే లేస్తూ"

శాస్త్రుర్లుగారు" వట్టిదేంటి అదుగో వాకిట్లో పోస్టు జవాను. రెండు అణాలిస్తే గాని పోడు. ఈ నాట్‌పెయిడ్ ఉత్తరాలెయ్యటానికి ఆనిర్మలరావెక్కడ దాపురించాడురా ఎవరు ఆ శర్మగారి మేనల్లుడేట్రా?" "నాకు మటుకేం తెలుసు. అయినా వాడికన్నా నాకు వ్రాసేవాళ్ళెవరు "అయితే కొత్త పుస్తకానికి డబ్బులివ్వను సుమా" "లేకపోతే మాన్లే తే నాన్నా ఎన్నాళ్ళకో వాడు నన్ను తలపుకు తెచ్చుకొని ఉత్తరం రాశాడు" అని పిట్టగోడ మీది నుంచి క్రిందకు దూకి తండ్రి చేతులో ఉన్న ఉత్తరం లాక్కున్నాడు. తండ్రి ఇంట్లోకి వెళ్లి రెండణాలుతెచ్చి పోస్టు జవానుకిచ్చి "ఇదిగో ఇక మీదట అటువంటి ఉత్తరాలు తేవాకు. డబ్బు ఖర్చు" అని అతన్ని పంపాడు.

రమణయ్య కవరు చింపి ఉత్తరం చేతికి తీసుకొని 'ఒరే ఎన్ని పేజీలు రాశాడు' అని చదవటం ప్రారంభించాడు. "వంకా రమణయ్యకు ప్రియ మిత్రమా ఎన్నాళ్లనుంచో నీకు ఉత్తరం రాయాలని అనుకుంటూ వుంటే ఇవాళ కొంచెం తీరింది. తలవని తలంపుగా నీ బోటి స్నేహితులందర్నీ వదలి పెట్టి అకస్మాత్తుగా మీకెవరికీ చెప్పకుండా వెళ్ళిపోయానని మీరెంత నొచ్చుకుంటారో నాకు తెలుసు. కానీ నేను గుంటూరు వదలిపెట్టిన పరిస్థితులు అటువంటివి. ఇప్పుడు నేను కేవలం ఇక్కడికి రావటానికి బాధ్యులెవరో, నేనే విధంగా ఇక్కడ వుండి చదువు కుంటున్నానో వ్రాస్తాను.

నేను అనేక కష్టాలు పడి **5-11-1915** కాకినాడ చేరాను. అక్కడి అవస్తులు తీరుతయేమోనని. ఒక కూలివాండ్ల కుటుంబంలో రంగూను పోవటానికి నిశ్చయించుకున్నాను. ఒక మేస్త్రీ ధర్మాన ఏర్పాట్లన్నీ జరిగినవి. ఆ మధ్యాహ్నం నాలుగు గంటలకల్లా రంగూను పోయే స్టీమరు దగ్గరకు మమ్మల్ని తీసుకెళ్ళారు. ఆ సముద్రపు ఒడ్డున కూర్చుంటే అమ్మా, నాయన తలపుకొచ్చారు.

చదువూగిదువూ లేకుండా ఆకానని కంతలకు పోయి చేసేదేమిట్రా భగవంతుడా అని కదుపులోంచి దిగులు పుట్టుకొచ్చి ఏంచెయ్యాల్సిందీ తోచక పోదామని ఒక ఆలోచన వద్దని ఇంకో ఆలోచన పుట్టి కొట్టుకుంటుంటే నాపేరు ఏజంటు గారు పిలుస్తూనే ఉన్నారు. నేను వెళ్లంగానే "నీపేరేమన్నారు'

"నిర్మలరావన్నాను" అయితే తండ్రి పేరన్నాడు. అంతలోకి మేస్త్రీ వచ్చి ఏదో చెవులో ఊదాడు. ఏజంటు నన్ను తేరిపార చూసి "అవతల కూచో" అని వేరే కూచోబెట్టారు. నేనే కుటుంబంతో పోవాలో వాండ్లను కూడా స్టీమరెక్కమని చెప్పారు. నా గుండెలు గుండెల్లో లేవు. మేస్త్రీ అటు ఇటు పరుగెత్తుతున్నాడు. దాదాపు యావన్మంది స్టీమరు ఎక్కిన తర్వాత ఏజంటుగారు నాతో "నీవు బ్రాహ్మణ పిల్లవాడిలాగున్నావ్. నిర్భాగ్యుడా. నీకెందుకు పుట్టిందీ దుర్బుద్ధి. ఆ రంగూను పోయి రిక్షాలు లాక్కుంటావా. మేస్త్రీ నాతో చెప్తే ఇంకెవరో అలగా పిల్లవాడు కదా పోనీ మనకేంలే అనుకున్నా. ముక్కుపచ్చులారని పసికూనవి ఎక్కడికిపోయి ఏమవస్థలు పడతా. రా,తోటి" అని స్టీమరు సాగిన తరువాత గుఱ్ఱపు బండిమీద వాళ్లింటికి తీసుకెళ్ళాడు.అక్కడ నేనాయనకు నాకు తల్లి,తండ్రి లేరని, ఉన్న మేనమామ కాస్తా కలరా వచ్చి చచ్చాడని. ఎక్కడన్నా చదువు కుందామని తిరుగుతుంటే ఎవరూ సహాయం చేయలేదని, కల్పించి ఒక విషాదకరమైన కథలాగు చెప్పా. ఆయనెంతో దయతల్చి భోజనము పెట్టించి "హైదరాబాదులో నా బావమరిది సదాశివరావు, ఉస్మాన్‌గంజిలో బియ్యపు మండిలో వర్తకుల పిల్లలకు ప్రయివేట్లు చెప్పుకుంటున్నాడు. అతనికి నేను ఉత్తరం రాసిస్తా. అక్కడి వర్తకులంతా ఉదారభావులు. నీకేదైనా ఏర్పాటుచేస్తారు. వెళ్ళు. నీవెట్లాగు టిక్కెట్టు లేకుండానే పోతుంటావు కాబట్టి దారి ఖర్చులకు రూపాయిస్తానని, ఇచ్చి ఆయన ధర్మాన పంపారు.

మళ్ళీ రైలెక్కాను. బెజవాడ వచ్చింది. అక్కడ నుంచి నైజాము బండి ఎక్కాల్సింది పొరపాటున గుంతకల్లు పోయే రైలెక్కా. గుంటూరు స్టేషన్ వచ్చినపుడు పోర్టర్లు గుంటూరని అరుస్తుంటే పై బల్లమీదెక్కి ముసుగుతన్ని పడుకున్నా. నాకు ఎక్కడలేని భయం పుట్టింది. ఎవరైనా చూచి మామయ్య గారింటికి లాక్కుపోతారేమోనని మర్నాడు సాయంకాలానికి గుంతకల్లు చేరా. అక్కడ ప్రయాణీకులను విచారిస్తే వాడీ మీదుగా హైదరాబాదు పొమ్మన్నారు. వెళ్లి వాడీ పోయే బండి మీద కూచున్నా. రాత్రి 8గంటలకు రాయచూరు వచ్చింది. టికెట్ కలెక్టరు వచ్చి టికెట్ అడిగాడు. లేదన్నా. బీదవాడ్నన్నా. ఎన్నన్నా వినకుండా చెవు పట్టుకుని గేటు దాకా లాక్కుపోయినాడు. బైటికి నెట్టాడు.

కాకినాడలో ఏజంటుగారిచ్చిన రూపాయిలో అర్ధరూపాయి మిగిలింది. బుకింగ్ ఆఫీసుకు వెళ్లి పక్క స్టేషన్‌కు టెక్కెట్ ఇవ్వమన్నాను. క్రిష్ణా స్టేషన్‌లోనే

బండి ఆగుతుంది. ఇది మెయిల్ అన్నాడు. సరే అక్కడికే ఇవ్వమన్నాను. ఇచ్చి ఐదణాలు తిరిగి ఇచ్చాడు. అర్థరాత్రికి వాడీలో దిగిపోయి థర్డ్‌క్లాస్ వెయిటింగ్ రూములో పడుకున్నా. ఇంతలోకి ఎవరో నన్ను లేపారు. ఇట్లా చూస్తే నల్లని దుస్తులు, పెద్ద గడ్డం. తురకటోపి. చేతులో కర్రవున్న మనిషి కనబడ్డాడు. నన్ను నీవెరని అడిగాడు. దిక్కులేని బీదవాడ్నన్నా. ఎక్కడికి పోవాలె అంటే హైదరాబాదన్నాను. సరే రైలు పోయే వేళయింది. వెళ్లి కూర్చో అన్నాడు. వెళ్లి రైలు పెట్టె ఎక్కి పడుకున్నా. ఇంతలోకి టికెట్ కలెక్టరొచ్చాడు. టిక్కెట్ లేదన్నా. అయితే దిగమన్నాడు. నన్ను తవిడి తనిఖీ చేసి దగ్గరున్న ఐదణాలు డబ్బులు కాజేశాడు. వెళ్లిపో అని వెళ్ళగొడుతుండగా  ఆ నల్లని దుస్తుల, గడ్డపు మనిషి వచ్చి, ఆతురక టిక్కెట్టు కలెక్టరు చెవులో ఏదో ఊదాడు. అతను నన్ను వొదిలి పెట్టి వెళ్లిపోయాడు.

ఈ నల్లని దుస్తుల సాహేబు నన్ను పెట్టెలో ఎక్కించి నిశ్చింతగా పడుకోమన్నాడు. తెల్లవారి 8గంటలకు హైదరాబాదు చేరా. టిక్కెట్ లేనందువల్ల తప్పించుకొని బయటకు పోయటం ఎట్లా అని ఆలోచిస్తుండే లోపల నల్లని దుస్తుల  గడ్డం సాయిబు కనబడ్డాడు. అతని పక్కన ఇద్దరు చింపిరి గుడ్డలు పెట్టుకున్న ఆడపిల్లలు, నల్లని గోచీ పెట్టుకున్న ఇంకో పిల్లవాడు ఉన్నారు. ఆడపిల్లల్ని ఒకచేత్తో ఇంకో చేత్తో మగపిల్లవాడ్ని పట్టుకొని ఉన్నాడు. నన్ను చూడగానే పిలిచాడు. బయటకుపోవటానికి సాయం చేస్తాడు గదా అని వెళ్ళా. ఆపిల్లవాడ్ని పట్టుకున్న చేత్తో నన్ను కూడా పట్టుకొని, గేట్లో గుండా తీసుకెళ్ళాడు. టికెటు కలక్టరు ఒక్క మాటైనా మాట్లాడలా.

నా మనసులో ఇతనెవరో పలుకుబడి కలిగిన పెద్దమనిషనుకున్నా. స్టేషను బయటకు వెళ్లగానే నన్నొదిలి పెట్టమన్నా. నామాట వినిపించుకోకుండా గుఱ్ఱపు బగ్గీ పిల్చాడు. తలుపు తీసి ముందు ఆడపిల్లల్ని ఎక్కించాడు. నన్నెక్కమని చెయ్యిలాగుతుంటే,మా వాళ్లున్నారు. నేను పోతానన్నా. ఇక అతను అదివరలో తెలుగు మాట్లాడిన వాడు తెలుగు తెలియని వాడిలాగా నటించి, "ఛడ్‌బేఛడ్" అని నన్ను ఎత్తి అమాంతం బండిలో వేశాడు. నేను లేవబోతే నా చెయ్యి గట్టిగా పట్టుకుని గుంజి కూచోబెట్టాడు. తను వెనక కూచున్నాడు. బండి సాగింది. అరగంటకు పైగా  పరుగులమీద పోయి, చివరకు ఆకుపచ్చ రంగు వేసిన ఒకపెద్ద గేటు దగ్గర ఆగింది.

ఆగేటుకు పైన అడ్డంగాఒక బల్ల కట్టి ఉన్నది. దాని మీద తెల్లని రంగుతో ఉర్దూ భాషలో ఏమో వ్రాసి ఉన్నది. ఒక వైపు యతంఖానా ఇంకొకవైపు హైదరాబాదీ అని మాత్రం తెలుగులో వ్రాసి ఉన్నది. లోపలి నుంచి పచ్చదుస్తుల భటుడొకడు వచ్చి ఆనల్లగుడ్డల సాయిబును "ఆదాబ్అరజ్" అని వంగి సలా చేసి గేటు తీశాడు. బండి లోపలికి సాగింది. కిందికి దిగారు. మాటోటి వచ్చిన సాహేబు నన్ను దిగమని చెయ్యి పట్టుకున్నాడు. నేను చెయ్యి విదిలించుకొట్టి నేను దిగనని మారాము చేశాను. ఆపిల్లల్ని దించారు. నా కళ్ల గుడ్లెర్రజేసి చూసి "ఉతర్"అని చెయ్యి గట్టిగా పట్టుకొని కిందకు లాగాడు. బండి తలుపు కొట్టుకొని తలకు గూడా దెబ్బ తగిలి నెత్తురు కారుతున్నది. నిర్దయగా చాచి రెండు చెంప దెబ్బలేశాడు. కండ్లు తిరిగి కింద పడ్డా. కొంచెం సేపటికి ఎవరో నన్ను చల్లటి నీళ్లతో కళ్ళు తుడిచినట్లుంది. కళ్ళు తెరిచి చూస్తే, ఒక ముసలి డొక్కు పక్కన కూచొని "కైసాహై బేటా" అంటున్నాడు. అతనికి సుమారు ఎనభై ఏండ్లుంటయి. పొట్టిగా నల్లగా కురూపిలాగున్నాడు. గుండెలకునున్న పిల్లిగడ్డం, పైనా కిందా గొరిగి మధ్యన చారగా పెట్టిన కత్తిరింపు మీసం, తొర్రిపండ్లు, నెత్తిన టర్కీటోపీ, దాని మధ్య బాలచంద్రుడు లాంటి ఇత్తడి గుర్తు, దాని మధ్య ఇత్తడి చుక్క తళ తళ మెరుస్తున్నది.

నేను కళ్లు తెరచి బాగా చూడంగానే "ఫర్వాలేదులే బేటా అల్లా యింటి కొచ్చావు. అల్లాయే నిన్ను కాపాడతాడు. లేచి కల్మా చదువుకొని భోం చేద్దువుగాని పద" అన్నాడు. "నేను బ్రాహ్మణ పిల్లవాడ్ని, నా కిక్కడ తెలిసిన వాళ్ళున్నారు. ఇక్కడ భోంచేయను" అన్నా. ముసలివాడు "దానికేం ఫర్వాలేదు. ఆ ఫకీరు సాహెబు మీకీఅప్పజెప్పాడు. నీకీపోవటానికీ లేదు. ఇక్కడ ఖురాన్ చెప్తాం. అన్నం, బట్టలు, అన్నీ ఇస్తాం. పెద్దయితే నౌకరీ యిస్తాం. అడక్కతినే వాడికి హిక హేమీ కావాలా" అన్నాడు.

అటుఇటు తిరిగి చూస్తే నున్నగా గొరిగించుకున్న బోడి గుండ్లతో, చాలీచాలని చొక్కాలు, చెడ్డీలు తొడుక్కుని తిరుగుతున్న పిల్లలు 16 ఏండ్లకు లోపలి వాండ్లు కనబడ్డారు. అంతా మగపిల్లలే. ఆ ముసలతను గుడ్డకాల్చిన మసి, నెత్తిమీద నెత్తురొచ్చే చోటు వెతికి అద్దాడు. మెల్లిగా రెండు చేతులు పట్టుకొని లేపి, మంగలివాణ్ణి పిలిపించి బోడి గుండు చేయించి, బయటపంపు దగ్గర నీళ్ళు పోసి, "లాహిలాయిల్లిల్లా, మహదల్ రసులల్లా" అని తనంటూ,

నా చేత అనిపించాడు. మంగిలి వాడి ధర్మాన నా గాయం తప్పించి జాగ్రత్తగా గొరిగాడు. తెల్లటి చెడ్డీ, ఒక చొక్కా తెచ్చి ఇచ్చాడు. తొడుక్కున్నా. నా గుడ్డల్లో నుంచి మంత్రాల పుస్తకం, పట్టుగోచీ మాత్రం మెల్లిగా తీసి, అతనటు చూస్తుంటే బొడ్లో పెట్టుకున్నా. లోపలికి తీసుకువెళ్ళాడు.

ఒక పెద్ద భవనంలో కొచ్చి కొబ్బరి తాడల్లిన మంచాలు నూరు దాకా ఉన్నాయి. బెల్లం మీద ఈగలు ముసిరినట్లు ఆ మంచాల నిండా ఈగలే. వాటి మీద చినిగిపోయిన జంపకానాలు, ఎన్నాళ్లనుంచో ఉతక్కుండా ఉన్న దుప్పట్లు ఉన్నవి. లోపలికి పోగానే డోకొచ్చింది. నన్నొక మంచం దగ్గరికి తీసుకువెళ్లి "ఇది నీ మంచం" అని చూపించి, ముసలతను ఇంకో పెద్దకుర్రాణ్ణి పిలిచి నన్నప్పజెప్పి అతను పోయినాడు. ఆపెద్ద కుర్రాడు కాసేపు నాకన్ని చెప్పి చూపించి "ఇక్కడ పడుకోవలె. ఇక్కడ చదువుకోవలె, ఇక్కడ ఒంటేలుకు పోవలె" అని.

కొంచెం సేపటికి గంట కొట్టారు. అతను నన్నింకో హాలులోనికి తీసుకెళ్ళాడు. అక్కడ కింద చాపలు పరిచున్నాయి. వాటి మీద పెద్ద పెద్ద పళ్ళాల్లో మధ్య అన్నం, చుట్టూ పది కుప్పల కూరలేసున్నవి. ఒక్కొక్క పళ్ళెం చుట్టూ పదిమంది పిల్లలు కూచొని నోటితో పీకుతున్నారు. నేను వెళ్లి అతనితో ఒక పళ్ళెం దగ్గర కూచున్నాను. అతను నన్ను తినమన్నాడు. ఆ కూరేమిటి అన్నాను. "మాంసం" అన్నాడు. అయితే నేను తినలేనన్నాను. అతను "నీ మాదిరిగా నేను కూడా పదిరోజులు ఏమీ తినకుండానే ఉన్నా కానీ, ఏం చేసేది? తినక తప్పేదేముంది? తిను" అన్నాడు. ప్రాణం పోయినా తినన్నాను. కదం పిల్లలు, అతను కూడా బొమికలు కూడ నమలటం మొదలుపెట్టారు. వాళ్ళు కూచున్నంతసేపూ నేను కూడా వూరికే కూచుని లేచాను. ఆ పెద్ద పిల్లవాడు చెయ్యి కడుక్కొని నన్ను అన్ని తప్పి చూపిస్తా రమ్మని తీసుకెళ్లాడు.

చుట్టూ పెద్ద ప్రహరీ గోడ. మధ్యలో ముందు భాగం మాత్రం ఒక అంతస్థుమేడ. దానిలోనే పైన సంచాలకుడుంటాడు. క్రింద అతని కచేరి. వచ్చే దర్శకులు కూచొను మధ్య గది, అవతల గదిలో లైబ్రరీ వుంది. వెనక మళ్ళా ఈమేడ కానుకొని రెండు పొడుగాటి భవంతులున్నాయి. చూడటానికి ఎంతో అందమైన స్థలం. ప్రహరీ, ఈ ఇండ్లకు మధ్యమామిడి చెట్లు, జామచెట్లు, అక్కడక్కడ చింత, వేప, మునగ చెట్లున్నవి. గేటు నుంచి మేడ వరకు చక్కని

పూలచెట్లున్నవి, ముందు భాగం ఎంత పరిశుభ్రంగా వున్నదో. వెనక భాగం అంత గలీజుగా వుంది. ఎక్కడ చూచినా ఎముకల కుప్పలు కోడి పెంటలే.

ఆ కాంపౌండు లోపల కోళ్ళు గూడా ఎక్కువగా ఉన్నవి. ఆ పిల్లవాడు ఇవన్నీ ఒక చుట్టూ తిప్పి చూపించి ఒక మామిడి చెట్టు కింద కూచొని "నేను ఒక కంసలి బత్తుని కుటుంబం వాడ్ని. నాలుగు సంవత్సరాలైంది. నేను వీధిలో అడుక్కుందే వాడ్ని, ఆ నల్లగుడ్డల ఫకీరు పప్పులు, బెల్లం పెట్టి మాయ చేసి రైలులో ఎక్కించి ఇక్కడికి తీసుకొచ్చి బలవంతాన వదలిపెట్టి వెళ్లిపోయినాడు. అప్పటి నుంచి ఇక్కడనే ఉన్నాను. ఎట్లాగూ గోకులం చెడిపోయినదిగదా. ఇంటికి పోయి ఈ సంగతి తెలిస్తే వెళ్లగడతారు కదా అని ఇక్కడనే వుండిపోయా. ఇక్కడనుండి ఒకరిద్దరు పిల్లలు తప్పించుకుపోయినారు. కానీ వాండ్లను వెతికి మళ్ళీ పట్టుకున్నారు. లాభం లేదు. నీవు కూడా ఇక్కడే ఉండిపో. ఆకలయి నప్పుడల్లా కాస్త తింటుంటే మాంసం కూడా నోట్లోకి వెన్న పోయినట్లు వెడుతుంది. కాదని చేయగలిగిందేమీలేదు.

ఎప్పుడో సంవత్సరానికొకసారి నవాబుగారి కోటలోకి తీసుకుపోతారు. అక్కడ పలావు అన్నం పెట్టి మంచి గుడ్డలిచ్చి పంపిస్తారు. ఇక్కడికి రాగానే అమంచి గుడ్డలు ఒకటొకటిగా మాయమౌతాయి. పంతుళ్ళు తమ పిల్లలకోసం ఎత్తుకపోతుంటారు. పది యేళ్ల తరువాత ఈ యతింఖానాలోనుంచి బయటకు తీస్తారు. అప్పటికి పక్కా మహమ్మదీయుడ్నిచేసి బయటకు పంపిస్తారు. ఇదంతా ఎట్లా ఉందంటే "మారే మారే ముసల్మాన్ బనాయా" అన్నట్లుంది. నీవు చూడు ఈ ప్రహరీకెళ్లి. ఎంత ఎత్తు గోడలో. ఆ ప్రహరీ కవతల ఆడపిల్లల్ని పెడతారు. మనం మంచి ముసల్మానైనామని వాళ్ళకు తోస్తే అక్కడ్నించి ఒకపిల్లను తెచ్చి పెండ్లి కూడా చేస్తారు. కాబట్టి పిల్లోడా ధైర్యం తెచ్చుకొని ఇక్కడ ఉండిపో" అన్నాడు. నాకు వళ్ళు మండుకొచ్చింది.

ఎట్లాగైనా అక్కడ్నుంచి తప్పించుకుపోవాలని పుట్టింది. అంతలోకి ఆకుర్రవాడు "నీవు భోం చేయలేదు కదా, రా ఆ ప్రహరీ గోడ చుట్టూ దోస చెట్లున్నవి. దోసకాయలు కోసిస్తా" అని తీసుకెళ్ళి నాలుగు దోసకాయలు కోసి ముందరేశాడు.తను కూడా ఒకటి తింటున్నాడు. పక్కనున్న చెట్టు క్రింద కూచొని దోసకాయలు తింటూ తలెత్తి చూచాను. అది చింత చెట్టు. దాని చిటారి కొమ్మలు రెండు ప్రహరీ గోడ మీదికున్నవి. చెట్టు వుపాయంగా ఎక్కి

వాటి చివరలు పట్టుకొని వేలాడితే అవతలికి దూకొచ్చునని తెలిసింది. అవతలి వైపు ఏమున్నదని అడిగాను. "బహుసా రోడ్డే" అన్నాడు. అయితే నీకూ తెలియదా అన్నాను. "ముందు భాగం తోటని తెలుసుగాని వెనుక భాగం నేనెప్పుడూ చూడలా" అన్నాడు. దోసకాయలు తిని ఇంట్లోకి పోయినాము.

కొంతసేపటికి గంట కొట్టారు. ఎందుకన్నాను. "నవాజు" కన్నాడు. "అయితే నేను బయటకు పోయినానని చెప్పు" అని అక్కడే దాక్కున్నాను. సాయంకాలం మళ్ళీ నవాజు గంట కొట్టారు. దానికీ పోలా. సాయంకాలం భోజనం గంట కొట్టారు. పోయి వూరికే కూచొనొచ్చా. అందరూ చదువుకొని పది గంటలకల్లా పడుకున్నారు. నాకు నిద్ర పట్టలా. చాలాసేపు కూచోని కూచొని కునికి పాట్లు పడ్డాను. బాగా నడిజాము దాటిన తర్వాత మెల్లంగా మంచం మీది నుంచి లేచాను. ఒక తడవ బైటికి పోయి చూస్తే అంతా గాడాంధకారం. భయం పుట్టి వచ్చి కాసేపు పడుకున్నా. కాని నిద్ర ఎట్లా పడుతుంది.

తప్పించుకుపోరా నిర్మలా అంటున్నది మనసు. ధైర్యం చేసుకొని లేచాను. నా స్వంత గుడ్డలు వాళ్ళు తీసుకోవటం వల్ల ఆ గుడ్డలే వుంచుకొని బొడ్లో దోపుకున్న మంత్రాల పుస్తకం, పట్టుగోచీ సర్దుకొని పైన దుప్పటి కప్పుకొని సాయంకాలం చూచిన చింత చెట్టు వైపు పిల్లిలాగ చప్పుడు కాకుండా మెల్లిగా చెట్టెక్కి చిటారు కొమ్మకెళ్ళి ఒక కొమ్మ మీద గుండా ఆ కొమ్మ చివర పట్టుకొని వేళ్ళాడి గోడకవతల కొమ్మ వదిలిపెడితే ఏ అఘాతంలోనన్నా పడతానేమోనని మెల్లిగా కిందకు చూచాను. ఏమీ కనపడలా. భగవంతుడి మీద భారం వేసి, ఈ వేళ చస్తే రేపటికి రెండని కొమ్మ వదిలిపెట్టి కింద దభేలున పడ్డా. ఎక్కడా గీరుకున్నా పోకుండా బయట పడ్డానురా స్వామీ అని, అటు ఇటు చూస్తే అదొక పాడుబడ్డ మశీదులాగుంది. ఇక కొంచెం చుట్టు చూస్తే ఇనుపకటకటాల గేటు కనబడ్డది. ఇక్కడ నుంచి తప్పించుకుపోవటం ఎట్లాగురా భగవంతుడా అని తవిడి తవిడి చూస్తే ఆ గేటుకు అడ్డ కమ్ములున్నవి. అ కమ్ముల మీదుగా ఎక్కి అవతలకు దాటా. చూస్తే పక్కనే రెండు గజాల దురంలో రోడ్డున్నది. ఆ రోడ్డున పడి పరిగెత్తితే ఎవరైనా వెంట పడతారని గబ గబ కొంతదూరం నడిచిన తర్వాత రెండెండ్ల బండ్లు కొన్ని ధాన్యపు గోతాలతో అడ్డదోవన పోతున్నవి. వాటిపక్కన చుట్ట కాలుస్తూ నడుస్తున్న ఒక మనిషిని "ఎక్కడకయ్యా" అన్నాను."ఇదిగో ఇక్కడికే ఉస్మాన్‌గంజికి"అన్నాడు. నా అదృష్టం పండిం

దనుకొని "నేను కూడా అక్కడికే" అన్నాను. "ఎవరున్నారక్కడ" అన్నాడు. అక్కడ బియ్యపు మండీలో మావారున్నారన్నాను. "పేరేమన్నాడు" "పంతులు సదాశివరావు"అన్నాను. "ఏందయ్యా పంతులుగారి కేమవుతా. మా లెక్కలు చూసేది అయనే" అన్నాడు. "ఆయన మాకు దూరపు చుట్టం. వాళ్ళింటికి పోవాలన్నా" "ఎక్కు బండెక్కయ్యా" అన్నాడు ఎక్కి కూచున్నా.

కొంచెం సేపటికి ఒక పెద్ద దొడ్లోకి బండి తోలుకెళ్ళి ఎద్దు విడిచి, బండి దింపాడు. బండ్లన్నీ వరసగా దించారు. నాతో మాట్లాడిన మనిషి "ఈడనే పడుకో తెల్లారంగానే పంతులయ్య ఈడకే వస్తాడు" అన్నాడు. నేను పడుకొని నిద్ర పోయినాను. బారెడు పొద్దెక్కి ఎవరో వచ్చి లేపారు. ఆ నల్లదుస్తుల ఫకీరేమోనని ఉలికిపడి లేచి చూస్తే సన్నగా పొట్టిగా ఒక పిలక జుట్టాయన "ఎవరబ్బాయి, నేనెక్కడా చూడలేదే నిన్ను నేనే సదాశివరావును" అన్నాడు. "అయ్యా నేను కాకినాడ నుంచి వస్తున్నాను. మీ బావగారు ఏజంటుగారు పంపారు నన్ను"అన్నాను. "ఓనీవేనా, రానాయన" అని వాళ్ళింటికి తీసుకెళ్లాడు. నిన్ననే వస్తావనుకున్నానన్నాడు. నేను జరిగిన వృత్తాంతమంతా చెప్పాను. విని నెలరోజుల దాకా బయటకు పోకుండా ఇంట్లోనే వుంచి, ఆ గుడ్డలు, దుప్పటి రహస్యంగా తగలేయించి "నీవక్కడ భోంచేయలేదు కనక ప్రాయశ్చిత్తం కూడా అనవసరం. వీధిలోకి పోయినావా పట్టుకుంటారు. వాళ్ల చేతులో పడ్డ వాళ్లందర్నీ వాళ్ళ మతంలో కలుపుకుంటారు. అది అరికట్టటానికి ఎవరి తరమూ కాదు. ఫకీర్లు, టికెట్ కలెక్టర్లు, స్టేషన్‌మాస్టర్, పోలీసు అధికార్లు, వాళ్లవాండ్లు. తురక టోపీ పెట్టే తురకవాడల్లా ఎట్లాగయినా వాండ్ల సంఖ్య పెంచుకోవటానికి మాల, మాదిగ, జోగి, జంగం, అనే తేడా లేకుండా ఎవరు దొరికతే వాండ్లను లాలించి బుజ్జగించి, ప్రేమించి, నయానా భయానా కూడా ముసల్మాను మతంలో కలుపుకుంటారు. ఇక్కడ రాజ్యమే వాళ్ళది కాబట్టి వాళ్ళు పడే పాట్లన్నీ చలాయింపు అవుతవి" అని ఆమండీలో ఉన్న పదిమంది షావుకార్ల కొట్లలో బట్టలు పెట్టి భోజనానికి బియ్యం వసూలు చేసి, నాచదువుకోసం డబ్బు వసూలుచేసి, ప్రయివేటుగా ఈ 7 నెలలు ఇంగ్లీషు, లెక్కలు అవి నూరి పోసి ఈ నెల 1న తారీఖున హైస్కూల్లో వేశారు. ఉస్మాన్‌గంజిలో ఈ బియ్యపు మండి పెద్ద మండి. రోజూ సంతలాగుంటుంది. ఈ మండీలో దాదాపు 50

దుకాణాల దాకా ఉన్నవి. ఇక్కడికి దూరములోనుంచి కూడా రకరకాల బియ్యం వస్తుంటవి. ఇద ఒక పెద్ద దొడ్డిలాగ ఉంటుంది. మధ్య పెద్ద స్థలం వదిలిపెట్టి చూట్టూ కింద కొట్లు పైన ఒక అంతస్థు కట్టి హవేలీలు వేసున్నవి, ఇవి ఏ కాలంనాడో వేసున్నవి. వచ్చే బండ్లకు, పోయేబండ్లకు, విసుగూ విరామంలేదు.

ఈ హవేలీల్లో సాధారణంగా గుమాస్తాల కుటుంబాలు ఉంటయి. మా మాస్టరుగారు కూడా ఒక హవేలీలో ఉంటున్నారు. ఆయనకు పెండ్లి కాలా. వాళ్ల తల్లిగారే ఆయనకు నాకూ వండిపెడుతున్నది. ఇప్పుదు నేనెంతో బాగా చదువుకుంటూ కులాసాగా ఉన్నాను. అమ్మ, నాయన, మాసీతమ్మ అత్తయ్య, మాత్రం ఎప్పుడూ జ్ఞాపకం వస్తుంటారు. నీవూ, కృష్ణుడు, కోటయ్య ఎప్పుడూ కలలోకొస్తుంటారు. మనం చేసిన అల్లరి కూడా జ్ఞప్తికొచ్చి అప్పుడప్పుడు నవ్వుకుంటాను. ఈ ఉత్తరం సంగతి ఎవ్వరికీ చెప్పవద్దు. నేనిక్కడ నాకెవ్వరూ లేరని, నా ఒక్కగానొక్క మేనమామ కూడా పోయినాదనీ చెప్పి కాలం గడుపుతున్నాను. కాబట్టి నరమానవుడుకి నా అడ్రసు చెప్పవద్దు. వెంటనే ఉత్తరం రాయి. అక్కడి సంగతులు తెలియజేయి. ఇట్లు ఎల్లప్పటికి నీ ప్రియమిత్రుడు, నందిపాటి నిర్మలయ్య **7-7-1916**. నా విలాసము ఎన్ నిర్మలరావు, ఫోర్తుఫారమ్, హెచ్.ఇ.ఇ. ది నిజాము్స హైస్కూలు,ఉస్మాన్‌గండి, హైదరాబాదు, దక్కన్.

ఆ ఉత్తరం చదివేటప్పటికి రమణయ్యకు అరగంట పట్టింది. మధ్య మధ్య కళ్ళంబడి వచ్చే నీళ్ళు చేత్తో తుడుచుకుంటూ ఎట్లాగయితేనేం పూర్తి చేసి, ఉత్తరం తీసుకెళ్లి పెట్టెలో పెట్టి పోతుండేటప్పటికి వాళ్ల నాయన వచ్చి "ఒరేయ్ రమణాయ్, పాపం సీతమ్మ తపించి పోతున్నదిరా ఆ నిర్మలాయ కోసం. ఇప్పుదు నేపోయి నీకు ఉత్తరం వచ్చిందంటే తనే రావటానికి సిద్ధమైంది. నీవురావాలా, అకుర్రకుంకని పంపుతాలే అని వచ్చా. పోయి ఎక్కడున్నాడో ఏమిటో చెప్పురా. వాళ్ళ నాయనకు ఆరేదు నెల్ల క్రింద రంగూన్ పోతున్నానని రాశాట్ట. మళ్ళీ ఉత్తరం లేదట. పోయి చెప్పురా నాయనా"

రమణయ్య "నాన్నా అతనెక్కడున్నది, ఏమిటీ ఎవరికి చెప్పవద్దన్నాడు. బతికి బాగున్నాదని మాత్రం ఎవరకైనా చెపుతాను. ఆపైన చెప్పను" అని వెళ్లి తన జాజికాయ పెట్టె సొరుగులో నిర్మలాయ ఉత్తరం భద్రం చేసి పెట్టెకు

తాళం గూడా వేళాడు. రమణయ్య. తాళంచెవి మొలతాడుకు కట్టుకొని పంచె కట్టి, ఉత్తరీయం వేసుకొని సీతమ్మ చెవిన బతికి బాగున్నాడు నిర్మలుడు అని మాత్రం చెప్పటానికి వెళ్ళాడు.

నిరాశ చెంది సీతమ్మ పమిట చెంగుతో కళ్ళు తుడుచుకొని "సరేలే నాయనా! నిర్మలుడు బాగున్నాడని చెప్పావంతే చాలు. కావాల్సింది అదే కదా! ఏజన్మ దుష్కర్మ ఫలితమో నిస్సంతు జీవితం నా నొసటన రాసాడాదేముడు. ప్రారబ్దకర్మఫలం అనుభవించక తప్పదు కదా. చిలిపి చేష్టలకేమి గాని నిర్మలుడు నిప్పులాంటి వాడు. ఇక్కడ వుంటే ఒక ఆడ నలుసును తెచ్చి పెంచి పోషించి వాడికిచ్చి పెండ్లి చేసి ఒక ఇంటివాడని చేస్తే మమ్మల్ను కనిపెట్టుకొని ఇక్కడే ఉంటాడని మా తదనంతరం అపారమైన ఆస్తిపాస్తులు అజమాయిషీ చేసుకుంటూ సుఖంగా బతకుతాడనీ అశపడ్డా. వాడు స్వాభిమాని. ఆ అభిమానం ముందు ఆస్తి పాస్తులు తృణప్రాయంగా తోచి అన్నింటిని కొలదన్ని స్వేచ్ఛ కోసం పరితపిస్తూ వెదలి పోయినాడు. వాడి మామయ్యగారు గూడా పైకి బింకంగా కనిపిస్తారే గాని వాడు వెళ్లిపోయిన తరువాత ఎంతో బాధపడ్డారు. అని గద్గద స్వరంలోనుంచి మాటలు పెగిలిరాక మౌనంగా కూర్చున్నది సీతమ్మ.

రమణయ్యకు బాధనిపించింది. నిర్మలుడు ఎక్కడ ఉన్నది ఏం చేస్తున్నది సీతమ్మగారికి చెబుదామా అని అనుకొని, స్నేహధర్మం కోసం మనసు మార్చుకొని "అమ్మా మీరే అన్నారు గదా నిర్మలాయ నిప్పులాంటి వాడని దూకే జలపాతం గూడా వాటిని ఒక పరిధిలో గీర గీసి వుంచాలనుకోవటం ఎంతటిదో నిర్మలరావును అది ప్రేమబంధమైనా బంధించాలనుకోవటం పొరపాటు వాడు స్వేచ్ఛాప్రియుడు. అనుమానం వద్దు. ఏరోజుకైనా వాడు గొప్పవాడై వస్తాడన్న నమ్మకం ఉన్నది. మీరు మనసు కుదుట పెట్టుకోవాలె. అంతే" అన్నాడు. ఆమె గొల్లున ఏడుస్తుంటే అప్పుడు నిర్మలుడు అడ్రసు చెప్పాడు. చాటుగా వాళ్ల మాటలు వింటున్న పేరయ్యశర్మ గారు దిగులుగా ఒక నవ్వు నవ్వి "ఏలెడంత లేదు రమణాయ సీతమ్మకే సుద్దులు చెబుతున్నాడంటే నవతరం ఎంతగా మారిపోయింది. క్రమశిక్షణను కాఠిన్యమనుకోటమే వాండ్ల లోపం. నా మేనల్లుడి మీద నాకు ప్రేమ లేకనా. అతగాడు కాపాడుకున్నదేమిటి. కాంతమ్మ విషయంలో కంతలు వెతకటం తప్పుకాదూ. మేనమామను కోపతాపం మీద ఒక దెబ్బ వేస్తే లోకం మునిగిందా. దానికింత రాద్ధాంతం అసమంజసం గదూ. అని మనసులో గాడిదెను కనబడనీ నాలుగు మొట్టి

కాయలు వేసి కొడితే తప్పేమిటి అని అడుగాతా" అని మనసులో అనుకున్నాడు.

 

ఏసుదాస్ బందరబ్బాస్ రేవులో నార్మంగ్ స్టీమరు ఎక్కి పిల్లిని ఎక్కించుకొని ఏడెన్ రేవు పట్టణం నాలుగు రోజులకు చేరుకున్నాడు. అక్కడ స్టీమరు ఆగి బొగ్గులోసుకుంటయి. రోజల్లా ఆగి పోతయి. ప్రయాణీకులందరూ ఏడెన్ నగరం చూడబోయినారు. ఏసుదాస్ కూడా బ్రిటిష్ ఆఫీసరుతో వెళ్లదామని పిల్లిని చంకన బెట్టుకున్నాడు. అంతలో ఒక ఆఫీసరు "ఏస్‌దాస్ ఎవరు?" అంటూ పూలమాలలు చేత పట్టుకొని వచ్చాడు. వివరం తెలుసుకొని ఏసుదాస్ ఓడలో పూలహారం వేసి చప్పట్లు కొట్టాడు. ఎవరో ఇదంతా ఏమని ఆకల్నల్ను అడిగితే ఇదంతా జనరల్ రాబిన్‌సన్ గారి ఉత్తర్వుల ప్రకారం జరుగుతున్నది. ఏస్‌దాస్‌ను మేము ఆహ్వానించి ఇక్కడికి పదిమైళ్ల దూరంలో ఉన్న ఇండియన్ సిపాయిల చావణీలో సభ ఏర్పాటు చేశాం. వారిని తీసుకొని వెళ్ళాలి" అన్నాడు. ఒక ఇండియన్ అధికారి ఏస్‌దాస్‌ను కౌగలించుకొని "ఆ జనరల్ రాబిన్‌సన్ గారు మన హిందూ దేశపు సిపాయిల వీరత్వం మారుమ్రోగేలా చేశారు. డామ్ బగ్గర్స్ అన్న తెలివితక్కువ తెల్లదొరలు ఇప్పుడు ఆనోటనే ప్రశంసిస్తున్నారు. మన దేశస్థులు అంట్లు తోమటానికి ఆర్డర్లీలుగా ఉండటానికి తప్ప ఎందుకూ పనికిరారన్న పిచ్చి భ్రమలో ఉన్న వాండ్లు ఇప్పుడు "ఉయ్ లవ్యూ ఇండియన్స్" అంటున్నారు. మనకు బ్రహ్మరథం పట్టి ఎక్కడ్లేని ఆశలు చూపిస్తున్నారు. వీలుచిక్కితే మనతో చేతులు కలిపి షికార్లుకు తిప్పుతూ పొగుడుతున్నారు. ఏసుదాస్ నీబోటి వీరులు హిందూదేశస్థుల యుద్ధ నైపుణ్యాన్ని, సాహసాలను ప్రపంచానికి ప్రదర్శించి చూపించాలి" అని గుక్కతిప్పుకోకుండా హిందూస్థానీలో అని "పిల్లిని వదలి క్రిందకు దిగితే స్టీము లాంచీలో యెక్కి గట్టుకు పోదాం. దిగండి" అన్నాడు.

ఏస్‌దాస్ "ఈ పిల్లిని మాత్రం వదలను. దీనిని చంకన పెట్టుకుని రాబట్టే చెడ్డ శకునమల్లా మంచి శకునంగా మారి నేనంత ధైర్యం ప్రదర్శించగలిగా.

అందరూ దిగి స్టీమ్ లాంచీలో గట్టుకు వెళ్ళి ఆ కొండ పంక్తులలో పరుగిడే తాచుపాములాగు మెలికలు తిరుకుతున్న రోడ్డులో వాండ్లు అయిదు మిలటరీ వాహనాలు ముందుకు సాగినవి. చుట్టూ ప్రకృతి సౌందర్యాన్ని ఏస్‌దాస్ చూపిస్తూ 20నిమిషాలలో చేరవలసిన చావణీకి చేరుకున్నారు. అక్కడ ఎత్తుగా

కట్టబడిన వేదిక మీద యేసుదాస్‌ను కూచోబెట్టారు.

సామ్రాజ్య జెండా ఎగురవేసిన తరువాత సిపాయిల డ్రిల్లు ప్రదర్శించారు. ఒక బ్రిటీష్ ఆఫీసరు, ఒక ఇండియన్ ఆఫీసరు ఏస్‌దాస్ ధైర్య సాహసాలను పొగిడి అతను చేసిన వీర కృత్యం వర్ణించారు. ఏస్‌దాస్‌ను మాట్లాడమనినారు. ఏస్‌దాస్ లేచి నుంచోగానే ఆ 25వేల మంది సిపాయిలు ఆకాశం చిల్లులు పడేట్లు హర్షధ్వనులు చేశారు.

"ప్రియసోదరులారా! ఈ ప్రపంచంలో బ్రతకటం నిరర్థకమనుకొని యుద్ధంలో చస్తే వీర స్వర్గం దక్కుతుందని నేను యుద్ధంలో చేరాను. పెండ్లికి పోతూ పిల్లి చంకన పెట్టుకొని పోగూడదన్నారని ఈ పిల్లిని చంకన పెట్టుకొని చావు తొందరగా రావాలని కోరుతూ బొంబాయిలో స్టీమరెక్కాను. కానీ భగవదేచ్ఛ ఇంకో విధంగా మారింది. మనం చక్రవర్తి కోసం సామ్రాజ్య కోసం మన దేశం కోసం వీరుల లాగు యుద్ధం చేయటమే మన ధర్మం" అని కాళ్ళకు ప్రాకాడుతున్న పిల్లిని చంకనెత్తుకుని కూచున్నాడు. ఏస్‌దాస్. ఆ సిపాయిలంతా ఘొల్లున నవ్వారు. జ్ఞాపకార్థం ఏస్‌దాస్‌కు ఒక కత్తిని సిపాయిలందరి తరఫున చదివించారు.

సభ ముగియగానే అక్కడి ఆఫీసరు కమాండింగ్ వారి బస దగ్గర అల్పాహార విందు చేసి ఏడెన్ నగరం చూడడానికి వెళ్ళారు. మొదటి ఏడెన్ నగరమంటే బొంబాయి లాంటి పెద్ద పట్టణం అనుకున్నాడు గాని ఆ మట్టి గోడల ఇండ్లు, చింపిరి గుడ్డలు కట్టుకుని తిరుగుతున్న జనం ఆ మూల మూతలు లేకుండా చాపల మీద పోసి అమ్ముతున్న మాంసం ముద్దలు చూసి ఆశ్చర్యపోయాడు! ఇదేనా ఏడెన్ అంటే. ఎందుకబ్బా ఈ జనం కూటికి గుడ్డకు ఇంత కరువాచి వుంటే ఈ బీద జనాన్ని లోబర్చుకోటానికి ఇంత పెద్ద యుద్ధాలు చెయ్యటం అని తమ మనసులో అనుకున్నాడు ఏస్‌దాస్. వాండ్లు వెళ్ళి స్టీమర్లో యెక్కారు.

స్టీమరు దారిలో 'జిబూటే' లో మాత్రం ఆగి అక్కడ దించాల్సిన సైన్యాన్ని దించి, మూడోరోజు ప్రొద్దున 7 గంటలకల్లా 'మాయజు' రేవు దగ్గర ఆగింది. ఏస్‌దాస్ అతని గయిడు బ్రిటిష్ ఆఫీసరు దిగి, వారికోసం వచ్చిన మోటారు కారులో యెక్కి ఆ మాయజు కెనాలు కాలువ కట్టన వేసిన రోడ్డు మీద గతుకుల్లో ఎగిరెగిరిపడుతూ రాత్రికి కెయిరో చేరారు. మరుసటి ఉదయం అక్కడ జరిగిన సిపాయిల సభలో ఉపన్యసిస్తూ తన బోటి ఒక చదువురాని

మొద్దుకే ధైర్యసాహసాలను ప్రదర్శించి పైకి రావటానికి అవకాశం వచ్చినప్పుడు ఇతరులకు గూడా అటువంటి అవకాశం వస్తుందని ధైర్యంగా పోండి హిందూ దేశపు పేరు నిలబెట్టమని యుద్ధానంతరం తమ కుటుంబాలన్నింటికీ కడుపునిండా అన్నం వంటినిండా బట్ట దొరకుతుందని తన గయిడ్ చెప్పి వల్లె వేయించిన పదాలే అప్పజెప్పి కూచున్నాడు.

ఆ సభ పూర్తికాగానే విమానాశ్రయానికి వెళ్లారు. అక్కడ ముందు ఒక విమానంలో ఇద్దరు మనుషులనెక్కించి వీపున కట్టుకోనున్న పారాచూట్లు ప్రమాదం వచ్చినప్పుడెట్లా విప్పాలో చూపించటానికి విమానం పైకెళ్ళింది. విమానం సాగ్గానే ఏసుదాస్ ఒళ్ళు జలదరించింది. బుర్...బుర్ మని కొంత దూరం విమానం నేల మీద పోయి గాలిలోకి లేస్తుంటే ఏస్‌దాస్ ఓసీ ఎంత మాయ గరుడపక్షిలాగు పైకి పోతున్నదే అని ఆశ్చర్యంగా చూచాడు.

గయిడ్ ఏస్‌దాస్ నెత్తిన టోపీ పెట్టి కట్టి కళ్ళద్దాలు తొడిగి, వీపున పారాచూటు సంచిని కట్టి ఏస్‌దాస్‌ను తయారుచేశాడు. అతను తనంతట తాను అన్నీ కట్టుకుని తయారైనాడు. విమానం సాగింది. కొంతదూరం పోయిన తరువాత గాలిలో లేస్తున్నది. కొంతసేపటికి బాగా పైకెళ్ళి 'బ్రని' ఘోషపెడుతూ వురవడిగా పోతున్నది.

ఆక్రింద పారే నైలునది, కెయిరో భవంతులు, పెద్ద పిరమిడ్లు కిందకి చూస్తే చిన్న చిన్నవిగా కనబడుతున్నాయి. విమానం ఎక్కానన్న సంతోషంతో వెళ్తున్నాడు ఏసుదాసు. పిల్లిని భద్రంగా తన కాళ్ల దగ్గర ఆ ఇంజను మోతకు భయపడి మెదలకుండా పడుకొని కూరేపాట్లుపడుతున్నది పిల్లి.

వాండ్లా విమానంలో టునీషియా చేరారు. అక్కడ మూడు రోజుల క్రితం హిందూస్థానపు సాయిబుల పటాలం తిరగబడి కొంతమంది తెల్ల సోల్జర్లను ఆఫీసర్లను కాల్చి చంపటం తటస్థించినది. తిరుగుబాటుకు కారణం బర్కతుల్లా అనే సుబేదారును పటాలపు కాప్టను పెరేడు మైదానంలో "సువర్' అని తిట్టి ఒక చెంప దెబ్బ కొట్టటమే. అంతట ఉద్రేకం పుట్టి ఆ పటాలంలోని వాండ్లు ఆయన్ను కాల్చారు. ప్రక్కన పెరేడు చేస్తున్న సోల్జర్లు కాల్పులు జరపటం ప్రారంభించారు. అటు ఇటు చాలా మంది గాయపడి కొందరు మృతి చెందారు. వెంటనే జనరల్ ఆఫీసరు గారికి విషయం తెలిసి విమానాల ద్వారా టియర్ గ్యాసు ప్రయోగించి 5 వేల మంది సిపాయిలను నిరాయుధులుగా చేసి ఛావణిలోని సోల్జర్లను అరెస్టు చేశారు.

అదే విధంగా జోర్డానులో కొందరు తిండి సరిగా లేదని హిందువులకు ఆవు మాంసం, ముస్లింలకు పంది మాంసం పెడుతున్నారని వదంతులు పట్టి వాండ్ల తిరుగుబాటు చేశారని తెలిసి టునీషియాలో అలజడి పుట్టింది. ఏస్‌దాస్‌ను పంపటం వల్ల అల్లర్లు తగ్గుతవన్న వూహతో విమానం మీద అతన్ని తిప్పి ఉపన్యాసాలిప్పించమని లండన్ నుంచి ఆదేశాలు అందినవి.

రాజభక్తిపరులైన ఇండియన్ ఆఫీసర్లతో పాటు సిపాయిల దగ్గరకి వెళ్ళిన ఏస్‌దాస్ వాండ్లతో "సోదరులారా" అని ఉపన్యాసం మొదలుపెట్టగానే సిపాయిలు లేచి "అల్లాహుఅక్బర్" అని కేకలు వేసి "మీఉపన్యాసాలతో మాకు పనిలేదు. జరిగిన అవమానానికి బదులు తీర్చుకుంటాం" అన్నారు.

ఏస్‌దాస్ "నేను కూడా మీ వాడినే. మీరేం చెబితే అది చెయ్యటానికి సిద్ధం. ముందు నా మాట వినండి" అంటే ఒక సిపాయి గొంతెత్తి "ముందుగా మా మాట వింటే తరువాత మీ మాట వింటాం" అన్నాడు. "సరే" అన్నాడు ఏస్‌దాస్. అతన్ని ఉపన్యాసాలు ఇప్పించటం కోసం రప్పించిన అధికారులు మొహాలు చూసుకున్నారు. అంతలో ఆ సిపాయి వచ్చి బల్ల మీద నించోని "ప్యారో భాయియోం మనకు భూములిస్తామని, పెద్ద పెద్ద నౌకర్లిస్తామని ఆశలు పెట్టి మనల్నిక్కడికి తెచ్చిన తెల్ల దొరలు మనల్ని అవమానిస్తున్నారు. మనం హోరాహోరి యుద్ధం చేసి యుద్ధ భూముల్లో ముందుకుపోతుంటే అప్పుడు తెల్లవాండ్లను ముందుంచి ఆ యుద్ధంలో జయం తాము సంపాదించినట్లు ప్రకటించుకున్నారు. మన ఆధ్యాత్మిక ఆచారాలకు భిన్నంగా మనను 'సువర్' అని తిట్టటమే కాకుండా భోజనంలో ఆవు, పంది మాంసాలు వండి వేస్తున్నారు. మనల్ని చీమలుగా చూస్తున్నారు..." అనంగానే "మనమేం చెయ్యాలి" అన్నాడు ఏసుదాస్. "ఎదురుతిరుగుదాం" అన్నాడతను. "ఎవరిమీద ఎదురుతిరుగాదాం? మనకనేక సౌకర్యాలు కలుగజేసి,. మూర్ఖులుగా ఉన్న నాబోటి వాండ్లు చూపిన ధైర్యసాహసాలకు బహుమతులిచ్చి మనల్ని తలి దండ్రులుగా చూసుకుంటున్న వారి మీదనా? మనం వాండ్ల క్రింద తాబేదార్లుగా పనిచెయ్యటానికి ఒప్పుకొని వచ్చింతరువాత వాండ్ల ఆజ్ఞల ప్రకారం మనం నడుచుకోవలసిందే. ఇప్పుడు తిరుగుబాటు చేసి మీరు సాధించేదేమిటి? మీలో కొందర్ని కోల్పోయినారు. వాండ్ల పెండ్లాం బిడ్డలకు తల్లిదండ్రులకు మీరేం చెబ్తారు. ఉద్రేకంలో జరిగిందేదో జరిగిపోయింది. మనం వచ్చిన పని చూసుకోని పోవాలె గాని ఇక్కడ తగవులు పడకూడదు. మనలను పోషించే ప్రభువులకు ఎదురు తిరగకూడదు. మీరు

అంతగా చావాలనుకుంటే ఆ సముద్రంలో పడి చావండి. కానీ తెలివితక్కువ పనులు చేసి ఎందుకు కొరగాకుండా పోవాకండి" అని వచ్చీరాని హిందూస్తానీలో ఉపన్యసించి "అల్లాహో అక్బర్" అని వాండ్ల చేత అనిపించి దిగాడు.

ఆ ఉపన్యాసం ఫలితంగా వాండ్లలో పెండ్లాం బిడ్డల మీద, ప్రమోషన్ల మీద ఆశ ఉన్నవాండ్లు ఆ సభలోనే లేచి చెంపలేసుకొని మాఫీ కోరినారు. కల్నల్ లేచి వచ్చి జరిగిందానికి క్షమాపణ చెప్పి వాండ్లను చల్లబరచి అట్లా శాంతి వాతారణం కలగజేసిన ఏస్‌దాస్‌ను కావలించుకున్నాడు. ఏస్‌దాస్ ఆ పూటకు ఉర్లగడ్డ కూరతో ఆ సిపాయిలతో కలసి భోంచేసి, విమానాశ్రయంలో ఏర్పాటు చేసిన బసకు ఆఫీసర్ల వెంట చేరుకొని విశ్రాంతి తీసుకున్నాడు.

ఆ సాయంకాలమే ఆ పటాలాన్ని అక్కడి మిలటరీ అధికారులు 500 మంది చొప్పున విడదీసి వేరు వేరు యుద్ధ భూములకు పంపించారు. ఉద్రేక పూరితులైన సిపాయిల గుంపును చాకచక్యంగా స్వాధీనంలోకి తెచ్చిన ఏస్‌దాస్‌ను కొనియాడుతూ వారాఫీసుకు తంతి ద్వారా తెలియపరిచినారు.

ఏస్‌దాస్ నిద్రలేచి వసారాలో పడక కుర్చీ మీద కూచోని నా బోటి తెలివి తక్కువ వాడికి గూడా అవకాశం వచ్చేటప్పటికి పెద్ద చదువులు చదవకుండానే అనుభవం వల్ల ఎంత తెలివి పుట్టుకొచ్చింది. ఆ ఎదురు తిరిగి మాట్లాడిన సిపాయి నోరు మూయించాడు. అంటే ఎంత మూర్ఖుడిలో అయినా నివురు గప్పిన నిప్పులా దాగి వున్న శక్తులు, ధైర్యసాహసాలు తెలివితేటలు పెగలించుకొని బయటపడతాయి గదా సమయం వచ్చేటప్పటికి. లేకపోతే ఎక్కడో గొడ్లు తోలుకు బతికే వాడినే నాకు ఈ గౌరవాలేమిటి, ఈ సన్మానాలేమిటి ఈ విమాన ప్రయాణాలేమిటి? ఇవన్నీ గూడా నాలో ఏక్కడలేని తెలివి పుట్టుకొచ్చి ఆ జనరల్ గార్ని రక్షించి, ఈ సభలో ఉపన్యాసమిచ్చి వెర్రికేకలు వేసి కాస్త తెలివిగా నటించునందుకేగా అనుకున్నాడు.

ప్రక్కగదిలోకి వెళ్లినపుడు బ్రిటిష్ ఆఫీసరొకదు 'చూశావా ఏస్‌దాస్ ఎంత అన్యాయమో. 'జోర్దాక్సు' లో ఇక్కడికన్నా తీవ్రంగా సిపాయిల తిరుగుబాటు చేశారు. తుపాకులు వశపరచుకొని కనపడ్డ బ్రిటిష్ ఆఫీసరు నల్లా కాలుస్తున్నారు. వాహనాలు తగలబెటుతున్నారు. మత విశ్వాసాలను అడ్డం పెట్టుకొని అభాండాలు వేస్తూ రెచ్చగొడుతున్నారు. అట్లాగే గతంలో నానాసాహబబ్, తాంతియాతోపే, లక్ష్మీబాయి బ్రిటిష్ వాండ్లు భారతీయ సిపాయిలకు ఆవు కొవ్వు, పంది కొవ్వులతో తూటాలు తయారు చేసి యిస్తున్నార్న వదంతలు పుట్టించి తిరుగుబాటుకు

ప్రేరించి ఏం సాధించారు? సైన్యాలను మా మీదికి నడిపించి ఘోర యుద్ధం చేసినా ఓడిపోయారు. అప్పుడు మా రాణిగారు ఉదారంగా మీ మత ధరామ్మలలో మేము జోక్యం చేసుకోము. సిపాయిలుగా ఉండి కూడా ఎవరి మత ధర్మాలను వాండ్లు నెర వేర్చుకోవచ్చు అన్నారు. అప్పుడు శాంతి వాతావరణం నెలకొన్నది. దేశమంతా మాకు స్వాధీనమైంది. మా ఉప్పుతిని మా మీదనే తిరగబడటం న్యాయమా, నువ్వేచెప్పు" అన్నాడు.

ఏస్‌దాస్ "ఏం చెప్పమంటారూ? బలపరాక్రమాలతో ఎవరిని లొంగ దీసినా ఎక్కువ రోజులు లొంగి వుండరు. ప్రేమతో ఎవరి హృదయాలు మనం వశపరచుకున్నా వారు మనకోసం పడిచస్తారు. ఇది సాధారణ మానవ ధర్మం, మీరు వాండ్లను నన్నిపుడు చూస్తున్నట్లుగానే చూచి మీ లోటుపాట్లు దిద్దుకొని వాండ్లను ప్రేమతో జయించి మీ పక్షం విడిపోకుండా చూసుకోవటం మంచిది. నా శాయశక్తులా నేను మీకు తోడ్పడుతా. ఎలాగూ ప్రాణానికి తెగించి వచ్చిన వాణ్ణి. మీకు నా ప్రాణం అర్పిస్తా.

ఆఫీసరు "సెబాష్ ఏస్‌దాస్ మీబోటి బుద్ధిమంతులు లోకంలో వుంటే సూర్యుడస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యం శాశ్వత బ్రహ్మతుల్యంగా ప్రపంచంలో దీటీలాగు వెలుగుతుంది. నీవు చెప్పినట్లు ఎలాగో వాళ్ల మధ్యకు వెళ్లి వుపాయంగా వాండ్లను మన పక్షానికి తిప్పటానికి ప్రయత్నించాలి. వాండ్ల నాయకులను ప్రేమతో జయించి మన పక్షానినెట తిప్పానా అంటే చక్రవర్తిగారు మీకింకా పెద్ద హోదా ఇస్తారు."

ఏస్‌దాస్ "నాకింకా పెద్ద హోదా ఎందుకులేండి. ఇక్కడెలా చొరవ చేసుకొని ఉపన్యాసమిచ్చానో అక్కడ కూడా అట్లాగే ఇస్తా. నా ప్రాణం పిడికిట్లో పెట్టుకుని వాండ్ల మధ్యకు పోయి మీ పక్షాన వాదిస్తా. ఇంతకన్నా ఏం చేయ గలను? వాండ్లిప్పుడు అక్రమించుకున్న స్థలానికి దగ్గర్లో నన్ను దింపితే వాళ్ల మధ్యకు పోయి కార్యం నెరవేర్చుకొని వస్తా"

ఆఫీసరు "నేను అక్కడ పరిస్థితులు తెలుసుకొని వస్తా. అప్పుడు మనం యెలా ముందుకు పోవాలో వ్యూహం రచిద్దాం."

అతను వెళ్లిపోయిన తరువాత ఏస్‌దాస్ మళ్లీ పడక కుర్చీలో పడుకొని ఇదేమిటబ్బా ! శివాజీ వీరుడ్ని ఝాన్సీ లక్ష్మిబాయిని తూలనాడేడే అతను! ఈ తెల్లవాండ్లు మన వాండ్లను మర్యాదగా చూడక పోవచ్చు. జర్మను ఫిరంగులకు మేతగా నల్లజాతుల సిపాయిలను ముందు నెడుతుండవచ్చు. వీండ్ల దేశాలలో

మేకలు తక్కువ కాబట్టి పందిమాంసం, గోమాంసం, పెడుతుండవచ్చు. 'దేవలాలీ'లో నన్నా దొరసాని యెప్పుడూ కసురుతూ మొహం చిట్లించుకొని చూసినట్లు నల్ల సిపాయిలను తెల్ల ఆఫీసర్లు, సోల్జర్లు ఏవగింపుతో చూస్తుండవచ్చు. లేకపోతే ఇన్ని తిరుగుబాట్లు ఎందుకు జరుగుతాయి? జర్మన్ ఏజంట్లు ఎట్లాగూ పురిగొల్పుతారు. వీండ్ల ఆక్రమిత దేశాల్లోకి వాండ్లెట్లా రాగలుగుతున్నారూ? వీండ్ల వల్ల పొరపాట్లు జరగటం వల్లనేకదా. వాండ్ల అధికృత కాపాడానికి నల్లజాతులు ఎందవల్ల వచ్చి పోరాడాలో నాకు అర్థం కాలా! మర్మం విప్పి చెప్పేవాండ్లెవరూ? ఇదంతా కట్టుకథలాగుంది. అనుకుంటూ కునికిపాట్లు పడుతున్నాడు. కొంచెం దూరాన కారు ఆగింది. అందులోనుంచి ఇద్దరు స్త్రీలు తన వైపు వస్తున్నారు. వాండ్లు దగ్గరికి రాగానే లేచి నిలబడి 'సలాం' అన్నాడు.

నడివయసు దాటిన స్త్రీ స్వచ్ఛమైన హిందూస్థానీలో "మేమిద్దరం యుద్ధ వార్తలు పంపించే విలేఖర్లం. నాపేరు మిస్ మేరీ. నేను మీ దేశంలో చాలా కాలమున్నాం" అని చేయి చాచి కరస్పర్శ చేయబోయింది. ఎస్‌దాస్ రెండు చేతులు ఎత్తి నమస్కరించాడు. ఆమె అతని చేయి పట్టుకుని కరస్పర్శ చేసింది. "మీ దేశంలో మాదిరి మా దేశంలో ఆడవాండ్లను చూసి సిగ్గుపడకూడదు. మీరు లండన్ వెళ్లినప్పుడు మా రాణిగారు కూడా కరస్పర్శ చేస్తారు." అన్నది.

"నాకు స్త్రీలను చూస్తే బహు బిడియం. ఇటువంటి మర్యాదలు నాకు తలకెక్కవు" అన్నాడు ఏస్‌దాస్

మేరీ "మరచిపోయా. ఈమె మిస్ వారన్. ఈమెకు కొంచెమే హిందూస్థానీ వచ్చు

ఏస్‌దాస్ " అంత చిన్నపిల్లలా ఉంది. ఉద్యోగం చేస్తున్నదా?"

మేరీ "ఈమెకు 15 ఏండ్లున్నవి. చిన్నపిల్లేం ఖర్మ. ఈ యుద్ధ సమయంలో మగవాళ్లందర్నీ యుద్ధంలోకి దింపి వాండ్ల స్థానాలన్నీ మేమా క్రమించుకున్నాం. మీరు లండన్ వెళ్ళిన తరువాత గాని మా పరిస్థితులు మీకు అర్థం కావు."

ఏస్‌దాస్ వాండ్లకు కుర్చీలు తెచ్చివేసి వాండ్లు కూచున్న తర్వాత తనూ కూర్చున్నాడు. మిస్ వారన్ నోటు పుస్తకం. పెన్సిలు పట్టుకుని "ఏస్‌దాస్‌గారూ మీపుట్టు పూర్వోత్తరాలు కొంచెం చెప్పండి. రాసుకొని మేం పత్రికలకు పంపాలి" అన్నది.

ఏస్‌దాస్ "నేనొక దిక్కులేని పక్షిని. నాకీ ప్రపంచంలో నా అనే వాండ్లెవ్వరూ లేరు. జీవితం మీద విరక్తి పుట్టి యుద్ధంలో చస్తే వీర స్వర్గమని బెజవాడ నగరంలో పదినెల్ల క్రితం సిపాయిగా చేరా. తర్వాత విషయాలు మీకు తెలుసు"

మేరీ " మీకు పెళ్ళయిందా"

ఏసు "అబే కాలా"

మేరి " ఏమైనా చదువుకున్నారా?"

ఏసు "పెద్ద బాలశిక్షదాకా"

మేరీ "ఈ యుద్ధంలో ఎవరు గెలుస్తారని మీ ఊహ

ఏసు " ఎవరి అదృష్టం మంచిదైతే వాండ్లు"

మిస్‌వారన్ "మా సామ్రాజ్యంలో మీ వాళ్లు సుఖంగా ఉంటున్నారా?"

ఏసు "అంత పెద్ద ప్రశ్నకు సమాధానం చెప్పలేను"

మిస్‌వారన్ " మీదేశంలో జరుగుతున్న వందేమాతరం ఉద్యమం వల్ల మాకు వచ్చే సప్లయిలకేమన్నా లోటు జరుగుతుందా?

ఏసు "వందేమాతరం అని కుర్రకుంకలు గోడలమీద రాసినంత మాత్రం అడ్డమేముంది. కూటికి లేని వాండ్లు కోటానుకోట్లున్నారు. పట్టెడన్నం జానెడు బట్ట ఇస్తే ఏ అగ్గిలో దూకమన్నాదూకుతారు."

మిస్‌మేరీ "బిసెంటమ్మగారు చెప్పినట్లు మీ దేశానికి హోంరూలిస్తే మీలో మీరు కొట్టుకొని చావరా?"

ఏస్ "ఇది కూడా నాకు అర్థంకాని ప్రశ్న"

మిస్‌వారన్ "అయితే కొట్టుకుచావటం నిజమని రాసుకుంటా"

ఏస్ "నాకు తెలియందానికి మీరేం రాసుకుంటే నాకేం"

మిస్‌వారన్ "మా పరిపాలన మంచిదికాదని హోంరూలు వాండ్లు అన్నట్లు ప్రజలు అంటున్నారా"

ఏసు "నాకెలా తెలుస్తుంది"

మిస్‌వారన్ " అయితే మీ ప్రజలంతా మాపాలనలో చాలా సంతృప్తిచెంది యున్నారని వ్రాసుకుంటా"

ఏసు "ఎవరికి సంతృప్తి వున్నా లేకపోయినా నాకు మాత్రం ఈ విమానాల్లో తిరుగుతుంటే మీబోటి దొరసానులు గౌరవిస్తుంటే సంతృప్తిగానే వుంది."

అంతట మిస్ మేరీ సెలవు తీసుకొని వెళ్లి కారులో కూర్చుంది. మిస్ వారన్ మాత్రం కూచొని నోట్‌బుక్‌లో ఏస్‌దాస్ ముఖచిత్రం గీచి అతనికి చూపెట్టింది. ఏస్‌దాస్ ఆశ్చర్యపోయాడు. మనసులో ఎంత గొప్ప చిత్రికారిణి ఈమె. కాసేపట్లో నా చిత్రం గీచింది. అనుకొని " బాగుంది"అన్నాడు.ఆమె సెలవు తీసుకొని వెళ్లింది.

కొంతసేపటికి ఆఫీసరు వచ్చి "ఏర్పాట్లు చేశాను. రేపు తెల్లవారు ఝామున మన మిక్కడ్నుంచి పయనమై పోతే, పది గంటలకల్లా నీవు దిగాల్సిన చోట దింపుతాం. ఇదిగో పటంలోకి తొంగి చూడు. ఇది నీవు దిగాల్సిన స్థలం అని గుర్తు చూపించాడు. "మనం కైరోలో బయలుదేరేముందు ఇద్దరు మనుషులు ఎట్లా ఆ విమానం మీద నుంచి దూకారో అట్లా దూకాలి. బైటినుంచి తపాకులు కాల్చి వాండ్లను జయించేకన్నా లోపల ప్రవేశించి తొలిస్తేనే మంచిది. సిపాయిలను నిరుత్సాహపరచి నాయకుల నుంచి విడదీసే ప్రయత్నం చేయాలి. ఈ లోపల వాండ్లకు నేను ఆహార పదార్థాలు విమానాల ద్వారా వేయిస్తాను. మీరు వాండ్లకు హింది, గురుముఖి, ఉరుదు భాషల్లో మీ లోటుపాట్లు మేం తీరుస్తామని హామీ ఇవ్వండి. వాండ్ల అసంతృప్తికి కారణం తెలిపితే మా తప్పులు సవరించుకుంటామని చప్పండి. మందుగుండు సామాను వృధాచేస్తూ వాండ్ల ప్రాణాలు తీయటం మాకు ఇష్టంలేదని తెలపండి. వాండ్ల కోరికలు నెరవేరుస్తామనండి. జర్మను గూఢచారుల దుష్ప్రచారానికి గురై తండ్రిలాగ చూసుకుంటున్న చక్రవర్తి గారి మీద తిరుగుబాటు చేయటం మంచిదికాదని, మత ధర్మాలకు విరుద్ధమైన ఆహారపదార్థాలు ఇవ్వమని అభయమివ్వండి" అని చెప్పి అదే విషయాలు ముద్రించిన కరపత్రాలు విమానం ద్వారా కురిపిస్తామని కూడా చెప్పాడాయన.

 

తన పెంపుడు పిల్లితో సహా ఏసుదాస్ ఎక్కిన స్టీమరు ఏడెన్‌కు పయనమై 'ఖుషైర్' రేవులో దించాల్సిన వాండ్లను దించి కదమ వాండ్లను ఏడెన్‌కు చేర్చింది. స్టీమరు ఏడెను రేవు దగ్గర ఆగంగానే పిల్లలు మొండి మొలలతోను, స్త్రీ పురుషులు గుండు మొఖాలతోను వచ్చి సిపాయిలు విసిరే చిల్లర నాణాల కోసం ఎగబడుతున్నారు. అక్కడి వాండ్ల శరీరం పచ్చని పసుపు రంగులో వుంటవి. కొండ ప్రాంతాలలో వుండే వాళ్ళు ఇంకా బాగుంటారు. చలికాలంలో

వాండ్ల బుగ్గలు ఎర్రబారి దొండపండ్లలా గుంటవి. మాంసం నిప్పుల మీద కాల్చుకొని తింటుంటారు.

స్టీమర్లలోని ఒక స్టీమరులో జనరల్ గారు వచ్చినందుకాను వారి గౌరవార్ధం 21 ఫిరంగి మోతలు మ్రోగించారు. ఏసుదాస్ ఆ మోతలకు చెవులు మూసుకొని రావటంతోనే యుద్ధం మొదలయిందనుకొని ఓ సిపాయిని అదే అడిగాడు. విషయం తెలిసి "ఇన్ని మందుగుండ్లు గాలిలో పేల్చి పాడుచెయ్యట మెందుకబ్బా" అన్నాడు.

జనరల్ గారితో పాటు వారికోసం ప్రత్యేకంగా ఖాళీ చేయబడ్డ ఒక పెంకుడు భవంతి బంగళాకు ఏస్‌దాస్ కూడా వెళ్లాడు. అతనికోసం ఒక్క చిన్న పాకలో మంచం, పరుపులతో సహా అమర్చారు. ఆ సాయంకాలం జరిగిన పెద్ద పెరేడులో ప్లాటుఫారం మీద జనరల్‌గారితో సహా పెద్ద పెద్ద ఆఫీసర్లు కూర్చున్నారు. ఏస్‌దాస్‌కు కూడా ఒక కుర్చీ ఇచ్చారు. రాజు తల్చుకుంటే దెబ్బలకు కొరవా అన్నట్లు జనరల్ తలచుకుంటే ఏస్‌దాస్‌ను ఎంత పెద్ద వాడి నైనా చెయ్యొచ్చు. ఆ జనరల్ రహస్యంగా బంగళాలో కూడిన యుద్ధవార్త విలేఖరులకు, ఆఫీసర్లకు, అమాయకపు ఏసుదాస్‌ను ఒకపెద్ద వీరునిలా పరిచయంచేసి, హిందూ దేశపు సిపాయిలు కూడా ప్రదర్శించి ఏసుదాస్ ధైర్యసాహసాలను చెప్పి పొగిడినాడంటే ఇతర సిపాయిలక్కూడా అతని మాదిరి ధైర్యంగా పెద్ద ఆఫీసర్లను రక్షించాలని ప్రాణాలు ధారపోసయినా యుద్ధం గెలవాలనే కాంక్ష వాండ్లకు కలిగించడమే. గొప్పబిరుదులు సంపాయించాలన్న పట్టుదలతో ప్రాణాలకు తెగించి యుద్ధం చేస్తారన్నది మాత్రమే.

తమ దేశం కాని బ్రిటిష్ సామ్రాజ్యం కోసం పోరాడటానికి తామిస్తున్న జీతాలు ఆకర్షణీయం కాదు. పోనీ ఏ గొప్ప స్వాతంత్రేచ్ఛతోనో, ఆదర్శం కోసమో జరుగునున్న పోరాటం కాదు. హిందూదేశంలో హెూంరూల్ కావాలని చేస్తున్న ప్రచారం వల్ల తమకు లాభంలేదని ఈ యుద్ధంలో పాల్గొనకూడదని, బ్రిటిష్ వారి యుద్ధాలు తమ దేశాల రక్తం, స్వాతంత్ర్యధన ప్రవాహంగా ధారపోసి గెలిచినందువల్ల మరి కొన్ని సంవత్సరాలు తాము బ్రిటష్ సామ్రాజ్యం క్రింద బానిసలుగా వుండటానికి తోడ్పడటం తప్ప ఇంకోటి లేదనే జ్ఞానం హిందూ దేశస్తులకు కలుగుతున్నది కాబట్టి ఇటువంటి ఏసుదాస్‌లను అక్కడక్కడ ఏరి వాండ్లు కొంచెం ధైర్యం ప్రదర్శించినా గోరంతలు కొండంతలుగా ప్రచారంచేసి వాండ్ల దేశనాయకుల యుద్ధానికి సహాయం చెయ్యగూడదని చేస్తున్న ప్రచారం

అరణ్యరోదనగా చేయవచ్చును కాబట్టి వాండ్లు ఏస్‌దాస్‌ను పెద్ద కొండమీది కెక్కిస్తున్నారు.

ఏస్‌దాస్‌ను ఆ సాయంత్రం జరిగిన సిపాయిల సమావేశంలో మాట్లాడిన అఫీసర్లంతా ఇంద్రుడు, చంద్రుడు అని పొగిడి వీరుడనే బిరుదు నిచ్చారు. ఇండియన్ డిస్టింగ్విష్ మెడల్‌కు రికమెండు చేశామన్నారు. ఏస్‌దాస్‌ను జవేదారు హొూదా యిచ్చామన్నారు. బ్రిటిష్ రాజ్యంకోసం, దేశంకోసం, ప్రాణాలకు తెగించి పనిచేసే ఏస్‌దాస్ వంటి సిపాయిలు ఆర్థింకంగా ఎక్కువ జీతాలు పొందగలిగే హోదాలోకి పోవటమే కాకుండా సూర్యుదస్తమించని ఈ సామ్రాజ్యంలో పేరు ప్రతిష్టలు సంపాయిస్తారని, డిస్టింగిష్ మెడల్ స్వయంగా జార్జి సార్వభౌముల వారి చేతల మీదిగా ఏస్‌దాస్ దుస్తులకు తగిలింపబడునని రెండు నెలల లోపే అందు ఏస్‌దాస్ ఇంగ్లాండుకు వెళ్ళుతాడని చెప్పారు.

ఆరోజు జనరల్ రాబిన్‌సన్ గారు లండన్ వార్ ఆఫీసుకు పంపిన డిశ్ఛార్జిలో ఈ విధంగా ఉన్నది. "ఎనిమిదో పటాలానికి చెందిన సిపాయి**7716** నాయక్ ఒంటెద్దు ఏస్‌దాస్ ఎన్,ఎస్ పథాన్ అనే స్టీమరు **6-7-1910**న బొంబాయి నుండి బయలుదేరి **7**వ తేది సాయంకాలం ఎనిమీ సబ్మెరీను యాక్షన్ వల్ల మునుగుతున్నపుడు అందులో ప్రయాణం చేస్తున్న నన్ను తన ప్రాణాన్ని లేక్కచేయకుండా రక్షించటమే కాకుండా ఇంకా **20**మంది సిపాయిలను కూడా రక్షించాడు. ఈ అతి ధైర్యమైన చర్యను నేను గుర్తించి అతనికి డబుల్ ప్రమోషనిచ్చి జమేదారు బిరుదునిచ్చాను. మీ అనుజ్ఞతో సుబేదారు చెయ్యాలని ఉంది. అతనికి హిందూదేశ డిస్టింగ్విష్ మెడల్ కూడా ఇవ్వవలసిందని నేను సిఫారసు చేస్తున్నాను. మద్రాసు గవర్నరు గారికి కూడా ఇతనికి భూములు ఇవ్వవలసినదిగా సిఫారసు చేయమని మిమ్ములను కోరుతున్నాను. అతను మెడలు పొందటానికి ఎప్పుడు సార్వభౌముని సన్నిధికి రావలెనో ఉత్తర్వులు ఇవ్వగోరుతాను.

ఇంగ్లాండులో ఇండియాలో పత్రికలన్నీ ఒంటెద్దు ఏస్‌దాస్ దివ్య సాహసాలను పొగుడుతూ "ఎర్రసముద్రంలో ఒకచోట జర్మన్ జలాంత ర్గాములను బ్రిటిష్ కాన్వాయికి మధ్య జరిగిన భీకర యుద్ధంలో మునిగి పోయిన ఎన్.ఎస్.పఠాన్ స్టీమరులో ప్రయాణం చేస్తూ నీళ్ళల్లో పడి మునుగుతున్న జనరస్ రాబిన్‌సన్‌గారిని రక్షించిన హిందూదేశ సిపాయివీరుడు మద్రాసు రాజధానికి చెందిన ఒంటెద్దు ఏస్‌దాస్ అనతికాలంలో లండన్ నగరానికి వెళ్లి

సార్వభౌములవారి స్వహస్తంతో మెడలును పొందెదరు. వారిప్పుడు జమేదార యినారని చిలవలు పలవలు కల్పించి ఎక్కడలేని వర్ణనలు చేసి మొదటిపేజీలో ఏసుదాస్ చిత్రం జనరల్‌గారి చిత్రం వేసి బ్రహ్మాండంగా ప్రచారం మొదలుపెట్టారు.

ఏస్‌దాస్ 'బందరబ్బాస్' లో జనరల్‌గారి ఆజ్ఞప్రకారం ఇంగ్లీషు కూడా ఒక హిందూస్తానీ వచ్చిన తెల్ల ఆఫీసరు దగ్గర నేర్చుకుంటున్నాడు. సార్వభౌములతో ఏమి మాట్లాడాలో ఆ మాటలు మాత్రం ఎక్కువగా వల్లేయిస్తున్నాడా ఆఫీసరు. వందలకొద్ది సిపాయిలు ప్రతిరోజు వచ్చి ఏస్‌దాస్‌ను చూసిపోతున్నారు. ఆ మహర్దశ అనుభవిస్తున్న రోజు సాయంకాలం చుట్టు పక్కల పల్లెలకు నడిచి వెళ్ళి అక్కడ పాటక జనుల కష్టాలు చూస్తూ, దిగంబర పిల్లలకు డబ్బులు, రొట్టెలు, పిప్పరమెంటు పంచి పెడుతూ పెంపుడు పిల్లికి బాగా పాలు తాగిస్తూ దాన్ని వెంబడి తిప్పుకుంటూ గడుపుతున్నాడు. ఎంత ఎక్కువగా చావాలనుకుంటున్నాడో ఆ భగవంతుడు అంత ఎక్కువగా బ్రతికుండమని బ్రతికిస్తున్నపుడు ఆయన ఇచ్ఛ మాత్రం నేనెందుకు పూర్తి చేయకూడదు. చూద్దాం ఎంత పెద్ద శిఖరం ఎక్కించి కిందకు తోస్తాడో అని అనుకొని తాత్కాలిక ఆనందంలో ఏసుదాస్ తైతక్కలాడుతున్నాడు.

 

హైదరాబాదులో సదాశివరావుగారి ఆశ్రయంలో మండీ షావుకార్ల సహాయంతో చీకూ చింతా లేకుండ చదువుకుంటున్న నిర్మలరావును విధి మళ్లీ ఒంకర చూపు చూసిందారోజు! మండీలో తనను గురించి ఆరా తీస్తున్న తండ్రిని చాటునుంచి చూచి నిర్మలరావు గుండె ఝల్లుమన్నది. తనను వెతుక్కుంటూ తన తండ్రి ఇంతదూరం యెలా రాగలిగాడబ్బా? తమ పత్తా ఆయనకెలా తెలిసుంటుంది. అని ఆలోచించసాగాడు. అప్పుడు రమణయ్యకు తను ఉత్తరం వ్రాసిన సంగతి అందులో తన ప్రస్తుత విలాసం గూడా రాసిన సంగతి గుర్తొచ్చి అతని గుండె గుభేలన్నది.

తను తండ్రి కండ్లబడితే ఇప్పటిదాకా బీద బ్రాహ్మడినని తనకెవ్వరూ లేరని చెప్పి ఆ మండీ వాళ్ల ఆసదాశివరావుగారి సహాయం పొందిన తను చెప్పిన వన్నీ అబద్దాలు వాండ్లకు తెలుస్తుంది. ఎంత అవమానం అది! అంతే కాకుండా తండ్రి తనను అక్కడ విడిచిపెట్టి వెళ్లడు. నయాన, భయానైనా తీసుకొని వెళ్ళి మళ్ళా ఆ గుంటూరు నరకకూపంలోకి నెడతారు. మామయ్య

కొట్టే చావు దెబ్బలు మళ్ళీ తినాలి. అవమానాలు సహించి భరించాలి. తండ్రికి కనిపించి మళ్లీ గుంటూరు పోవటం కన్నా ఈ ప్రదేశం విడిచిపెట్టి పోయి యే నూయ్యే గొయ్యే చూసుకున్నా గౌరవంగా వుంటుంది అని అనుకొని నిర్మలుడు మండీ దుకాణాలను చాటు చేసుకుంటూ. తెలిసిన వాండ్ల కండ్ల బడకుండా అక్కడ్నుంచి బైటపడ్డాడు.

టిక్కెట్టు లేకుండా బస్సుల్లో వెళ్ళటం కుదరదు. స్టేషనుకు పోయి యేదో ఒక రైలులో యెక్కడికన్నా పోవాలంటే ఆ రైలు స్టేషన్లో ఫకీరు, అతని మనుషులు ఎవరైనా చూస్తే బలవంతంగానైనా మతం మారుస్తారు. లేదా కాలో చెయ్యో విరగ్గొట్టి బిచ్చగాణ్ణయినా చేస్తారు. నీచంకన్నా మరణం మేలు గదా అనుకొని గబగబా ముందుకు నడుస్తున్నాడు. అట్లా చాలా దూరం నడచిన తరువాత ఒక చోట దూరాన మువ్వల మోత వినిపించింది.

ఎవ్వరో "ఛాయ్..ఛాయ్ నీ ఎద్దుగాల " అని అరుస్తూ మువ్వల చప్పుడు దగ్గరికి వచ్చింది. "ఓరి నీ పిలగాడు గూల. ఎద్దొచ్చె పొడుస్తుంది." అని అంటున్నారు. నిర్మలరావు కండ్లు తెరచి చూసే లోపల ఎద్దు పొడవనే పొడిచింది. అతన్ని రెండుకొమ్ముల సందున లేపి విసిరికొట్టింది. నిర్మలరావు దిమ్మెరపోయి పడ్డాడు.

బండి తోలే మనిషి పరుగెత్తుకుంటూ వచ్చి చెవులు మూశాడు. "నీకేమన్నా చెముడా పిలగాడా అరుస్తుంటే వినిపించుకోకుండా నిల్చున్నావు. ఎక్కడ దెబ్బ తగిలింది? లే..లే"అన్నాడు. నిర్మలరావు కొంచెం సేపటికి కండ్లు తెరిచి చూశాడు. ఆ మనిషి మెల్లగా లేవదీసి గట్టిగా పట్టుకొని అటుఇటు నడిపించాడు. "పలకవేమయ్యా దెబ్బ యెక్కడ తగిలిందో చెప్పు" అన్నాడు.

నిర్మలుడు మెల్లగా "కండ్లు తిరుగుతున్నవయ్యా కూచోపెట్టు" అన్నాడు. అతను "అదృష్టవంతడవయ్యా ఆ బండల మీద పడకుండా ఇసుకలో పడ్డావ్. మెళ్ళో జంధ్యం వుంది. బాపనయ్యలాగుంది. శివ..శివా బ్రాహ్మణ్ణి చంపిన పాపాన పోయేవాడ్ని గదా! ఇయ్యాళ లేచిన యాళ మంచిదయింది. భగవంతుడు నిన్నూ, నన్ను రక్షించాడు. లేవయ్యా..లే ఎక్కడా దెబ్బ తగల్లేదులే" అన్నాడు.

నిర్మలరావు కుడికంటి మీద చేయి పెట్టుకొని "కన్నుపోటు పుడుతున్నదయ్యా, కంటికి దెబ్బ తగిలింది" అన్నాడు.

ఆమనిషి "చావుతప్పి కన్ను లొట్టపోయిందిలే. లే.. కాసేపు వూదరపడితే అదే పోతుందిలే" అని తన వుత్తరీయం కొనమడిచి గుప్పెట్లో పట్టుకొని నోటితో

వూదరేసి నిర్మలరావు కంటి మీద కాసేపద్దాడు. నిర్మలరావుకు కొంచెం తెరిపి చిక్కనట్లయింది.

ఆమనిషి" ఏవూరయ్య మీది?"

నిర్మల "దక్షిణాది'

అతను "ఆడనుంచి ఈడకెందుకొచ్చా"

నిర్మల "పేదవాడ్ని చదువుకోవాలని వచ్చా"

అతను "ఇక్కడ మీ చుట్టాలున్నారా"

నిర్మల "దిక్కులేని వాడికి అంతా చూట్టాలే. వుండే వుంటారు వెతకాలి"

అతను " మేం గద్వాల విడిచి మూడు వారాలైంది. మాది గద్వాలే. ఈ యెద్దులు, ఆ బ్రిడ్జి క్రింద విడిచిన ఆ బండ్లు గద్వాల సంస్థానం వారివే. నవాబు గారికి నజరానా తీసుకొచ్చాం. రాత్రికి బవ్వల్దిని చుక్క పొడవంగానే బండ్లు కట్టుకొని బయల్దేరుతాం."

నిర్మల " ఇక్కడికి గద్వాల ఎంతదూరం"

అతను " ఇరవై ఆమదలు"

నిర్మల "ఎన్నాళ్ళు పడుతుంది పోవటానికి'

అతను "చలాగ్గా పోతే పది రోజులు పడుతుంది"

నిర్మల "అయితే నన్నెక్కించుకొని పోండయ్య మీకు పుణ్యం ఉంటుంది"

అతను "మేమంటే చద్ది బువ్వలు కట్టుకొని ఎక్కడా ఆగకుండా పోతుంటాం. సూద్దుర్లం, మీకు మాతోయెట్టాకుదరుద్దయ్యా"

నిర్మల "దాందేముంది లేవయ్యా. నాదగ్గర రెండు రూపాయలున్నాయి. బియ్యం, పప్పు కొనుక్కుంటా. ఒక చెంబు, తప్పేల ఇస్తే ఇంతన్నం వండుకొని పచ్చిపులుసు చేసుకొని తింటా"

అతను "అట్టయితే నీ యిట్టం. మా వూరు బండ్లలో నీకు చోటే లేక పోతుందా. బండ్లన్నీ ఖాళీగానే పోతయి. పొద్దోటోలంగానే నా బండ్లో వచ్చి పండుకో అదిగో అక్కడున్నది నా బండి" అని బండి తట్టు చూపించి, దూరాన దొరువులో నీళ్లు తాగుతూ చెల్లాటాలాడుతున్న ఎద్దులను మళ్ళేసుకొస్తానని పోయినాడు.

నిర్మలరావు వూర్లోకి పోయి బియ్యమవీ కొనుక్కొని ప్రొద్దుకూక్క ముందే వచ్చి బండ్లో పడుకొని నిద్రపోయినాడు మర్నాడు ఉదయం మెళుకువ వొచ్చి చూస్తే పొద్దు కరకర పొడుస్తున్నది. చెరువు గట్టున బండ్లిడిచిన ఆ బండ్ల

మనుషులు ఆ బండ్లకు కాపలా కాస్తున్న ఇద్దరు యానాదులు చద్ది బువ్వల మూటలిప్పి చద్దన్నాలు తింటున్నారు. నిర్మలరావు మొహం కడుక్కొని తాను తెచ్చుకున్న పప్పుచెక్క పకోడీలు తిని నీళ్లు తాగాడు. తనకు పరిచయస్థుడైన బండి మనిషి "బండ్లు దించినపుడు బువ్వొండుకుందవులేవయ్యా" అన్నాడు.

మిట్టమధ్యాహ్నానికి ఒక ఊరి ముందర బండ్లు దించారు. నిర్మలరావు పెసరపప్పు పులగం చేసుకొని ఆ ఊళ్లో మజ్జిగడిగి తెచ్చుకొని రెండు వంకాయలు మగ్గలో పెట్టి కాల్చి చింతపండు పులుసు పచ్చిమిరపకాయలు ఉప్పు వేసి చేత్తో పిసికి కడుపునిండా అన్నంతిని, మిగిలింది మూటకట్టుకున్నాడు. కరకర వేసిన ఆకలి మీద ఆ పులగం వంకాయబజ్జీ యెంతో రుచిగ ఉన్నవని జన్మలో అంత రుచిగల పదార్థాలెప్పుడు తినలేదని సంతోషపడ్డాడు.

ఆవిధంగా చెరువుగట్టుల్ని, చెట్లనీడల్ని, వూరితోపుల్లో బండ్లు ఆపుకుంటూ, పాటలు పద్యాలు పాడుకుంటూ కథలు చెప్పుకుంటూ పోతు ఒకరోజు చిట్టడవిలో చెరువు గట్టున పొద్దుగూక్కముందే బండ్లాపారు. నిర్మలరావు "ఎందుకయ్యా ఆపారూ" అన్నాడు.

"ఇక్కడ్నుంచి ఆమడదూరం దాకా కీకారణ్యం. చిరతపులులు మెండుగా వుంటయి. రాత్రిపూట ఈ అడవి దాటలేము. అందుకని ఇక్కడ మకాం వేసి పొద్దున్నే బయలుదేరుదాం" అన్నాడా బండి మనిషి. దారిలో కనిపించిన తాడిచెట్ల దగ్గర అమ్ముతున్న కల్లు ముంతలు చూసి "మీరు ఆగండయ్యా వస్తున్నాం" అని ఆగిన ఆ బండ్ల వాళ్ళు మందు కూర్చి పెట్టుకున్న తుపాకులతో సహా కల్లు తాగటానికి పోయి యెంత సేపటికి రాలా. వంటలైనయి. భోం చేద్దామని కూచోని కబుర్లు చెప్పుకుంటూ అన్నాలు తింటున్నారు.

అంతలోకి దూరాన్నుంచి గాండ్రు గాండ్రు మనే అరుపు వినబడ వచ్చింది. చిరతపులులని బండి యెడ్ల పలుపులు తప్పించి బండ్ల వాండ్లు కొందరు జల్లల్లో నిల్చోని అరుస్తున్నారు. తుపాకులున్న వాండ్లింకా రాలేదు.

అంతలోకి చిరతపులి గాండ్రిస్తూ వచ్చి అక్కడకి పదిగజాల దూరంలో నిల్చున్న యెద్దు మీదికి దూకింది. ఒక యెద్దు రంకె వేస్తూ ఝాడించిన దాని కొమ్ము ఝాడింపుకు క్రింద పడిన చిరతపులిని ఆ యెద్దులు చుట్టుముట్టి బుసలుకొడుతూ కొమ్ములు వంచి వీర ఆవేశంతో కొమ్ములతో కుమ్ముతూ దాడి చేసినవి. ఆ యెద్దుల వీర నృత్యం నిర్మలరావును కంపింపచేసింది.

ఎడ్ల కొమ్ముల తాకిడికి చిరుతపుల గుక్కతిప్పుకోలేక తలుపు బిగించి

కొడుతుంటే పిల్లిచూసిన చూపులు చూస్తూ తోక ముడుచుకొని పంజాఎత్తి నేలకు కొడుతూ పండ్లికిలిస్తూ బుఎ కొడుతూ అటు ఇటు మసులుతున్నది. కొంతసేపటకి ఒక పదుచు కోడె చిరుతపులి డొక్కలో బలంగా ఒక కుమ్ము కుమ్మింది. దాని పదునైన కొమ్మొకటి ఈ డొక్కలోంచి ఆ డొక్కలోకి దూరింది. నెత్తురు కాల్వలుగా కారుతున్నది. కొమ్ముల మీద ఆ పులిని ఎత్తలేక దాని పొట్టలో దూరిన కొమ్ము పెకలించుకోలేక ఆ ఎద్దు మోకాళ్ళు నేలకు మోకరించి తల యెత్తలేక అటుఇటు ఊపుతున్నది. పులి వెనుక కాళ్లపంజా గోళ్లతో అందినంత వరకు ఆ కోడె ముట్టె గీకి పెడుతున్నది. దాని మూతి నుంచి నెత్తురు కారుతున్నది. ఆ కోడెను కట్టిన బండి మనిషికి ఎక్కడేలేని ఆవేశం వచ్చింది. అడ్డంగా వున్న ఎద్దు వీపున దుడ్డుకర్రతో ఒక చరుపు చరచి ఆ క్రింద పడి ఉన్న చిరుతపులి కణత మీద బలంకొద్దీ ఒక ఏటేసి తోక పట్టుకుని అవతలకి లాగి కోడెను "ఛాయ్..ఛాయ్" అని అదిలించాడు. ఆ కోడె కొమ్మును వెనక్కు గుంజుకొని చిరుతపులిని చంపానన్న సంతోషంతో నేమో అన్నట్లు ముందరి కాళ్లను పైకెత్తి కాసేపు చంగనాలు తీసింది. కదంబడి మనుషులు, నిర్మలరావు గూడా కిందకు దూకి వచ్చి కొన వూపిర్న ఉన్న చిరుతపులిని కర్రలతో బాదొదిలిపెట్టారు.

అప్పుడే తప్పతాగి వూగులాడుకుంటూ దూరంగా నిల్చున్న ఏనాది ఒకడు వచ్చీరాగానే తుపాకి పేల్చాడు. బండ్ల వాండ్లు "దొంగగాడిద కొడకల్లారా అంతా ఐపోయిం తర్వాతొచ్చి తుపాకులు కాలుస్తున్నారా తప్ప తాగొచ్చి" అని ఏనాదులను కొట్టబోయినారు. "దండాలండీ బాబుల్లారా దాన్సిగదరగ ఎన్నాళ్ళ పులిసిందో గాని సుక్క పడంగానే ఇంకా తాగాలనిపించింది. సమాధే సుకొని కూకున్నాం పొద్దుబోయిందే సూడకుండా కిందపడి దొర్లుతాండాం. మైకం కమ్మి నిదరబోయాం. పైర గాలికి తెలివొచ్చి సూత్తే నెలబొడిసింది. లగెత్తుకొస్తుంటే మీఅరుపులు పులిగాండ్రింపులు వినంగానే కొంప మునిగిందిరా దేవుడా అంటూ భయం పడ్డాం. దొరగారికి మాత్తరం సెప్పవాకండి సాములూ" అంటూ బొక్కబోర్లా సాష్టాంగపడి నమస్కారం చేశాడు.

"అయిందేదో అయింది. పోయి బర్రెబచ్చలాకు పీక్కురాండి. గాయాలు తగిలిన ఎద్లకు కట్టుకడదాం" అన్నారు. దంటుపుల్ల దీటీలు కట్టి వెలిగించుకొని చుట్టుపక్కల వెతికి ఇంత ఆకు పీక్కొచ్చాడా ఏనాది. బండి మనుషులు ఎవరెద్దుల్ని వాండ్లు పట్టుకొచ్చి కట్టేశారు. వళ్ళంతా తేరిపార చూచారు. ఆ ముసలెద్దుకు,

కోడెదూడకు తప్ప ఇంక వేటికీ గాయాల తగల్లా. ఆ రెంటి గాయాలు వేడ్నీళ్ళలో ఉప్పేసి, ఆనీళ్ళతో కడిగి ఆకుల పసరు రాసారు. భోజనాలు చేసి పొద్దు పోయిం దాకా శాస్త్రాలు చెప్పుకొని అంతా నిద్రపోయారు. ఏనాదులు మాత్రం ఒకడు విడిచి ఒకడు రాత్రల్లా మేలుకోనే ఉన్నారు.

పొద్దున్నే బారెడు ప్రొద్దెంకంగానే చద్దన్నాలు తిని, చిరుతపులిని ఒక బండ్లో వేసుకొని,బండ్లు కట్టుకొని బయలుదేరారు. వారిలో ఏ వూరోచ్చినా ఆ ఏనాదులు పెట్టెదిమ్మలు (వత్తి కాల్చి పేల్చే తుపాకీలు) కాలుస్తూ, "చూశారా మా కోడెలు చిరుతపులిని చంపినై. మేమైతే సింహాలనే దుడ్డుకర్రలతో కొట్టి చంపుతాం" అని ఆ చచ్చిపోయిన చిరుతపులిని చూడదాని కొచ్చిన వాండ్లందరికి చెబుతూ మూడోరోజు ఉదయం గద్వాల వూరి బయట బండ్లాపి చప్పిడి ఉప్పిడి కాకుండా ఊళ్ళోకి పోవటం మంచిది కాదు, ఊరేగింపు చేసుకుంటూ పోదాం అనుకొని, ఇద్దరు బండి మనుషులువ ఏనాదులు రాజాగారి కోటలోకి పోయి "అయ్యా మనెద్దులు కొమ్ములతో కుమ్మి చిరుతపులిని చంపినై. బ్రహ్మప్రళయంగా మేళతాళాలతో ఊరేగింప జరపాలను కుంటున్నాం" అన్నారు.

రాజాగారు సంతోషంతో "మన సంస్థానంలో ఉన్న వాయిద్యాలన్నీ పంపి బ్రహ్మాండంగా ఊరేగింపు జరపండన్నారు. కాసేపటికల్లా తప్పెట్లు, తాషామరపలు, బాకాలు, భజంత్రీలు, మేళ తాళాలు ఒకటే గణగణ ధ్వనితో గడబిడలుగా వూరంతా ఊరేగింపు చేసుకుంటూ ఎద్దుల మొహాలకు పసుపు కుంకుమలు పెట్టి, బండ్లలో బండి మనుషులు నిల్చొని ఏనాదులు బండ్ల ముందర చెరొక తట్టు నిల్చోని పెట్టె దిమ్మలు కాలుస్తూ ఒక బజారు గూడా తరువోకుండా తిరుగుతున్నారు. చివరికి నిర్మలరావు గూడా ఎక్కడలేని ఉత్సాహంతో కట్టెచేత పుచ్చుకొని కోట బజారు కొచ్చేటప్పటికి పైన ఉత్తరీయం, బిళ్లగోచి, పిలక, వెనకమళ్ళాగా చూసి అతనా సదాశివరావుగారే అని గుర్తించి చేతిలో ఉన్న కట్టె పడేసి ఏ చేయాలా అని చూస్తుండగానే సదాశివరావుగారు అతన్ని చూసి, ఆశ్చర్యపోయి "ఓహో నిర్మలరావు నీవా? ఎక్కడ్నించి, నీవు అట్లా గున్నావేం?" అన్నాడు.

నమస్కారమండి సదాశివరావుగారూ! కారణాంతరాల వల్ల హైదరాబాదు వొదిలిపెట్టవలసి వచ్చింది. క్షమించాల. మీరేమిటి ఇక్కడ" అన్నాడు

సదాశివ " నేనిక్కడ కుదురుకోవాలని వచ్చాను. బంధువులు రమ్మంటే వచ్చాను. వాండ్లు నా వివాహానిక్కూడా సన్నాహాలు చేస్తున్నారు."

నిర్మల" అంతా విచిత్రంగా వుంది గదండీ!"

సదా " అదేమరి జీవితం అంటే. సరేగాని. ఆపులిని ఎద్దులు చంపటం నీవు గూడా చూశావా? బండిలోనే వస్తున్నావు గదా"

నిర్మల "కండ్లారా చూచానండి" అన్నాడు. ఇద్దరు కలిసి సదాశివరావు ఇంటికి వెళ్లారు. వాండ్ల పరిస్థితి కూడా అస్తాయిస్తంగా వుంది. ఆయనకింకా పట్టు చిక్కల అక్కడ. "ఇంక నేను వెళ్ళోస్తానండి" అని చెప్పి సదాశివరావు గారొక రూపాయిస్తే దాని జేబులో వేసుకొని ఇంటికి వెళ్తానని చెప్పి శలువు తీసుకున్నాడు.

కోటలో సంభావనల కోసం కర్నూలు నుంచి వచ్చిన బ్రాహ్మలు తిరిగి పోతుంటారని తెలిసి వాండ్ల వెనకాల కర్నూలు పోవొచ్చునని అక్కడికి పోయినాడు. వాండ్లతో కలసి కొంచెంసేపు విశ్రాంతి తీసుకొని కొంచెం చల్లబడంగానే వాండ్ల వెంట కర్నూలు దారిపట్టాడు. కర్నూలు దగ్గరి కొస్తున్న కొద్దీ వాన పెద్దదయింది. వళ్ళంతా తడిసిపోతున్నా అక్కడెక్కడా తల దాచుకోటానికి వీలు చిక్కక వాండ్లలాగే తడుస్తూ నడక సాగిస్తున్నారు. దారిలో ఒకతను ఉబుసుపోక "నిర్మలరావు అన్నావు కదూ నీపేరు"అన్నాడు. నిర్మల 'అవునండీ నిర్మలరావే'

బ్రాహ్మ "మీరు నియోగులా? వైదీకులా?"

నిర్మల "చెప్పాలంటే నియోగులమే. అయినా శాఖా భేదంతో ఏముంది లెండి ప్రయోజనం. వృత్తి విభజన చివరకి కుల విభజనై అదికాస్తా శాఖల దాకా విస్తరించింది. వృత్తులు మారిపోతున్నా విభజన తప్పటంలేదండి".

బ్రహ్మ "పోనీ మనకేంటంటా. అంతా ఈశ్వరేచ్ఛ. అదంతా వగదెగేది కాదూగాని నువ్వు కర్నూలు ఎందుకెళ్తున్నావు.

నిర్మల "బీదవాడ్ని. చదువుకోవాలని వెళ్తున్నా" బ్రాహ్మ " కర్నూలులో మీవాళ్ళున్నారా?"

నిర్మల "అందరూ మావాళ్ళే" అన్నాడు నిర్మలరావు.

వాండ్లు అక్కడికి చేరేసరికి తుంగభద్రానది ఉరవళ్ళు ,పరవళ్ళు తొక్కుతూ భీకరంగా గర్జిస్తూ ప్రవహిస్తున్నది. ఏరు దాటి అవతలి ఒడ్డుకు

పోవాలంటే డింగీలో వెళ్ళటం తప్పనిసరి అయింది. సదాశివరావుగార్చిన రూపాయి పప్పుబెల్లాలకు ఖర్చయి పోగా మిగిలిన చిల్లర జేబులు తడుముకొని చూచుకొని సరిపోతవనుకొని ఒక డింగీలో నది దాటటానికి ఎక్కినాడు నిర్మలుడు.

 

తల్లి చచ్చిపోయిన తర్వాత కాంతమ్మకు పూర్తి స్వేచ్ఛ దొరికినది. తన తమ్ముడితో సహా కొత్త ఇంట్లోకి అద్దెకు చేరినప్పట్నించి విచ్చలవిడిగా శారీరక సుఖాలు అనుభవిస్తూ తన అందచందాలతో రసికులను ఆకర్షిస్తూ ఆనందాలు జుర్రుకుంటున్నది. దూరపు బంధువు కాకాని కరణం గూడా కాంతమ్మ ఉచ్చులో పడినాడు. ఆమె విషయం ఆనోట ఈనోట ప్రాకి చివరకి కానిస్టేబుల్ ఖాదర్ దాకా వెళ్లింది. ఒక సందర్భంలో ఆమె కాకాని కరణంతో సరసల్లాపాలలో మునిగి తేలుతుండగా ఖాదరు వాండ్లను పట్టుకున్నాడు. స్టేషనుకు తీసుకొని పోయి కేసు పెడతానని బెదిరించాడు.

కాంతమ్మ లబలబలాడు వగలేడ్పులు ఏడ్చింది. పరువు ప్రతిష్టలు మంట గలిసిపోతవని వాపోయింది. గట్టెక్కిస్తే లంచం ఇస్తానని మంచం పంచుకొను సిద్ధమేనని చెప్పి ఖాదర్ను ప్రాధేయపడింది. కాకాని కరణం కొంచమైనా చలించలేదు. అసలికి భయపడలేదు. కాంతమ్మ ఖాదరు కాళ్ళావేళ్ళా పడి బ్రతిమాలుతున్న కొద్దీ కాకాని కరణం, ఖాదరు రహస్యంగా నవ్వుకుంటూ సైగలు చేసుకోవటం ఆపిచ్చి బాగుల కాంతమ్మ గమనించలేదు.

కాంతమ్మను పోలీసులకు పట్టించింది కాకాని కరణమే అయినా ఆమెను చూసిన తర్వాత ఖాదరు కరణం విషయమే మరచిపోయి మరోవిధంగా ఆలోచించసాగాడు. సి.ఐ.డి ఇనస్పెక్టరు సీతయ్య పోలీసులందరిలోకి రసికుడు. మానం అర్పిస్తే మర్డరు కేసయినా తప్పించగల సమర్థుడు. చిక్కిందాన్ని విడిచిపెట్టడు. నాయనో, భయానో లొంగదీసుకొని తనివితీరా అనుభవించి అవతలకి తోసెయ్యటం అతనికి అలవాటు. అతని చేతిలో అధికారం వుంది. మనిషినిండా వ్యామోహం వుంది. అదేమని ఎవరన్నా అంటే స్త్రీ జనోద్ధరణ అనే లౌక్యం వుంది.

ఒక పనిచేస్తే పోలా !ఇంత వరకు కాంతమ్మలాంటి అందగత్తెను సీతయ్య గారు చూసుండరు. చూసినా అనుభవించివుండరు. అటువంటప్పుడు ఈ కాంతమ్మకు ఆ సీతయ్యగారికి లింకు కలిపితే సరి. అప్పుడు సీతయ్యగారు

తన కోసం పనిచేస్తాడు. అతని ప్రాపుతో అధికారం ఇంకా బనాయించి చలాయించవచ్చు. అని అనుకొని ఆనాడు కాంతమ్మను విడిచిపెట్టినట్లు నటించి ఒకసారి తనామెను అనుభవించి అటు తరువాత సీతయ్యగారితో కాంతమ్మను జతకలిపాడు.

కాంతమ్మను చూసి క్షణంలోనే సీతయ్యగారు ఆమె అందానికి అవయవ సౌష్టవానికి ఆశ్చర్యపోయి అటువంటి అప్సరసను పరిచయం చేసినందుకు ఖాదర్ని అభినందించాడు. అప్పటినుండి సీతయ్య కాంతమ్మలు కొత్త ప్రేమికుల్లాగ చట్టాపట్టాలేసుకొని తిరుగుతూ, సినిమాకు షికార్లకు పోతూ కాంతమ్మ ఇంట్లోనే రాత్రులు గడుపుతూ సీతయ్యగారు అమర సుఖాలు అందుకోసాగినారు. అనుకున్నట్లే పోలీసు శాఖలో కానిస్టేబులు ఖాదరు పలకుబడి ఇబ్బుముబ్బడిగా పెరిగిపోయినది.

ఒకరోజు కాంతమ్మ సీతయ్యగార్ని కౌగిలిలో బంధించి చుంబనాలను కొసరి కొసరి అందిస్తూ "ఇట్లా చాటుమాటు వ్యవహారం అంత మంచిది కాదు మనం పెళ్లి చేసుకుందామండి" అంది. "తప్పకుండా" అన్నాడు సీతయ్య గారు. అప్పటినుండి వారి అనుబంధం మరింతగా పెరిగిపోయి గట్టి పడింది. ఒకరోజు సీతయ్య,కాంతమ్మలు పెండ్లి కలలు కంటూ కలవరిస్తూ పలవరిస్తూ కాలం గడిపింది కూడా తెలియకుండా బారెడు పొద్దెక్కిందాకా గాఢ నిద్రలో ఉన్నారు. కాకాని కరణం వచ్చి తలుపు కొడుతున్నాడు. వాకిట్లో పడుకున్న రాంభద్రయ్యకు మెళుకవ వచ్చి "అక్కయ్యా ఎవరో తలుపు కొడుతున్నారే" అన్నాడు దగ్గరకు వెళ్లి.

కాంతమ్మ చప్పున లేచి పడగ్గది తలుపేసి వచ్చి వీది వాకిలి తెరచింది. కాకాని కరణాన్ని చూచి ఆయనెక్కడ లోపలికి తోసుకొని వస్తాడో అని వాకిటి కడ్డంగా నిలబడి "ఓహో వచ్చారే నా పైకం తెచ్చారా?"అన్నది. లోపల పడుకున్న సీతయ్య రాంభద్రయ్య వేసిన కేకలకు మేల్కొని వచ్చిన వారెవరై ఉంటారా అనుకొని "పైకం తెచ్చారా' అన్న మాటలు వినబడి అంతకు ముందు కాంతమ్మ ఇంట్లో దొంగతనం తాలూకు పైకం ఖాదరేమైనా తెచ్చాడేమో అనుకొని "కాంతా!ఖాదరేమైనా తెచ్చాడా పైకం" అంటూ పడకగది తలుపు తెరచుకొని వచ్చి అక్కడ వసారాలో నిల్చోని కాకాని కరణాన్ని చూచి నిర్ఘాంతపోయినాడు. కాంతమ్మ మొహంలో నెత్తురు చుక్క లేకుండా పోయినది.

"అయితే పదకొండు గంటలకు రిజిస్టరాఫీసుకు రండి. అక్కడ భూమి

మీకు రిజిష్టరు చేసి పైకం పుచ్చుకుంటాను" అని అన్నది వంచిన తలెత్తకుండానే "సరే" అని కరణం వెళ్లిపోయాడు.

అప్పుడక్కడున్న సీతయ్యను గుర్తించిన కాకాని కరణం కాంతమ్మ వుండి వుండి మంచి అధికారినే పట్టింది. అయినా, ఇంటికొచ్చిన చుట్టానికి కాళ్ళు కడుక్కోటానికి నీళ్లివ్వక పోవటమే కాకుండా భోజనానికి కూడా రమ్మనలేదే! అయినా ఈ చెడిపోయిన దానింట్లో నేనుమటుకెట్లా భోజనం చేసేది? చెడిపోయిందాన్ని వేరే చెడగొట్టేదేముంది. అందునా మరదలు కూడా గాదు కదా! చుట్టరికంలో ఉచితంగా ఆనందం పొందవచ్చు గదా" అని అనుకొని అక్కరకు అడ్డం పెట్టుకున్నాడు కాంతమ్మను.

అప్పుడు కాంతమ్మ పురమాయించిన పని మీద అరండల్‌పేటలో వకీలుగారి సలహాతో దస్తావేజు చిత్తుప్రతి వ్రాసుకొని పూటకూలింట్లో భోంచేసి రిజిస్టరాఫీసుకు పదకొండు గంటలకల్లా చేరాడు కాకాని కరణం. కాంతమ్మ వచ్చింది. దస్తావేజు స్టాంపు కాగితాల మీద వ్రాయించి ఆమెకు చదివి వినిపించి రిజిస్ట్రార్ గారికి ఇద్దామని పోతుండేప్పటికి ఇనస్పెక్టరు సీతయ్యా వెనుకనించి "ఏమయ్యా కరణం" అని పిల్చాడు. "ఆకాగితాలు ఇటు తేవయ్యా" అన్నాడు. తీసుకొని చదివితే అందులో ఆస్తి వేయి రూపాయలకు కొన్నట్లుంది. ఆయన కాంతమ్మతో "వెయ్యిరూపాయలకా నీవు అమ్మింది" అని అడిగాడు. కాంతమ్మ ఆశ్చర్యపోయి "లేదండీ పన్నెండొందలనే చదివాడే" అన్నది.

ఇనస్పెక్టరు సీతయ్య కాకాని కరణాన్ని గుడ్లురిమి చూచి "నాకు తెలుసు నువ్వేదో పితలాటకం చేస్తావని" అందుకే వచ్చాను. సరిగా వ్రాయ వయ్యా" అన్నాడు. కరణం "చిత్తం పొరపాటే" అని కాగితం దిద్ది సంతకం పెట్టి చూపించినాడు. ఇనస్పెక్టరు గారు ఆ కాగితాలు తీసుకొని రిజిస్ట్రారుగారి దగ్గరకువెళ్ళి వెంటనే రిజిస్ట్రారు గారి దగ్గరికి వెళ్లి వెంటనే రిజిస్టరు చేయించుకొని వచ్చి కాంతమ్మ చేతిలో పైకం పెట్టమన్నపుడు కరణం తన దగ్గరిప్పుడు డబ్బుల్లేవని, తరువాత ఇస్తానని బ్రతిమాలి భంగపడినాడు.

సీతయ్యగారు కరణాన్ని గద్దించి మిగతా రెండొందల విషయం అడగంగానే కరణం వినయంగా "అయ్యా ముందొక వంద బయానాగా ఇచ్చాను. ఇంకో వంద వుంది యెంతయినా మేము బంధువులం ఎప్పటికైనా కాంతమ్మకు గతి మేమే గదా! ఈ వంద కోసమైనా రాకపోకలు జరుగుతుంటే మా బంధుత్వం బలపడుతుంది. ఎం కాంతా..నిజం కదూ?" అన్నాడు.

కాంతమ్మ సీతయ్యగారికి నచ్చజెప్పి అతన్ని పంపించివేసింది. అప్పుడు సీతయ్యగారు కాంతమ్మతో "కాంతా మనం బ్యాంకుకు పోయి మొన్నటి మూడు వేలు ఇవ్వాల్టి పదకొండొందలు రాంభద్రయ్య పేరిట డిపాజిట్టు చేద్దాంపద" అని ఆవిడ దగ్గరున్న పదకొండొందలు తీసుకొని వెళుతూ "అన్నట్లు కాంతా! నేను మేనెల ఒకటో తారీకున మద్రాసు వెళ్లి సి.ఐ.డి. సర్కిల్ ఇనస్పెక్టరుగా చార్జి పుచ్చుకొని అంతవరకు ఒకనెల రోజులు శలవు వుండమని ఆర్డర్లొచ్చినయి" అన్నాడు.

కాంత "ఇందాక మూడువేలన్నారేమిటి? దొరికాయా?"

సీతయ్య " మీఇంట్లో అవి కాజేసినది మా కానిస్టేబుల్ నీలాంబరమే. వాడ్ని బేడీలేసి నాలుగు బాదేటప్పటికి నేరం వప్పుకొని సస్పెండైనాడు. మా కానిస్టేబుళ్ళతో కాలాంతకులుంటారు తెలుసా" అన్నాడు సీతయ్యగారు

కాంత "తమరూ పోలీసే గదా"

సీతయ్య "మనం అట్లాంటివాళ్లం కాముగదా! అన్యాయం చేయను నిన్ను. ఇద్దరమూ పెండ్లి చేసుకొని వితంతు వివాహంతో ఆదర్శంగా ఉందాము. సంఘ సంస్కరణ పోలీసు వాండ్లు మాత్రం చెయ్యగూడదా, ఏం? అన్నట్లు గుర్తొచ్చింది కాంతా, మనం బ్యాంకుకు రేపు పోదాం. ఒకపని గుర్తొచ్చింది. అర్జంటుగా నేను ఆఫీసుకెళ్ళాలి" అని సీతయ్యగారు కాంతమ్మను ఇంటికి పంపించి వేసి తను వెళ్ళిపోయినాడు.

రాంభద్రయ్య స్కూల్నించి వస్తూనే చిరచిరలాడుతూ పుస్తకాలు నేలమీదకి విసిరేసి కాళ్ళు చేతులు కడుక్కోవటానికి దొడ్లోకి పోయినాడు. కాంతమ్మ కూడా దొడ్లోకి పోయి"ఏమిరా తమ్ముడూ అట్లా వున్నావేమిటి?" అని అడిగింది.

రాంభద్రయ్య "నీతో మాట్లాడితేనే మహాపాపం"

కాంత "దయ్యంగాని పూనిందా ఏమిట్రా"

రాంభద్రయ్య " నువ్వు సీతయ్యని వుంచుకున్నావటగదా"

కాంత "ఎవరన్నార్రా?'

రాంభద్రయ్య "ఆ కాకాని కరణం మా బడికొచ్చాడు. రాంభద్రయ్యా అని పిలిచి అయిన వాడివి కనక చెబుతున్నాను. మీ అమ్మ చనిపోయిన తరువాత మీఅక్కయ్య విచ్చలవిడిగా ప్రవర్తిస్తున్నది. ఆ మీసాల ఇనస్పెక్టరును వుంచుకున్నది. పెండ్లి కూడా చేసుకుంటారని, ఆ పనే మీ అక్కయ్య చేస్తే మిమ్ములను కులంలో వెలి పెడతారు. నిన్నింక పలకరించే దిక్కెవరూ ఉండరు.

మీ అమ్మ మాసికాలు, తద్దినాలు పెట్టటానికి పురోహితులు రారు. ఇంతవరకు సీతయ్య ఉంచుకున్న ముండ అంటున్నారు. ప్రాయశ్చిత్తం చేసుకున్నా కులం లోనికి రానివ్వరు. ఇంకనన్నా బుద్ధి కలిగి వుండమను. లేకపోతే నీవన్నా విడి పోయి నీ డబ్బు నీపేర పెట్టించుకొని నా బోటి బంధువుల ఇంట్లో వుండి చదువుకో. మీఅక్కయ్య ఏమయినా పాపపుణ్యాలెరగని నీవు ఎవరికీ కొర గాకుండా పోతావు. అని రోడ్డు ప్రక్కన గోడమీద కూచోబెట్టుకుని చెప్పాడు. నీవు చెడ్డది కాక నన్నెందుకు చెడగొడతావే అక్కయ్యా. అమ్మ బ్రతికున్నట్లయితే నీవీ నాటకం ఆడేదానివటే అక్కయ్యా. ఇకనన్నా బుద్ధి కలిగుండు. నేను పెద్ద వాడ్నవుతున్నా. మనకేం తింటానికి గతిలేకనటనే ఈ పాడుపని? ఉన్న కాస్త కలోగంజో తాగి జీవిద్దాం. చదువుకొని నేను మంచి ఉద్యోగం చేసి సంపాయించి పెడతా. అంతదాకా నన్ను పెంచి పెద్దవాడ్ని చెయ్యవుటే అక్కయ్యా" అని కాంతమ్మను కావలించుకొని బావురుమని ఏడుస్తున్నాడు.

కాంతమ్మకు నోటంబడి మాట రాలా. కొంతసేపటికి తెప్పరిల్లి "తమ్ముడూ ఎందుకట్లా ఏడుస్తావు. ఇన్నాళ్ల నుంచి చూస్తున్నావు ఆ బంధువులనే వాండ్లు మనింటి ఛాయలకెప్పుడైనా వచ్చారుటరా? మనం తిన్నామో పస్తులున్నామో అని వచ్చి చూచిన పాపాన పోయినారట్రా? చిన్నవాడివి గదా అని లేనిపోని ఎక్కులు చెప్పి నిన్ను దగ్గరికి చేర్చుకొని నీ ఆస్తి కాజేయ్యాల్నని కాకపోతే నీ డబ్బులు నీపేర పెట్టించుకోని తన బోటి బంధువుల దగ్గర చేరమంటాడా? అతనే గదరా నా అత్తవారింటి ఆస్తంతా కాజేసింది. మనకా ఇనస్పెక్టరు మామయ్య అండగా వుంటున్నాడని ఓర్చలేక చెప్పిన మాటలురా. చిన్నప్పట్నించి చంక దించకుండా ఏత్తుక తిరిగిన నీ అక్కయ్య నేటికి నిన్ను దిక్కులేని పక్షిని చేస్తుందట్రా. ఈ కాలపు బంధువులందరూ మనమెప్పుడు చస్తామా మన ఆస్తి కాజేద్దామా అని కొంగ జపం చేస్తూ కూచుండే కిరాతకులురా. ఈ గొడవలు నీకర్థం కాదులే. అని పమిట చెంగుతో కండ్లు తుడిచి పంపించి వేసింది. రాంభద్రయ్యను అప్పటికప్పుడు సమాధాన పరిచింది గాని ఆమె మాటలతన్ని సంతృప్తి పరచలా. అతనేదో తప్పుచేస్తున్నది అక్కయ్య అన్న ఆలోచనలోనే ఉన్నాడు. కాంతమ్మ అది గమనించికూడా చేసేదేమీ లేదు మౌనం దాల్చింది. మనం త్వరలోనే మద్రాసు పట్టణానికి మకాం మారుస్తున్నాం. సీతయ్య మామయ్య గొప్ప పోలీసాఫీసరువుతున్నాడు.

నువ్వు బాగా చదువు కోవచ్చు. కోరినది కొనుక్కోవచ్చు. అని అశకూడా పెట్టింది కాంతమ్మ.

 

ఆ నిర్భాగ్యపు నిర్మలరావు ఎక్కిన డింగీ దోలుతూ దోలుతూ తుంగభద్రా నదిలో మునగనే మునిగింది. ఆ డింగీ నడిపే బెస్త మనిషి "మునుగుతుందర్రా" అని నెత్తీనోరు పెట్టుకొని ఎంత మొత్తుకున్నా యినకపోతిరి. ఇప్పుడిప్పుడే రేపు కల్లాల కాడికొత్తే ఆయాళ డింగీలో ఎక్కించుకోలేకపోతియే ఈ యాళ ఏమొహం పెట్టుకొని గింజల కోసంవచ్చా? ఎళ్ళెళ్ళమని ఎళ్ళగొడతరా. ఇప్పుడు డింగీ మునిగితే డింగీ ముంచితివి గదా ఎందుకొచ్చావంటారు. ఎవరన్నా దిగండయ్యా బాబూ మీగింజలు లేకపోతే పీడబాయె. బతికి బాగుంటే బలుసాకన్నా ఏరక బతకొచ్చు. ఈడొచ్చిన వాండ్లంతా ఈకాస్త దూరం ఈదండయ్యా. ఆ బరువుగా ఉన్న సామాన్లన్నీ ఏటిలో పడెయ్యండయ్యా. ఆ సొర కాయచిప్పలతో నీళ్ళు తోడి పొయ్యండయ్యా. అయ్యో, వచ్చిపడె నీళ్ళు ..వచ్చి పడె నీళ్లు... మునిగె..మునిగె..." నని గడ గడ వణుకుతూ చేతిలో తెడుగడా వెయ్యలేకుండా హర హరా హర హరా పాయె, పాయే మునిగా మునిగా అని కేకలేస్తున్నాడు. నడికారు మనుషులు నలుగురు పంచెలు బిగించుకొని నీళ్లలోకి దూకారు. ఒక ముసలతను పెరుగుదుత్తలు, గుమ్మడి కాయలు ఎత్తెత్తి ఏటిలో వేస్తున్నాడు.

డింగీలోకి నీళ్లు ఎక్కువగా వస్తున్నాయి. డింగీ నీళ్ల బరువుకు కృంగి పోతున్నది. డింగీ మునగనే మునిగింది. డింగీలో పదమంది దానితోపాటు మునిగి బడకలేసి పైకి తేలి బలం కొద్దీ ఈదడం ఆరంభించారు. వొడ్డున మట్టిపని చేసుకుంటున్న వడ్డెర మనుషులు తాము చేసుకుంటున్న పని మానుకొని నీళ్ళలోకి దూకి గబగబా ఈదుకుంటూ వచ్చి తేలుతూ మునుగుతూ ఈత రాక కొట్టుకుంటున్న ఇద్దరు ఆడవాండ్లను జుట్టు పట్టుకుని లాక్కొంటూ తెచ్చి వొడ్డున పడవేశారు. మొత్తం మీద ప్రాణాలు దక్కించుకొని అంతా బయటపడ్డారు.

ఈదుకొంటూ వొడ్డు కొచ్చిన బెస్త మనిషి "అయ్యో ఆకుర్రోడేడి? అని కెవ్వున కేక వేసి "సూడండి..సూడండి...ఎతకండి..ఎతకండని అరుస్తున్నాడు.

నిర్మలరావు డింగీ మునుగుతుంటే తను బయటపడే తెరువు చూసు

కోకుండా ఆ ఇద్దరిలో ఒక ఆడమనిషికి సహాయం చేయబోయేటప్పటికి ఆ ఆడమనిషి అతన్ని గట్టిగా పట్టుకోవడంతో నీళ్లల్లోకి మునిగాడు. చివరికి ఆ ఆడమనిషి చెయ్యి కొరికి ఆవిడ పట్టు విడిపించుకున్నాడు. ఇంతలోకే నీళ్లల్లోకి దూకిన వడ్డెర మనుషులలో ఒకడు ఈదుకుంటూ వచ్చి ఆ ఆడమనిషిని జుట్టు పట్టుకొని ఒొడ్డుకు చేరదీసాడు. నిర్మలరావు కొంత దూరాన పైకి తేలి గట్టిగా ఈదలేక ఎల్లికిలా పడుకొని తను మునగకుండా చూచుకొని అలుపు తీర్చు కుంటూ ఆ ప్రవాహంతో పాటే కొంత లెక్క కొట్టుకుపోయినాడు. అక్కడ్నించి బలవంతాన ఈదుకుంటూ ఒొడ్డుకు రాబోయేటప్పటికి ఒక సుడిగుండంలో చిక్కుకున్నాడు. అప్రయత్నంగా పొట్టునిండా నీళ్ళు తాగాడు. ప్రాణం మీద ఆశ వదిలి కళ్ళు మూసుకుని ఒకతడవ తల్లిని, తండ్రిని, సీతమ్మను తలుచు కున్నాడు. ఆతర్వాత మైకం కమ్మి స్పృహ తప్పి దూరాన్నించి గట్టున పరుగెత్తుతున్న మనుషులు.

"అదుగో..అదుగో..తేలుతున్నాడు. గట్టుకు వస్తాడ"ని కేకలేస్తున్నారు. అంతలోకి కళ్ళు మూసి తెరిచేటప్పటికి సుడిగుండంలో తిరిగిపోతున్న నిర్మలరావు ను చూసి ఆ డింగీ నడిపిన బెస్త మనిషి "హరా హరా.. అంతా బతికి ఆపిల్లోడు పాయగదా' అని కండ్ల నీళ్ళు పెట్టుకుంటూ ఇంటికెళ్ళాడు, పెండ్లాంతో

"అశా యంత పనైందనుకుండా, ఈయాళ లేచినేల మంచిది కాదేయ్. డింగీ ఎట్లో మునిగింది. బతుకు నా సామిరంగా అని బయటపడేశాడా పలమాత్ముడు. నిక్షేపమంటి పిల్లోణ్ణి పొట్టన పెట్టుకున్నదా తుంగభద్రమ్మ. అసే ఎట్టా ఉండాడనుకుండా చందమామకన్నా సక్కంగా ఉండాడే. ఏట్లో దూకి బయటకి తెద్దామనుకుంటే టాలికి సుడిగుండంలో చుట్టకపోయినాడే, ఒొగుడాకు చుట్టకుపోయినట్లు. ఏ కోస్తాన తేలుద్దో ఆ శవం" అని కండ్ల నీళ్లు పెట్టుకొంటు అన్నాడు.

"అయ్యో పాపం ఎవరి పిల్లోడో వాండ్లమ్మ అయ్యకు సెప్పెన్నా సెప్పిరాక పోయినావా! ఇంతలోకి బువ్వకేం తొందరొచ్చింది. కడుపులో ఎలుకలు తోడు తున్నాయా, పోయిసెప్పిరా, పోయి రాంగానే బువ్వేత్తా" నన్నది అతని పెండ్లాం

" ఓసి ఎర్రిదానా! ఇంత ఎర్రిదానివైనాయేవిటే? డింగీ ఎక్కినోళ్ళందర్ని పేర్లు అడుక్కోవటానికి నా కాడ వూపిరాడుతుందంటే? ఒకటే మెయిన రెక్కలు విరిగే పనాయ. నాబొట్టు గూడ ఇచ్చేడే ఆ బుడ్డోడు వురికన్నా ఎక్కలా.ఏఅమ్మ కన్న బిడ్డోనే. ఒడ్డుకు కొట్టుకొస్తుండాడని సూస్తుండే టాలకి పాయే గదే. ఆ బుడ్డోడు పోయినాడని యేడుస్తుంటే పెరుగుల పాపమ్మ ఏందో అబ్బాయి

ఏట్లానో బతికినీయాల కాని పెరుగు దుత్తలు కాసిని పాయ గదా యని ఏడ్చింది. మాల గూడెం ముండాకొడుకులు పలుగులు పారలు పోయినాయని ఏడుస్తుండిరి. యేందో లేయే యెన్నేళ్ళు బతకాలో ఈ రోత బతుకు. ఆ పిల్లోడి లాగున పోతే పున్యం పండదంటే అన్నాడు బెస్తమనిషి.

"సుబం పలకరా పెళ్లికొడకా అంటే పెళ్లికూతురు ముందేది" అన్నట్లు ఏవిటి నీవు సెప్పేది. బతుకుమీద రోతున్నోడియి నా మెళ్ళో తాలెందుకు కట్టా? ఇక చాల్లే లే, బువ్వతిని కూసింత పడుకో" అని బువ్వేసి నీళ్లిచ్చింది. బువ్వ తిని పడుకొని లేచి, ఏటొడ్డుకు పాయినాడా బెస్త మనిషి.

అక్కడ పనిచేసుకుండే వడ్డి మనుషులలో ఒక ముసలతను

"చూశావంటయ్యా పెద్దాయన, ఆపిల్లోడు ఈదుకు పరుగుదూరంలో పోయితేలాడు. మేం పయిటి బువ్వ తిని చుట్ట పొగాకు తగలేస్తుంటే మాచిన్న పిల్లొచ్చి అయ్యోయ్ ఇందనక ఏటి కాడికి బట్టలుతుక్కోటానికి పోతే బట్టలు ఉతుక్కుండే బండకాడ సిన్నోడి పీనుగ పడుందే. బయం పుట్టి లగెత్తుకుంటు ఇంటికాడ కొచ్చి యేడుస్తూ సెప్పానే. బుట్టలల్లుకుంటూ కూచున్న పిన్నమ్మా, అమ్మా పరుగున లగెత్తుకుంటు పోయి ఆ పిల్లోణ్ణి సేతుల్లో యేసుకుని ఇంటికాడకు తెచ్చారే" అని రొప్పుతు యేడుస్తూ చెప్పేటాలికి మేం లగేసు కుంటూ పోయి సూస్తే పొట్టుబ్బి గుడ్లుతేలేసి పడుండాడు. దేవుడి మీద బారం వేసి పట్టమీద కాలేసి తొక్కేటాలికి నోటెంబడి ముద్దెంబడి బుంగెడు నీళ్ళు కక్కిండు. బొక్కబోర్ల పడేసి కాళ్లకు సేతులకు పసుపేసి మర్దన చేసి వీపున కిరసనాయి లేసి రుద్దేటాలికి పోయిన పానం మళ్లీ వచ్చింది. తడి గుడ్డలిప్పి కుక్కి మంచం మీద గొంగొళ్ళ సందునేసి కప్పి, నోట్లో ఇన్ని యేడ్నీళ్ళు పోసే టాలికి బొట్టు బొట్టు లోనికి పోయినై. రాగి సంకటి పల్చంగా చేసి పొయ్యేండే అని చెప్పి పన్లో కొచ్చా. పోయి సూసిరావయ్యా"అన్నాడు.

కర్నూలు నగరం చాలా పురాతన నగరం. రెడ్ల ప్రభుత్వానికి ముందే ఎన్నేళ్ల నుంచో ఆ నగరం ఆ చుట్టుప్రక్కల కల్లా ముఖ్య నగరంగా వెలసిల్లింది. పడమట తూర్పులుగా వూరికి ఉత్తరాన తుంగభద్రానది పారుతున్నది. హంద్రీ నది కూడా ఊరికి దక్షిణంగా పడమట నుంచి తూర్పుకు పారుతూ వూరిని తిరగేసుకొని దక్షిణ ఉత్తరాలుగా పారి వచ్చి తుంగభద్రలో కలుస్తుంది. వూరికి రెండు ప్రక్కలా హంద్రీ నది, ఇంకో తట్టు తుంగభద్రా నది, అటు పడమర పైపు ఉత్తర దక్షిణాలుగా కర్నూల కడప కాలవ పారుతున్నది. ఆ కాలువ ఎప్పుడు కట్టారో తుంగభద్ర నీళ్ళు సేద్యానికి ఉపయోగించుకోవటానికి

కట్టినట్టుంది. అందువల్ల కర్నూలు నగరం ఒక దీవిలాగా ఎత్తాటి ప్రదగేశంలో ఉంది. దూరానికి బహు ఇంపుగా కనబడుతుంటుంది. ఆ తుంగభద్రా నది గట్టున ఒక కోట ఉన్నది. ఇప్పటికి ఆ నది ఒడ్డున కోటగోడలు, ఒక వాటి పక్కల్న ఎత్తాంటి చెట్లు, ఆ పెద్ద దర్వాజా అవతలి ఒడ్డునుంచి వచ్చే వాళ్ళకు ఒక పెద్ద కోటలో ప్రవేశిస్తున్నట్లు తోస్తుంది. అక్కడ వెనక సాయబులా నగరాన్ని అక్రమించి నప్పుడు గోపాలరావనే ఆయన ఆ ఉత్తర దర్వాజ నుండి నీళ్ళు మెండుగా ప్రవహిస్తున్నప్పుడు డింగీలు కొద్దిగా ఉన్నప్పుడు మనుషులను బండ్లు దాటే రేవు గుండా పారిపోయినాడని, అందువల్ల ఆ దర్వాజాకు గోపాలరావు దర్వాజా అనే పేరొచ్చిందని పెద్దలంటారు.

అదృష్టవశాత్తూ కొనవూపిరితో సుడిగుండంలో మునిగిన నిర్మలరావు నీళ్ల తోపిడికి వొడ్డుకు కొట్టుకొచ్చి ఆ రేవుదగ్గర పడిఉన్నపుడే ఆ బెస్త మనిషితో ఉన్న ఆయన కూతురు చూచింది. అప్పటికి ప్రాణం చిక్కబట్టుకుని ఒడ్డున పడి ఉండగా చూచి చచ్చిపోయిన శవమనుకొని భయపడి పరుగెత్తుకుంటూ పోయి వాండ్ల వాండ్లను పిలుచుకువచ్చింది. ఆ వడ్డెతను కూతరు.

ఆవడ్డె ముసలతను నిర్మలరావు బ్రతికే ఉన్నాడని చెప్పంగానే ఆ డింగీ నడిపే బెస్త మనిషి కోట గోడల ప్రక్కన పరుగెత్తుకుంటూ పోయి కుక్కిమంచం మీద గొంగళ్ళ మధ్య వేడి వేడి రాగి జావ ఆ ముసలతని భార్య పోస్తుంటే గుటక వేస్తు త్రాగుతున్న నిర్మలరావు మొహం కళ్ల చూచి

"ఈ సిన్నోడే మహారాజుకు పుట్టాడో రాచబిడ్డలాగున్నడు. సంద మామంటి సిన్నోడి మీద జాలేసి ఆ దేముడు రచ్చించాడు. అదేపదేలు. ఇంతకు నే లేచిన యేల అసువంటిదె. అబ్బి బ్రతికాడు. ఆ యమధర్మరాజు పాశాలు పుటిక్కిన తెంచుకొని బతుకుజీవుడా అని బైట పద్దాడు. ఇక ఆ మృత్యుదేవత ఈ సిన్నోడి జోలికి రావటానికి నూరేండ్లు పడతాది. బసక్కా బాగా సూసుకో. రెండ్రోజులు లేసి తిరగందే యాడికి పోనియ్యబాక..."అని ఆ ముసలిదానితో చెప్పి వెళ్లిపోయినాడు.

వేడి వేడి జావ తాగగానే నిర్మలరావుకు వంటి నిండా చెమట దిగ జారుతున్నది. బసివి కూతుర్ని పిలిచి "లచ్చి ఆ సిన్నోడి వళ్ళు తుడిచి గొంగళ్ళ తీసి దుప్పటి కప్పి పండెయ్యవే. నేనా కూసింత బుట్ట పొద్దు గూక్క ముందే అల్లేస్తా. ఆ నానిన పూసలెండిపోతే పొద్దుంటికి పనికిరావు. పెలపెల్లాడి ఇరిగి పోతయ్" అని బుట్టల్లుకోవటానికి పోయింది. లచ్చి పాత గుడ్డొకటి తెచ్చి

నిర్మలరావు వంటి మీద చమట తుడిచి, మీద దుప్పటి కప్పింది. నిర్మలరావు కొద్దిగా కండ్లు తెరచి ఆ పిల్ల కళ్ళి చూచి మరుక్షణం కండ్లు మూసుకొని నిద్ర పోయినాడు. లచ్చి పోయి వాండ్లమ్మ ప్రక్కన చువ్వలందిస్తు కూర్చున్నది.

సాయంకాలానికి ఎక్కడెక్కడో పొట్ట కూటికై కూలికోసం బుట్టలమ్మ కోటానికి పోయిన అగూడెంలోని ఆడవాండ్లంతా వచ్చి నీటి గండం తప్పి వూపిరి పోసుకుంటున్న నిర్మలరావును చూడటానికొచ్చారు.

"ఆసమ్మా ఇంతకు ఆయుశ్యముంటే ఏ ఏట్లో పడ్డా బతికి బయట పడతారు. అదిలేకపోతే ఆ ఘడియొచ్చేటాలికి మృత్యుదేవత నెట్టుకొనొచ్చి ఎంత వాండ్ల నయినా ఏదో యిదంగా యత్తకపోతది. ఆ కాస్త ఆయుస్సు చక్కంగా వుంటే ఎంత పెద్ద గణ్ణమొచ్చినా తప్పిపోతది' అని ఒకరు

"ఈ భూదేవి రుణం తీరందే ఎట్లు పోతరులెద్దూ. ఏ కష్టసుఖాలను భవించాల్నో ఏ పాపపుణ్యాల ఫలం అనుభవించాల్నో ఆజీవుడు పుటుక్కున పొమ్మన్నా పోతాడా ఏం? పెండ్లి పేరంటం సేసుకొని దిగుళ్లమారి సంసారం ఈదాలని రాసుంటే" అని ఇంకొకరు అనుకుంటున్నారు.

ఇంతలోకి ఒక ముసలమ్మ వచ్చి ముసి ముసి నవ్వులు నవ్వుతూ వచ్చి "ఏదేవతా పురుషుడో మన లచ్చికోసం వచ్చినట్లు దానొళ్లో పడ్డట్టుంది. బసక్కా ఆ యినాయకుడికి ఇన్ని ఉంద్రాళ్లు పోసి మంచి రోజు చూసు ముడిపెట్టు. నిచ్చేపమంటి బిడ్డలు పుడతారు " అంది.

బసవి "ఎందుకొచ్చిన మాటలేస్తూ ముసలమ్మా. మా లచ్చికన్నా సిన్నోదు లాగుంది. అయినా పరాయి వాండ్ల కిచ్చుకుండేంత ఖర్మం ఏం పట్టింది. ఇంట్లో నా తమ్ముడుంటే"

ముసలమ్మ " ఎద్దాంటి ఆ నలభైయేండ్ల మొద్దు ముండాకొడుక్కిచ్చి దాని గొంతెందుకు కోస్తావులేద్దూ"

బసివి " ఇటువంటి వెధవమాటలు దానెదురుగా మాట్టాడొద్దని ఎన్ని తడవలు చెప్పాలి. పో లేచి పో" అని కొట్టబోయినట్లు లేచింది.

"ఇక చాల్లెస్తురూ గాలాడకుండా ఎందుకట్లా ఈగలు మూగినట్లు పోండమ్మా తల్లుల్లారా" అని అందర్నీ పంపింది. ఆ ముసలిది పోతూ పోతూ "మీ అమ్మకు కోపం వస్తే వచ్చింది గాని ఆ దున్నపోతు ఎదవను చేసుకోగాక. నీసక్కదనానికి తగ్గోణ్ణి సేసుకో" అంటూ వెళ్లిపోయింది.

బసక్క బువ్వొండందరికి పెట్టి నిర్మలరావు నిద్రపోతుంటే పొద్దున్నే

పాత జొన్నలు తొక్కి సంకటి కాచి పొయ్యిచ్చుని తను గూడా భోంచేసి నిద్రపోయింది. లచ్చికి పొద్దుపోయిందాక నిద్ర పట్టలా. ఆ ముసలలిదన్న మాటలు తలపోసుకుంటూ ఆ ముసలి బావను నేను చేసుకోను. పడుచు కుర్నోడ్నిచ్చి చేస్తే చేసుకుంటూ. లేకపోతే గణాచారిలా పెండ్లి చేసుకోకుండా వుంటా. అని తలపోసుకుంటు పొద్దుపోయిన తరువాత నిద్రపోయింది.

నిర్మలరావుకు తెల్లంగ తెలవారంగానే మెళుకువొచ్చి మంచంమీద లేచి కూర్చున్నాడు. ఇంకా ఆ ఏట్లోనే తేలిపోతున్నట్లే ఉందతనికి. కండ్లు నులుముకుంటూ ఆ మట్టిగోడల గుడిసె, దాని ముందర పందిరి, ఆ పందిరి కింద తను పడుకున్న కుక్కి మంచం. కుర్ కుర్ అని అటు ఇటు తిరుగుతున్న పందులు. అప్రక్కనే పారుతున్న మురికి కాలువ. అదోరకంగా కొడుతున్న ఏదో వాసన. ప్రక్కనే కొంత దూరంలో మొండిమొలలతో ఆడుకుంటున్న పిల్లలు. కొక్కొరొక్కొ అని పదికోడి పిల్లల మందతే తలకాయెత్తుకొని ఠీవిగా రాణిలా తిరుగుతూ కళ్ళెలుగా వేసిన మట్టి కుప్పల్లో అప్పుడప్పుడు తలకాయ వంచి ముక్కుతో పొడిచి పురుగు పుట్రను ఏరుకొని తింటు తిరుగుతున్న పెద్ద కోడిని, కోడి పిల్లలను చూచి-

"ఏమిటీ చిత్రం ఎక్కడున్నానబ్బా. ఆ నదిలో మునిగిపోతుంటే రక్షించిందెవరబ్బా? ఇదేదో వద్దె వాండ్ల గూడెంలో వుంది. ఇది కర్నూలవునో కాదో" అనుకుంటూ లేచి నిల్చోపోయినాడు. కండ్లు తిరిగి మళ్ళీ మంచం మీద కూలబడ్డాడు. ఇంతలోనే ఏటికి నీళ్లకు పోయి బుంగచేత పట్టుకుని వచ్చిన లచ్చి కళ్ల చూచాడు. లచ్చి గూడ అతని కళ్ల చూచింది. ఇద్దరి చూపులు ఏకమైనాయి. లచ్చి నలుపైన కండ్లలో వుంది అందమంతా. చూడటానికెంతో అందంగా ఉంది. నిర్మలరావును చూచి ఒక నవ్వు నవ్వి వయ్యారంగా పోయి ప్రక్కన గాబులో ఆ బుంగెడు నీళ్లు కుమ్మరిస్తుంటే పమిట తొలిగి పడుచు అందాలు బయట పడ్డాయి. నీళ్లు కమ్మరించడం కాగానే అదోరకమైన ఒయ్యారంతో తొలిగిపోయిన పైట సర్దుకుంటూ వచ్చి మంచం దగ్గర నిలబడి ముత్యాల్లాంటి పండ్లు బయటపడేట్లు నవ్వుతూ

"ఏమబ్బాయి. ఎలా వుంది ఆకలవుతుందా? మా అమ్మ ఎచ్చం తేవటానికి కోమటింటికి పోయింది. బువ్వుడికింది. మా అమ్మొచ్చి కారం కొట్టి చారు నీళ్ళు పెట్టి బువ్వ పెడుతుంది. నేనింకా నీళ్ళు తేవడం కాలా. నీ

మంచం కింద కచ్చిక, ముంతలో నీళ్ళు పెట్టుంచా. నీవు లెగిచి పండ్లు తోముకుండేటాలికి నేను నీళ్ళెత్తకొస్తా. ఇంతలోకి మా అమ్మ కూడ వస్తది" అని గబ గబా గుక్క తిప్పుకోకుండా చెప్పి నిర్మలరావు జవాబు చెప్పకముందే చప్పున తిరిగి చకచకా అంగలేసుకుంటూ నీళ్ళుతేవటానికి పోయింది.

నిర్మలరావు మెల్లిగా లేచి మంచం కాళ్ల గట్టున పెట్టున్న కచిక పెట్టి పండ్లు తోమటానికి ముంతలో నీళ్లతో మొహం కడుక్కుని వళ్లు తవిడి చూసుకుంటే జంధ్యంలేదు. మొలకు పాత గుడ్డ మాత్రం చుట్టున్నది. తలగడన చూస్తే తన పంచె చొక్కా మడత పెట్టున్నాయి. వాళ్ళ నాయన ఎంతో ముచ్చటగా ఎప్పుడో మూడొందల రూపాయలు ఖర్చు పెట్టి వడుగు చేయించిన జంధ్యం కాస్తా పోయిందని విచార పడ్డాడు.

ఇంతలోకే బసవి బజార్నుంచి వచ్చి "ఏం బాబు లెగిచావా? ఇదిగో నిమిసంలో బువ్వ పెడతా. ఎల్లుల్లిపాయలేసి కారంకొట్టి పెడతా. చారులో చింతపండేసొస్తా" అని గుడిసెలోకి పోయి పొయ్యి మీదున్న దుత్తలో వేడ్నీలల్లో ఇంత ఉప్పు కారం చింతపండేసి "యేం బాబు బాగున్నావా? మా అయ్యగదే ఎంత గండం తప్పింది. వరాలతండ్రయి బతికావు కదే" అని నిర్మలరావు రెండు బుగ్గలు తన చేతుల్తో దిగదుడిచి తన కణతలకేసి అదిమి మెటకరించి గుడిసె లోపలి కెల్లి ఇంత పసుపు, సున్నం తెచ్చి ఒక చట్టిలో నీళ్లు పోసి కలిపి ఎర్ర నీళ్ళుచేసి దిష్టి త్రిప్పి ఆ నీళ్ళు తీసుక వెళ్లి దూరంగా పారేసింది. లచ్చి బుంగ చంకన పెట్టుకొని ఆ బుంగ బరువుకు ఒక ప్రక్కకు వంగి నడుస్తూ గాబు పక్కన బుంగ దించి పెట్టి

"అమ్మోయ్ నీళ్లు పాడుగాను ఇక నే తేలేనే" అన్నది

బసివి "సరేగాని నా పెండ్లి నాటి పెద్దకంచం తీసి లోన యెత్తు పీటేసి అయ్యను కూకోబెట్టయే. కూసింత ఉడుకుడుకు సంకటి నోట్లో ఏసుకుంటాడు" అని లచ్చితో అన్నది. లచ్చి గుడిసె లోపలికెళ్ళి మంచం మీది జాజికాయ పెట్టె తీసి కంచం బైటికి తీసి శుభ్రంగా బూడిదేసి తోమి కడిగి యెత్తు పీటేసి నిర్మలరావు మంచం దగ్గరకొచ్చి

"ఏం అబ్బాయి లెగుస్తావా లెగదోసేదా?" అని వంగి నిర్మలరావు బుజాలు పట్టుకున్నది. నిర్మలరావు లేచాడు. దడ బుట్టి కండ్లు తిరిగి లచ్చి బుజం మీద చెయ్యేసి కొంచెం సేపు నిలబడ్డాడు. దడ అగి కండ్లు తిరగటం

మానంగానే గుడిసెలో వేసుంచిన పీట మీద లచ్చి సహాయంతో పోయి కూచున్నాడు. బసివి కంచంలోకి కొద్దిగా ముద్ద సంకటి తోడి కారం కలిపి ముద్దలు పెట్టబోతుంటే నిర్మలరావు చెయ్యిచాచాడు. బసివి "ఆ చెయ్యేట్టా వణకుతుంటే నీవు పట్టకపోతే యేం?" అని ముద్దలు నోట్లో పెట్టింది. నిర్మలరావుకు ఆ ముద్దలు తింటుంటే ఇంటి వద్ద అమ్మ, పినతల్లి, మేనత్త సీతమ్మ తన కట్లా ముద్దలు పెట్టడం జ్ఞాపకమొచ్చింది. వాండ్లు పెట్టిన ముద్దల కన్నా ఈ బసివి ఇంత ప్రేమగా పెదుతున్న ముద్దలు ఎంతో రుచిగా ఉన్నట్లని పించింది. ఆనాడు శబరి యెంగిలి పండ్లు రాముడెంతో అప్యాయంగా తిన్నట్లు తిన్నాడు. బసివి కలిపిచ్చిన ముద్దలు తినడం అయిపోగానే బసివి కంచంలోనే చేతులు కడిగి, నిర్మలరావు మూతి తుడిచింది. లచ్చొచ్చి లేవదీసి మంచంమీద కోచోబెట్టింది. కొంతసేపటికి మంచం దగ్గర ఒక పక్కన బసివి మరోపక్కన లచ్చి వచ్చి కూర్చున్నారు. మంచంమీద కూర్చున్న నిర్మలరావు మీద బసివి ప్రశ్నల పరంపరను కురిపించింది.

బసివి " ఇక సెప్పునాయనా నీకతేందో, యాడ్నించి వస్తున్నాయేంది?"

నిర్మల "నేను గద్వాల నించి వస్తున్నాను"

బసివి "మీ అయ్య అమ్మ లేరంటయ్యా"

నిర్మల " అంతా ఉన్నారు"

బసివి "యాడ గద్వాల్లోనా"

నిర్మల "వుం.. దక్షిణాదిన"

బసివి "అయితే ఎందుకీ దేశమొచ్చా"

నిర్మల "చదువుకోటానికి"

బసవి "సదువుకోటానికి ఆడ సదువులేదా?"

నిర్మల "ఉన్నయి వుంటే బీదవాళ్ళకి చదువులెవరు చెప్పిస్తారు"

బసివి మనస్సులో ఏందబ్బా బాపనోళ్ళ సిన్నోడి మాదిరి యాస లేకుండా స్వచ్ఛంగా మాట్లాడుతుండాడు. కొంప ముంచి కూడి పెట్టి కులం సెడగొట్టిన పాపం మెడకు సుట్టుకోదుగదా!అనుకొని పెద్దగా "యేమిటోళ్ళు బాబు?"అన్నది.

నిర్మల "యే కులమైతేనేం. కులంలో ఏముంది"

బసివి " అట్టా అనగాకయ్యా. నా బిడ్డనిచ్చి చేద్దామని నీకులమడిగా" అని చతురుగా నవ్వింది.

పక్కన కూచున్న లచ్చి సిగ్గుతో తలకాయొంచుకొని ముసి ముసి

నవ్వులు నవ్వింది.

బసివి "యే కులవని అడిగితే సెప్పవేందయ్యా? బాపనోండ్లా"

బసివి ఈ మాటలనగానే నిర్మలరావు మనస్సు చివుక్కుమంది. నా కులం చెబితే ఇక నీళ్ళన్నా ఇవ్వరు. ఈ అవస్థలో ఎక్కడికనిపోయేది? ఇంకోళ్లయితే ఇంత ప్రేమగా చూసుకోరు. అని మనస్సులో అనుకొని జవాబు చెప్పకుండా కండ్లు మూసుకున్నారు.

బసవి "నీకంత కష్టంగా ఉంటే చెప్పగాక. పడుకో. నీకు ఓపికొచ్చినప్పుడే చెబుదుగాని. తొందరేం వొచ్చిందిలే" అని లచ్చి వేపుకు మళ్లి "లచ్చి నీచెల్లెలేదే? యాడాడుకుంటున్నదో దుత్తలో బువ్వేసిస్తా మీఅయ్యా వాండ్లకు బువ్విచ్చిరా" అన్నది. లచ్చి దుత్త నెత్తిన పెట్టుకొని పోగానే బసివి మళ్లీ బుట్టలల్లుకుంటూ కూచున్నది. చిన్నపిల్ల చేత అన్నం పెట్టి పంపించింది. నిర్మలరావు మళ్లీ నిద్రపోయినాడు. సుమారు మూడు గంటలకు నిర్మలరావుకు మెళుకువ వచ్చి లేచి మంచం మీద కూచున్నాడు. దూరాన పంది పిల్లల్ని అదిలిస్తున్న లచ్చి కనబడ్డది. మెల్లెగా మంచం మీద నుంచి లేచి కూర్చున్నాడు. వళ్లు తిరగలా. తల కింది పంచె తీసి కట్టుకున్నాడు. చొక్కా తొడుక్కుంటుంటే లచ్చి వచ్చి

"యే అబ్బాయ్, ముస్తాబవుతున్నాయే యాడికి పోతా?" అన్నది

"ఏమిలా వూరికే పంచె వేసుకున్నా, కాసిని మంచినీళ్ళు ఇయ్యి. అని మంచం మీద కుచున్నాడు నిర్మలరావు. లచ్చి ముంతలో మంచినీళ్లు తెచ్చిచ్చింది. అవి త్రాగి ముంత క్రింద పట్టి "మీ అమ్మేది" లచ్చి నడిగాడు.

లచ్చి "మా అమ్మ ఏటికాడికి బట్టలుతుక్కోటానికి పోయింది. నాకు బయమేసి నే పోలా"

నిర్మలరావు " ఈ పంచెలో కట్టిన పైకం ఏమైంది?"

లచ్చి "నిన్న పంచె గుంజేస్తుంటే తీసి మూట కట్టుకున్నా. ఇయిగో తీసుకో" అని 2-4-3 తీసి నిర్మలరావు చేతిలో పెట్టింది. నిర్మలరావు పైకం బొడ్లో దోపుకున్నాడు. లచ్చొచ్చి మంచం దగ్గర నిలుచుని ఏదో అడుగుదామని సంశయిస్తూ "యేం అబ్బాయ్, యేం అబ్బాయ్" అని రెండు తడవలు తడబడుతూ అన్నది. నిర్మలరావు "ఏందో చెప్పు" అన్నాడు.

లచ్చిసిగ్గుతో తలకాయెత్తకుండా "నన్ను సేసుకొని ఈడుండరాదా" అన్నది. నిర్మలరావు ఒళ్ళు జలదరించింది. ఇక్కడ వుంటే బలవంతానన్నా నాకీ లచ్చి నిచ్చి పెండ్లి చేస్తారు. కులం చెడుతుంది. మా అమ్మా, నాయనకు,

గంపెడంత మంది బంధువులకు కాకుండా పోతా. వీళ్ళు చూస్తే వడ్డె వాళ్లలా గున్నారు. పందులు కాచుకుంటూ మట్టి తట్టలు మోసుకుంటూ పలుగులు పెట్టి గుంటలు తవ్వుతూ బ్రతకాల్సి వస్తుంది. ఈ పిల్లను వాళ్ళమ్మ కోసం పోయి రమ్మని కాళ్లకు బుద్ధి చేప్పి ఇక్కడ్నుంచి సాగిపోతా లేకపోతే చివరకు వడ్డె కులంలో కలసిపోవాల్సొస్తుంది. ఆలస్యం అమృతం విషం అన్నారు. అనిమనసులో అనుకొని పైకి

"అమ్మాయ్ మీ అమ్మను పిలుచుకురా మాట్లాడుకుందాం" అన్నాడు లచ్చితో. లచ్చి తనను చేసుకుంటానికే వాండ్లమ్మతో చెప్పటానికి పిలవ మంటున్నాడనుకొని బట్టలుతుక్కోటానికి పోయే లచ్చి అని వాండ్లమ్మ చెప్పినప్పుడు "నిన్నట్నించి నాకాడ దయ్యాలున్నాయని బయంగా వుందే. రాత్రి గూడా ఎవ్వరో నా కాలు పట్టక లాక్కపోయినట్లు కలొచ్చిందే. నేనా చాయలకు పోనే" అని తనన్న మాటలు కూడా మరచిపోయి నిర్మలరావు తనను పెండ్లి చేసుకుంటాడనే సంబరంతో చంకలెగరేసుకుంటూ చక చక యేటి కల్లి పోయింది. లచ్చి అటుపోగానే నిర్మలరావు మంచం మీద నుంచి లేచి సందులు గొందులు దాటి చివరకు కాసేపటికి రోడ్డు మీదకు తేలాడు.

బలవంతాన కట్టబెట్టి పెండ్లి చేస్తారేమో ననే భయంలో ఒంట్లో ఇంకొంచెం శక్తి పెరిగి దూకుళ్ల మీద దారి బట్టి పోతూ మొదట ఎదురైన మనిషితో "ఏమండీ సత్రమెక్కడ బ్రాహ్మల"మన్నాడు.

ఆయన " ఇక్కడ సత్రాలేమీ లేవు. ఈ రోడ్డునే పోతే రామ మందిరం వుంది. అందులోనే బ్రహ్మలుండటానికి గదులున్నాయి. పోయేదారినే పో" అన్నాడు. నిర్మలరావు గడ గడ వొణుకుతూ రొప్పుతూ రోస్తూ ఇంకోర్నడిగి కనుక్కొని ఆ రామమందిరంలో కొచ్చి ఒక మూలన నాపరాళ్ళు పరిచున్న చట్రం మీద 'బతికానురా దేవుడా'అనుకుంటూ ముడుచుకొని పడుకున్నాడు. కొంతసేపటికి దడ దడ మని కొట్టుకుంటున్న గుండె కుదట పడి దడ అణిగింది. లేచి కూచొని చుట్టూ పరికించి చూశాడు.

అది ఒక నల్చదరంగా కట్టబడిన కట్టడం. మధ్య మధ్య స్తంభాలేసి పైన ఒ చప్పరం వేసి మెరాబాగా వేసిన మండపం మాదిరి మండపం మధ్యలో వుంది. ఒక మూలన గుడి మాదిరి వేరే కట్టడం కట్టున్నది. ఆ గుడివైపు కొనన ఉత్తరంగా నాలుగు గదులున్నాయి. ఇటు దక్షిణంగా కూడా నాలుగు గదులున్నయి. కుటుంబాలతో వచ్చిన బాటసారులైన బ్రహ్మలకు, కోమట్లకు

ఈ గదులిస్తుంటారు. మండపంలో మాత్రం సాధువులు, సన్యాసులు అప్పుడప్పు డొచ్చి వుంటుంటారు. ఈ కట్టడం ఉత్తర దక్షిణాలకు కొంచెం పొడుగ్గా వుంటుంది. పడమటి ద్వారం రోడ్డుమీద కుంటుంది. నిర్మలరావు మెల్లగా లేచి వచ్చి గుళ్లో తెల్లటి చలువరాతితో తొల్చిన సీతారామలక్ష్మణుల విగ్రహాలు చూచాడు. యెంతో అందంగా వున్నాయి విగ్రహాలు. పైన వున్న గంట కొట్టి నమస్కారం చేసి "నన్నెట్లాగన్నా గట్టుకు చేర్చు నాకేమైనా మార్గం చూపు రామచంద్రా " అని ఒక స్తంభాని కానుకొని కూచున్నాడు.

ఆగుడి పూజారి బైటికొచ్చి "ఎవరబ్బాయినువ్వు" అని రెండు అరటిపండ్లు చేతులో పెట్టాడు. పూజారి అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పకుండా అవి మెల్లిగా తింటూ కూచున్నాడు. ఆ పూజారి నిర్మలరావు మాట్లాడకపోవటం చూసి అక్కడ్నించి వెళ్ళిపోయినాడు. అప్పుడు ఎదుటి గది ముందు కూచున్న ఇంకో చిన్న పిల్లవాడు వచ్చి నిర్మలరావు దగ్గర కూచున్నాడు. "ఎవరబ్బాయి మీరు" అని అడిగాడు.

"మేంబ్రాహ్మలం" అన్నాడు నిర్మలరావు

ఆపిల్లవాడు "ఐతే ఎందుకొచ్చావిక్కిడికి"

నిర్మల 'బీదవాడ్ని ఎక్కడన్నా మాధవకళం ఎత్తుకొని చదువుకుందామని వచ్చా"

ఆపిల్లవాడు "ఎన్నళ్లయింది వచ్చి"

నిర్మల "ఇప్పుడే"

ఆపిల్లవాడు "అయితే నేను గూడా మాధవకళం ఎత్తుకొని వేదం చదువుకుంటున్నాను"

నిర్మల " నాకు ఇంగ్లీషు చదువుకోవాలనున్నది"

ఆపిల్లవాడు "పోనీయ్ చదువుకో ఎక్కడుంటా?"

నిర్మల "ఎక్కడుండేది నాకే తెలియదు"

ఆపిల్లవాడు " నీకు వడుగయిందా"

నిర్మల "అయింది కాని ఏట్లో స్నానం చేస్తుంటే జంధ్యం పోయింది ఈరోజే"

ఆపిల్లవాడు "అయితే అబద్ధాలు చెబుతున్నావేమో బ్రాహ్మణుడివి కావేమో"

నిర్మల "లేదు బ్రాహ్మణ్నే"

ఆపిల్లవాడు "అయితే మీ ప్రవర చెప్పు"

నిర్మలరావు ఋషులతో ప్రాంభించి "శాండిన్యస గోత్రహ యుజర్వేద శాఖాధ్యాయీ ఆపస్తంభ సూత్రహ నిర్మలరాయ శర్మన్ అహంభో అభివాదయే" అని పూర్తి చేశాడు.

ఆపిల్లవాడు "సరే నేను జంధ్యం తెచ్చిస్తాను. సంధ్య వార్చుకొని వేసుకో" అని గదిలోకి పోయి జంధ్యం తెచ్చిచ్చాడు. ఒక పంచపాత్రతో నీళ్ళు కూడా తెచ్చిచ్చాడు. నిర్మలరావు చొక్కా విప్పి ఆచమనం చేసి యజ్ఞోపవీత మంత్రం చదువుకుంటూ జంధ్యం వేసుకున్నాడు.

ఆపిల్లవాడు " రేపు నున్నంగా నా మాదిరి జుట్టు గొరిగించుకొని పిలక కొంచెం పెద్దదిగా పెట్టుకో. మా ఇంట్లోనే వుందువుగాని. అనెక్కు మా అమ్మతో చెపుతా. మానాయనగూడా ఒప్పుకుంటాడు. ఇక్కడ కొంచెం సేపటికి దద్ధోజనం ఇస్తారు. ఈ పూటకు దద్ధోజనంతో సరిపెట్టుకో. పూజారితో చెప్పి కొంచెం ఎక్కువ ఇప్పిస్తాను. రేపట్నుంచి నా వెంబడి వద్దువుగాని. ఇదివరకు ఎన్నడన్నా మాధవకళం ఎత్తుకున్నావా?"

నిర్మల "లేదు ఇక నేర్చుకోవాల్సిందే"

ఆపిల్లవాడు "అయితే నేను బాగా నేర్పుతాలే భయవడవాకు. మా అమ్మ ఎవరింటికో పేరంటానికెళ్ళింది. మానాయన బజారుకెళ్లాడు. వాండ్లు రాంగానే ఇక్కడే వుండే ఏర్పాట్లు చేస్తా" అని పెద్దవాళ్ళు చెప్పినట్లు ధీమాగా చెప్పాడు.

నిర్మల " మీరెవరేమిటి?"

ఆపిల్లవాడు " మేం వైదికులం. మాది కనిగిరి. అక్కడ బ్రతకుతెరువు లేక ఇక్కడికొచ్చాం. నేను మాధవకళానికి పోతుంటా. మానాయన బ్రాహ్మణార్థాలకు పోతుంటాడు. మాఅమ్మ ఎవరన్నా ముత్తయిదువులకు పెట్టు కుంటేనో, పేరంటానికి పిలుస్తుంటేనో పోతుంటుంది. నాకు పదోయేదు. ఇద్దరు చెల్లెళ్ళున్నారు. మాబోటి కుటుంబాలు శానామంది కనిగిరి వదిలిపెట్టి ఇక్కడికి వచ్చేశారు. సంతర్పణలకు, సంభావనలకు అందరం వెళుతుంటాము. నేను తెచ్చిన దాంట్లో సర్దుకోవాల్సిందే. నాకేదన్నా జబ్బు చేసి ఒకరోజు పోలేకపోతే ఆరోజు పస్తులుండ వలసిందే. మానాయనకు మోకాలు కలకలు. విశేషంగా ఎక్కడికి పోడు. సంభావనల్లో సంపాయించుకొని మూట గట్టకపోవచ్చని అంతా లేచొస్తుంటే మేము వచ్చాం. తీరా ఇల్లు వాకిలి వదిలి ఇక్కడకొస్తే పొట్ట గడవడం

కష్టంగా వుంది. గర్భ దరిద్రం అనుభవిస్తున్నాం. ఇక్కడ ఇంట్లో ఇట్లా వుంటే అక్కడ ఆ వేదాలు చెప్పే బ్రాహ్మడింటికి పోతే అరవ చాకిరి చేయించుకొంటాడు. ఒక పనస చెప్పటానికి ఆయనకు నెల పడుతుంది." అని కండ్లెంబడి నీళ్లు పెట్టుకున్నాడు.

నిర్మలరావుకు కూడా కండ్లెంబడి నీళ్ళు తిరిగాయి. "దేశంలో ఇంత గర్భ దరిద్రులున్నారే ఈ దరిద్రం పోగొట్టే లేదు గామాల. ఇంకా బ్రాహ్మలన్న వాండ్లు నాలుగుమంత్రాలు చెప్పి, బ్రాహ్మణార్థాలు చేసో బ్రతుకుతుంటారు. కదం వాళ్లు పొద్దస్తమానం చాకరి చేసుకొని బతకాల్సిందే కదా. ఒక్కొక్కప్పుడు చాలా మందికి చాకిరి చేసుకుందామన్నా పని దొరకదు కదా. వారికి మడత కుడుములే  గతి కదా. పస్తులుండో బలసాకు తినో బ్రతకుతుంటారుకదా. కొంతమందికి గంజి గూడా దొరకదు గదా. పోనీ పంటలు పండటం లేదనుకుంటే ఏటా పంటలు పండుతూనే వుండె. డబ్బు లేదనుకుందామా వున్న వాండ్ల దగ్గర ఎంతో డబ్బుండె. తిన్నంత తిని  పారేసే వాండ్లు కూడా ఉన్నారు. ఇంతకూ ఈ సమాజ నిర్మాణం లోనే ఎక్కడో ఏ కీలో తప్పింది. పెద్దవాడ్నయిన తరువాత ఈ కీలకం కనిపెట్టి పాటుక తోయటానికి ప్రయత్నిస్తా" అని అనుకుంటూ కూచున్నాడు నిర్మలరావు.

ఎదురుగా గది మెట్ల దగ్గర "ఏం రా అబ్బాయ్ ఎక్కడికి పోయావురా?" అనే కేక వినబడ్డది. ఆ పిల్లవాడు "అదిగో మా అమ్మొచ్చిం"దని లేచిపోయినాడు. ఆమెకు సవిస్తరంగా నిర్మలరావు సంగతి చెప్పినాడు. కొంచెం సేపటకి వచ్చి నిర్మలరావును పిలుచుకుపోయినాడు. ఆ పిల్లవాడి తల్లి నిర్మలరావును ఎగాదిగా తేరి పార చూసి "పోనీయ్ ఇక్కడ్నే వుండనియ్యరా. మనమేమన్నా పెట్టి పోషించదున్నది గనకా. మన మున్నట్టే అతను వుంటాడు" అన్నది.

మరునాడుదయం పదిగంటలకల్లా నిర్మలరావును ఆ పిల్లవాడు తయారు చేసాథు. నున్నటి గుండు, పిలకజట్టు, మెళ్ళో జంధ్యం, చేతిలో జోలె, మొహాన ఎదురురొమ్మున రెండుచేతుల నిండా విభూదిరేఖలు, ఒక చేతిలో పంచపాత్ర, ఆపిల్లవాడి వెనకాలే ఒక బ్రాహ్మణింటికి వెళ్ళారు ఇద్దరు.

"భవతీ బిక్షాం దేహి.. బ్రాహ్మలమండీ మదాకవళమండీ" అన్నాదా పిల్లవాడు. పళ్ళెంలో ఇంతన్నం పెట్టుక్కొని దానిమీద కొంచెం పప్పేసుకొని తీసుకొచ్చింది ఒక వితంతువు. "ఓహో ఒకరికిద్దరైనారే, ఆ అబ్బాయిదేవూరు?"

అన్నది.

"అతనిది దక్షిణాది. బీద పిల్లవాడు. ఇంగ్లీషు చదువుకోటానికి నిన్ననే ఈ వూరోచ్చాడు." అని నదరు బెదురులేకుండా చెప్పాదా పిల్లవాడు. అతను పంచెపాత్రను కింద పెట్టి జోలె పట్టాడు. అట్లాగే నిర్మలరావు కూడా చేశాడు. అతను వంగి పంచెపాత్ర మీద చెయ్యానించి నీళ్లు కాసిని చిలకరించి పంచపాత్ర చేత పుచ్చుకున్నాడు. అట్లాగే చేశాడు నిర్మలరావు గూడా. ఈ విధంగా కొత్తకోడెను అరకలవాటు చేసినట్లు ఆ పిల్లవాడు నిర్మలరావుకు మాధవకవళం ఎత్తుకుండే నేర్పరితనం నేర్పాడు.

ఇట్లా రెండుమూడు రోజులు గడిచిన తర్వాత ఇద్దరూ ఒకేసారి ఒకే వీధికి పోతే బాగుండదని అతనొకతట్టు, నిర్మలరావొకతట్టు పోవటం ప్రారంభించారు. అప్పట్నుంచి నిర్మలరావు నాలుగిండ్లు తిరిగి జోలె నిండా అన్నం పట్టుకొచ్చేవాడు. ఆ పిల్లవాడి తల్లి ఏంతో సంతోషించేది.

"నీ మొహారవిందం అటువంటిది నాయనా. మావాడు పోతే తెచ్చిన దాంట్లో కూడా మిగిలించుకొని వెనక్కు తీసుకపోతారు. నిన్నేమన్నా అడిగి పెడతారా?" అన్నది

"అడిగేదేముంది. ఒకపద్యమో శ్లోకమో చదవమంటారు. లేకపోతే ఇంగ్లీషు చదువుకోటానికొచ్చానంటున్నావు కదా, ఏది రెండింగ్లీషు ముక్కలు మాట్లాడమంటారు. ఒక పద్యమే శ్లోకమో చదివి ఇంగ్లీషులో రెండుముక్కలు మాట్లాడితే రోజుటికన్నా ఎక్కువగా అన్నం కూరలతో సహా తెచ్చిపెడతారు. అక్కడెవరో పంతులుగారిల్లుంది. అక్కడ మరీ ప్రేమగా పెడతారు. అక్కడ్నే తినమంటారు గూడా" అన్నాడు నిర్మలరావు.

ఈవిధంగా పదిరోజులు గడిచినయి. ఆ పిల్లవాడితండ్రి కాళ్ళలో కలకని ఇంట్లో నుంచి కదలటమే మానుకున్నాడు. తల్లి గూడ తిని తేపుతూ సంతోషంతో కాలం గడిపేది. ఒకరోజూ ఆ పిల్లవాడు "నీవు వచ్చిన తరువాత నాకు మొట్టికాయలు తప్పినయి. ఎంత తిరిగినా జోలె నిండేది కాదు. ఇంటోకి రాగానే మా అమ్మ మొట్టికాయలు కొట్టి ఈ కాస్త ఎవరి ముక్కులో పెడదామని తెచ్చావురా. ఇప్పుడేం తినాలి? చిన్నపిల్లలకు మధ్యాహ్నానికేం పెట్టాలె? అని మళ్లీ పంపుతుంది. నేనేదుస్తూ ఇంకా నాలుగిండ్లు తిరిగి ఇంకొంచెం తెచ్చేవాడ్ని. ఒక్కొక్క రోజు ఓ కోటకు కూడా పోతుండే వాడ్ని. తిరిగి తిరిగి కాళ్ళు కండెలు కట్టిపోయేవి. నీధర్మాన నా కష్టాలు కొంత వరకు తీరినయి." అని నిర్మలరావుతో

చెప్పి కండ్ల నీళ్లు కారాడు.

పదహేను రోజులైన తరువాత ఒకరోజు నిర్మలరావు గుడికెదురుగా కూచోని నేనీవిధంగ చదువు సంగతి ఎత్తకుండా ఏన్నాళ్లని వుండేది? అపంతులు గారింటికి ఈ రాత్రి పోయినప్పుడు అయన్నడిగి చూస్తా. బిచ్చ మెత్తుకుని పొట్టనింపుకుంటుంటే లాభమేముంది? అని అనుకొని ఆ రాత్రి పంతులు గారింటికి వెళ్లినప్పుడు అప్పుడే భోంచేసి వస్తున్న పంతులుగారితో

"అయ్యా నేను హైదరాబాదులో ఫోర్తుఫారంలో చేరి కారణాంతరాల వశాత్తు వదిలిపెట్టి రావలసివచ్చింది. బీదవాడ్ని, తల్లిదండ్రులు కూడా బీదవాండ్లు. నన్నే విధంగా నన్నా ఇక్కడ హైస్కూల్లో చేర్పించే ఏర్పాటు చేయండి. నేను బతికున్నంతకాలం మిమ్మల్ను తలచుకుంటా. మీకు పుణ్యముంటుంది" అన్నాడు

"అయితే రేపు నీవు ఉదయం నీవిక్కడకొస్తే నిన్ను పరీక్ష చేసి చూసి ఈ ఆర్నెల్ల పరీక్షలో కూచోపెట్టిస్తా. పరీక్షలో మంచి మార్కులతో పాసయినావంటే స్కూల్లో చేర్పిస్తా. చదువుకోటానికి. ఇక్కడి కొస్తుంటే నేనే నీకు ప్రయివేటుగా చదువు చెపుతుంటా" అన్నారాయన.

నిర్మలరావు మర్నాడుదయం పోగానే పరీక్ష చేసి చూసి "నీవు నిక్షేపంగా పరీక్ష పాసవుతావు. నెలరోజుల్లో పరీక్షలు ప్రారంభమవుతాయి. తప్పకుండా రోజూ మాయింటికి వచ్చి చదువుకుంటుండు. నీకు కావల్సిన పుస్తకాలు నేనిస్తా. ఒకరిద్దరు స్నేహితులతో మాట్లాడి నీ స్కూలు ఫీజు కూడా ఏర్పాటు చేస్తా. ఈ యేడు పరీక్ష బాగా మంచి మార్కులతో పాసయితే వచ్చే యేడు స్కాలర్‌షిప్ వచ్చేట్లు చూస్తా" నన్నాడు.

అప్పటినుండి నిర్మలరావు ఆ శంకరరావు పంతులుగారింటికి పోతూ రాత్రిపూట అక్కడ్నే వుండటం ప్రారంభించాడు. ఇతని తెలివితేటలకు ఆయన యెంతో సంతోషించి ఎక్కువ శ్రద్ధతో చదువు చెబుతూ వుండే వాడు. శంకరరావు గారు మధ్వ బ్రాహ్మణుడు. కొంచెం పొట్టిగా యెర్రగా అందంగా వుండేవాడు. అప్పటికి ఆయనకు పాతికేండ్ల లోపే. మంచి కసరత్తు చేసిన శరీరం. శరీరం ఎంత సొంపుగా ఉండేదో మనసు గూడ అంత గొప్పదే. బీద పిల్లలంటే బహు ప్రేమ. చుదువు చెప్పడంలో బహునిపుణుడు. ఆయన భార్యగారు ధర్మ తల్లి. ఆయన తల్లిగారు మహాతల్లి. కొద్దిరోజుల పరిచయంతోటే నిర్మలరావు వారింట్లో అందరితో పాటుగా ఒకటిగా అతికి పోయినాడు. కొంతకాలానికి ఆ వాతా వరణం నచ్చక అక్కడ్నించి బయల్దేరినాడు.

 

ముందుగా అనుకున్నట్టే ఎస్‌దాస్ ఆ అధికారి ఆజ్ఞల ప్రకారం అక్కడ తిరుగబాటు చేస్తున్న సైనిక పటాలం దగ్గర పారాచూట్ సహాయంతో విమానంలో నుంచి క్రిందికి జారి ఆ సైనికుల దగ్గరికి వెళ్లాడు. అంతలోకి హరిరామ్‌సింగ్ పోలీసు బూర ఊదినాడు. సైనికులందరూ బార్లు తీర్చి నిల్చోగానే ఎస్‌దాస్ వాండ్ల నాయకులతో మాట్లాడినారు. "మీరు వట్టి పుణ్యానికి అంత గలభా చెయ్యగూడదు" అన్నాడు చివరగా. అంతలోకి విమానం ద్వారా ఆహారంతో నిండిన హుండీలు జారవిడిచారు. వాండ్ల నాయక్ గోపాల్ వచ్చి "బహుశా విషం కలిపారేమో" అన్నాడా సైనికులతో. అప్పుడు ఏస్‌దాస్ ఒక బల్లమీద ఎక్కి "హిందూస్తానీ సిపాయియోంకో జై" అని అరిచాడు. వాండ్లూ అరిచారు.

ఏస్‌దాస్ నినాదాలు ఆగిన తర్వాత "అధికారుల ప్రకటనలో మోసం ఉన్నట్లు నాకు కనపడటం లేదు. చావణిలో ఉన్న అందరూ సైనికులతో మాట్లాడిన తర్వాత మనమేం చెయ్యాలో నిర్ణయించుకుందాం. ముందు ఆ హుండీలలో విషం కలిపారేమో చూద్దాం. విషం కలపకుండా ఉంటే ఈ ప్రకటనలో చెప్పినట్లు మన కోర్కెలు వాండ్లు నెరవేరుస్తారనుకుందాం. ముందుగా నేనా హుండీల్లో ఆహారం తిని చూస్తాను, పదండి" అని క్రిందకి దిగాడు. సిపాయిలంతా అతని వెంబడి పద్దారు. ఏసుదాసు ఒక హుండీ దగ్గరకు వెళ్ళి కూర తీసి నోట్లో వేసుకోబోయినాడు. అంతలోకి హరిరామ్ సింగుగారొచ్చి "నీవట్లా వేసుకోవద్దు. కావాలంటే ఏ జంతువుకన్నా వేసి చూద్దాం. అని అక్కడ పారాడుతున్న తన పిల్లిని పిల్చివేసాడు. అది ఉర్లగడ్డ ముక్క తిన్నది. ఇంకో హుండీలో నుంచి రొట్టెముక్క తెచ్చి వేశాడు. పదినిమిషాల పోయిన తరువాత తనే ఒక చపాతి, కూర తిన్నాడు. ఇంకొంచెం సేపటికి తలా కాస్త తిని చూశారు.

ఏసుదాస్ "సరే ఇప్పుడొచ్చిన తొందరేమీ లేదు. ఈపూటకు భోజనాలు చేసి కొంచెం విశ్రాంతి తీసుకొని లేచి అందరం కలిసి ఆలోచిద్దాం. ఈ లోపల మన సర్దారులు కలిసి ఏం నిర్ణయిస్తారో చూద్దాం" అన్నాడు. హరిరామ్ సింగు గారు కూడా అదే మంచి పని అన్నాడు. హుండీలు పోగు చేయించి అక్కడున్న వారందరికి ఆహారము పంచి. లేని వాండ్లకు దాచిపెట్టి ఉంచారు. భోజనం చేసేటప్పుడు అల్లాబక్షుగారి దగ్గర్నుంచి కబురొచ్చింది. భోజనానంతరం

అక్కడ సర్దారుల సభకు వాండ్లు వెళ్లారు. నాయక్ గోపాల్, ఇంకా కొంతమంది తెల్లవాండ్లకు వ్యతిరేకంగా ఉన్నారు. ఏస్‌దాస్ వాండ్లకెంతగానో నచ్చచెప్పాడు. సాయంకాలం సిపాయిలందరినీ మరో సభకు పిల్చి సభికుల ఇష్టప్రకారం నడుచుకుందామనే నిర్ధారణకు వచ్చారు. నాయక్ గోపాల్ "ప్రభుత్వం లొంగింది. మనం గెలిచాం." అని కేకలు వేస్తూ చావణీ కొస్తుంటే మధ్యలో ఇంకో రెండువేల మంది సిపాయిలు తిరుగుబాటులో చేరటానికి వచ్చారని తెలిసిం దప్పుడు. అప్పటికే ఏస్‌దాస్ వచ్చిన పని సగం పూర్తయింది. ఆ సాయం కాలం సిపాయిల సభలో అల్లాబక్షుగారు ప్రకటన చదివి ఈ ప్రకటనలో ఉన్న విజయాలను నేనే మాత్రం నమ్మను. ఇది మనల్ని మోసం చెయ్యటానికి వేసిన ఎత్తు. మన సంఖ్య రోజురోజుకు పెరిగిపోతున్నది. ఇంకొక వారంరోజుల తర్వాతా కొన్ని ఊళ్లనే మనం అక్రమించుకొని అక్కడ ఇండ్లలోనే మన చావణితీలు ఏర్పాటు చేసుకోగలం" అని ఉత్సాహమైన మాటలు మాట్లాడి ఈ రోజు వచ్చిన రెండు వేల మందిలో ఎవరన్నా మాట్లాడండి. మీ అభిప్రాయం తెలియజెయ్యం"దన్నాడు. ఒకరిద్దరు లేచి "మేము మా ప్రాణాలను అర్పించటానికి వచ్చాము గానీ, ఒక తడవ ప్రభువులే లొంగిన తరువాత దేశం కాని దేశంలో మనం మూర్ఖించి లాభంలేని పనులు చెయ్యకూడదు. మనం దేనికొరకైతే తిరుగుబాటు చేశామో ఆ పని పూర్తయింది" అని పెద్దగా ఆవేశంలో చెప్పాడు. అంతా చప్పట్లు కొట్టారు. నాయక్ గోపాల్ లేచి మంచి ఉద్రేకంగా మాట్లాడుతూ సంధి షరతులతో పంపటానికి తగిన శాంతమూర్తి వివేకుడు ఏసుదాసు దప్ప ఇంకొకడు లేడని ఈ ప్రకటన షరతుల ప్రకారం ఏసుదాస్‌గారికి సర్వాధికారమిచ్చి వారికి సలహాగా అల్లాభక్షుగార్ని హరనాయక్ సింగు గారిని నాయకుడు ముల్లాఖాన్‌గారిని, రాంసింగ్ గారిని, ఇంకా ఇద్దరు సర్దారులను పంపమని తీర్మానం తెచ్చాడు. ఒకరిద్దరు వ్యతిరేకంగా మాట్లాడి, సంధి వద్దు,చివరిదాకా పోరాడుతాం" అని అన్నారు. బహుసంఖ్యాకులతో తిరుగుబాటు ఆలోచన విరమించుకొనేలా చేస్తూ వాండ్లకు అన్ని సౌకర్యాలు కలిగించేలా ఒప్పించాడు.

అక్కడికి ఏసుదాసు వచ్చిన కార్యం పూర్తయింది. పర్షియా నుండి గైడుగా వచ్చి అతను అక్కడ కలిశాడు. ప్రేమపూర్వకంగా ఏసుదాసుతో కరచాలనం చేసి అభినందించాడు. ఆరోజు సాయంకాలమే ఏసుదాసుతో

బయలుదేరిన అతను రాత్రికల్లా లండను చేరుకున్నారు.

ఇక్కడ అమాయకపు సిపాయిలను విడివిడిగా అనేక తెల్లవాండ్ల చావణీలలోకి పంపారు. తిరుగుబాటు నాయకులను విడదీసి నాయక్ గోపాల్‌ను అరెస్టు చేసి ఖైదులో వేశారు. తిరుగుబాటు అణచివేశాడని ఏసుదాసుకు కితాబిచ్చారు. అల్లాబక్షు మాత్రం ఆ గూఢచారి గోపాలు బారినుంచి తప్పించుకున్నాడు. నాయక్ గోపాలు గూఢచారి అధికారి మన్ననలకు పాత్రుడై పూనా దగ్గర పది ఎకరాల భూమి సంపాదించుకున్నాడు.

  

వాండ్ల పెండ్లి బ్రహ్మసమాజ మందిరంలో ఏర్పాటు చేసినారు. మద్రాసంతా బలాదూరుగా తిరిగి రావటానికి ట్రాము టిక్కెట్టేగా. వాటిలో లోపం లేకుండా జరిగినన్నాళ్ళు నేనుచింత పడాల్సిన విషయమేమీలేదు. నా సుఖం నేను చూసుకుంటే అక్కయ్య సుఖం అక్కయ్య చూసుకుంటుంది. నాకెందుకూ అని దొడ్లో తోటమాలి ఏతంతొక్కి చెట్లకు నీళ్ళు పెడుతుంటే చూస్తూ గచ్చు బావి వొడ్డున కూర్చున్నాడు రాంభద్రయ్య.

బ్రహ్మంగారు జేబు రుమాలు తీసు మూతి తుడుచుకుంటూ "పెండ్లి పిలుపు చదివారు. ఈ విందు పిలుపు కూడా చదవండి" అని బొత్తిలో నుంచి తీసి పిలుపు పత్రిక తీసి లేచి చేతికివ్వబోయినాడు.

కాంతమ్మ చీరచెంగుతో ఆనందబాష్పాలు తుడుచుకుంటూ "మీరే చదవండి. వింటా" అన్నది

బ్రహ్మం గారు "ఓం బ్రహ్మకృపాహి కేవలం ప్రేమ వివాహపు విందు పిలుపు. మా ప్రేమ వివాహ సందర్భమున రాయపేటలో మా నివాస గృహమైన 'కామినీవిహార్' బంగళాలో, రెండు ఆరు పంతొమ్మిదివందల పదహారు రాత్రి ఎనిమిది గంటలకు వన భోజనపు విందునివ్వ నిశ్చయించితిమి గాన తమ బోటి సంఘసంస్కరణ ప్రియులు తప్పక మీ బంధు మిత్రాదులతో విందారగింపవిచ్చేసి మమ్ము కృతార్థుల చేయ ప్రార్థన. ఇట్లు వోగిరాల సీతయ్య, వోగిరాల కాంతమ్మ, కామినీ విహార్, గమనింపవలసిన విషయం, విందులో వర్ణ విభేదములు, జాతి మతములు పాటింపబడవు" అని స్వశ్ఛమైన ఉచ్చారణతో చదివాడు.

కాంతమ్మ విందులో వర్ణవిభేదములు, జాతి మతములు పాటింప

ఐదవ న్నపుడు మాత్రం కొంచెం మనసు బితుక్కుమన్నది. అయితే ఇది చివరకు వర్ణ సంకరపు పెండ్లి అని ఒప్పుకున్నట్లుందే. అందులో అంతా కలసి భోం చేయట మెట్లా? అనుకొని రాత్రి సీతయ్యగారు బ్రాహ్మలకు, బ్రహ్మోలకూ భేదం లేదన్నమాట జ్ఞాపకం వచ్చి

"అయితే నాకు తెలియక అడుగతా, బ్రహ్మోలకూ, బ్రాహ్మలకు భేదం ఏమిటండీ? మావారు ఏంలేదన్నారు" అని మెల్లిగా తల వొంచి ఆయన వంక వార చూపు చూస్తూ అన్నది.

బ్రహ్మోంగారు ఫక్కున నవ్వి "మీకు వారికి గూడ మా సమాజం కొత్త. బ్రహ్మణీకాన్ని దాని గొప్పను రూపు మాపటానికి పుట్టింది మా బ్రహ్మ సమాజం. బ్రహ్మజ్ఞానంతో 'బ్రాహ్మణః' అనే పదం సార్ధకం చేసే వాళ్ళం మేము. నేను గూడా ఒకప్పుడు మీ మాదిరి శుద్ధ ఛాందస కుటుంబానికి చెందిన వాడినే. కానీ నాలో చీము నెత్తురు ఇతరులలో గూడా వుందని, నాకున్న దేముడు ఇతరులకు గూడా ఉన్నాడని, ఇతరులను మనకన్నా తక్కువ వారని చూడటం తప్పని ఈ మానవ కోటి అంతా ఆ పరమాత్ముని సృష్టి అని ఆ సృష్టిలో హెచ్చు తగ్గుల చీలిక పెట్టి ఒకరిని, ఇంకొకరు ద్వేషంగా చూసేటట్లు చేసే బ్రహ్మోణ సమాజం కలంకనీయమని తెలసుకొని ఆ భగవంతుడనే వాడొక్కడే అని, అతని బిడ్డలమైన మనమంతా ఒకే కుటుంబంగా వుండి సాంఘిక దురాచారాలను రూపుమాపి కుల భేధాలు లేకుండా ఆ ఏకోపాసుకుని ప్రార్థన చేస్తూ అందరం కష్టం చేసుకొని సఖంగా జీవిస్తూ కాలం గడిపాలనే అంశం గుర్తించి నేను ఈ సమాజంలో చేరాను. రాను రాను మీకన్ని విషయాలు తెలుస్తవి. మా సమాజ మందిరానికి ప్రార్థనల కొస్తూ, మా పత్రికలు, కరపత్రాలు చదువుతుండండి. మీకు తోచిన సందేహాలు అప్పుడప్పుడు నన్నడిగి తీర్చుకుంటండి" అన్నాడు.

కాంతమ్మ "నాకీ విషయాలన్నీ తెలుసుకోవాలని ఎంతో ఆశగా వుంది. తప్పకుండా వచ్చి తెలుసుకుంటాను. అయితే రెండో తారీఖున విందుకు ఏమి ఏర్పాటు చేశారు?"

బ్రహ్మం "ఆభారమంతా నాదిలేండి. వొక్క తడవ మా సమాజంలో చేరిం తరువాత వారికి పొదుపు, మట్టసం నేర్పే భారం నామీదనే వుంటుంది. నిదానం మీద అన్నీ వాటంతటవే చక్కబడతవి. వెళ్ళొస్తా, సెలవని" లేచాడు. ఆమె గూడా లేచింది. ఆయన వెళ్తూ నమస్కారం చేస్తే మళ్ళీ నమస్కారం

చేసింది.

బ్రహ్మంగారు రిక్షా సేవాశ్రమం దగ్గర నిలిపి ఇంత దూరం రానే వొచ్చాను. అంబుజమ్మాల్ గారిని స్వయంగా చూసి, పెండ్లికి విందుకూ ఆహ్వానిద్దామనుకొని లోపలికెళ్ళాను. అమె తన ఆఫీసు గదిలో కూర్చొని ఉత్తరాలు రాసుకుంటుంటే ఈయన అక్కడ ఉన్న ఆయనతో పంపిన చీటీ చూసుకొని లోపలికి రమ్మని కబురు చేసింది. బ్రహ్మంగారు లోపలికెళ్ళి ఆమెకు నమస్కారం చేసి ఎదురుగా ఉన్న కుర్చీమీద కూర్చొని

"ఇవాళ తమకు పోస్టు ద్వారా ఆహ్వానం పంపాను. తప్పక 2వతేది ఉదయం రాత్రి గూడా పెండ్లికి విందుకూ మీ భర్తగారి సమేతంగా దయ చేయాలి" అన్నాడు.

ఆమెగారు "బ్రహ్మంగారూ నాకు తీరికనేది ఎప్పుడూ లేదు. ఈ సంస్థ నెత్తిన వేసుకున్న తరువాత మునిగానాం తేలానాంగా వుంది నా పని. అనేక కుటుంబాలు నడపవచ్చు గాని ఇటువంటి సంస్థ ఒకటి నడపడమంటే మాటలు గాదు. ఈ సంస్థ ప్రారంభించేటప్పుడు ఎంతో ఉత్సాహంతో ఇది ఎంతపని అనుకొని ప్రారంభించా. కానీ రాను రాను ఇందులో ఉన్న కష్టసుఖాలు ఇప్పుడు తెలుస్తున్నాయి. ఒక సమస్యకాదు అనేక కొత్త సమస్యలు ప్రతిదినం తీర్చాల్సివస్తుంది. ఈ విషాదకరమైన ఉత్తరం ఒక స్త్రీ దగ్గర నుండి వస్తే దానికి ఏవిధంగా జవాబు ఇవ్వటమా అనే సందిగ్ధంలో పడి కొట్టుకుంటున్నా. అవునందామా ఆ స్త్రీ ముగ్గురు పిల్లల పోషణ బాధ్యత నా నెత్తిన పడుతుంది. కాదందామా వాండ్లనేక కష్టాల పాలవుతారు. అదీగాక ఇన్నాళ్ళ నుంచి ఇంత పెద్ద సంఘ సంస్కర్తలమని తల యెత్తుకు తిరుగుతున్న మా భార్యాభర్త మనస్సాక్షి కొట్టుకలాడుతుంది. పోనీ ఆ స్త్రీ పెనిమిటి మీద దావా వేసి 'మనవర్తి' ఇప్పిద్దామా అంటే ఆయన ఎప్పుడో పది ఏండ్ల క్రితం కలకత్తాలో బ్రహ్మ సమాజంలో పెండ్లి చేసుకున్నాడట. పెండ్లి తరువాత రిజిష్టరు చేయించలేదట. పెండ్లి చేయించిన వారి పేర్లుగాని, ఎక్కడ జరిగింది గాని ఆ స్త్రీకి తెలియదు. చూదండి, ఉత్తరం చూడండని బ్రహ్మంగారి చేతికిచ్చింది.

దయార్ధహృదయులైన శ్రీ అంబుజమ్మాళ్‌గారికి తల్లీ మీరు నన్ను అనేక మార్లు చూచే ఉందురు. నేను ఈ పట్టణంలోనే ఉన్న ఒక పత్రికా సంపాదకుని భార్యను. నేనొక పల్లెటూరు బీద బ్రహ్మల పిల్లను. నా తండ్రి నాకు చిన్నతనంలోనే పెండ్లిచేయాలని ఎంతో ప్రయత్నించాడు. మా ప్రథమ

శాఖల బ్రాహ్మలు చాలా కొద్దిమంది. కట్నాలు కానుకలు ఇవ్వటానికి శక్తిలేక ఎక్కడన్నా ఒకబీద పిల్లవాడిని వెతికి పెండ్లి చేయాలని చూశాడు. కానీ దురదృష్ట వశాత్తు ఎక్కడో మనువున్నదని పోయి వస్తూ దారిలో పాము కరిచి చని పోయినాడు. మా అమ్మ వూళ్ళో బ్రతుకు తెరువులేక నన్ను నన్ను తీసుకొని నెల్లూరు నగరం వచ్చి అక్కడ వంటలు చేసుకొని బ్రతుకుతుండేది. ఆమె గూడా అనేక సంబంధాలు విచారించి చూసింది. ఎక్కడా మనువు కుదరలేదు. కొన్నాళ్ళకు, నా కప్పుడు పదునాల్గు ఏండ్లు . రసజస్వల కూడా అయినాను. కానీ మా అమ్మ మాత్రం రజస్వల కాలేదనే చెప్పుతుండేది. అప్పటికీ మనువులేవీ కుదరలేదు. మేము అప్పుడొక పెద్ద నియోగి కుటుంబీకుల ఇంటికెదురుగా కొష్టంలో వుండేవాళ్ళం. ఆకుటుంబం వారి పిల్లవాడు మా ఇంటికి వచ్చి పోతుండేవాడు. ఒకరోజు మా అమ్మకు జబ్బుచేస్తే అపిల్లవాడు మా అమ్మకు మందులు అవి తెచ్చిపెట్టి అక్కడనే పడుకున్నాడు. మా అమ్మకు మైకం కమ్మి పడివుంటే మా ప్రేమ ప్రళయ ప్రేమలోకి దిగింది. చివరికి కడుపు అయింది. ఆ పిల్లవాడు మద్రాసులో బియ్యే పాసయి వచ్చి అప్పటికి ఆరునెలలు అయింది.

నాకు కడుపు అయిందని తెలిసిన నాల్గవనెలలో ఒకరోజు మా ఇంటికి వచ్చి ఈరాత్రి మెయిల్లో మనం కలకత్తా పారిపోదాం. అక్కడ నిన్ను పెండ్లి చేసుకుంటా. ఇక్కడ మావాళ్ళు నిన్ను చేసుకోవటానికి వొప్పుకోరు. నీవు రజస్వలై ఉన్నావని నీవు మా శాఖ కాదని కారణాలు చెప్పుతారు.ఎక్కడకో పోయి పెండ్లి చేసుకొని వచ్చిన తరువాత వారు చేయగలిగింది లేదని చెప్పాడు.

మా అమ్మ వంటలు చేసి రాత్రి ఇంటికి రాకముందే నాకు మగవాని వేషం వేసి 'బలార్నీసు'కప్పి బండెక్కించుకొని తీసుకెళ్ళాడు. ఆయన వచ్చేటప్పుడు చేతినిండా పుష్కలంగా డబ్బు తీసుకొని రాబట్టి కలకత్తాలో ఒక ధర్మశాలలో కొన్నాళ్ళుండి చివరకు ఒక ఇల్లు అద్దెకు తీసుకొని వున్నాం. ఆయనకెక్కడో ఇంగ్లీషు పత్రికలో నెలకు **50** రూపాయల ఉద్యోగం గూడా దొరికింది. ఒకరోజు బ్రహ్మసమాజంలో పెండ్లి ఏర్పాటు జేశానని రమ్మని గుర్రపుస్వారీ బండిలో తీసుకెళ్ళాడు. అక్కడ ప్రార్థనలతో పెండ్లి జరిగింది. అక్కడ మూడు సంవత్స రాలున్న తరువాత ఇద్దరు పిల్లల తల్లినయినా. వారికిక్కొడొక పత్రికలో నెలకు **150** రూపాయల పత్రికా సంపాదకుడిగా ఉద్యోగం దొరికితే వచ్చాము. వారు మాత్రం అప్పుడప్పుడు నెల్లూరు పోయి వస్తుండేవారు. మా అమ్మ నేను లేచిపోయిన రెండునెలల్లోనే చనిపోయిందని చెప్పారు. ఒక యేడుపు ఏడ్చి

స్నానంచేశా. తమరప్పుడప్పుడు మీ సంస్థ విషయంలో మాట్లాడటానికి మా ఇంటికి వస్తున్నప్పుడు మిమ్ములను చూచాను. నన్ను చూస్తే గుర్తుపడతారు. ఇక్కడికొచ్చిన తరువాత ఒక ఆడపిల్ల కూడా పుట్టింది. ఇప్పుడు నాకు ఇద్దరు ఆడపిల్లలు. ఒక మగ పిల్లవాడు. వారికి ఎలా సంబంధం కుదిరిందో వారికన్నా ఒక సంవత్సరం పెద్దదైన డాక్టరమ్మతో సంబంధం కుదిరింది. పదిరోజులనాడు నన్ను పిల్లలను నిర్దయగా వదిలిపెట్టి వెళ్ళిపోయినారు. ఇప్పుడు ఏకాకిగా ఒక సత్రంలో పడి ఉన్నాను. ఇదేమి అన్యాయం పెండ్లిచేసుకొని వదలటం న్యాయమా? మా మనవర్తి అయినా ఇవ్వండి అంటే నిన్ను నేను పెండ్లి చేసుకోలేదు. నీకూ నాకూ సంబంధం లేదని వెళ్ళిపోయేటప్పుడు చెప్పి పోయినాడు. వీలయినంతవరకు ఇప్పటికైనా వారికి మీరు నచ్చజెప్పగల్గితే వారితో కాపురం చేయటానికి నాకభ్యంతరం లేదు. నాతప్పేమిటి? ఎందుకు వదిలిపెట్టిపోయారు. అని అడిగితే నీవు అందగత్తెవు కాదు. నీవు చదువురాని దానవు. నాకు చదువుకున్న పెండ్లాముంటే మేమిద్దరం కలిసి సంపాదించుకొని బాగా జీవించవచ్చని చెప్పారు. దయచేసి ఈ దీనురాలిని  రక్షించ ప్రార్థన. ఇట్లు వం.నరసమ్మ, మార్వాడి సత్రం, తొలసిందం వీధి, మద్రాసు.

బ్రహ్మంగారు ఉత్తరం ఆసాంతం చదివి "నాకాయన ఎవరైంది తెలిసింది. ఆయన నిన్న మా ఆఫీసుకు ఆ డాక్టరమ్మతో వచ్చాడు. జూన్ 10వ తారీక్కు పెండ్లి చేయించమని చెప్పి, ఆ ఏర్పాట్ల కోసం ఈ సాయంకాలం ఆఫీసుకు వస్తానని చెప్పిపోయినాడు. ముందు మీరామెను ఇక్కడికి తీసుకొచ్చి వుంచితే మన శక్తంతా ధారపోసి చేయగల్గిన సహాయం చేద్దాం.

అంబు "అయితే ఉత్తరానికి జవాబిచ్చేదానికన్నా ఇప్పుడే వెళ్లి ఆమెను పిల్లలను ఇక్కడికి తీసుకొస్తా. మీరు మాత్రం వీలైతే ఆయన్నిక్కడికి సాయంకాలం తీసుకురండి. అంత ఆమెను ఏలుకోనంటే యే కొంతన్నా మనవర్తి నిచ్చేట్టు చేద్దాం.

బ్రహ్మ "ఓ తప్పకుండా అలాగే చేద్దాం. మీరు మాత్రం రెండవ తేదీన మరచిపోవాకండి. ఈ వివాహ మాత్రం అటువంటిది కాదు. ఆయన సి.ఐ.డి. ఇనస్పెక్టర్. పెండ్లి కూతురు కూడా చాలా అందంగా కొంచెం ఆస్తితో కూడా వచ్చినట్లుంది. వారు ఇక్కడికి దగ్గరలోనే కామినీవిహార్‌లో కాపురముంటున్నారు. విందుకు కూడా తప్పకుండా దయ చెయ్యండి. మీకు దగ్గర కూడానూ."

అంబు నవ్వుతూ" మీరు చేయించే పెండ్లిలో స్త్రీకి పూర్తిగా రక్షణ

వుండేటట్లు 1817ఏ ఎక్ట్ ప్రకారం ప్రతి పెళ్లి రిజిష్టరు అయ్యేట్టు చూడండి. లేకపోతే ఇటువంటి చిక్కులు రావచ్చు. చివరికా పాపం మీరు మూట కట్టుకోవాల్సొస్తుంది."

బ్రహ్మం "వీలైనంత వరకు జాగ్రత్తగానే వుంటున్నాను. మీ సలహా కూడా శిరసావహిస్తా. సరే వెళ్ళొస్తానండి" అని చెప్పి శలవు పుచ్చుకొని తన స్వగృహానికి వెళ్ళారు బ్రహ్మాగారు.

అంబుజమ్మాళ్‌గారు తన గుఱ్ఱపు బండి కట్టించుకొని ఆ సత్రంలో కెళ్ళి నరసమ్మ గారిని గుర్తించింది. ఆమె ఈమె వాకిట్లోకి రాగానే ఎదురుగా బోయి నమస్కారం చేసి మొహానికి చెంగడ్డం పెట్టుకుని భోరున ఎడ్చింది. అంబుజమ్మాళ్‌గారు లోపలికి వచ్చి కొంచెం ఎదిగున్న ఇద్దరు పిల్లల్ని ఎత్తి ముద్దు పెట్టుకొని కింద అంబాడుతున్న చంటి బిడ్డను ఎత్తుకొని "రాపోదాం నరసమ్మా" నరసమ్మకు ప్రాణం లేచొచ్చింది. ఏడ్పుతోనే చిరునవ్వు నవ్వి అమెతోపాటు బండ్లో కూచున్న తర్వాత

"అమ్మా మీబోటి తల్లులు ఈ ప్రపంచంలో వుండబట్టే మాబోటి నిర్భాగ్యులకు శరణ్యమవుతున్నారు" అన్నది

అంబు "అంతా భగవత్కృప, నాదేముంది? నేను కేవలం నిమిత్త మాత్రురాలిని"

నరసమ్మ "వారేవరైందీ తెలుసుకున్నారా?"

అంబు "తెలుసుకోలేకేమి? తెలుసుకున్నాం. బహుశా సాయంకాలం మన అశ్రమానికి రావచ్చు"

నరసమ్మ "అయితే ఇప్పుడే మీరు వారితో మాట్లాడతారా?"

అంబు "లేదు ఒక స్నేహితుడు అయనను తీసుకొస్తామన్నారు."

నరసమ్మ "ఇంతకూ ఆయన్నని కూడా లాభంలేదు. నేను కొంచెం నలుపన్న మాట వాస్తవమే. నాకంత చదువుకూడా రాదు. అమె చదువుకున్నది. కొంచెం నాకన్నా ఎరుపు. నేను చూడలేదు. అన్నీ ఆయనే చెప్పారు."

అంబు "అయితే మీ ఇద్దరి మధ్య తగాదా ఏమన్నా జరిగిందా."

నరసమ్మ "రామరామ లేదండి ఆ సంబంధం బహుశా ఈ చంటిబిడ్డను కడుపుతో ఉన్నపుడు కలిగుంటుంది. ఈ బిడ్డ పుట్టిన తర్వాత నన్ను స్నేహితంగా చూచేవాడు. భార్యగా చూడలా పదిరోజుల నాడు అన్నీ చెప్పి బైటి కెళ్లగొట్టి ఆ ఇల్లు తాళం వేసి అయిదు రూపాయలు చేతిలోపెట్టి ఎక్కడన్నా బతుకు ఏమన్నాకా

అని బహుతెంపుతో పిల్లల కళ్ళ కూడా చూడకండా వెళ్ళిపోయాడు" అన్నది.

కొంతసేపటికి ఆ ఆశ్రమంలో తను స్వయంగా పడకకు, భోజనానికి ఉపయోగించుకునే గదిలో ఈ పిల్లను తల్లిని వదలిపెట్టి ఆపీసు పనిచూసుకొని వెళ్ళి పూలచెట్లకు నీళ్లు పోస్తుండగా బ్రహ్మగారు ఆ పత్రికా సంపాదకులు ఆ డాక్టరమ్మ వచ్చారు. ఆఫీసుకెదురుగా అదివరకే వేసి ఉంచిన కుర్చీల మీద కూచున్నారు. బ్రహ్మగారు మాత్రం వారికీ విషమేమీ చెప్పలా. వారికి నరసమ్మ ఆ పిల్లలు అక్కడున్నారని తెలియిదు.

అంబు "ఏమండీ సంపాదకులుగారూ, మీరిద్దరు వివాహం చేసుకుంటారరటగా"

సంపా "అవునండీ అలాగే నిశ్చయించుకున్నాం"

అంబు "అయితే మీ భార్యా పిల్లలను ఏంజేస్తారు"

సంపా "నేనిదివరకు పెండ్లి చేసుకోలేదు"

అంబు "అయితే మీ ఇంటికి నేను రెండు తడవలొచ్చినపుడు ఉన్నవారెవరండీ?"

సంపా "వివాహం చేసుకున్న భార్యగాదు"

అంబు "మీరు కలకత్తాలో ఆమెను పెండ్లి చేసుకోలేదా? ఆరేండ్ల క్రితం మీరామెను నెల్లూరు నుంచి లేపుకుపోలేదా?"

ఇంతలోకి ఆడాక్టరమ్మ "అంబుజమ్మాళ్‌గారూ ఇన్ని ఆరాలు ఎందుకూ? ప్రతిదినం సంఘసంస్కర్తలని తిరుగుతూన్న మనం వొకరి మొఖాలు ఒకరు చూసుకోవాలి. అది అంతా నిజమే ననుకోండి. ఇప్పుడేమి చెయ్య మన్నారోచెప్పండి."

అంబు " దయచేసి మనమని నన్ను కలుపుకోమాకండి. నేను మీలాంటి సంఘ సంస్కర్తని కాను"

డాక్టరమ్మ " అయితే స్త్రీ స్వాతంత్ర్యం మీరు కోరరా"

అంబు" స్త్రీ స్వాతంత్ర్యం అనే పేరుతో ఇతర కాపరాలు చెడగొట్టే వ్యవహారాలు నేను ఎప్పుడూ ఒప్పుకోను క్షమించండి"

డాక్టరమ్మ "అయితే మీరిప్పుడేమంటారు"

అంబు "అనేదేముంది. ఈ సంపాదకులుగారు ఇప్పుడామెను తీసుకు పోయి ఆమెతో కాపురం చేయమంటాను."

డాక్టరమ్మ "అయితే నన్నేం చేయమంటారు."

అంబు "అది మీయిష్టం"

సంపా "అదంతా వట్టిమాటండి. వొక్క తడవ విడిచిపెట్టిన దానితో కాపురం చెయ్యలేను చెయ్యను. మేమిద్దరం పెండ్లి చేసుకోవాల్సిందే."

అంబు "అయితే మనవర్తి ఇవ్వండి"

డాక్టరమ్మ "సరేలెండి. మీ ఇష్టప్రకారం మనవర్తి ఇచ్చే బాధ్యతనాది. తప్పో వొప్పో మంచో చెడో మా ఇద్దరికి కలిగిన మనో నిర్బలత వల్ల సంబంధం కుదరింది. పెండ్లి మాత్రం చేసుకోవలసిందే కాని, వారిష్టపడితే ఆమెకూడా ఇంట్లో వచ్చి వుండటానికి నాకభ్యంతరం లేదు."

సంపా "నాకుమటుకేం అభ్యంతరం, నీకులేనిది. వుండనియ్యి. ఇంట్లో వంట చేసినట్లవుతుంది."

అంబు "ఇది మరీ చిత్రంగా వుంది. అయితే వుండండి. ఆమే మంటుందో" అని ఆయిని పిల్చి నాగదిలో ఉన్న అమ్మగారిని పిల్లలను పిలుచుకు రావే" అన్నది

ఆమె రాగానే డాక్టరమ్మ, సంపాదకులు గూడా ఆశ్చర్యపోయారు.

అంబు "ఏమమ్మా మీరు ముగ్గురూ కలసి కాపరం పెడతారా?"

అమాయకపు నరసమ్మ ఏడుస్తూ "వారిష్టప్రకారం ఏమైనా చేస్తాను. వారికి నామీద ప్రేమ తగ్గినా, నాకు మాత్రం వారిమీద ప్రేమ తగ్గలా"

అంబు " అయితే మీకు పిల్లలు పుడితే ఆమె పిల్లల గతి ఏమి కావాలండి డాక్టరమ్మగారూ"

డాక్టరమ్మ "నాకుమాత్రం పిల్లలు పుట్టరు. నేను సంతాన నిరోధ సంఘంలో చేరిన దానను. ఆపిల్లలనే నా పిల్లలుగా చూచుకుంటూ వుంటా. అందులో ఏ లోపం వుండదు. రిజిష్టరు పెండ్లి మాత్రం చేసుకుంటాం మే మిద్దరం" అని అంబుజమ్మాళ్ గారితో చెప్పి నరసమ్మతో "మన ముగ్గురం కలిసి కాపురముందాం. నిన్నెప్పట్లాగే ఆయన చూచే బాధ్యత నాది"

ఆ డాక్టరమ్మ ఉదారస్వభావానికి, తను లేపుకుపోయిన పెండ్లి చేసుకున్న నరసమ్మ ప్రేమకు పొంగిపోయి, సంపాదకులు కళ్ళనీళ్ల కారుస్తూ "రావే పోదాం" అన్నాడు.

ముగ్గురూ అంబుజమ్మాళ్‌గారికి, బ్రహ్మంగారికి నమస్కారాలు పెట్టి వెళ్లిపోయారు. బ్రహ్మంగారక్కడే దిగబడ్డారు. వారటుపోగానే అంబుజమ్మాళ్‌గారు " అ నరసమ్మను, పిల్లలను ఏ కోస్తాలోనన్నా దింపి రారుకదా"

బ్రహ్మం" దింపేట్లు కనబడ్డంలేదు. మొగుడూ,పెళ్ళాలకు ప్రేమ ఉన్నట్టుగా వుంది. కాని మధ్య వచ్చిన డాక్టరమ్మ కూడా చదువుకున్నది. హృదయం కలది. కాబట్టి తను చేసేది తప్పని తెలిసి ఈ విధంగా సవరించు కున్నది."

"కామినీవిహార్" ఒకపింఛను పుచ్చుకున్న పోలీసు ఆఫీసరు గారు తాను స్పెషల్ బ్రాంచి డిప్యూటీ సూపరింటెండెంటుగా ఉన్నపుడు కట్టించిన బంగాళా అది. స్పెషల్ బ్రాంచి పోలీసులంటే ప్రభుత్వానికి ఆయువుపట్టన్నమాట. ఆబ్రాంచి సక్రమంగా పనిచేసినన్నాళ్లు ఏ ప్రభుత్వమైనా ఢోకా లేకుండా సాగు తుంటుంది. వారు దేశంలోని ప్రతి రాజకీయపార్టీ గురించి వాటి పుట్టు పూర్వోత్తరాల గురించి అన్నీ బైటికి తీసి ఆసంస్థలలోకి వాండ్ల ఏజంట్లను సభ్యులుగా చేర్చి అక్కడి ఆరాలన్నీ తీస్తుంటారు. అవసరమొచ్చినప్పుడు రష్యాలో పోలీసు ఛీఫ్ జుబీటల్ అనే అతను కార్మిక సంఘాలు పెట్టించినట్లు వీండ్లు కూడా అటువంటి సంఘాలు పెట్టిస్తూ ప్రజల సక్రమమైన పోరాటాలను పెడదారులు దీయటానికి ప్రయత్నిస్తుండేవాండ్లు. వందేమాతరోద్యమం దేశంలో ప్రారంభమైనప్పటి నుంచి, పైకి వచ్చిన విప్లవసంఘాలలో అనేక శాఖలు ఎక్కువగా వీండ్లే ఏర్పాటుచేసి అవి ప్రారంభమైన ఉద్దేశ్యాలను నానాటికి నశించేట్లు చేస్తూ, అందులో దేశభక్తితో ఉద్రేకంతో, దేశసేవ చేద్దామనే ఉద్దేశ్యంతో, చేరిన వాళ్ళందరినీ పైకిలాగి ఉన్నవి లేనివి కల్పించి, వాండ్లను ఏ ద్వీపాంతర దీవులకు జయిళ్ళ పాలు చేసారు. చాలామంది నవయువకులను వురిపాలు గూడా చేశారు.

మద్రాసు రాజధానిలోని తెనుగు జిల్లాలని, అరవజిల్లాలని రెండు ప్రాంతాలుగా విడదీసి ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్క డిప్యూటీ సూపరింటెండెంట్ ను నియమిస్తారు. వారికి ఒక్కొక్కరికి సంవత్సరానికి 2500రూపాయలు లెఖ్క చెప్పాల్సిన అవసరంలేని మొత్తం రాజకీయ సంస్థలలో ఉన్న వారికి, ఆచూకి ఇచ్చేవారికి బహుమతిగా ఇవ్వటానికనీ ఇష్టమొచ్చిన విధంగా తనకు కావలసిన ఇన్ఫర్మేషన్ తీయటానికి ఈ మొత్తం ప్రభుత్వము వారు ఇస్తారు. దీనిలో దాదాపు అంతా వారి స్వంతానికే ఖర్చు అవుతుంది.

రేపు నా భార్య నీలగిరి పోతుంది. అమెను స్పెన్సరుకు తీసికెళ్ళి కావల్సిన వస్తువులు కొనిపెట్టమనో, నాకూతురు కారొకటి కావాలంటున్నది చూసిపెట్టమని లౌకికంగా చెపుతారు. ఆవిధంగా అవరమైనవి లేనివి అన్నీ

కొనివ్వాల్సిందే. లేకపోతే ఉద్యోగమే దక్కదు. ఈ విధంగా ఏదో విధంగా కొంత ఖర్చైనా సగటున సంవత్సరానికి డీప్టీ సూపరింటెండెంటుకు పదిహేను వేలన్నా మిగులుతవి.

సాధారణంగా ఈ ఉద్యోగం మూడు సంవత్సరాలకన్నా ఎక్కువ ఎవరికీ ఇవ్వరు. అదీగాక సర్వీసంతా అయి దాదాపు పింఛను పుచ్చుకోబోయే వారికే ఇస్తారు. అందువల్ల ఈ ఉద్యోగం లోకొచ్చి రిటైరవుదామనే అశతో చాల మంది ఇనస్పెక్టర్లు చూసి రమ్మంటే కాల్చి వచ్చే పనులు చేస్తూ ఉంటారు. పై అధికారులకు అతి భృత్యానుభృత్యులుగా వుంటుంటారు. తోటి ఇనస్పెక్టర్ల మీద, ఉద్యోగస్తుల మీద గూడా లేనిపోని సాడీలు చేపుతుంటారు.

ఈ కామినీ విహార్ కట్టించిన రిటైర్డ్ డీప్టీ సూపరింటెండెంట్ ఆఫ్ స్పెషల్‌బ్రాంచి పిళ్ళేగారు కూడా ఈ విధంగా సంపాదించిన డబ్బుతోటే లోపలంతా చలువరాతితో, బయట పెళాస్త్రీతో బహుదిట్టంగా వుండేటట్లు ఆబంగాళా కట్టించాడు. కానీ పిళ్ళేగారి అదృష్టమో దురదృష్టమో లేదా పాపిష్టి డబ్బు మహత్యమో ఆఇంట్లో చేరిన వారిద్దిరిలో, ఒకరికి పిల్లలు చనిపోవడం, ఒకరికి భార్య చనిపోవడంతో ఆ బంగళాకు దయ్యాల బంగలా అనే పేరు పడ్డది. మన ఇనస్పెక్టరు కాంతమ్మను ఇక్కడకు తీసుకొచ్చేముందు ఒకతడవ మద్రాసు రావడం అక్కడ సెంట్రలు స్టేషన్‌లో పిళ్ళేగారు కనబడటంతో పెద్దవాడు కదాని రెండు చేతులెత్తి దణ్ణంపెట్టాడు. పిళ్ళేగారు సమయం చిక్కింది కదాని "మీకెట్లాగో ఇల్లు కావాలి కదా" అన్నాడు. నాకు కామినీవిహార్ అని దివ్యమైన బంగాళా వుంది. మీరు భలానా రోజున వస్తామంటే శుభ్రం చేయించి వుంచుతా. స్టేషన్ కొచ్చి నా కార్లోనే మిమ్మల్ని అక్కడికి తీసుకెళ్తా. రెండు మూడు నెలలు అద్దె ఇవ్వకుండానే వుండండి. మీకా బంగలా నచ్చినప్పుడే అక్కడ కాపుర ముండటం అచ్చొచ్చిందనుకుంటే అద్దె మాట్లాడుకుందాం" అన్నాడు.

"నాకు అచ్చిరావటానికి ఇంకెవరికన్నా అచ్చిరాలేదా ఏమండీ?" అన్నాడు సీతయ్య

పిళ్లేగారు చప్పరిస్తూ "చుట్టుపక్కల వాండ్లు నేనింత ఆస్తి సంపాదించానంటే చుప్పనాతితనంతో అక్కడికి వచ్చిన వాండ్లందరితో దయ్యాలున్నాయని, భూతాలున్నాయని భయపెట్టి వెళ్లగొట్టుతున్నారు. చెప్పొద్దూ" అన్నాడు.

"నాకటువంటి భయాలేం లేవు. నేనే ఒక భూతాన్ని. ఏప్రిల్ 27వ తేదీ ఉదయం మెయిలుకు భార్యాసమేతంగా వస్తా . తప్పకుండా బంగళా అంతా శుభ్రం చేయించండి. ఏదో నాకు తోచిన అద్దె ఇస్తుంటా. నేనీరోజే ఆఫీసు పనిచూసుకొని రాత్రి మెయిలుకు తిరిగి వెళ్తాను. మీరు శ్రమ అనుకోక పోతే ఇంకో చిన్న పని గూడా మీకే పురమాయిస్తా. పైన పడకగదిలో ఒక మంచి పట్టెమంచం, నిలువుటద్దంతోవున్న బల్ల, పడక కుర్చీలు రెండు, క్రింద హాలులో ఒక సోఫా నాలుగు మాంచి కుర్చీలు, మంచి ఫర్నిచరు వేయించండి. నాకొత్త భార్య ఈ ఏర్పాట్లు చూసి గుమ్మయిపోవాలి. ఈ ఏర్పాట్లన్నింటికి ఈ యాభై రూపాయలు మీ దగ్గిరుంచుకోండి" అని జేబులోంచి యాభైరూపాయలు తీసి ఇచ్చి "సెలవండి, వెళ్ళొస్తాను" అన్నాడు.

పిళ్ళే గారి మొహం చాటంతయింది. కట్టించినప్పట్నించి ఖాళీగా పడున్న ఇంటికి బాడుగకొచ్చేవారు దొరికారు గదా అనే పట్టలేని సంతోషంతో సీతయ్య గారి చెయ్యి పట్టుకొని శక్తి కొలదీ వూపి వూపి కరస్పర్శ చేసి కామినుల ప్రేమ కొద్దీ విహరిస్తారు కదా అనే ఆనందంతో

వచ్చిన పని వాకిట్లోనే అయింది. చివరకా బంగళా పేరుగూడా తమ ప్రేమకు సరిపోయినట్లుగానే వుందని ఆయన విడిపోయినారు. ఎవరు పనుల మీద వారు పోయినారు.

మాటన్నప్రకారం సీతయ్యగారు27వ తేదీ ఉదయం కలకత్తా మెయిలులో గుంటూరు నుంచి కాంతమ్మ, రాంభద్రయ్యలతో సహా వచ్చి దిగాడు. బండి వచ్చే అరగంటకు ముందే వస్తారో రారో అని ఇంతా కష్టపడితే అని అనుకుంటూ ప్లాటుఫారం మీద రేకుల షెడ్డు కొనన స్తంభానికానుకొని బండి రాగానే ప్రతి పెట్టె దగ్గరా ఎగాదిగా చూస్తూ వస్తున్న పిళ్ళేగారు, శోభనపు పెళ్లికొడుకు మాదిరి సంతోషంతో ఉన్న సీతయ్యగారిని కలుపుకొని సామాన్లతో సహా కామినీ విహార్‌కు చేర్చాడు. సీతయ్యగారితో "చూశారా ఇంద్ర భవనంలాగు తయారు చేయించాను. ఇటువంటి నిక్షేపం లాంటి బంగళా మీకు చుట్టుపక్కలా ఎక్కడా కనబడదు." అని కాంతమ్మతో "ఏమమ్మాయి నీవెప్పుడూ మద్రాసు వచ్చి వుండవు. వచ్చినా ఇటువంటి బంగళా చూసి వుండవు" అని గది గది తిప్పి చూపించాడు. కాంతమ్మకు ఇల్లు నచ్చింది.

పైనించి కిందకి దిగి వచ్చేటప్పుడు పిళ్ళేగారు నాలుగు మెట్లు ముందుగా దిగటం చూచి సీతయ్యగారి కళ్ళీ చూసి నవ్వుతూ నోటి మీద వేలేసుకొని

"అరెరె ఏమిటిది ఎంత పని చేశారండీ" అన్నది. సీతయ్యగారు ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ రాజువెడలె రవితేజములలరగ అన్నట్లు ఠీవిగా నుల్పోని వారమొహం పెట్టి వొక్క తడవ మీసం మెలేసి చూశావా నా ప్రతాపం అన్నట్లు తల వంచి మరుక్షణం కాంతమ్మ నడుము దగ్గరకు చెయ్యి రానిచ్చి కాంతమ్మను దింపుకుంటూ మెట్లు దిగుతున్నాడు. పిళ్ళేగారు సగం దిగి వెనక్కు చూచేటప్పటికి చేయి తీశాడు. వీళ్ళిద్దరి ఆనందం చూచి ఆయన ఉప్పొంగిపోయాడు. మనసులో వాళ్ళిద్దరూ సుఖంగా వుండాలని, సీతయ్యగారిని మద్రాసులోనే ఉంచు భగవంతుడా అని ప్రార్థించుకుంటూ దిగి-

"ఏం అమ్మాయి, నీకు నచ్చిందా ఇల్లు" అన్నాడు "అయ్యో రాజ మహల్లాగుంది. నాకెంతో నచ్చింది." అన్నది

సీతయ్య "నీకు నచ్చింది నాకు నచ్చకుండా వుంటుందా" అన్నాడు. పిళ్ళేగారు సంతోషంతో వెళ్ళిపోయారు.

అప్పటినుండి సీతయ్య, కాంతమ్మలు ఆ కామినీవిహార్ లోనే కాపుర ముంటూ నవయవ్వన దంపతుల మాదిరి ప్రేమోద్రేకాలలో కాలం గడుపు తున్నారు. కాని, కాంతమ్మకు రోజూ వచ్చిపడే ఆ పావురాళ్ళ గుంపులు, గబ్బిలాల తండలు, తోలలేక విసుగెత్తేది. రాంభద్రయ్య అస్తమానం ఇస్సూ ఇస్సూ అంటూనే వుండేవాడు. పదిరోజులైన తరువాత ఆ బాధ కూడా తగ్గింది.

ఇంట్లో తోమటానికి బట్టలుతకటానికి పెట్టుకున్న అమ్మాయి మాత్రం మూడు రోజులకన్నా ఎక్కువుండే వారు కాదు. చివరకు పదిహేను రోజులైన తరువాత ఒక సి.ఐ.డి. కానిస్టేబుల్ తెచ్చిన ఒక ముసలిది మటుకు ఖాయంగా ఉండిపోయింది. ఒడిదుడుకులు లేకుండా కాలం గడుపుతున్నారు.

అక్కడ కాపరానికొచ్చిన 20 రోజులకేమో ఒకనాడు పడక గదిలోకి ఇద్దరూ ప్రవేశించగానే కాంతమ్మ "ఏమండీ మనం పెళ్ళెప్పుడు చేసుకోటం? ఇట్లాగే కాలం గడిచిపోతుందె" అన్నది

సీతయ్యగారు "దిక్కులేని వారి మాదిరి ఆ రిజిష్టరీ ఆఫీసులో మనమే మతానికీ చెందిన వాళ్లం కాదని చెప్పి రిజిష్టరు పెండ్లి చేసుకుండే దానికన్నా శుభ్రంగా పది మందిని పిలిచి పూలదండలు ఒకరి మెడలో ఇంకోకరు వేసుకొని సక్రమంగానే పెండ్లి చేసుకుందామని పుట్టింది. ఇవాళే ఆ బ్రహ్మసమాజం కార్యదర్శి గారితో పోయి మాట్లాడి వచ్చా. పెండ్లికి ఊళ్ళో పెద్దవాళ్ళంతా వస్తారు. నీకెందుకా చింత. చేసేవాడ్ని నేనుండగా. సమర్థత లేని వాడికయితే

చెప్పాలి కాని, నాకెందుకు నీవు తడవ తడవ చెప్పటం " అన్నాడు.

కాంత "ఇవాళే కదండి ఆ ప్రస్తాపనెత్తింది. పెండ్లి చేసుకుందామనే బులపాటం తీర్చుకుందామని గాని పెండ్లి కాకపోతే నాకేమన్నా లోటొచ్చిందనా అంటం"

సీతయ్యగారు కాంతమ్మ బుజంమీద చేయి వేసి మేడమీద పిట్టగోడ కానుకొని చంద్రుడివైపు కాంతమ్మ వైపు మార్చి మార్చి చూస్తూ "కాంతా ఆ చంద్రుని కన్నా చక్కని మొహంతో నిన్ను పుట్టించిన దేవుడు నన్నింకొంచెం అందంగా పదేండ్లు చిన్నగా పుట్టించినట్లయితే ఎంతో బాగుండేది. మన ప్రేమ జీవితమెంత ప్రమాణం ఇంకో పదేళ్ళు ముందుకు నెట్టుకపోయేది గదా. ఎంత బలిష్టుడనైనా ముసలితనమనేది రాక తప్పదుగదా. ఇవాళ ఆఫీసులో కూచొని పంజరంలో చిలుక మాదిరి బిక్కుబిక్కున ఒక్కదాన్నే నిన్నిక్కడ వుంచి పావాల్సొచ్చనే, సదా నీచెంత నుండ గల్గే భాగ్యం నాకు లేక పాయెనే అని చాలా విచార పడ్డా..

కాంతమ్మ "ఊరుకుందురూ మీకొచ్చిన ముసలితనము లేదు, నాకున్న యవ్వనంలేదు. నన్నొక్క దాన్ని కావాలని వదిలిపెట్టి పోతున్నారా? ఉద్యోగం పురుష లక్షణం అని అందరి మాదిరి మీరు కూడా ఉద్యోగం చేసి నాలుగు డబ్బులు సంపాయిస్తున్నారు. కూచొని తింటే మటుకేం చేస్తారు? ఎప్పుడూ ప్రేమ వాత్సల్యాలు ఒకరికొకరం కట్టకట్టుకుని ఒకచోట ఉన్నప్పటికి వియోగం అనేది లేకపోతే ఆ ప్రేమవాత్సల్యాల విలువ మనకు తెలియదు. మీరక్కడ ఆఫీసులో ఒంటరిగా కూచొని నా ప్రేమను, నన్ను, నాఅందాన్ని గురించి అనుకుంటుంటే నేనిక్కడ ఒంటరిగా కూచొని మీ అసమానమైన ప్రేమను, మీ బాహుబలాన్ని, మీ సమర్థతను కొనియాడుకుంటూ కాలం గడుపుతుంటా" అని సీతయ్యగారిని గట్టిగా కావలించుకొని ఆయన ఎదురు రొమ్ము మీద వాలింది.

ఇది జరిగిన వారంరోజులకు బ్రహ్మసమాజం కార్యదర్శిగారు అచ్చు వేయించిన శుభలేఖలు, విందు పిలుపులు తేవటం తటస్థించింది.

బ్రహ్మంగారు మాట్లాడి పోయిన తరువాత కాంతమ్మ పైకిపోయి పడక కూర్చీమీద కూచొని గుంటూరులో ఆరోజు బ్యాంకుకు పోవాలని పోతూ కాకాని కరణం ఇచ్చిన బయానా వందరూపాయల నోట్లు చెంగాయ చీరకొంగున కట్టినది వున్నదో లేదోనని ఇంటికి రావటం సీతయ్యగారికి ఆమెకు

జరిగిన సంభాషణ రాంభద్రయ్యకు కాకాని కరణం చెప్పిన ఎక్కులు, ఆరాత్రి సీతయ్యగారి భార్య తాలూకు నాలుగువేల రూపాయల సొమ్ము తెచ్చి తన కివ్వటం కాకాని కరణం అన్న మాటలు ఆయనకు చెప్పటం ఆవెధవను కుక్క మొరిగనట్లు మొరగనియ్యి, మననేంచేస్తాడు? అంత మరీ ఎక్కువగా మన జోలికొస్తే ఫోర్జరీ కేసు పెట్టించి జైలుకు పంపస్తానని అనటం, మర్నాడు వచ్చి పైకం బ్యాంకులో వేశానని ఆయన చెప్పటం. మధ్య మద్రాసుకు ఆయన వచ్చి పోయిం తర్వాత రాంభద్రయ్య పరీక్షలు పూర్తి కాంగానే ఏప్రిలు 26వ తేది బెజవాడ మీదుగా మద్రాసుకు రావటం.

అబ్బ పోనిస్తూ జరిగిపోయినవి తలపోసుకోవటమెందుకూ! ఇక జరగబోయేదాన్ని గురించి ఆలోచిద్దాం. అని రెండో తారీకు జరగబోయే పెండ్లికి పెద్దలు, పిల్లలు వస్తారు కదా నేను కడుపుతో వున్నానే వాండ్లది కనిపెట్టి ఏమనుకుంటారో. వాండ్ల మొహం చూడటమెట్లా? అని కొంచెం సంకోచం పుట్టి కండ్లు మూసుకొని "ఏమన్నా అనుకోనీయ్ వాండ్లేమనుకుంటే మనకేం. పెండ్లి చేసుకుండేది మేమిద్దరం కదా! ఆయన నన్ననబోయేదేమీ లేదుకదా! ఎవరో నుకొని పోతారనే జిజ్ఞాస నాకెందుకు అని మనసు కుదుట పరచుకొని మళ్ళీ ఆ ప్రేమలీలలు నవల కాసేపు చదివి క్రిందకుపోయి కొత్తగా కొన్న కుక్కరులో అన్నం, పప్పు, కూర ఒకేతడవ ఎక్కించి దొడ్లో ఆడుకుంటున్న రాంభద్రయ్యను పిలిచి "ఏంరా నాయనా, ఎప్పుడూ ఆటలేనా? చదువు సంధ్యా అక్కర్లా" అన్నది.

రాంభద్రయ్య "సరేగానక్కయ్యా! ఈ శుభలేఖలేంటి-పెండ్లేమిటే?"

కాంత "మీమామయ్యగారు నేను పెండ్లి చేసుకోబోతున్నాము" ఇంకో వారానికి మా పెండ్లవుతుంది."

రాం.భ "అయితే మన కులం చెడిపోతున్నదా'"

కాంత "కులం ఎక్కడికి పోతుందిరా ఇది వరకు బ్రాహ్మలమైనాము. ఇప్పుడు బ్రహ్మలమవుతాము"

రాం.భ "అయితే బ్రహ్మలు ఇక నాకు పిల్లనివ్వరన్నమాట"

కాంత "బ్రాహ్మలిస్తారు, ఎవరివ్వకపోయినా నాకడుపున పుట్టిన బిడ్డనన్నా యిచ్చి చేయక వూరుకుంటానురా పిచ్చివాడా"

రాం.భ "నీకడుపున అతా మగపిల్లలే పుడితే"

కాంత " అబ్బా ఏం రా నీతెలివి ఇక నీకు పెండ్లి కాకుండా పోతుందనా ఇప్పుడు నీ భయం"

రాం.భ "ఏమో ఎవరు చూసొచ్చారూ"

కాంత "వూరుకో లేనిపోని మాటలు మాట్లాడకుండా ఆ పంపు దగ్గర సబ్బు పెట్టా స్నానం చేసి కొత్త గుడ్డలేసుకో. ఇంతలోకి మీమామయ్యగారు వస్తారు. అందరం బీచికి షికారుకు పోదాం. ఇంతభోగం నీవా బ్రాహ్మల్లో వుంటే అనుభవించేవాడివేనా? బ్రాహ్మల్లో వుంటే మన వూర్లో చుట్టాలే. ఇప్పుడు మనకు దేశమంతా చుట్టాలే. అనవసరమైన అనుమానాలు పెట్టుకొని కుళ్ళి కృశించమాక పెండ్లికి వచ్చిందా తొందర పో" అన్నది. రాంభద్రయ్య మాట్లాడ కుండా పోయి స్నానం చేసి నెత్తికి వాసన నూనె రాచి కొత్తలాగూ చొక్కా తొడుక్కొని కాళ్లకు వచ్చిన పదిరోజులకు కొన్న క్రోం చెప్పులేసుకొని ముస్తాబై వరండాకు ముందు మెరాబాలో పచారు చేస్తున్నాడు.

ఇంట్లో కాంతమ్మ కాళ్ళు చేతులు మొహం శుభ్రంగా సబ్బుతో కడుక్కొని మేడమీదికిపోయి వుల్లి పొరలాటి సన్నని ఆకుపచ్చని విదేశపు వాయిల్ సిల్క్ చీర ఒకటి కట్టుకున్నది. అదే రంగు రెవిక చేతులకు వెడల్పాటి ఎర్ర అంచులున్నది తొడిగింది. ఈలోగా క్రిందనుండి రాంభద్రయ్య "అక్కా అరుగో మామయ్యగారు వస్తున్నారోయ్" అని, ఆయన సైకిలు మీద గేటు దగ్గర కనబడగానే పెద్దగా కేక పెట్టాడు.

కాంతమ్మ ఉలిక్కిపడి చివ్వున లేచి ఆదలాబాదలా బల్లమీద పెండ్లి, విందు పిలుపుల బొత్తి చేత్తో పట్టుకుని మెట్ల మీది నుంచి ఆ పడకగదిలో కొచ్చి, గది తలుపుకు వెనాకాల దాక్కొన్నది.

కింద సీతయ్యగారు సైకిలాపి దిగీ దిక్కముందే "మామయ్యగారూ మీపెండ్లి శుభలేఖలు లొచ్చినై. ఆ బ్రహ్మా సమాజమాయన తెచ్చిచ్చాడు" అని ఆయన సైకిలు తను చేతపుచ్చుకొని మీరు తయారై వచ్చేలోగా బైట రెండు చుట్లు చుట్టి వస్తా ఇవ్వండి "అని సైకిలు తీసుకున్నాడు. సీతయ్యగారు జవాబు చెప్పకుండానే ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ "కాంతా, కాంతా" అని కుప్పిగంతలు వేస్తూ పైకి వెళ్లాడో లేదో తలుపు చాటునుండి సీతయ్యగారిని "బవ్" మంటూ జడిపిస్తూ చేతులు రెండు వెనక్కు పెట్టుకుంటూ వయ్యారంగా చిరునవ్వు నవ్వుతూ "నాచేతిలోవి ఏమిటో కనుక్కోండి" అని అన్నది.

సీతయ్యగారు తన చేత్తో వీపు చరుచుకుంటూ "నాకు తెలుసులేస్తూ, ఆయనిప్పుడే ఆ సేవాశ్రమంలోనుంచి వస్తూ ఎదురైనాడు" అని శుభలేఖలు విందు పిలుపులు చదువుతున్నాడు.

ఆయన చదివే ఒక్కొక్క అక్షరం కాంతమ్మ కెంతో వినసొంపుగా వుంది. ఆ పరవశంలో రెండు కంటి కుదుర్లలో రెండు ముత్యాల లాంటి ఆనందబాష్ప కణువులు బుడకల్లాగా తేలినై. సీతయ్యగారు ఇది హఠాత్తుగా చూచి "నీవు సంతోషమైనా పట్టలేవు. దు:ఖమైనా పట్టలేవు. ఎందుకట్లా కంటి నీళ్ళు కారుస్తావు' అన్నాడు.

"అవి లోపల్నించి సంతోషం పొంగి పైకొచ్చే బుడకలు లేవండి" అని చేత్తో తుడుచుకొని సీతయ్యగారి వొళ్ళోనుంచి లేచి నిల్చోని "మీరు తొందరగా తయారు గాండి. స్నానం చేద్దురు గాని" అన్నది. కొంచెం పెద్దదిగా కనబడుతున్న పొట్టను చూచి "కాంతా నీకిప్పుడెన్నో నెలా?" అన్నాడు సీతయ్యగారు. "మీకు తెలియని నెలలు నాకెక్కడొచ్చాయి. ఏ అయిదో నెల అయివుంటుంది." అన్నది కాంతమ్మ. "ఆపుట్టేదెవరో, నామాదిరి ఒడ్డూ, పొడుగులతో పుట్టేట్టున్నాడు." అన్నాడు సీతయ్యగారు.

కాంతమ్మ తన మనసులో ఈయన మనసులో ఈ కడుపు తనది కాదని అనుకుంటున్నారేమో కొంపతీసి అనుకుంటూ సీతయ్యగారి వంక వార చూపులు చూస్తూ నవ్వుతూ "అలా పుట్టాలనేగా నాకోరిక. మిమ్మల్ని తలతన్నే వాండ్లు పుట్టాలి" అని గేటు ముందర సైకిల్ మీదనుంచే తొంగిచూసిన రాంభద్రయ్యను "ఒరేయ్ రారా" అని కేక పెట్టింది.

అతను లోపలికొచ్చి సైకిలు లోపల పెట్టంగానే ఇంటికి తాళాలేసి ముగ్గూరూ బీచి వైపుకు వెళ్ళారు. బీచి వద్దున నడుస్తూ వుండగా సీతయ్యగారు "కాంతా పెండ్లికొచ్చిన పెద్దలందరూ మనల్ని చూచి ఏమనుకుంటారో మనిద్దరికి ఈడుజోడు కాదనుకోరుగదా"

కాంత "ఎందుకండీ మీకు తేప తేప ఈ అలోచనలు రావటం. మగవాండ్ల కెప్పుడూ నలభయ్యోపడి దాటితేనే ప్రేమ పిచ్చి ఏక్కువంటారు. ఎంత చిన్నదైనా ముగ్గురు బిడ్డలు పుట్టేటప్పటికి ఆడదానికి ముసలవతారం పడుతుంది. మీరు నాకన్నా వయసువారిలాగు కనబడుతున్నారు. మీ ఈడులో పుట్టిన ప్రేమ శాశ్వతంగా నిలిచిపోతుంది. ఎవరేమనుకున్నా కాపురం చేసే దాన్ని, మీ ప్రేమ వాత్సల్యాలు జుర్రుకునేదాన్ని నేనే కదా. కామేచ్ఛతో

ప్రారంభమైన మన ప్రేమ రానురాను అనురాగ సమ్మిళితమై పురేసుకొని పోతున్నది. ఒకటి రెండు మీ ప్రతిబింబాలు నాకడుపున పుట్టంగానే మన ప్రేమ కుటుంబ ప్రేమగా మారి, తెగతెంపులు లేని ప్రేమగా ప్రజ్వరిల్లుతుంది. అప్పుడు నేను కోరుకునేదల్లా మీ కండ్లెదుట ప్రాణం వదలాలని"

సీతయ్య "ఛీ.. ఎందుకటువంటి కోరిక కోరుకోవాలి"

కాంత "స్త్రీ ఎప్పుడూ అటువంటి కోరికే కోరుతుంది. కొన్నాళ్ళు కాపురం చేసి నలుగురు బిడ్డలు పుట్టింతర్వాత ముండమోసి కష్టాలనుభవించే దానికన్నా పెనిమిటి కండ్లెదుట చావాలని కోరుకోటం సహజం"

సీతయ్య "సరే పోనిస్తూ మనకు కాబోయే పెండ్లి ధోరణిలో పడక ఈ ధోరణిలో పడ్డాం. అయితే మనమింకా కొనాల్సిన వస్తువులేమన్నా ఉన్నాయా?"

కాంతం "ఏమున్నాయి? చీరెలుండె..సొమ్ములుంటె.. మనమెవరికి చదివించాల్సిన చదివింపులు లేకపాయె. ఇంకోరు మనకే చదివింపులివ్వరాయె. ఆశీర్వచనాలు తప్ప ఈ పద్ధతే బాగుంది. బోలెడంత దబ్బు తగలేసేదానికన్న"

అక్కడ నిండు నెలల కడుపుతో ఉన్న స్త్రీ ఒక చంటి బిడ్డను వొళ్ళో వేసుకొని ఆది పాలు కుడుస్తున్న స్తనం బైట వేసుకొని చింపిరి నెత్తి గోక్కుంటూ చినిగిపోయిన గుడ్డలతో బెదిరి పోతున్న పవిటె సర్దుకుంటూ "అమ్మా, కడుపుతో వున్నదాన్ని, ఒక కాసియ్యండమ్మా" అని వెంబడిబడ్డది.

సీతయ్యగారు "చిల్లరలేదు పో అమ్మీ" అంటున్నాడు. అది కాంతమ్మ వెంబడి ఇంకా వస్తుంటే కాంతమ్మ తటాలున ఆగి "పొమ్మంటే పోవేం" అని మొర్రి చూచింది. ఆ అడమనిషి "మీకాళ్ళకు మొక్కుతా ఒక కాసియ్యమ్మా" అని వంగి కాళ్ళు పట్టుకోబోయి కడుపులో కలక పుట్టి "చస్తినో దేవుడా" అని పొట్ట పట్టుకొని కూలబడ్డది. కాంతమ్మకు ఎక్కడలేని జాలిపుట్టి "ఇవాళో రేపో నీళ్ళాడబోయే ఈ ఆడది అడక్క తినకపోతే ఆ కడుపుకు బాధ్యుడైన వాడు ఈ పదిరోజులన్నా పోషించకుండా ఎట్లా వుండగలిగాడండి." అని సీతయ్యగారి కళ్ళి చూసి " మీజేబులో డబ్బు లేమన్నా ఉంటే చూడండి" అన్నది.

సీతయ్య " చిల్లరలేదు రూపాయలు తప్ప"

కాంత " ఒక రూపాయి ఇట్లా ఇవ్వండి" అని తీసుకొని ఆ స్త్రీ చేతిలో పెట్టి "లేఅమ్మా" అని బుజాలు పట్టుకుని లేపి "నీబోటి నిర్భాగ్యులను పోషించలేని ఆదేవుడు మిమ్మల్నెందుకు పుట్టించాడో పో మెల్లెగా ఇంటికిపో. నీకెవరన్నా వున్నారా?" అన్నది.

"నాకెవరున్నారు తల్లీ నేనొక నిర్భాగ్యురాలను. నాపెనిమిటి ఈ చంటి బిడ్డను నన్ను వదిలిపెట్టి ఇంకోదాన్ని తీసుకొని పోయినాడు. నెలరోజులైంది. ఆ చెట్ల క్రింద మావూరి వాండ్లు వండకతిని కూలికి పోతుంటే నీబోటి మహా తల్లులెవరన్నా ఒక కాసిస్తే ఇంత వుడకేసుకొని తిని అక్కడ్నే పడు కుంటున్నా. ఆ దేముడికి కనికరమేడిది తల్లీ" అని మెల్లిగా అన్నది.

కాంతమ్మ కడుపు తరుక్కుపోయింది. ఇంటికి పిలుచుక పోదామను కున్నది. కానీ ఇటువంటి నిర్భాగ్యులెంతమందో వుంటే నేను దీనినొక్కదాని మీద దయతల్చి తీసుకుపోతే కదం వాండ్ల గతేమనుకోవాలి "సరే పో పాపం" అని తను సీతయ్యగారి పక్కన నడుస్తూ

"ఏమండీ చూచారా యెంతటి నిర్భాగ్యులున్నారో ఈ ప్రపంచంలో. మరింత మంది ఉద్యోగం చేస్తున్నారు గదా ఇటువంటి నిర్భాగ్యులను పోషించే మార్గం ఎందుకు వెతకరండి" అన్నది.

రాంభద్రయ్య దోవ పొడుగూత ఏదో ఆలోచిస్తూ వస్తూ సీతయ్యగారున్న సంగతి కూడా మరిచపోయి, వాండ్లక్కయ్య చేయి పట్టుకొని ఇవతలకు లాగి

"అక్కయ్య పెండ్లి చేసుకోబోయే వాండ్లంతా ఆ బీచి వొద్దకు షికారుకు వస్తుంటారా యేమే?" అన్నాడు

కాంతమ్మ ఫక్కున నవ్వి "విన్నార్టండీ వీడి గొడవ ఇవాళ సాయంకాలం నుండి వాడికి పెళ్ళి పిచ్చి పట్టింది. చూడండి ఏమడుగుతున్నాడో"

సీతయ్య " ఏమిటి నేను వినలేదే. ఏదో ఆలోచిస్తున్నా" అన్నాడు.

రాంభద్రయ్య సిగ్గుపడి "అక్కయ్యా చెప్పబోకే చెపితే అమ్మ తోడే" అన్నాడు

కాంత " ఏంలేదులేండి. వాడి గోల వాడిది" అన్నది. కొంచెంసేపటికి ముగ్గురు ఇంటికి చేరారు. భోంచేసి పడుకున్నారు.

పడుకోబోయేముందు పడకగదిలోకి రాగానే ఆ బల్లమీద శుభలేఖలు విందుపిలుపులు చూసి మళ్ళీ ఒక తడవ చదువుకున్నది.

సీతయ్య "మనస్నేహితులకు, బంధువులకు పంపటానికి ఇచ్చి పొమ్మంటే ఇచ్చి పోయారు"

కాంత " అయితే మీరు ఎవరికి పంపిస్తారు. నేనెవరికి పంపించేది?"

సీతయ్య "ఎందుకూ ఆ కాకాని కరణానికి పంపు. నేను తోటి ఇనస్పెక్టర్లకు మా ఆఫీసర్లకు ఇస్తాను.'

కాంత " ఆపాడుమొహంవాడి పేరెందుకెత్తుతారండీ"

సీతయ్య " అయితే నీవింకెవరకి పంపుతా. పంపిస్తే ఆ పేరయ్యశర్మకు పంపాలె."

కాంతమ్మ కోపం అభినయించి మెడ వదిలి పెట్టి పక్కన దాబా మీదికి పోయే వాకిటి తలుపుకానుకొని "చూచారా, ఏప్పుడూ లేంది ఇటువంటి మంచి ఘడియల్లో నా మనసు నొప్పించే సూటిపోటీ మాటన్నారు. గతించిన పాపిష్టి రోజుల గాధ మళ్ళీ పెళ్ళగించారు. మీరిట్లా అంటారని తెలిస్తే ఇక్కడికొచ్చే దాన్నే గాదు"అని ఏడుస్తూ అన్నది.

సీతయ్యగారు గభాల్న లేచి "నేనేదో గమ్మత్తుగా అంటే నీవింత నొచ్చుకుంటావనుకోలా. కాంతా ఏడవకు. కలకంఠి కంటి కన్నీరొలికిన సిరియింట నుండ నొల్లదు" అని పెద్దలంటారు. అట్లా ఏడవకూడదు వూరుకో" అని దగ్గరికి పోయి కావలించుకొని గడ్డంపట్టుకొని ఓదార్చాడు.

ఆచిన్న ప్రణయకలహపు రవ్వ కామపూరిత మైన ప్రేమ ముద్దులతో చల్లార్చాడు. ఇంకాసేపట్లో సమాధాన రూపకంగా ఒకరినొకరు కావలించుక పడుకున్నారు. తెల్లవారి లేచేటప్పటికి ఆ సాయంకాలపు సంభాషణ, ఆ చిన్న ప్రణయ కలహం మరిచి పోయినారు.

కాంతమ్మ ప్రొద్దున్నే కాఫీ చేసిచ్చి ఆయన ఆఫీసు కాయితాలు చూచుకుండేలోగా కుక్కరు మీద వంటచేసి పదిగంటల కల్లా ఆయనకు భోజనం పెట్టి ఆఫీసుకు పంపిది. తాను తమ్ముడు నిదానంగా భోంచేశారు.

"పాఠాలన్నా ఒకతడవ చూసుకోరా మా పెండ్లి కాంగానే నిన్ను బళ్ళో వేయిస్తా. ఎందుకు రోజుకు రోజుకు పనికిమాలినవాడివవుతున్నావు. చెప్పిన మాట వినవే వినవు. ఇట్లా అయితే నీతో నేను వేగలేను" అని బలవంతాన పుస్తకం చేతికిచ్చి చదివిస్తూ తనకు కూరుపు పట్టి ఆ పడక కుర్చీ మీదనే నిద్రపోయింది. రాంభద్రయ్య మళ్ళీ ఆడుకోటానికి వెళ్ళాడు.

సాయంకాలం సీతయ్యగారు రాగానే ఆ రోజుకు బీచికి పోవటం మానేసి ట్రాముకు మూరు మార్కెట్టు దగ్గర పీపుల్స్‌పార్కుకు పోయినారు. ఆ మరుసటి దినం సినిమాకు పోయినారు. ఈ విధంగా రోజు యేదో ఒక చోటికి షికార్లకు పోతూ మామూలు దినచర్యకు తోడుగా తోడైన ప్రేమలీలలో నిండుగా మునిగి తేలుతూ మర్నాడు పెండ్లనగా జూను 1వతేదీ బజారుకు వెళ్ళి పెండ్లి జ్ఞాపకార్థం రెండు వెండి పళ్ళాలు, పుట్టబోయే బిడ్డ కోసం వెండి గిన్నె వెండి స్పూను గూడా కొని కాంతమ్మ వద్దన్న కొద్దీ ఇంకో 50 రూపాయలు పెట్టి ఒక బనారుసు చీరె గూడా సీతయ్యగారు కొనిపెట్టారు. ఆయన రెండు జరీ పంచెలు, ఉత్తరీయాలు కొనుక్కున్నారు. రాంభద్రయ్యకు రెండు మర

బొంగరాలు, ఒక చేతి గడియారం గూడా కొనిపెట్టారు.

❖❖❖❖ ❖❖❖❖ ❖❖❖❖

పెండ్లినాటి కిందటి రాత్రి, రేపు పెండ్లంటే రేపు పెండ్లనుకుంటూ ఇద్దరూ మురుస్తూ ముచ్చటలాడుతూ సరసల్లాపాలు చేసుకుంటూ రోజుటి కన్నా ఎక్కువ ఆవేశ ప్రేమతో గడిపారు. సీతయ్యగారు చాలాసేపు మేల్కొని చివరకు నడిఝాము వేళకు గురకలు పెడుతూ నిద్రపోయినాడు. కాంతమ్మ మాత్రం కోడి కునుకులు పడుతూ దూరాన గంటలు కొట్టినప్పుడల్లా లెక్క పెట్టుకుంటూ ఇంకా ఎన్ని గంటలున్నవి. ఇంకా ఎన్ని గంటలున్నయి అనుకుంటూ తెల్లంగా తెల్లవారి ఆరుకొట్టగానే కొత్త బిచ్చగాడు పొద్దెరగడన్నట్లు లేచి కాలకృత్యాలు తీర్చుకొని తల దవ్వుకొని సీతయ్యగారు లేచే ముందే కాఫీ పెట్టింది. గాఢ నిద్రలో ఉన్న రాంభద్రయ్యను తట్టి లేపి సైకిలు మీద బజారుకు తరిమి **10** ఇడ్డెన్లు, **6** దోశలు తెప్పించింది. సీతయ్యగారింకా నిద్రపోతుంటే మెల్లగా పైకిపోయి చల్లటినీళ్లతో కండ్లు తుడిచి లేపి "ఏమిటీ నిద్ర టైమైంది లేవండి. ఆ బ్రహ్మంగారు కారుతీసుకొని వస్తారు. ఫలహారంచేసి తయారవుదురు గాని" అని అన్నది.

ఆయన ఆదలాబాదలా లేచి మొహం కడుక్కుని పలహారం చేసి కాఫీ త్రాగాడు. కాంతమ్మకు పెండ్లి సంతోషం మీద పలహారం కాస్తయినా లోపలికి పోలా. పంచపాత్రెడు కాఫీ మాత్రం త్రాగి లేచింది.

కాంతమ్మ తను ఆరోజూ కట్టుకోవలసిన చీరె, రవికె పెట్టెలో నించి తీసి మంచం మీద వేసి, సీతయ్యగారు కట్టుకోవలసిన జరీపంచె, బ్రహ్మసమాజం వారు ఆరోజుల్లో వేసుకుంటున్న పొడుగాటి తెల్లటి మల్లు జుబ్బా పెండ్లి కోసమని ప్రత్యేకంగా కుట్టించిందీ, కుప్పడమంచు చేనేత జరీ ఉత్తరీయం, ఆయన పెట్టె నించి తీసి ఆ మంచం మీదనే వేసింది. కిందికి పోయి ప్రొద్దున్నే పొయ్యి మీద పెట్టిన కాగులో వేడి నీళ్ళు పోసుకుని వచ్చింది.

కాంతమ్మ "మీ ఇష్టం మూహూర్తం వేళకు చేరుకోకపోతే బాగుండదు" అన్నది. సీతయ్యగారు ఆ చిట్టా అక్కడ పెట్టి లేచి కోటు జేబులో నుంచి జేబు గడియారం తీసి టైం చూసి, "ఇంకా ఎనిమిదన్నర కాలా. ఎందుకంత తొందర పడతా. నీవు కూడా కాస్త కుచ్చులు సరిగా పోసి ఆచీరె జాగ్రత్తగా కట్టుకో. ఆ వడ్డాణం కూడా కొంచెం బిర్రుగానే పెట్టుకో. ఈ చూడు గేదెనెక్కడ

పట్టుకొచ్చా దబ్బా అని అనుకుని పారిపోతారు" అని నవ్వుతూ అని కాంతమ్మ వైపు చూడకుండా అ అద్దంలో పడుతున్న ఆమె ప్రతిబింబం కళ్ళి చూచాడు.

కాంతమ్మ మొహం కందిపోయింది. చీరె కుచ్చిళ్ళు పోసుకుండే చేతులు అట్లాగా ఆగిపోయినై. వంచిన తల ఎత్తకుండా కండ్లు మిటకరించి గుడ్లు పైకెత్తి చూచింది. కండ్లెంబడి నీళ్లు గిర్రున తిరిగినై. మరుక్షణం పెండ్లినాడు ఏడవ కూడదనే ఆలోచన తట్టి కండ్ల నీళ్ళు కుక్కుకొని గబక్కున పోట్లాటేసు కుందామనే మనసు తిప్పుకొని ఇవాళెట్లా గడిస్తే అట్లాగే ఇక రోజులన్నీ గడుస్తాయనుకొని కోపం అణచుకొని నవ్వినట్లు నటించి మళ్ళీ తలకాయ వంచి కుచ్చెళ్లు పోసుకుంటూ "ఈ చూడి చేసిన వారు మీకు మాత్రం ఆమాటలు తగలవా" అన్నది. సీతయ్యగారు కూడా ఇంతమాటన్నానే అని నొచ్చుకొని "కాంతా ఏదో నోరుజారొచ్చింది పోనిస్తూ. ఇవాళ గూడ యెత్తి పొదుపులతోనే పోతుంది. సుఖం అనుభవించదానికి చేసుకునే పెండ్లి రోజున తగవులాడు కున్నామా ఎల్లకాలం తగువుల మారి సంసారం ఈదాల్సొస్తుంది" అన్నాడు.

కాంతమ్మ "సరే నేనా ప్రారంభించింది మీరా. పుటిక్కిన అనరాని మాటేదో అనటం, మళ్ళీ పశ్చాత్తాప పడటం ఈనాలుగైదు నెలల నుంచీ లేని నోటి తుత్తరతనం తీరా పెండ్లి చేసుకోబోయే ముందు మీకెందుకు పుట్టిందో నా కర్థం కావడంలేదు. పోనీయండి అదీ ఒకందుకు మంచిదే. చేసిన తప్పులు వెంటనే దిద్దుకుండే బుద్ధి అందరికీ ఉంటుందా? తాబట్టిన కుందేలుకు మూడే కాళ్ళని మొండికేస్తారు గాని. మన పెండ్లి రోజు పశ్చాత్తాపాలతో ప్రారంభం కావడం కూడా శుభసూచకమే. ప్రేమ నా పశ్ఛాత్తాపంతో ప్రారంభమైంది. పెండ్లి మీ పశ్చాత్తాపంతో ప్రారంభమవుతున్నది. ఇక మన ప్రేమ జీవితం పూలు పరచిన మెత్తటి మార్గాన నడుస్తుంది."

కొంతసేపటికి చప్పిడి ఉప్పిడి లేకుండా జరగబోయే ఈ పెండ్లెట్లా వుంటుందో. కడుపుతో వున్న కాంతమ్మను చూచి ఏమనుకుంటారో...నా మీసం నా ఈడూ నా బొజ్జా చూచి ఈ ముదురు బొచ్చెకు ఇప్పుడు పెండ్లెందుకు కావాల్సొచ్చిందనుకుంటారేమో అనుకుంటూ గడియారంలా ముందుకు నడిచే ఈ ప్రపంచంలో అన్నీ సంభవమేనని మనసు సమాధాన పరచుకొని గబ గబా రెండు తడవల వాసన సబ్బేసి రుద్దుకొని వళ్ళు తుడుచుకొని తడిగుడ్డక్కడేసి మొలకు తువాలా చుట్టుకొని కూనిరాగం తీసుకుంటా గదిలోనికి పోయినాడు.

కాంతమ్మ మొలకు గజ్జెల వడ్డాణం,మెళ్ళో వరహాలపేరు, గజ్జెల పట్టెడ, బంగారు కంటె, చెవులకు కెంపుల దిద్దులు, దండ చేతికి తెల్లటి ఎర్రటి కెంపుల వంక కడియం చేతులకు నాలుగేసి జతల బంగారు గాజులు, కుడిచేతి వ్రేళ్ళకు రెండు బంగారు ఉంగరాలు, నెత్తిన నాగారం పెట్టుకొని ఆయి తెచ్చిచ్చిన పూలతో తయారైంది.

ఇంకో పదినిమిషాల్లో సీతయ్యగారు పంజబోసి పిఠాపురం జరీ ధోవతి కట్టి, వెనక మడత గోచీ పెట్టి, బెంగాలీ ఫాషన్లా ముందు కుచ్చెళ్ళు విడిచి జుబ్బా తొడిగి వల్లెవాటుగా ఉత్తరీయం వేసుకొని తయారైనాడు. నిలువుటద్దం ముందు క్రాఫింగు మీద అటుఇటు చేయి రుద్ది మీసం మెలెస్తూ నిల్చున్నాడు.

కాంతమ్మ అయ్యో వాడ్ని తయారు చేయలేదే అని గబగబా కిందికి పోయి "ఓరేయ్ తమ్ముడూ, ఎక్కడున్నావురా?" అని కేక పెట్టింది. జవాబు రాలా. అటు ఇటు చూచి చివరకు అతని గదిలోకి వెళ్లింది. మంచం మీద చుట్టిపెట్టిన పరుపు మీద అనుకొని యెల్లికిలా చేరగిలి కూచోని ఏదో ఆలోచిస్తున్నాడు. "ఎన్నిసార్లు పిలిచినా పలకవేమిరా? ఏమట్లా కూచున్నా? దయ్యమేమన్నా పూనిందా? లే దబ్బున తయారుగా, పోరా కారొస్తుంది"అన్నది మంచం దగ్గరకెళ్లి నిల్చోని కాంతమ్మ.

రాంభద్రయ్య "ఎక్కడికే వచ్చేది? నేను రాను."

కాంతమ్మ "అదేమిట్రా రానంటావు? మా పెళ్ళికి రాకపోతే రేపు మీ పెండ్లికి నెనెట్లా వచ్చేదిరా"

రాంభద్రయ్య " రాకపోతే మాన్లే. ఈ పెండ్లికొచ్చి కులం చెడగొట్టు కుండేదిటే? రాత్రి అమ్మ కలలోకొచ్చి నాయానా తద్దినాలు పెడుతుండు. ఆ గంగాక్షేత్రంలో నా పిండాలెయ్యి. అని నా పక్కలో కూచొని చెప్పి పోయింది. ఇప్పుడు పెండ్లికొస్తే ఎవరాన్నా చూస్తే కులంలో వెలివేస్తారు. అమ్మకు, నాన్నకు తద్దినాలు పెట్టటానికి లేకుండా పోతుంది. ఎందుకులే నీవు పోయిరావే".

కాంతమ్మ "అయ్యో ఇదేం పిచ్చిరానీకు? పిట్టకొద్ది కూతఘనం అన్నట్లు ఏలెదులేవు నీకప్పుడే ఇన్ని ఆలోచనలెందుకురా? నీ మెడలో జంధ్యపు పోగేసిన తరువాత అట్లాగే నీ ఇష్టమొచ్చినట్లు చేతువుగాని. ఇప్పుడు నా మాట విను. లే ఊరికే వచ్చక్కడ కూచో. ఆ సిల్కుకోటు, కొత్తలాగూ చొక్కా, ఈ బూట్లు వేసుకొని దొర లాగు తయారై వచ్చి అందర్లో కూచుందువు గాని. నేచెప్పినమాట విను" అని లేవదీసింది.

కొత్తకోటు బూట్లు సంగతెత్తంగానే అలకా గలకా మరిచిపోయి లేచి నిల్చొని పోయి కాసేపట్లో తయారైనాడు. మేడ మీదకి తీసుకుపోయి తలకు నూనె రాసి తల దువ్వింది. ఇంకొంచెంసేపట్లో కారు గేటుముందాగింది. బ్రహ్మంగారు దిగి ఆదలాబాదలా లోపలికి రావటం పైన పిట్టగోడ దగ్గర నిల్చోని చూస్తున్న ముగ్గురూ చూచారు. సీతయ్యగారు "వస్తున్నామండీ బ్రహ్మంగారు" అన్నాడు. ముగ్గురూ కిందికి వెళ్ళారు. తలుపులు తాళాలేసి అయితో చెప్పి తోటమాలితో ఎవరన్నా బల్లలు, కుర్చీలు తెస్తే బయట చెట్ల కింద వేసుంచమని చెప్పి వెళ్ళి కారులో కూచున్నారు.

రాంభద్రయ్య దోవన పోతూ గులాబీ పువ్వొకటి కోసి తనకోటు మడత కాలరు మీద గుండీ రంధ్రంలో తగిలించాడు. కారుదాకా పోయిందాక వెనక్కూ ముందుకూ ఆ బూట్సువంక, ఆ కొత్త గుడ్డల వంక చూచుకుంటూ వెళ్ళాడు.

కారు సాగి కొంత దూరం పోయిన తరువాత కాంతమ్మ "ఏమండీ తాళిబొట్టు, నల్లపూసలు, కొనటం మరచిపోయినామే" అన్నది. సీతయ్యగారితో ముందుసీట్లో కూచున్న బ్రహ్మంగారు "దానిదేముంది. మామూలుగా మేము పులదండలతోటే ముగిస్తాము". కావాలంటే కారు చైనా బజారుకు తిప్పి అవి కొనుక్కొని పోదాము. కారు చైనా బజారుమీదుగా పోనీవోయ్" అన్నాడు డ్రైవరుతో. తాళిబొట్టు, నల్లపూసల పేరు తయారుగా అమ్ముతున్న ఒక సొమ్ముల దుకాణంలో కొనుక్కొని ఎగ్మూరు బ్రహ్మసమాజమందిరంలోకి చేరేటప్పటికి పందింటికి అరు నిమిషాలున్నది.

బ్రహ్మంగారు కారు ఆగీ ఆగక ముందే తలుపు తీసి కారాగంగానే గభాలున దిగి ఇవతలి తలుపు తీసి ముగ్గుర్నీ దించి తలుపేసి ముందు తను నడుస్తూ వీరిని వెంట బెట్టుకుని హాలులోకి పోతున్నాడు. హాలంతా కిక్కిరిస్తున్నది. అది సుమారు 50గజాల పొడవు, 10 గజదాల వెడల్పు హాలు. మధ్యలో దోవ వదిలి పెట్టి రెండు పక్కలా కొంత లెక్క కుర్చీలేసున్నాయి. అవతల కొనన మోకాలెత్తు బల్ల, వెడల్పుగా ఒక స్టేజి మాదిరి అమర్చబడ్డది. దానిమీద ఒక బల్ల దాని వెనకాల ఒక ఎత్తాంటి కుర్చీ సింహాసనం మాదిరిగా వేసున్నాయి. అబల్లకు కిందిగా అటుఇటుపక్క ఒక్కొక్క కుర్చీ వేసున్నది. బల్లమీద బొందుగా పొడుగ్గా కట్టిన రెండు పెద్ద పూలదండలు పెట్టున్నాయి.

సీతయ్య, కాంతమ్మలిద్దరు ఆమధ్య దారిగుండా వచ్చి స్టేజి మీద అమర్చిన ఆ కుర్చీల మీద కూచోవలె. ప్రవేశద్వారము దగ్గరికి రాగానే లోపల

కుర్చీలమీద కూర్చున్న జనం చప్పట్లు కొట్టడం మొదలెట్టారు. కాంతమ్మ వాండ్లను బెదిరిపోయిన లేడిమాదిరి బిత్తరచూపులు చూసుకుంటూ అయోమయంలో పడి ఏం చెయ్యాలో తోచక పమిట సర్దుకొని ఆ పమిటచెంగు ఒకచేత్తో కడుపు మీదుగా తీసుకొని తను గర్భిణి ఎవరూ చూడకుండా దాచి పెట్టినట్లు అక్కడ చెయ్యట్లా అడ్డం పెట్టుకొని సిగ్గుతో వంచిన తల ఎత్తకుండా తప్పటడుగులు వేస్తూ సీతయ్యగారి పక్కనే నడుస్తూ వచ్చి మెల్లగా ఆస్టేజి ఎక్కారు. బ్రహ్మంగారు చూపించిన కుర్చీ మీద కూచోటానికి సంశయిస్తూ నిల్చున్నది. బ్రహ్మంగారు వెంబడొచ్చిన రాంభద్రయ్యను ఆ స్టేజిమీద ఒక ప్రక్కన కూచోపెట్టాడు సీతయ్య. కాంతమ్మ కుర్చీ ఎదురుగా వేసుంచిన కుర్చీ మీద కూచుంటూ ఒక్క తడవ అందరివైపు చూచి "కాంతా కూచో" అని మెల్లిగా అని తనూ కూర్చున్నాడు.

కాంతమ్మ పొట్టమీద చెయ్యి తీయకుండా అట్లాగే పట్టుక కూర్చున్నది. వెంటనే బ్రహ్మంగారు కాంతమ్మ అటు పక్కగా బల్ల దగ్గర నిల్చొని "బ్రహ్మోపాసకులారా! ఈ దినము మన బ్రహ్మసమాజ చరిత్రలోనే సుదినము. గొప్ప కుటుంబానికి చెందిన ఈ ప్రేమికులిద్దరూ మన సమాజ పద్ధతుల ననుసరించి పునర్వివాహము చేసుకోటానికి నిశ్చయించినారు. గనుక వారికి వందన శతంబులు తెలియపరచుచున్నాను. వారిష్ట ప్రకారము ఈరోజు ఇక్కడ వివాహము జరిపించే ఏర్పాటు చేసిన కృషి ఫలితంగా మీరంతా ఇక్కడి దయచేసినందుకు మీకు కూడా నా వందనములు. అందరూ సమానమే అనే సమతా ధర్మంతో కూడుకున్న మన సమాజం ప్రపంచమంతటా కొద్దికాలంలోనే వ్యాపించి పోతుందనటంలో అతిశయోక్తి ఏమీ లేదు. మన సమాజంలో వారిని చేర్చుకొని వారి వివాహాన్నిపుడు పూజ్యులైన శ్రీ రాళ్ళబండి సోమయ్యగారిని పౌరోహిత్యము వహింప వేడుచున్నాను." అని ఆస్టేజి మీదనే ఒక ప్రక్కగా నిల్చున్నాడు బ్రహ్మంగారు.

సోమయ్యగారొచ్చి ఆపెద్ద కుర్చీమీద కూచున్నారు. ఆయన కళ్ళు మూసుకొని "ఓం"అని ప్రార్థన ప్రారంభించగానే హాలంతా నిశ్శబ్దమై పోయింది. అందరూ తలలు నేలకువేలాడేసి నిశ్శబ్దంగా కూర్చున్నారు.

సోమయ్యగారు 'ఓం' అన్న తరువాత "బ్రహ్మకృపాహి కేవలం ఓ పరమాత్మా! మూఢనమ్మకములను వదిలి ఏకోపాసకులుగా చేరిన ఈ ఓగిరాల

సీతయ్య, కాంతమ్మ గారిని సర్వదా నీవు రక్షింతువు గాక, వారు చేసిన పాపములను క్షమించి వారి మనసులను శుద్ధపరచి వారిని మంచి మార్గమున నడుదువు గాక" అని కొంచెం ఆగి కళ్ళు తెరిచారు.

అంతా తలెత్తారు. బ్రహ్మంగారొచ్చి కాంతమ్మను సీతయ్యగారిని లేచి నిల్చోమన్నారు. వారు నిల్తున్న తరువాత చెరి ఒక పూల దండ ఇచ్చి రెండు చేతులతో పట్టుకోమన్నారు. కాంతమ్మ చప్పున పొట్టమీద చెయ్యితీసి పూలమాల పట్టుకొన్నది. జనంలో గుసగసలు బయలుదేరినవి.

ముఖ్యంగా పదిహేను, పదహారేండ్ల అడపిల్లలు ఒకరిచెవులో ఇంకొకరు "అంతా ఇదవరకనుకున్నట్లే కడుపుతో వున్నదని ఇపుడు స్పష్టంగా చూచారు. కడుపుతో ఉన్నది చూడమని. కడుపు కాక ముందు పెండ్లి చేసుకుంటే బాగుండేది. ఎంత అసహ్యంగా వుంటుంది ఆకడుపుతో వచ్చి అక్కడ నిల్చుంటే? అని అనేక విధాల అనుకుంటున్నారు.

స్టేజీకి దగ్గరగా కుర్చీలమీద కూర్చున్న ఒక ఆడపిల్ల వాండ్ల అమ్మతో "అమ్మా రేపో మాపో అన్నట్టుగా వుందే. పోనీ కన్నతరువాత చేసుకోవచ్చుగా పెండ్లి" అన్నది. ఈమాటలు స్పష్టంగా కాంతమ్మకు వినపడ్డవి. సీతయ్యగారి చెవిన కూడా పడ్డట్టే వుంది. కాంతమ్మ జారివిడిచిన పమిటచెంగు ఒక చేత్తో తీసి దోపుకొని మళ్లీ పూలహారం రెండు చేతులతో పట్టుకున్నది. వాళ్లనుకంటే ఏం లేస్తూ అని మనసు కుదుట పరచుకున్నది. ఒక తడవ కండ్లెత్తి ఏం కడుపుతో వుంటే? నన్నేం చేస్తారు మీరు? అన్నట్లు ఒక నిర్భయమైన చూపు చూచింది.

అదే సమయంలో సోమమయ్యగారు బల్లమీద వేళ్ళతో టక్కు టక్కున రెండు తడవలు కొట్టాడు.

సోమయ్యగారు "ఓగిరాల సీతయ్యగారుమీరేనా? మీరు కాంతమ్మ గారిని వివాహం చేసుకోదలిచారా?" అవునన్నాడు. "అయితే నేను చెప్పిన విధంగా మీరు చెప్పండి. ఓగిరాల సీతయ్య అను నేను భగవత్సాక్షిగా కష్టాలలో నైనా, సుఖాల్లోనైనా, దరిద్రంలో నైనా, మనసార ప్రేమించి ఇప్పుడు పాణిగ్రహణము చేసుకుంటున్న ఈ కాకాని కాంతమ్మను వదలిపెట్టక నాభార్యగా ఏలుకొందును. ఇందుకు భిన్నంగా నడచుకోను." అని ఒక్కొక్క మాటగా చెప్పి సీతయ్యగారి చేత అనిపించి ఆయన చేతిలో పూలదండ కాంతమ్మ

మెడలో వేయించారు. కొంచెము సేపు హాలంతా కరతాళ ధ్వనులతో మారుమ్రోగింది.

పౌరోహిత్యము వహించిన సోమయ్యగారు గూడా సభికుల ఆనందాన్ని పరికించి చూచి తన చేతిమీదుగా జరుగుతున్న ఈ వివాహం ఇంతమంది ఆనందానికి కారణమైందనే సంతోషంతో ఒక చిరునవ్వు నవ్వి కాంతమ్మగారూ మీరుకూడా నేను చెప్పిన విధంగా చెప్పండి' అని కాకానికాంతమ్మ అను నేను అని ఇదవరకు సీతయ్యగారిచేత అనిపించిన మాటలే అనిపించి, చివరకు ఈ వోగిరాల సీతయ్యగారిని భర్తగా ఏలుకొందును" అని అనిపించి కాంతమ్మను పూలమాల సీతయ్యగారి మెడలో వేయ్యమన్నాడు.

పరమానందంతో పరవుశురాలైన కాంతమ్మ పెనిమిటి పేరు చెప్ప గూడదనే పూర్వాచారపు ఆలోచన కూడ మనసుకు తట్టకుండా స్పష్టంగా సోమయ్యగారు చెప్పిన వాక్యాలను ఒడిదుడుకులు లేకుండా చెప్పి, చెక్కిళ్ళ మీద ధారగా కారుతున్న ఆనంద బాష్పాలను ఎవరన్నా చూస్తారనే భయం కూడా లేకుండా తలయెత్తి సీతయ్యగారి కళ్ళి చూసి పూలహారాన్ని అయన మెడలో వేసి ఒక చిరునవ్వు నవ్వింది. చెక్కిళ్ళ మీద కారుతున్న ఆనంద బాష్పాలధారను మొహం నిండా చెమ్మగిల్లిన చెమటను పమిట చెంగుతో తుడుచుకున్నది.

బ్రహ్మంగారు జేబులోనుంచి తీసి బల్లమీద పెట్టిన తాళిబొట్టు, నల్లపూసల పేరు గూడా సోమయ్యగారు సీతయ్యగారి చేత కాంతమ్మ మెడలో కట్టించారు. సభికులలో కొంతమంది ఇంత చక్కగా జరిగిన బ్రహ్మసమాజపు పెండ్లిలో ఈ మూఢాచారం ఎందుకు తెచ్చి పెట్టారా అన్నట్లు ఫక్కున నవ్వారు.

స్టేజీమీద కూర్చున్న రాంభద్రయ్యకు ఈ తతంగం అంతా విచిత్రంగా తోచింది. అందరూ నవ్వినప్పుడు నవ్వాడు. అందరూ చప్పట్లు కొట్టినప్పుడు తనూ చప్పట్లు కొట్టాడు. మొహంమీద పడుతున్న క్రాఫింగును సర్దుకుంటూ కాసేపటు కాసేపిటు బార్లు తీరిన కుర్చీలవైపు తేరిపార చూస్తున్న రాంభద్రయ్య చూపు ప్రవేశద్వారం వద్ద హఠాత్తుగా ఆగింది. అక్కడ లోపలికి వస్తున్న కాకాని కరణం స్వరూపాన్ని చూచాడు. ఏమీతోచక కాంతమ్మ కుర్చీ దగ్గరకు వచ్చి "అక్కయ్యా కొంప మునిగింది. ముండాకొడుకు కాకాని కరణం అదుగోనే" అన్నాడు వేలుపెట్టి గూడా చూపించాడు.

ఇతను వేలిపెట్టి చూపించటం చెవిలో చెప్పటం అంతా చూచి అతను

చూపించిన వైపు చాలామంది చూచారు. బ్రహ్మంగారు, సోమయ్యగారు కూడా చూచారు. సీతయ్యగారి దృష్టి గూడా అటు వైపే పోయింది. కూచోటానికి స్థలంలేక ఒక పక్క కుర్చీలకు వెనకమళ్లా రెండు చేతులతో రికార్డు పట్టుకొని గోడకానుకొని చేతులు వేలాడేసి చూస్తున్న కరణాన్ని గుర్తించారు.

"కొంపముంచి ఈ పెండ్లి జరగటానికి వీల్లేదని ఇంజక్షను తేలేదు గదా" అని ఒక క్షణం అనుకొని, మరుక్షణం "వాడిమొహం, ఏమని తెస్తాడులే బహుశ నేను గుంటూరు ఆఫీసర్లకు పంపిన శుభలేఖ చూచుంటాడు. ఏదో పని మీద ఇక్కడకొచ్చి పెండ్లెట్లా జరుగుతున్నదో చూడటానికి వచ్చుంటాడు. అని మనసు సమాధాన పరుచుకున్నాడు.

బ్రహ్మంగారికి బహుశ ఆమె బంధువులెవరో పెండ్లిలో విఘ్నం కలుగ చేయటానికి వచ్చారేమో బైటికి పొమ్మందామని గబగబా వెళ్లి "ఎవరయ్యానీవు? ఎందుకొచ్చా, వెళ్ళు" అన్నాడు

కరణం "నేను బారిష్టరు ప్రకాశంగారికోసం వచ్చాను. వారితో అవసరమైన కోర్టు విషయాలు మాట్లాడాల్సివచ్చా" అన్నాడు. బ్రహ్మంగారు "సరే అయితే బయటే ఉండండి. ఇక్కడేం పని వెళ్ళండి.. ఊ వెళ్ళరే" అంటూ ఆయన చేయి పట్టుకుని బయటకు పంపి ఆ ద్వారం తలుపేసి స్టేజి దగ్గరకొచ్చి "మీరు కానివ్వండి" అన్నాడు సోమయ్యగారితో

వారు మళ్ళీ బల్లమీద రెండు తడవలు చప్పుడుచేసి "మన బ్రహ్మసమాజ ప్రముఖులైన శ్రీ బారిష్టరు ప్రకాశంగారు హితోపదేశం చేస్తారు"అన్నాడు. వెంటనే బారిష్టరు ప్రకాశంగారు వల్లెవాటు సర్దుకుంటూ స్టేజీ మీదకు వచ్చి బల్ల దగ్గరగా సీతయ్యగారి పక్కన నిల్చొని "పూజ్యసోమయ్యగారు! పునర్వివాహపు దంపతులారా! పెండ్లికొచ్చిన పెద్దలారా! చూడవచ్చిన చిన్నలారా! మన బ్రహ్మసమాజం ఆధ్వర్యంలో ఇదివరకెన్నో పెండ్లిండ్లి జరిగనవి. ఇటువంటి ఆదర్శ వివాహం ఇదివరకెన్నడూ నేను చూచెరగను. వధువు మంచి నియోగి బ్రాహ్మణ కుటుంబానికి చెందిన స్త్రీ. వరుడు శుద్ధ ఛాందసమైన వైదీక కుటుంబానికి చెందినవాడు. మంచి ఉద్యోగంలో వున్నాడు. ఇద్దరి మొహార వించంలో బ్రహ్మతేజస్సు ఉట్టిపడుతున్నది. స్త్రీ మాత్రం పునర్వివాహం చేసుకోగూడదనే పక్షపాతంతో ప్రవర్తించే ఈ బ్రాహ్మణ సమాజాన్ని కాలదన్ని ఏకోపాసకులమైన మన సమాజంలో చేరి ఈ వివాహం చేసుకోటం తద్వారా వీరు లోక కళ్యాణానికి తోడ్పడ్డవారైనారు. ఈ వధూవరులను మీ అందరి

తరపున ఆశీర్వదిస్తున్నాను. ఈ వధూవరులిద్దరూ ఎవరి దినచర్యలు వారు సక్రమంగా జరుపుకుంటూ, ఎవరి విద్యుక్త ధర్మాలను వారు నెరవేర్చుకుంటూ ఎంతో అన్యోన్యంగా కుటుంబజీవితం గడుపుకుంటారని ఆశిస్తూ భగవంతుడు వారికి ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధి, బుద్ధికుశలత యిచ్చి రక్షించాలని ప్రార్థిస్తూ ఇంతటితో నేను విరమిస్తున్నాను" అని అందరికి నమస్కారం చేసి వెళ్లి కూర్చున్నారు. కరతాళధ్వనులతో హాలంతా మిన్ను ముట్టిపోయింది.

శ్రీవోగిరాల సీతయ్య, కాంతమ్మల దాంపత్యం చిరాయువుగా ఉండాలనే ప్రార్థనతో పెండ్లి కార్యం ముగిసింది. సభికులలోని ఆడవాండ్లు, మగవాండ్లు కాంతమ్మ, సీతయ్యలతో కరస్పర్శలు చేసారు. ఇస్తివాయనం పుచ్చుకుంటి వాయనం అన్నట్లు వారు వీరికి వీరు వారికి నమస్కారం చేశారు. కొంచెంసేపటికి ఆ హాలు తలుపులు తెరచి అంతా బైటికి పోవటం ప్రారంభించారు. తలుపు దగ్గరగా నిల్చున్న కరణం ఎవరబ్బా ఇతను అని చూస్తూ ఏదో పనిమీద వచ్చుంటాడనుకుంటూ చాలా భాగం అంతా బైటికి వచ్చారు.

కాకాని కరణం బారిస్టరు ప్రకాశం గారు బైటికి రాగానే నమస్కారం చేసి "అయ్యా! నేను తమకోసం వచ్చానండి" అన్నాడు. "ఒరే నీకు బుద్ధి లేదురా. ఇక్కడకెందుకొచ్చా. పిలవని పేరంటానికి. వచ్చినవాడివి వూరె కుండక దేబె మొహం వేసుకుని పిచ్చి వెధవ మాదిరి లోపలికొచ్చి చూస్తుంటివి. రా పోదాం" అంటున్నారు బారిస్టర్ ప్రకాశం. ఇంతలోకి అక్కడికొచ్చి కొంచెం ఆగి మాటలు విన్న కాంతమ్మ, సీతయ్యలు కరణం ఏమంటాడో అని బ్రహ్మం గారితో సహా అంతా కారెక్కి ఇంటికి పోయినారు.

కారులో పోయేటప్పుడు ఆ కరణం తమ చుట్టమని బహు దుర్మార్గుడని ఏదో కోర్టు పనిమీద వచ్చుంటాడని చెప్పింది కాంతమ్మ. బ్రహ్మంగారు "అయితే మీ పెండ్లి విషయంలో జోక్యం చేసుకోనేందుకు రాలేదు కదా! అట్లా అనుకునే చేయి పట్టుకుని బైటికి లాక్కెళ్లా" అన్నాడు.

బ్రహ్మంగారు కూడా ఆపూట అక్కడనే భోంచేసి సాయంకాలం జరగ బోయే విందు ఏర్పాట్లు చేయిస్తున్నారు. సీతయ్యగారు కూడా వారితోపాటే అటు యిటూ తిరుగుతూ కాలం గడిపారు. ఆ చెట్ల క్రింద పెద్ద పెద్ద బల్లలు రెండు బారుగా వేయించారు. వాటి పక్కల్ను ఒక వంద కుర్చీలు వేయించారు. ఒకకొనన ఆ రెండు బార్లకు మధ్య ఒక చిన్న బల్ల వేయించి రెండు కుర్చీలు

వేయించారు. అక్కడక్కడ స్తంభాలకు గ్యాసులైట్లు కట్టించారు. సాయంకాలం 7 గంటలకల్లా వంట పదార్థాలు లారీలో వచ్చిచేరినై. బల్లమీద తెల్లదుప్పట్లు పరచి పింగాణీ పళ్లాలు, పింగాణీ గిన్నెలు అమర్చారు. బ్రహ్మంగారు 6గంటలకు ఇంటికి పోయి స్నానంచేసి పంచెలు మార్చుకొని 7.30 కువచ్చారు.

రాంభద్రయ్య గూడా పొద్దున వచ్చిన వాండ్లందరినీ చూచిన తర్వాత ఇంత పెద్ద వాళ్లకు లేని కులం నాకు మటుకు ఎందుకూ? ఒక్క తడవ ఆ బ్రహ్మ కపాళం వెళ్ళి అమ్మకు పిండం వేసి వచ్చానా, ఇక తద్దినాలు పెట్టక్కర లేకుండా పోతుంది. వ్రతం చెడ్డా, ఫలం దక్కేట్లుగా వుంది ఇటువంటి గొప్ప వాండ్ల సాంగత్యం. ఆపాదు బ్రాహ్మణ సమాజంలో దొరకబోయిందటలే అనుకొని ధైర్యం తెచ్చుకుని జములు నేత చెక్కు గుడ్డల కోటు, లాగు తొడిగి లోపల వేసుకున్న తెల్లటి చొక్కా కాలరులో సీతయ్యగారి ఎర్రటిరంగు టై ఒకటి ఆయన చేత కట్టించుకొని విందు పెత్తనమంతా తన మీదుగా నడిచిపోతున్న దన్నట్లు వాండ్లక్కయ్య పక్కన నిల్చొని వచ్చేవాండ్లందరికి వారు చూసినా చూడకపోయినా నమస్కారాలు చేస్తూ నిల్చున్నాడు.

చాలా వరకు రావలసిన పెద్దలంతా వచ్చి కుర్చీలమీద బాతాఖానీ కొడుతూ కూర్చున్నారు. బ్రహ్మంగారు బారిస్టరు ప్రకాశంగారు రాలేదేమబ్బా అనుకుంటూ ఎదురు చూస్తూ వుండేలోగా ఆయన కారాగింది. ఆయనతో పాటు కాకాని కరణం కూడా దిగాడు. గేటులోకి రాగానే అక్కడ కట్టిన గ్యాసు లైటులో సీతయ్య, కాంతమ్మ, రాంభద్రయ్యలుకూడా కరణాన్ని గుర్తించారు.

ప్రకాశంగారు గేటులోకి రావటంతోటే "ఏమండోయ్ బ్రహ్మంగారు! కాంతమ్మగారు చుట్టాన్ని గూడా విందుకు పిలుచుకొచ్చా చూచారా. మీరాయన్ని పాపం ఎవరో అనుకొని తరిమిగొడితిరి. నేనిక్కడున్నాని మా ఇంట దగ్గర చెపితే ఏమో మునిగిపోయినట్లు వచ్చాడు. ఏమమ్మా కాంతమ్మా గుర్తించావా యీయన్ని?" అన్నాడు. కాంతమ్మ ఏమీ జవాబు చెప్పలేక నిల్చున్నది. సీతయ్యగారు వచ్చీరాని నవ్వొకటి నవ్వి "గుర్తించకేమండీ" అన్నాడు కరణం "నమస్కారమండీ ఇనస్పెక్టరుగారు" అన్నాడు సీతయ్య "నమస్కారం ఏం ఇలా వచ్చారు" అన్నాడు.

కరణం "ఏమండీ రాక నాకేం భయమా. మీబోటి పెద్దవాళ్ళకి లేని పట్టింపులు నాకు మటుకెందకూ? అందులో బారిస్టరుగారు కూడా మా దూరపు

చుట్టం. ఇంత గొప్ప వారంతా పూనుకొని చేస్తున్న కార్యం మంచిది గాక చెడ్డది అవుతుందా. ఆరోజు కూడా మీరేదో వొట్టి పుణ్యానికి నామీద అగ్రహ పడ్డారు గాని నేనన్నది మటుకేముంది?" అన్నాడు.

కాంతమ్మ "సరే ఇప్పుడవన్నీ ఎందుకులేస్తురూ, దయచేసి వెళ్లి కూర్చోండి" అన్నది

కరణం "మరదలూ, మంచి దివ్యమైన పనిచేశావు. లేక ఎన్నాళ్ళని వైధవ్యం అనుభవించటం. మన సంఘంలో వున్న దురాచారాలు పోగొట్టాల్సిందే. నీ ధైర్యానికి మెచ్చుకున్నా. రేపు మాయింటికి వస్తే పంక్తిన కూచో పెట్టుకుని భోం చేస్తా" అన్నాడు

కాంతమ్మ " ఈ పెద్ద ఉద్యోగస్తుల ప్రాపు సంపాదించటానికో, ప్రకాశం గారి బోటి వారి మెప్పుపొందటానికో సమయానుకూలంగా మాట్లాడుతున్నావు. నీసంగతి నాకు తెలియదా. మనిషెదుట మనిషి మాటలు మాట్లాడతావు. గుంటూరు జేరుకోంగానే మమ్మల్ని కులంలో వెలెయ్యాలనబోయేది నువ్వే. నీవేం జేస్తే మటుకు నాకు భయముంటేగా " అన్నది.

బ్రహ్మంగారు, సీతయ్యగారు ఒకేసారిగా "సరే రండి ఎనిమిదైంది" అన్నాడు. అంతా విందారగించటానికి వెళ్ళారు. అంబుజమ్మాళ్ గారు, వారి భర్త జడ్జిగారు గూడ వచ్చారు. అంబుజమ్మాళ్‌గారు బ్రహ్మంగారి కోరిక మీద రెండు ఆశీర్వచనపు మాటలు జెప్పి వధూవరుల ఆయురారోగ్యాల కొరకు మీరంతా విందారగింపుడు" అని చెప్పిం తర్వాత అంతా విందారగింప ప్రారంభించారు.

కోమల విలాస్ నౌకర్లు స్ఫటికమైన తెల్లటి దుస్తులతో శుచైన, రుచైన పదార్థాలు వడ్డిస్తుంటే నవ్వుకుంటూ, ఆమాటలు ఈమాటలు చెప్పుకుంటూ అంతా భోంచేస్తున్నారు.

ప్రకాశం గారు కరణంతో "చూచావటయ్యా, ఇప్పుడు మాట్లాడినామె పెనిమిటే ఇక్కడ జడ్జిగారు. ఒకవేళ అక్కడి జిల్లా కోర్టులో కేసుపోయినా ఇక్కడ తప్పకుండ గెలిపిస్తా"అన్నాడు

కరణం "ఏమోలేండి. అందుకని కదూ, నామరదలన్న మాటలన్నీ మింగుకొని వచ్చి ఇక్కడ కూర్చున్నది. లేకపోతే తిరిగి పోక పోయానా. వ్రతం చెడ్డా ఫలం దక్కుతుందనే ఆశతోనే వచ్చా" అన్నాడు

ఆ కామినీవిహార్ కాంపౌండులోని ఉద్యానవనంలో గ్యాసులైట్ల కాంతిలో

తెల్లదుప్పట్లు పరచిన బల్లమీద పింగాణీ ప్లేట్లలో, కోమలవిలాస్ పిండి వంటలతో సీతయ్య, కాంతమ్మ ప్రేమ వివాహపు విందుకు వచ్చిన వారందరికి బ్రహ్మంగారి ఆచారాలతో చందన తాంబూలాదులతో పూర్తయింది. ఎవరింటికి వారు పోవసాగారు. సీతయ్య, కాంతమ్మలు ఒకరి కంచంలో ఇంకొకరు పిండి వంటలు వేసుకుంటూ బువ్వల బంతులు ఆడుకోటంతోటే సరిపోయింది. సగమాకలి తోటే లేచి అంతా వెళ్లిందాకా గేటు దగ్గర నిల్చొని నమస్కారాలతో అందరినీ సాగనంపారు. బ్రహ్మంగారిని కూడా అనేక వందనాలతో సాగనంపారు.

కులం చెడ్డా ఫర్వాలేదనే ధైర్యంతో రాంభద్రయ్య పోయి పడుకోంగానే నిద్రపోయినాడు. పెండ్లి బడలికతో వుండి కూడా ఆ దినమంతా వైభవంగా జరిగిపోయిందనే పరమానందతో ఒకరి కౌగిలిలో ఒకరు నిశ్చింతగా నిద్రపోయినారు సీతయ, కాంతమ్మ.



ఏసుదాస్ కాప్టన్ బ్రాడ్లే దొరతోపాటు లండను విమానాశ్రయంలో రాత్రి ఫ్రాన్సు నుంచి చేరుకోగానే వార్ ఆఫీసు వారు ఏర్పాటు చేసిన ప్రకారం రెండు ఆర్మీ చిన్నకార్లు వచ్చినై. వీరిని ఆహ్వానించి తీసుకుపోవటానికి ఒక ఆఫీసరు గూడా వచ్చాడు. ఆ ఆఫీసరుకు, బ్రాడ్లే గారికి ఇదివరకే పరిచయం ఉండటం వల్ల కరస్పర్శలు చేసుకొని కుశలప్రశ్నలు వేసుకున్నారు. బ్రాడ్లీగారు ఏసుదాసును పరిచయం చేశారు.

ఆయన ఏసుదాసుతో కరస్పర్శ చేసి "మీవంటి వీరులను సందర్శించే భాగ్యం నాకు గల్గింది" అన్నాడు. ఏసుదాసు ఒతత సహజమైన నవ్వు నవ్వి వురుకున్నాడు.

పాస్‌పోర్టు అధికారుల లాంఛనాలు పూర్తికాగానే ఒక కార్లో సామాను, ఇంకో కార్లో ఏసుదాసు, బ్రాడ్లే, వీరినాహ్వానించటానికి వచ్చిన ఆఫీసరు బయలు దేరారు.

కార్లో వచ్చేటప్పుడు లండన్ పట్టణంలో వెలుగుతున్న విద్యుశ్చక్తి దీపాలు, విసుగూ విరామం లేకుండా తిరుగుతున్న కార్లు, గొప్పమేడలు, ట్రాములు, ఇవన్నీ చూచి ఏసుదాస్ అచ్చెరువొందాడు. తల బైటికి పెట్ట ఎసుదాస్ ఎంతో ఆదుర్దాగా చూస్తుండే బ్రాడ్లే "ఏసుదాస్‌జీ, ఎందుకంత వింతగా చూస్తారు. ఎట్లాగో ఇక్కడ కొద్దిరోజులుండబోతున్నాం. తీరికగా నగరమంతా చూపించే ఏర్పాటు అదివరకే చేసుంటారు. మీ ఆతుర్తా ఈ వచ్చిన ఆఫీసరుకు

ఎబ్బిరకంగా కనపడవచ్చు. బాగుండదు. మామూలుగా నే కూర్చోండి. అదీగాక మీరిక్కడెంతో గౌరవస్తులుగా మెలగాలి. తెల్లవారితో మీరు ఎక్కడ ఎట్లా మెలగాల్సిందీ రేపు ఉదయం కలుసుకున్నపుడు విశదంగా చెపుతా "అని హిందూస్థానీలో చెప్పాడు.

ఏసుదాసు యథాప్రకారం సీటుకానుకొని దర్జాగా కూర్చోన్నాడు. తాను మర్చిపోకుండా బ్రాడ్లేగారు విడిచిపెట్టమని ఎంత చెప్పినా వినకుండా తనతో పాటు తెచ్చుకున్న పిల్లికు గూడా అంతా కొత్తగా వుంది, ఏసుదాస్ వళ్ళో కదలకుండా కూర్చుంది.

విమానాశ్రయంలో అదే కారులో వచ్చిన ఆ ఆఫీసరు గూడా ఇటువంటి నాటు పిల్లిని వెంట తేవటం యేమిటి ఇక్కడన్నా వదలిపెట్టమని చెప్పండని బ్రాడ్లేతో చెప్పాడు. "ఆయన్నట్లా అడగటం మర్యాద గాదని, ఈ యుద్ధంలో నానాజాతి వారి మత ధర్మాలతో వారి వారి అలవాట్లతో ఆచారాలతో జోక్యం కలుగజేసుకోకుండా వుండి మన జాతి మన ఆచరాలకు విరుద్ధమైన పనులెన్నో ఇతరుల సహాయం వాంఛించి చేస్తున్నపుడు ఇది కూడా అట్లాగేనని ఆయన ఆ పిల్లి వుండబట్టే జనరల్ రాబిన్‌సన్ గారిని రక్షించగలిగా ననే ఒక మూఢ నమ్మకంతో వున్నాడని అందువల్ల ఆయన నడగకూడదని సమాధాన పర్చాడు.

కార్లు రెండు లండన్ సిమెంటు రోడ్లమీద మెత్తగా దొర్లుకుంటూ వచ్చి 'సెవాయి' హోటల్ ముందు ఆగినయి. హోటలు పోర్టర్లు వచ్చి సామా నెత్తుతుంటే ఏసుదాసు మనసులో అయ్యో తెల్లదొరల చేత పని చేయించు కోటమా అనుకొని తనెత్తబోయినాడు. పక్కనున్న బ్రాడ్లే దొర వెనకనుంచి కోటు పట్టుకు లాగి అట్లా చెయ్యకూడదని సంజ్ఞచేశాడు. "వాళ్ళు హోటల్ నౌకర్లు. ఈ పని చేయడం కోసం వాళ్ళిక్కడ ఉన్నారు" అని హిందూస్థానీలో చెప్పాడు.

ఏసుదాసు "అవును మర్చిపోయా. ఇక్కడ పాకీపని వాండ్లు కూడా మన దేశానికి పెద్ద ఉద్యోగస్తుల్లాగా వచ్చి దర్జాలు పోతుంటారని వినేవాడ్ని. ఇది తెల్లవాండ్ల దేశం కాబట్టి బీద బిక్కి, నౌకర్లు చాకర్లు అంతా తెల్లంగానే వుంటారు. తెల్లదొరలను చూస్తే వంగి సలాములు చేసే బానిస బుద్ధి ఎక్కడికి పోతుంది. ఇంత గొప్ప హోదా ఇచ్చి నన్నింత గౌరవంగా చూస్తున్నా అని మనసులో అనుకుంటూన్నాడు. వాళ్లు ముగ్గురూ కలిసి లోపలికి వెళ్ళారు. ప్రవేశ ద్వారం దగ్గరనే లోపలగా ఒక పక్కన వొక పెద్ద బీరువా లాంటి పెట్టెలోకి బ్రాడ్లే దొరగారే దారి తీశారు. ముగ్గురూ లోపలికెళ్ళారు. పోయి నిల్చోంగానే

తెల్లటి దుస్తులతో తళ తళ లాడే పద్దెనిదేళ్ల పడుచు పిల్లొకతే కులుకుతూ కోర చూపులు చూస్తూ దొరలు వేళ్ళెత్తి "గుడ్ ఈవెనింగ్" అన్న సలాముకు బదులుగా వంకర తల పెట్టి వయ్యారంగా "గుడ్ ఈవెనింగ్" అంటూ ఆ పెట్టే కటకటాల తలుపు ఠక్కున వేసింది. వేలుపెట్టి ఒక కిటు వొత్తింది. బజ్ అని శబ్దం చేసుకుంటూ పెట్టె పైకి వెళ్ళుతున్నది.

ఏసుదాసు అయోమయ స్వరూపం ఆ బిత్తరచూపులు చూచి బ్రాడ్లే దొర హిందూస్థానీలో "ఇది మనుషులను పై అంతస్తుల మీదికి, కిందకు చేరవేసే మా నిచ్చెన, దీన్నే లిఫ్ట్ అంటారు ఇంగ్లీషులో.

అక్కడ ఆ వరండానిండా ఎక్కడ చూచినా ఆ తెల్ల విద్యుశ్శక్తి దీపాలల్లో పెళపెళ లాడుతున్న తెల్ల దుస్తులతో గులాబిరంగు బుగ్గలతో, ఎఱ్ఱటి పెదిమలతో ఎత్తాంటి మడమలతో టిక్కు టిక్కుమని మెరుపుతీగల్లాగ తిరుగుతున్న ఆ ఆడపిల్లలే.

ఈ ఆడమళయాళంలో నన్ను పడవేసి వీరి దారిన వీరు పోతే నా గతేం కావాలె? మైనహీం ఆసక్తా? అన్నాడు ఏసుదాసు "క్యోం" అన్నాడు బ్రాడ్లీ. "నేను ఆడవాండ్ల మధ్య ఉండను. మగ వాండ్ల మధ్యలోనే ఉంటా" అన్నాడు హిందూస్తానీలో.

"ఇక్కడుండేదంతా మగవాండ్లే. ఈ కనపడే ఆడవాండ్లు కేవలం ఇక్కడ చాకిరి చేసేవాళ్ళే. వాళ్ళు నీజోలికి రారులే రమ్మని రెక్కపట్టుకొని తీసుకెళ్ళాడు. వీరి కొరకు ప్రత్యేకించబడి వుంచిన వొక గదిలోకి అక్కడ రెక్కవిడిచి పెట్టి బ్రాడ్లీ దొర "ఏసుదాస్‌జీ! ఎందుకూ ఆడవాండ్లను చూస్తే నీకంత బిత్తరపాటు? మీదేశంలో మాదిరి మా దేశంలో ఆడవాండ్లను ముసుగులు కప్పి ఘోషాలో వుంచం. అన్నం వండి పెట్టటానికి, పిల్లలను కంటానికే వాళ్ళు పుట్టారని అనుకోం. ఇప్పుడు మా మగవాండ్లంతా యుద్ధ భూములకు పోతే, ఆడవాళ్ళంతా యుద్ధం లేని సమయాల్లో మామూలుగా మగవాండ్లు ఆక్రమించుకొని చేస్తున్న పనులన్నీ చేస్తున్నారు. యుద్ధ పనిముట్లు తయారయ్యే పెద్ద కర్మాగారాల్లోనే కాక, ట్రాములు, బస్సులు నడిపే పన్ల దగ్గర్నించి పొలాలు దున్ని సేద్యం చేసే పనులు కూడా వాండ్లే చేసుకుంటున్నారు. యుద్ధ హడావుడి తగ్గిం తర్వాత పోటీ వచ్చేట్టయితే పనివంతులనుకున్న మా మగవాళ్ళేందర్నో మా ఆడవాండ్లు అనేక కఠినమైన పన్లలోగూడా ఓడించవచ్చు."

ఇంతలోకి ఒక పడుచుపిల్ల దరులేసి నడుస్తూ వచ్చి "సుబేదార్ ఏసుదాస్

ఎవరు" అని అడిగింది. బ్రాడ్లీ గారు వీరేనన్నారు ఏసుదాసును చూపిస్తూ "మీ గది ఇది. కాప్టన్ బ్రాడ్లీగారి గది ఆ కొనన ఉన్నది" అన్నది. వారాఫీసు నుంచి వచ్చిన ఆఫీసరు వీరికి తగిన ఏర్పాట్లు చేయటానికి హోటలు మేనేజరుతో మాట్లాడి అప్పుడే వచ్చి వీరితో కరస్పర్శలు చేసి "వెళ్ళొస్తానండి. రేపు ఉదయం 10గంటలకు జనరల్ రాబిన్‌సన్ గారు భార్యాసమేతంగా వచ్చి మీ పరామర్శ చేసి పోతారు. వచ్చేవారం రాజభవనానికి వారు మిమ్మల్ని వెంట పెట్టుకుపోతారు. ఈ లోపల మీరు లండనులో చూడదగిన స్థలాలు చూడడానికి ఏర్పాట్లు జరిగినయి. ప్రస్తుతం మీ ప్రోగ్రాం యిది." అని వెళ్ళిపోయినాడు.

బ్రిటీషు సామ్రాజ్యానికి ముఖ్య పట్టణమైన లండను నగరం వాయువేగ మనోవేగంతో పెరుగుతుండటం వల్ల కింద భూమిలోకి పైకి ఆకాశంలోకి కూడా భవనాలు పెంచి స్థల ముక్తసరి కోసరం కడుతూ వచ్చారు. అమెరికా ముఖ్య పట్టణమైన న్యూయార్కులో మాదిరి 100 అంతస్తుల మేడలు లేకపోయినా లండనులో 40-50 అంతుస్తుల మేడలక్కడ ఉన్నయి.

మన ఏసుదారు బసచేసిన సేవాయ్ హోటల్ కూడా వలసరాజ్య ప్రజల నానివిధ దోపిడి విధానంతో బ్రిటిష్ సామ్రాజ్య వాదుల ఐశ్వర్య సంపదలు అంతులేకుండా పెరిగి పోతున్న రోజులలో పునాదులేయబడి క్రమేణా భూమ్యా కాశాలలోకి పెరిగిన 15 అంతస్తుల మేడ.

ఇందులో వీధిమట్టానికి ఉన్న సగ భాగంలో రకరకాల దుకాణాలున్నె. భూమి లోపలికి కట్టిన రెండంతస్తుల కింది భాగం సరకులు నిలువ చేసుకుండే గోదాములు, ఇంకో భాగంలో చౌక రకం సారా, బీరు అమ్మబడే క్లబ్బులు, సామాన్యరకం ప్రజలు రుసుముతో స్నానం చేయగల స్నానాగారాలు ఉన్నవి. కదమ 12 అంతస్తులు కేవలం హోటలు కోసం ఉపయోగపడుతున్నయి. చిట్ట చిటారు అంతస్తులో మధ్య ఒక పెద్ద నాట్యశాల, బార్‌రూమ్, ఒకపక్క రకరకాల సారా, విస్కీ, బ్రాందీ, షాంపేన్, ద్రాక్షరసం(వైను) అమ్మబడే బారు, అల్పాహారపు రెస్టారెంటు, ఇంకో పక్కన నాట్య సమయంలోనూ, నాట్యం పూర్తైన తరువాత స్త్రీ పురుషులు జంటజంటలుగా వెళ్ళి కులాసా కాలక్షేపన చేయటానికి విడి విడిగా కట్టబడిన సోఫాసెట్లతో అలంకరించబడిన గదులు, ఆ భవనం కప్పు మీద చక్కని చలువరాతి చప్పరం వేసి పెద్దపెద్ద తొట్లతో తీగచెట్లు క్రోటన్లు, పుష్పజాతి చెట్లు పెంచి, వంకర టింకరగా దారులు ఏర్పాటు చేసి, అక్కడక్కడ చలువరాతితో అందంగా కట్టి అమర్చబడ్డ బెంచీలు వేసి,

విహారార్థం ఎంతో అందంగా రంగు రంగుల దీపాలతో అలంకరించిన వుద్యానవనం విలసిల్లుతున్నది.

బండి తోలుకబతికే మోటోడ్ని నాచేత ఇంకోర్ని రక్షించేట్టు చేసి కాసేపట్లో కన్నుమూసి తెరిచేలోపు గొప్పోణ్ణి చేసి అందలమెక్కించాడు. పెరుగుట విరుగుట కొరకే ధర హెచ్చుట తగ్గుట కొరకే అన్నట్లు అంతులేని భోగాలలో దించి చివరకు నీతి నియమాలు తప్పిన నిర్భాగ్యుడిగా చేసి అధోగతిపాలు చేసేట్టున్నాడు.

వీరస్వర్గం అనుభవిద్దామని నేపెట్టుకున్న గిరి తప్పించి రవురవాది నరకం లోకి నెట్టి, ఆ యమకింకరుల బారి నుంచి రక్షించు ఈ దీనుడ్ని. నీ దాసానదాసుడ్ని రక్షించు. నా దీక్ష చెదరకుండా చూదు స్వామీ ఏడుకొండలవాడా వెంకటేశ్వరస్వామి" అని తలపైకెత్తి దండం పెడుతూ భగవధ్యానంలో పడ్డాడు.

కొంతసేపటికి బ్రాడ్లేగారు స్నానంచేసి దుస్తులు మార్చుకొని ముస్తాబై వచ్చి చేతి వేళ్ల మెటిమలతో తలుపు కొడుతూ "మే ఐ కమిన్" అంటున్నాడు. కానీ ఏసుదాసు వినిపించుకోలా. బ్రాడ్లేగారు తలుపు తెరుచుకొని లోపలి కొచ్చారు. ఏసుదాసు ధ్యానంలో వుండటం చూసి పలకరిస్తే ఏం 'సొడ్డో' అని పక్కన చే కుర్చీలో కూచున్నాడు. ఎంతసేపటికి అతని ధ్యానం వగదెగక పోతే ఏసుదాసు చుట్టూ మ్యావ్ అని తిరుగుతున్న పిల్లిని పట్టుకొని దానితో కాసేపు ఆడుకున్నాడు. ప్రొద్దు పోతున్నదని ధైర్యం తెచ్చుకొని చప్పట్లు కొడుతూ "ఏస్‌దాస్‌జీ" అన్నాడు. ఏసుదాసు కండ్ను తెరిచి చూచాడు. "అయ్యా మీరెంత సేపైంది వచ్చి" అన్నాడు.

"దాదాపు అరగంట

ఐంది. ఇంకా మీరు స్నానం చేసినట్లు లేదే. ఏం, ఇవాళ మీరేదో ఒకవిధంగా ఉన్నారే. ధ్యానంలో ఉన్నారా, ఏమన్నా ఆలోచనలో పడ్డారా" అన్నాడు బ్రాడ్లే

ఏసుదాస్ " రెండిట్లోపడ్డా అనవసరంగా మీరు నన్నిక్కడికెందుకు తెచ్చారో నాకు బోధ పడటంలా. నాబోటి మూర్ఖుడ్ని మీ దేవకన్యల మధ్య తెచ్చిపడేశారు. ఏం పాపం చేస్తానో అనే భయం తోచి బాధ పడుతున్నాను. నాజీవితంలో జరిగిన ఒక సంఘటన జ్ఞాపకం వచ్చి మళ్ళీ అటువంటి పాపం చెయ్యకుండా చేయమని ఆ భగవంతుడ్ని ప్రార్థిస్తున్నా. నన్నిక్కడ్నించి ఎక్కడన్నా మిలటరీ బారకాసులో బడేయ రాదుటండీ. మానవమాత్రుడ్ని. ఉప్పుకారం తినేవాడ్ని. అవకాశం చిక్కినపుడు మహా మహా యోగీశ్వరుల మనసులే

చలించినట్లు ఈ స్త్రీల సాంగత్యంలో మనోబలం తగ్గిన సమయంలో సంపర్కం ఏర్పడి చెడిపోతానేమో. నేను ఒక స్త్రీకి మాటిచ్చొచ్చా ఇంకో స్త్రీని ఆశించనని ఏమంటారు?"

బ్రాడ్లీ "ఏసుదాస్‌జీ! ఎంత వెర్రి ఆలోచనలో పడ్డారు. మనోనిగ్రహత సంపాయించి ముక్తి చెందాలంటే ఆకర్షణీయమైన స్త్రీల మధ్య వుండే ఆ నిగ్రహత సంపాయించాలె. వాంఛనీయమైన వస్తువుల మధ్య మెలుగుతూ వాటి నంటు కోకుండా యోగత్వం సంపాయించవలె. లేదా పాపపుణ్యాలను కట్టిపెట్టి వాటిని తనివితీరా అనుభవించి వాటి రుచులను, అరచులను తెలుసుకోవాలె. అవి స్వీకరించినందువల్ల వచ్చే లాభనష్టాలు తెలుసుకున్న తరువాతనే వాటిని త్యజించాలె. లేక వాటిని చూచి భయపడి మనోనిర్మలత ఏర్పడుతుందేమో అని దూరంగా పోయి ముక్కుమూసుక కూచుంటే వాటిని అనుభవిస్తే ఎట్లా ఉంటుందో అనే వాంఛ ఎక్కువౌతుంది. మానవ జన్మ ఎత్తినందుకు మానవ సేవ చేయాలె. బలవంతుడు బలహీనులను భక్షించకుండా రక్షిస్తూ భాగ్యవంతుడు బీదవాండ్లను పీల్చి పిప్పి చేసి వాండ్ల శరీర కష్టం ఏదమ్మిడికో కొని వాండ్ల బుద్ధికుశలతను, భాగ్యాన్ని బీదల శ్రేయస్సుకోసం ఖర్చుపెట్టాలె. మానవ సేవ చేస్తూ మనసు దారుణాల పాలు కాకుండా యోగత్వం సంపాయించిన వాడే ఘనుడు.

అందులో స్త్రీని అనేక రూపాలలో చూడలేక కేవలం ఒకే ఒక కామ దృష్టితో చూచేవాడు పరమనీచుడు. పరస్త్రీని తల్లిగా, తోబుట్టువుగా ఎందుకు చూచుకోగూడదు? స్త్రీలను చూచి అంత బిత్తరపోతావెందుకు? ఈ మనోనిర్బలత పోగొట్టుకో. లేచి స్నానం చేసి భోంచేసి కొంచెం షికారుకు కెళ్ళొస్తే ఆందోళన తగ్గుతుంది" అన్నాడు

ఏసుదాస్ ఆశ్చర్యంతో " బ్రాడ్లీగారు మీకీవేదాంతం ఎక్కడ్నుంచి అబ్బిందండీ?" అన్నాడు

బ్రాడ్లీ " ఇన్నాళ్లనుంచి మనమీ దోరణిలో మాట్లాడుకుండే అవకాశమే లేకపోయింది. నేను కూడ బీద కుటుంబంలో పుట్టి నా స్వశక్తిమీద ఆధారపడి ఇంతవాడ్నయినా. అందువల్ల ఈ వేదాంతం ఉగ్గుపాలతోటే నాకొచ్చింది. మమ్మల్ను గురించి మీ దేశంలో అట్లా అనుకుండే మాట నిజమే. అందులో అబద్ధం కూడా లేదు. పాశ్చాత్య దేశస్తుల పాపం పండిపోయిందన్న మాట నిజం. మావాండ్లు ఎన్ని దురంతాలో చేసి, దేశాలన్నీ ఆక్రమించారు. సగం

ప్రపంచాన్ని అన్యాయంగా ఆక్రమించుకొని నల్లజాతులను బానిసత్వంలో వుంచి వాండ్లను పీడించి నెత్తురు కూడు తింటున్న మాట వాస్తవం. ఆ జాతీయ అభిప్రాయం అనే వరదన విధిలేక నేను కొట్టుకపోవాల్సిందే. మాలో ఎన్ని పార్టీలున్నా ఎన్ని అభిప్రాయ బేధాలున్నా మాకు లాభసాటిగా ఉన్న ఏ పాపాని కైనా అంతా ఒడికట్టక తప్పదు.

అసలు ఆరాతీస్తే ఈ యుద్ధం ధనాద్యుల మధ్య యుద్ధం. ఇది పాటక ప్రజల బాగోగులకు చేస్తున్న యుద్ధం కాదు. నాకు మాత్రం ప్రపంచంలో ధనికులు, కష్టజీవులు, దోపిడి చేసే వాండ్లు, పరుల కష్టం మీద జీవించే మిల్లు యజమాన్లూ, పరాన్నభక్షులు, జీవనోపాధి కోసం శరీర కష్టం అమ్ముకొని బతికే కార్మిక, కర్షకులు, కాలిమీద కాలేసుకొని కడుపులో చల్ల కదలకుండా ఇతర్ల నోళ్ళు కొట్టి భోగ భాగ్యాలతో తులతూగే ఆగర్భ శ్రీమంతులు చమటలు కార్చి కష్టం చేసి తమ కాయకష్టం యొక్క ఫలితం ఇతరుల కప్పజెప్పి కలి అంబలికి గూడా కరువాచి, కడుపునిండా అన్నం వంటి నిండా బట్ట లేకుండా కటికి దరిద్రం అనుభవించే పాటకపుజనం ఏమన్నా వున్నవాండ్లి లేని వాండ్లని రెండే జాతులున్నవని తెలుసు. ఎప్పటికైనా మెట్టలు పల్లాలు అనేవి ఎచ్చు తగ్గులనేవి చదరం చేసి, దేవుడిచ్చిన పాడి పంటలు అంతరాల వన్నట్లు కేవలం ప్రబోధనలతో బతిమిలాడి భంగపడటం తప్ప ధనాద్యులు బుద్ధిపూర్వకంగా అధికారం ఆస్తులు వదులుకోరు.

ఏసుదాసుకు అతను చెప్పిందంతా అయోమయంగా వున్నా చెవియొగ్గి విన్నాడు. ఇటువంటి యుద్ధంలో చస్తే వీర స్వర్గం కాదు యమలోకమే ప్రాప్తం అనుకున్నాడు. ఇద్దరూ కలిసి డైనింగు రూముకు పోయి భోంచేసి , కొంచెంసేపు వీధిలో షికార్లు కొట్టొచ్చి పడుకున్నారు.

❖❖❖❖ ❖❖❖❖ ❖❖❖❖

స్త్రీ ఎప్పుడూ సాహసురాలే. స్త్రీలో పశ్చాత్తాపమే వచ్చి చేసిన తప్పు దిద్దుకొని సక్రమంగా వుండ తలచకుంటే బ్రహ్మాదులు తలక్రిందులైనా ఆ స్త్రీ యొక్క మనో నిశ్చయాన్ని మరల్చలేరు. అటువంటి స్త్రీ చేయదలచుకున్నదేదో మనసారా చేస్తుంది. ఎన్ని ఇక్కట్లొచ్చినా నిండుకుండ మాదిరి తొణకదు.

"ఛీ దేశంకాని దేశంలో వచ్చి పడ్డా. నన్ను తొందరగా యుద్ధభూమికి పంపమని రేపా రాబిన్‌సన్‌గారొచ్చినపుడు చేతులు జోడించి చెప్పుకుంటా. తానొకటి తలిస్తే దైవమొకటి చేశాడన్న చందంగా ఉంది నాబతుకు. బతుకు

జీవుడా అని ఈ భోగంలో నుండి బయటపడి ఏ తుపాకి గుండుకో గురవుతా. ఉరి పోసుకొని చద్దామంటే ప్రాణమొప్పకపాయ" అని పరిపరి విధాల మనసు పరుగెత్తుతుంటే, మొదడులో పురుగులు తొలుస్తున్నట్లుంటే పిల్లిని దగ్గరకు తీసుకొని జోకొడుతూ.

బ్రాడ్లీగారు పదికొట్టడానికి రెండు నిమిషాలుండనగా లిఫ్ట్ మీద ఆగే చోటికి వెళ్ళి రాబిన్సన్ గారి కోసం చూస్తున్నాడు. ఏసుదాసు, వాళ్ళొచ్చే లోపల తలపాగా శుభ్రంగా కట్టుకొని నిల్చున్నాడు. రాబిన్సన్ గారు గది వాకిలి దగ్గరికి రాగానే నిట్టనిటారుగా నిల్చోని టక్కున బూటుకాళ్లతో చప్పుడు చేసి ఒక సెల్యూట్ కొట్టాడు.

అయన "ఏసుదాస్‌జీ ఈమె నాభార్య, ఈ పిల్ల నాకూతురు" అంటూ ఇంకో 20ఏళ్ళ పిల్లను చూపించి అంటూ చెయ్యెత్తి తిరుగు సలాం చేస్తూ వచ్చి ఏసుదాసు చేయి పట్టుకొని కరస్పర్శ చేశాడు. భార్యతో "ఈయనే ఏసుదాసు గారు. నా ప్రాణాలు రక్షించినవారు" అని చెప్పటంతో ఆయన భార్య నవ్వు మొహంతో వచ్చి కరస్పర్శ చేసింది. కూతురు కూడా అదే విదంగా కరస్పర్శ చేసింది. వారి వెంబడొచ్చిన ఇంకో ఆఫీసరు కూడా కరస్పర్శ చేశాడు.

రాబిన్సన్‌గారి భార్య "మీరు నాభర్తను రక్షించినందుకు నా కృతజ్ఞతలు తెలుపుతున్నాను. నేనెంతో కృతార్థురాలను. ఆ భగవంతుడే మీలో ప్రవేశించి నాకు పతి బిక్ష పెట్టినట్లున్నాడు" అన్నది. "మా తండ్రిగారిని రక్షించిన వీరులు, మీకు నాహృదయపూర్వకమైన కృతజ్ఞత స్వయంగా తెలుపుకుందామని వచ్చా" అన్నది అయన కూతురు. వచ్చిన ఆఫీసరు "మీరు చేసిన అపారమైన సేవకు మా ప్రజల తరఫున నా తరఫున నీకు కృతజ్ఞతాపూర్వక వందనములర్పిస్తున్నా" అన్నాడు.

ఏసుదాస్ చేతులు జోడించి నమస్కరిస్తూ "అంతా భగవదేచ్ఛ" అంటున్నాడు. ఈ సంభాషణలు పూర్తి కాగానే బ్రాడ్లీగారు వీరందర్నీ పిలుచుకొని పక్కన ఇంకో పెద్ద గదిలో ఏర్పాటు చేసిన అల్పాహార విందు బల్ల దగ్గరికి తీసుకెళ్ళాడు. అంతా ఒక గుండ్రటి బల్ల చుట్టూ వేసున్న కుర్చీల మీద కూర్చున్నారు. జనరల్ రాబిన్సన్ గారు ఏసుదాసును మధ్యలో కూర్చోబెట్టి ఒకపక్కన తాను, ఒకపక్కన భార్యా కూర్చున్నారు. ఏసుదాసుకు ఎదురుగా అవతల తట్టు రాబిన్సన్‌గారి కూతురు మార్గరెటా, ఆమెకొక పక్క బ్రాడ్లీగారు,

ఇంకో పక్కన ఆ వచ్చిన ఆఫీసరు కూర్చున్నారు.

ఏసుదాస్ పాలు తాగి ఊరుకున్నాడు. పిల్లికి పింగాణి గిన్నెలో పాలు పోసి తన వొళ్ళో కూర్చోపెట్టుకొని తాపాడు.

ఏసుదాస్‌జీ నేను మిమ్మల్ని చూడటానికి ముందే కారిడార్లో కాప్టన్ బ్రాడ్లీ గారితో మాట్లాడా. మీకింకా ఇంగ్లీషు తగినంత రాలేదని, రాజుగారిని చూచినపుడు వారితో మాట్లాడదగినంత శక్తి మీకింకా కలగలేదని, ఈ హోటలులో ఉండటం కూడా మీకిష్టం లేదని చెప్పారు.

అందువల్ల మీరు ఒక మాసం పాటు మా కుటుంబంతో పాటు వుంటే బాగుండునని తోచింది. బ్రాడ్లీగారు కూడా నెలరోజులు శలవుమీద వారి స్వగ్రామం వెళుతున్నారు. నా భార్యగారు కూడా మిమ్మల్ని మా ఇంట్లో అతిధిగా వుంచాలని అన్నారు. కాబట్టి మీరు మా స్వగృహంలో వుంటే మేమెంతో సంతోషిస్తాం. మా అమ్మాయి మీకు ఇంగ్లీషు బాగా రాయటం మాట్లాడ్డం నేర్పుతుంది. కొత్త భాష నేర్చుకోవాలంటే మీ స్వభాష తెలియని కుటుంబాల్లో కొన్నాళ్ళుంటే వాడుక వల్ల తొందరగా వస్తుంది. నేను కూడా అప్పుడప్పుడు వస్తుంటాను. మీకు చెప్పాల్సిన అనేక విషయాలున్నాయి. మా దేశాచారాలు గూడ కొన్ని గమనించి వచ్చు" అన్నాడు.

ఏసుదాసు "ఉదయం నుంచి నన్నిక్కడ వృధాగా అపవాకండి. ఎక్కడో ఓపిక కొద్దీ యుద్ధం చేసి చచ్చేవాడికి ఇవన్నీ ఎందుకు? రాజుగారి దర్శనం చేసినట్లుగానే భావిస్తా. నాకు మీరు చేయాల్సిన మర్యాదలలో లోటుపాట్లు చేశారని ఏమాత్రం అనుకోను. నామాట విని యుద్ధభూమికి వెంటనే నన్ను పంపండి" అని హిందూస్తానీలో చెప్పిన మీదట బ్రాడ్లీగారు తర్జుమా చేసి చెప్పారు.

రాబిన్ "మా అతిధ్యాన్ని తిరస్కరించమాకండి. మీరు అసమాన రాజభక్తి పరాయణులని, త్యాగశీలురని, సామ్రాజ్య రక్షణకు ఎంత పనైనా చేస్తారని నన్ను రక్షించినప్పుడే కాకుండా టునిషీయాలోను, బోర్డర్సు వద్ద మీరు ఏ కొద్ది మందో తుంటర్లు చేసిన తిరుగుబాటును అణచి వేసినప్పుడే తెలిసింది. మీరు తప్పక కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకొని యుద్ధ నిపుణత కొంత నేర్చుకోవాలె. గురిపెట్టో, పెట్టకనో గుడ్డేట్టుగా తుపాకి గుండ్లు పేల్చటం యుద్ధం కాదు. వ్యూహరచన మొదలైనవి ఎన్నో మీబోటి వీరులు అవి నేర్చు కోవటం అందుకు భాషాజ్ఞానం ఆ విద్య అవసరం."

వారు పోయింతర్వాత ఏసుదాసు తన గదిలోకి వెళ్ళి తలపాగా వంకెకు తగిలించి కుర్చీ మీద కూర్చోని "బ్రాడ్లీగారు చెప్పినట్లు వాంఛనీయమైన వస్తువుల మధ్య మెదులుతూ కామ, క్రోధ,లోభ, మోహ, మద,మాత్సర్యాలు జయించాలె గానీ వాటిని చూచి ఎక్కడికో నిరత్సాహ పడి పరుగెత్తి పోగూడదు. అందుకనే భగవంతుడు నా నోటినుంచి సరే వస్తా ననిపించాడు. ఏసుదాసూ, వెర్రిపోకడలు పోవాకు. గులాబి చెట్టుకు ముళ్ళున్నాయి గదా అని ఆ పుష్పాన్ని కోసి వాసన చూచి అనందింకుండా వదిలేస్తున్నామా ఈ ప్రపంచం గులాబి చెట్టనుకో. ఈ జీవితం ఒక పుష్పమనుకో. దాన్ని వాసన చూచి దానిలో వున్న జీవిత మర్మం తెలుసుకో.విచ్చలవిడిగా ప్రవర్తించి ప్రపంచానుభవం అన్ని విధాలా సంపాయించు. నవ్వు మంచి వాడివైతే నిన్ను చెడగొట్టగల సాహసకులెవరు? ఆడవాండ్లను చూచి ఎబ్బెరికంగా ప్రవర్తించవాకు. సమత్తాడిన పిల్ల మాదిరి సిగ్గు పడమాకు. అబద్దాలాడేవారు తను ఆడిన అబద్దం నిజమేనని, నిరూపించు కోటానికి ప్రయత్నించినట్లు నీవే మహా నీతిపరుడవని, అందరి కాన్నా ఒక దర్జా ఏక్కువని, దేవలోకం నుండి ఉట్టి పడ్డావని, కోరిక పూరితమైన మనసులో కోరికలేమీ లేవని గొప్ప యోగ పుంగవుడిలాగు నటించవాకు. సామాన్య మానవుల దర్జాలోకి దిగి అందరిలాగే ప్రవర్తించి నిష్కామతత్వం సంపాయించుకో. బడాయి చోరా బుద్ధి తెచ్చుకో" అని తన చెంపమీదనే గట్టిగా చాచి ఒక దెబ్బ కొట్టు కున్నాడు. 'అంతా రామమయం ఈ జగమంతా రామమయం' అని పాడుతూ పోయి అద్దంలో తన మొహం చూచుకొని దర్బీ మొహమేసుకుని తిరగవాక మొహం మీద బొమ్మలాట లాడుతున్నట్లు కనబడవాక. వడిగండ్ల వానలో తడిసిన మొహం లాగు మొహం వేలాడేసుకొని తిరగవాక. సహజమైన సంతో స్వరూపం దాల్చి నవ్వుల గంప మొహం పెట్టుకొని తిరుగు" అని తన బుగ్గలు తనే సాగదీసుకున్నాడు. మరుక్షణంలో అంతా ప్రేమమయం- ఈజగమంతా ప్రేమమయం అని చిందులు తొక్కుతున్నాడు. పిల్లి బుజాల మీద ఎక్కించుకొని గిర్రున అల్లీ బిల్లీ తిరుగుతున్నాడు.

కొంచెంసేపటికి ఎవరో తలుపు కొట్టి "మేఐకమిన్" అన్నట్టుంటే "కమిన్ ప్లీజ్" అన్నాడు

తలుపుతెరుచుకొని మార్గరెటా ప్రత్యక్షమైంది. ఏసుదాసు పిల్లిని బుజాల మీద నుంచి దించకుండానే నవ్వు మొహంతో అమె కళ్లి చూచాడు. ఆ నొసటి మీద బొప్పి భుజంమీద పిల్లి విచిత్రంగా పెట్టిన ఆమొహం చూస్తే ఆమెకు

నవ్వొచ్చింది. నవ్వుతూ“ ఏసుదాస్‌జీ పిల్లితో ఆడలాడుకుంటున్నారా? ఆ మొహం మీద బొప్పేమిటి? అన్నది.

రండి పోతూ మాట్లాడుకోవచ్చు. పిల్లిని నా చేతికివ్వండి. ఈ పిల్లి అల్లావుద్దీన్ మాజిక్ లాంప్ మాదిరి మీ దగ్గరుంటే ఎంత కార్యమైనా చేయగలరని మా నాన్నగారన్నారు. నిజమేనా? తలపాగా పెట్టుకోండి పోదాం. కారులో కూచొని మాట్లాడుకుంటూ పోవచ్చు” అని ఏసుదాసు జబ్బల మీద నుంచి దించిన పిల్లిని ఆమె చంకలో పెట్టుకొని ఆయన వంకెకు తగిలించిన తలపాగా తీసి పెట్టుకోగానే “మీతలపాగా రాజుగారి కిరీటం శోభించినట్లు మీకెంతో శోభిస్తున్నది” అని తలుపేసుకొని బయటకు రాగానే ఆయన చంకలో చేయి దూర్చి పట్టుకొని లిఫ్టులో కిందికి పోయి కారులో కూచున్నారు.

అలిఫ్టు నడిపే పిల్ల వీండ్లిద్దరిని చూచి ఆశ్చర్యంతో చూచింది. పైనుంచి కిందకు వచ్చేంతవరకు కనపడ్డ పిల్లలంతా వీండ్ల కళ్ళే చూస్తున్నారు. తల్లీ కూతుళ్ళ మధ్య ఏసుదాసును వెనక సీట్లో కూచోపెట్టుకున్నారు. కారులో ఎక్కబోయేటప్పుడు తలపాగా పైన కారు టాపుకు కొట్టుకొని కింది పడిపోబోతే లోపల కూచున్న లేడీ రాబిన్‌సన్ నవ్వుతూ “అది చేత పుచ్చుకొని నిదానంగా ఎక్కండి” అని ఎసుదాసును ఎక్కించింది.

ఈ అడస్పర్శ తగిలిన కొద్దీ అతని హృదయం మంచుగడ్డ లాగు బిగుసుకు పోతున్నది. కాని వెంటనే ఆడవాళ్ళను ఇంకో విధంగా చూడలేమా అని బ్రాడ్లీగారు చెప్పిన వేదాంతం మనసుకు తట్టంగానే వంట్లో ఉష్ణం బయలు దేరింది. ధైర్యం తెచ్చుకొని సీటుకు చేరగిలబడి ఇద్దరి మధ్యన ఒత్తుకొని కూర్చున్నాడు. కారులో ఎక్కంగానే కారు బయలుదేరింది.

మార్గరెట్ తల్లితో “అమ్మా, ఈ మాజిక్ పిల్లిని నీ దగ్గర పెట్టుకొని నాకా కిరీటం ఇయ్యి నా వొళ్ళో పెట్టుకుంటా” అన్నది. ఆమె నవ్వుతూ పిల్లిని తీసుకొని  తలపాగా కూతురు కిచ్చింది.

“మీరు మా అతిథులు మేంచెప్పినట్లు వినాల్సిందే” అని తల తిప్పుతూ పండ్లన్నీ బయటపడేటట్లు సకిలించి అన్నది మార్గెరెట్. తల్లీకూతుళ్ళు ఇద్దరు కవలలు కాదుగాని అక్కచెల్లెళ్ళలా ఉంటారు.

తల్లికున్న ఔదార్య వాత్సల్యాలు తండ్రికున్న ధైర్యసాహసాలు మార్గరెట్‌లో ఇమిడి రూపలావణ్యాలలోనే కాకుండా గుణగణాలలోకూడ గొప్ప ఆదర్శవ్యక్తిగా తోటి స్నేహితుల వాళ్ల బంధువుల వల్ల పరిచయస్తుల వల్ల పరిగణింపబడేది.

ఏసుదాసును చూచిన క్షణం నుండి తన తండ్రిని రక్షించాడనే కృతజ్ఞతే కాకుండా అతని మీద ప్రేమానురాగాలు  గూడా ఆమెలో మొలకరించినవి. ఆమె ఏసుదాసును ఒక తడవ పైనుంచి కిందిదాకా చూచి తన తండ్రి చెప్పినట్లు ఇతనొట్టి అమాయకుడు. ఇటువంటి వాండ్లు ఆ 32 కోట్ల ప్రజల్లో దొరుకుతుండ బట్టే వీండ్లను మన సూత్రధారులుగా అడ్డం పెట్టుకునిమా రాజకీయవేత్తలు వీండ్ల మీద 200 ఏండ్ల నుండి రాజ్య ఏలగలిగారు. లేకపోతే ఒక్క పూట ప్రభుత్వం చేయగలిగేవాండ్లా. విడదీసి ఏలే పద్ధతి మా వాండ్ల కబ్బినట్లు ఇంకెవరికి అబ్బలా. తియ్యని మాటలతో ప్రజలను బోల్తా కొట్టించి ప్రభుత్వం ఏలుతున్నారు. వీండ్లలో ఏ కొద్దిమంది తెలివితేటలు గల వాండ్లు బయలుదేరినా తమరాజ్యం తమకు కావాలనే కోరిక పుట్టినా చాలు, ఇంత పెద్ద సామ్రాజ్యం పటాపంచలై దానంతటదే కూలిపోతుంది. అంత పెద్ద రోమన్ సామ్రాజ్యమే శిధిలమైపోతే మా బ్రిటిష్ రాజ్యం మాత్రం ఏన్నాళ్ళుంటుంది" అని అనుకున్నది.

లేడీరాబిన్‌సన్ తన కూతురుతో "మార్గరెట్ ఏమంచి ఆడదానికైనా ఏసుదాస్ ఆదర్శ పెనిమిటవుతాడు గదా ఒక పిల్లను చూచి ఆయనకు మనమే పెండ్లెందుకు చేయగూడదు" అన్నది ముసిముసి నవ్వులు నవ్వుతూ

ఏసుదాసు సిగ్గుపడి తల ఒంచుకున్నాడు. "ఏసుదాసంటి వరుడ్ని పెండ్లి చేసుకోనని చెప్పే ఆడదుంటుందిటే" అన్నది పగలబడి నవ్వుతూ.ఏసుదాస్ మొహం అభిమానంతో ఎర్రబడింది.

"ఇంత గొప్ప కుటుంబం వాండ్లు కూడా ఇంత ఎబ్బెరికంగా ఎగతాళి చేస్తారేమబ్బా" అనుకున్నాడు. ఇంతలోకి మార్గరెట్ మాటలు మార్చి "చూడు అదిగో అదే ఎస్టుమినిస్టర్. అదే మాదేశంలో కెల్లా గొప్ప చర్చి. అదిగోచూడు ఆ దుకాణం వాటిలో అద్దాల కొట్లలో పెట్టి ప్రదర్శించే ఆ వస్తువులు, ఈ గొప్ప కట్టడాలు భవనాలు ఆనందంతో ఆకలి బాధలు ఎటువంటిదో ఎరగకుండా సంతోషంతో ఈ వీధుల్లో తిరుగుతున్న ప్రజలు ఇవే మా మహద్ ఐశ్వర్యానికి చిహ్నాలు చూశావా?" అని మెడమీద చెయ్యేసి వంచి ఆకారులో గుండా చూపిస్తున్నది. ఏసుదాసుకు అవి చూస్తుంటే ఆశ్చర్యంగా ఉంది.

మధ్యాహ్నం రెండు గంటల దాకా అన్ని చూచి తాము బసచేసిన రాయల్ హోటల్‌కు ఏసుదాసును తీసుకెళ్ళారు. అది తామున్న హోటలు కన్నా  పెద్దది. అక్కడ వాండ్లతోపాటు భోంచేసిన తర్వాత నాలుగు గంటల దాకా ఆకబుర్లూ, ఈ కబుర్లూ చెప్పుకొని తన హోటలు కొచ్చి విశ్రాంతి

తీసుకున్నాడు.

మార్గరెట్ ఏడుగంటల కల్లా వచ్చి ఇంకా నిద్రపోతున్న ఏసుదాసును లేపి తను స్వయంగా నడుపుకొని వచ్చిన చిన్న కారులో ముందు సీట్లో తన పక్కన కూచోపెట్టుకుని హాయిడ్ పార్కుకు తీసుకెళ్ళింది. అక్కడ కారు ఒక పక్కన ఆపి తన టోపి, అతని తలగుడ్డ తీసి కారులో పెట్టి కారుకు తాళంవేసి అతని నడుమున తను ఒక చెయ్యేసి, అతని చెయ్యి తన నడుముకు కరపించు కొని ఇంకో చేతితో అదిమి పట్టుకున్నది.

ఏసుదాస్ "దొర్లు దొర్లు పుచ్చకాయ దొర్లకు దోసకాయ అన్నట్లు పుచ్చకాయలాగు ఆ పిల్ల చేతుల్లో కాలచక్రంలో పడి దొర్లుతున్నాడు. ఎంతో స్నేహ పాత్రులతో సరసాలాడుతున్నట్లు ఏసుదాసుతో సరసాలాడుతున్నదా పిల్ల.



నిర్మలరావు రామమందిరం వదిలి పెట్టొచ్చి శంకరరావు గారింట్లోనే వుండి వారాలు చేసుకుంటూ చదువుకుంటున్నాడు. వారింటికొచ్చిన పది రోజులకు ఆ వూళ్ళో ఒక పెద్ద ముసురు పట్టి కమ్మింది. కుంభ వర్షం కురుస్తున్నది. ఒకటే బుంగపోత పోస్తుంటే ఎవ్వరూ ఇండ్లలోనుంచి బయటికి పోవటానికి ఆస్కారం లేకుండా పోయింది. పైన ఈదురు గాలి. తగినంత ఎండు వంటచెరుకు లేకపోతే చూరుల్లో చితుకులేరి పిడకలు పెట్టి వంటలు చేసుకుంటున్నారు. మట్టి గోడల ఇండ్లు వర్షానికి నాని నాని పడిపోతున్నాయి. బర్లన్నీ వరదలు పారిపోతున్నాయి.

శంకరరావుగారిల్లు పెంకుటిల్లు కావటం వల్ల ఆ వర్షానికి రెండు రోజులు తట్టుకొని మూడోరోజు పొటకరించటం ప్రారంభించింది. గచ్చుగోడలు కావటం వల్ల కూలి నెత్తిన పడలా. సూది మోపటానికి సందు లేకుండా ఎక్కడ చూచినా సందు లేకుండా బొట బొటమని నీళ్లు కారుతున్నయి. ఆ రాత్రి తలదాచుకోటానికి స్థలం లేకుండా పోయింది. ఒక పక్కన మార్తం పైన గుంజలకు చాపలు దుప్పట్లు కప్పి సామాన్లు గుట్టగా వేసి నిర్మలరావుతో సహా ఆయింట్లో వున్న అయిదారుగురు సామాన్లు కరుచుకొని కూచున్నారు. నిర్మలరావు తప్ప అంతా పీటల మీద కూర్చున్నారు.

నిర్మలరావు లాంతరు తీసుకొని ముందు బయలుదేరాడు. పంతులుగారి తల్లి ఒక పెట్టెలో ఉన్న సొమ్ముల మూట తీసి, కొంగున కట్టుకొని "నాయనా సామానెట్టాగురా" అంటున్నది. "బతికిబాగుంటే అదే పదివేలు. ముందు

ప్రాణాలు దక్కించుకుంటే అంతే చాలు ” అన్నాడు పంతులు.

దూరాన్నుంచి “చస్తిమో దేవుడా” అని కేకలు వినబడుతున్నాయి. ఇరుగుపొరుగు వాండ్లు ఇంకో పదిమంది పోగయినారు. “నదులు రెండూ పొంగిపోయినయి. వరదలో కొచ్చినయి. ఇండ్లు ఖాళీ చేసి కోటమీదకి చేరుకోండర్రోయ్” అని కేకలు వేస్తున్నారు. అంతా కేకలు వేసుకుంటూ ఆ మొల లోతు నీళ్ళల్లో గుంటలు గతుకుతూ తప్పించుకొని పడకుండా సందుల గొందుల పడి పెద్ద రోడ్డుకు చేరుకున్నారు.

అందరికీ మొల లోతు నీళ్ళోస్తే నిర్మలరావుకు మెడలోతున నీళ్ళొచ్చాయి. ఒకటి రెండు చోట్ల గట్టలో కాళ్ళుబడి మునిగిపోయి కాలు ఊతం చిక్కించుకొని గుక్కెడు నీళ్ళు కూడా తాగి ఉద్దు గుడుచుకొని బయటపడ్డాడు. తీరా వొడ్డుదాకా వచ్చిం తర్వాత కాలు జారి పడ్డాడు. వొళ్ళంతా బురదైంది. అంతవరకు చేతుల్లో పైకెత్తి పడకుండా పట్టుకొచ్చిన లాంతరు కిందపడి మూడు ముక్కలైంది.

పంతులుగారికి నవ్వొచ్చి ఫక్కున నవ్వి “ఏమోయ్ నిర్మలరావు జారితే పడబుద్ధయిందా లే, పాపం దెబ్బతగలలేదు గదా” అన్నాడు. నిర్మలరావు కళ్ళనీళ్ళ పర్యంతమై “లాంతరు పగిలందండీ” అన్నాడు

“పాతది పోతే కొత్తది వస్తుందిలే పద” అన్నాడు పంతులు. అంతా కలిసి కోట వైపుకు పోయినారు. దారిలో ఎక్కడ చూసినా జనం లాంతర్లేసుకొని తిరుగుతున్నారు. మా ఇల్లు కూలిందంటే మా ఇల్లు కూలిందని అనుకుం టున్నారు. ఎవరు చూచినా హడావిడిగా తిరుగుతున్నారు. కొంతమంది యువకులు అక్కడక్కడ నిలబడి వచ్చేపోయేవాండ్లందరిని గచ్చు కొంపల్లోకి, మేడల్లోకి, మిద్దెల్లోకి చేరుస్తున్నారు. భార్యను, తల్లిని ఊళ్ళోని ఒక షావుకారి ఇంట్లో గదిలో పడకోబెట్టి “నేను నిర్మలరావు వెళ్లి వూరంతా బలాదూరుగా తిరిగి అసలు సంగతేంటో కనుక్కొస్తాం.” అని ఎవరెంత చెప్పినా వినకుండా నిర్మలరావును తీసుకుని ఇద్దరూ కలిసి బజార్లు అన్నీ తిరిగారు.

కర్నూలు పేటని, కోటని, రెండు భాగాలుగా పిలవబడేది. పేట పల్లంలో ఉంది. కోట ఏత్తులో వుంది. వూరు చుట్టూ ఎక్కడ చూచినా నీళ్ళే. ముప్పాతిక మూడు భాగాలు పేట భాగం నీళ్ళలో మునిగింది. కోట భాగానికి పడమర తట్టు కొంచెం పల్లంగా ఉన్న చోట నీళ్ల మయమే. ఇండ్లు వాకిండ్లు పోయి, చావంగా మిగిలి ప్రాణాలు దక్కించుకొని వచ్చి పడుతున్న జనానికి సహాయం చేస్తూ కొంతకాలం గడిపారు.

కొంతమంది తెప్పలేసుకొని ఇండ్లకప్పుల మీద చెట్ల మీద ఎక్కి కేకలు పెడుతున్న జనాన్ని తెచ్చి వడ్డున దింపుతున్నారు. పంతులుగారు గూడా అక్కడ కోమట్లు సమకూర్చిన దూలపు మొద్దులు మేకు లేసి కట్టి తెప్పగా తయారుచేసింది ఒకటి సంపాయించి నిర్మలరావును తెప్ప మీదెక్కి పట్టుకొమని పెద్ద వెదురు గడతో తెప్ప నడుపుకొని పోయి తెల్లవారిందాకా జనాన్ని చేరుస్తునే వున్నారు. ఒకటి రెండు శవాలు కూడా నీళ్ళలో తేలి కొట్టుకొస్తుంటే తెప్పమీదేసుకొని తెచ్చి ఒడ్డున పడేశారు. గుమి కూడిన జనంలో కొంతమంది సోకాలు పెట్టి ఏడుస్తున్నారు. వాళ్ళ వాండ్లు కనబడలేదని. ఈ శవాలు బైటెయ్యంగానే అంతా వచ్చి చూసుకున్నారు. మావాండ్లు కాదంటే మా వాండ్లు కాదన్నారు.

ఇంతలోకి పక్కన ఒక చెట్టుమొననుంచి "ఎవరయ్యాబాబు, వొదులు నేనుండానయ్యా, సావు తప్పి కన్ను లొట్ట బోయిందన్నట్టు ఈ చెట్టుకు కరచుకున్నా. ఈదురుగాలికి, సలికి పానాలు సుక్కించాయి. పుణ్యముంటుంది వడ్డునేతురూ" అని ఎవరో అన్నట్టుంటే పైకి చూచాడు.

కొమ్మల సందున తడిసిన చిన్న చింపిరి గుడ్డపేలిక మాత్రం మొలకు చుట్టుకొని వణికపోతున్న కొంచెం ముదురుపాటి నల్లటి ఎద్దాంటి మనిషొకడు కనబడ్డాడు. ఆ మనిషెక్కితే తెప్ప మునిగి తీరుతుందనుకున్నాడు నిర్మలరావు. పంతులుగారు బలంకొద్దీ గడేసి తెప్పచెట్టుకానించి కొమ్మ పట్టుకున్నాడు. ఆ మనిషి దిగి వచ్చి తెప్పలో కూచున్నాడు. తెప్ప తిప్పుకొని గడేస్తున్నారు పంతులుగారు. ఆఎక్కిన మనిషిని నిర్మలరావు గుర్తించాడు. ఆ మనిషిగూడ అతని వంక చూసి ఎగాదిగా చూస్తూ

"ఓరి సిన్నోడా! నీవేనంటబ్బాయీ. ఆయాళ ఏట్లో డింగి మునిగితే కొట్టకొచ్చినోడివిగదూ! మా ఇంటికాడ నిచేపంగా రెండురోజులుండకుండానే లగెత్తిపోయినావే. మా లచ్చి నంటసేసుకోబడుతుందనా?" అన్నాడు

నిర్మలరావు నిర్ఘాంతాపోయినాడు. తెల్లమొహం వేశాడు. నోటంబట మాట రాలా. పంతులుగారు ఆశ్చర్యంతో మైన పొత్తుల్లాంటి కండ్లు మరింత మిటకరించి తెప్ప నడుపుతూనే నిర్మలరావు కళ్ళి తీక్షణమైన చూపు చూసి "ఏం నిర్మలరావు కథేంటి?" అన్నాడు.

నిర్మలరావు దిగాలుపోయి ఆయన వంక, అతని వంక బిత్తరచూపులు చూసి "ఉన్నదున్నట్లుచెపితే ఇంట్లో నుంచి వెళ్లగొట్టుతారు. వాండ్లింట్లో కూడు

తిని చెడిపోయిన కుంకవు ఏ మొహంపెట్టుకొని మా ఇంటికొచ్చా" వంటారు పంతులుగారు. నాచదువుకు, బతుకుకు అన్నీ విఘ్నాలే. అని మనసులో అనుకొని అయినా ఉన్నదున్నట్లు చెప్పి ప్రతిఫలం అనుభవించటం మంచిదని, ఆ జొన్న సంకటి, జొన్న జావ ద్వారా తనకు ప్రాణామృతం పోసి బతికించిన ఆ బసివి పెనిమిటె ఇతను అని వాండ్లింట్లో భోంచేసానని అజ్ఞాయిస్తూ చెప్పాడు.

"ఓరి వెర్రివాడా ! అత భయపడతావెందుకు నీ ప్రాణాలు దక్కించిన వాళ్ళ ప్రాణాలు దక్కించే బాగ్యం నీకు నాకుకూడా కలిగిందని సంతోషించు. ఇటువంటి భాగ్యం అందరికీ కలుగుతుందా"? అన్నాడు పంతులుగారు

ఆమనిషి "ఇసుమంటి సిన్నోళ్ళను సాకితే నీకు పుణ్యముంటుంది లేవయ్యా. ఆ అయ్యలాగ వరాలంటి పిల్లలు పుడుతారు" అన్నాడు. ఇంతలోకి తెప్ప ఒడ్డుకు చేరుకుంది. దూరాన గుంపులో ఇద్దరు పిల్లలు "అదుగోనే అయ్య, అమ్మా అదుగోనే అయ్య" అంటున్నారు.

బసివి కండ్లమీద చేతులు వేసుకొని చుక్కాని చూసినట్లు చూపాపి చూసింది. గుండెలమీద కొట్టుకుంటూ "నాకింకా పసువు, కుంకుం రాసుకుండే రాతుండబట్టే బతికాదు నిన్న నల్లపూసలు పెరిగిపోతే గతుక్కుమన్నది. ఈ జోర్న కురిసే వర్సంలో ఏటొడ్డున పడిపోతుంటే మళ్లీ సూత్తానే సూదనో అనిపిచ్చింది. ఇంతకీ తాళి కట్టిన ఏలా ఇసేసం అసుమంటిది" అని అనుకుంటూ రెండు చేతులు చాచి మోకాలు లోతు నీళ్లలోకి పోయి మొగిడి చేతులు పట్టుకొని

"పంది పిల్లలు చావ, ఎందుకు పోతివయ్యా" అని తెప్పమీద నుంచి దించి వడ్డుకు లాక్కొచ్చింది. దాని చెల్లెలు అయ్యనుకరుచుకొని వాండ్లయ్య బతికొచ్చాడనే సంతోషంతో ఏడుపు ఎక్కువై ఏడుస్తున్నారు."పొద్దున్నే ఏరొచ్చిందని ఇన్నప్పట్నించి నీకోసం తపిచ్చి తిరుగుతుండాం" అన్నారు ఇద్దరూ

అతను "ఎందకే ఏడుత్తారు. చూశారుటే అయ్యోరు, ఆసిన్నోడు రచ్చించారు నా పానం. పాదు పందులు కోసం వెతికి వెతికి ఎవరి పంచలోనో చలికి తల దాచుకుందామని ఇట్లా తొంగుందును గదా పెద్దమ్మ పూని నిదరొచ్చింది. నడిజాముకు నీళ్ళలో తేలుతుంటే ఈదుకుంటూ వచ్చి చెట్టెక్కా. ఈ పుణ్యాత్ములు రాబట్టి సరిపోయింది. లేకుంటే గంగమ్మ తల్లి గటుక్కున మింగేసేది" అన్నాడు

ముగ్గురూ పంతులుగారి కళ్ళి నిర్మలరావు కళ్ళి చూచారు. లచ్చి చూపులు అతని మీద పడ్డాయో లేదో "ఓసమ్మో, ఆ సిన్నోడే" అని మాత్రం అని నిర్మలరావు కళ్ళి చూసింది. నిర్మలరావు తెప్ప దిగొచ్చి ఎగా దిగా చూస్తున్న బసవితో "బసమ్మా బాగున్నా" అన్నాడు.

బసివి అతన్ని ఆప్యాయంగా కావలించుకొని "మా తండ్రి నీవే నటయ్యా ముసలాయన్ని రచ్చిచ్చింది. ఆయాల ఏటికాడి నుండి వచ్చేతలికే మాయల పకీరులాగ మాయమయ్యావే, మయదారి సిన్నోడా. లచ్చిని చేసుకోబడు తుందనా లగెత్తి పోయా?" అన్నది ఆ ఏడ్పు మొహంతోనే

లచ్చి మొహం మీద నిర్మలరావును చూచాననే ఆనందం తాండవ మాడుతున్నది. "అమ్మ సిన్నోడా ఎంత మాయల మారోడివి. అంతలోకి మాయ బుచ్చి మిద్దెల సందున మాయమయ్యావే. ఆ యాల నీకోసం ఎతక లేక నా కాళ్ళు పడ్డయి." అన్నది కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ

నిర్మలరావు లచ్చినిక జన్మలో చూడలేనేమో అదే ఆఖరు చూపు దీనంగా చూచి కండ్ల నీళ్ళు తుడుచుకున్నాడు. పంతులుగారు కనుబొమలెగరేస్తూ నవ్వుతూ "చెప్పవు కథ మనిషి జానెడు. వూహాలు బారెడు. అన్నట్లుందే నీ కథ. ఎనకటికి నీబోటి వాడెవడో చీకట్లో కనుసైగ చేశాట్ట. అంత నీవా పిల్ల నొదిలి పెట్టలేకపోతే లోకంలో ఏ పాలఘూటు పిల్లనో చెప్పి మా ఇంట్లోనే పెంచి నీకిచ్చి పెండ్లి చేస్తా, సరేనా" అన్నాడు

నిర్మలరావు "అబ్బే అది కాదండి వాండ్లకు నామీదున్న ప్రేమ నా చుట్టాలకు లేకపోయెనే అని ఏడుపొచ్చింది. నా ప్రాణం దక్కించి ప్రేమగా చూచుకున్న వాండ్లనింకెప్పుడు చూడగల్గుతానో అని గూడా ఏడ్చా" అన్నాడు

నిర్మలరావు చదువు నిరాఘూటంగా సాగిపోతుంది. వారాలు చేసుకొని వంతుల ప్రకారం ఇంటింటి దగ్గర భోంచేసి పంతులుగారింట్లోనే వుండి చదువు కుంటున్నాడు. **1917**వ సంవత్సరం ప్రారంభమైంది. ఒకరోజు నిర్మలరావు బళ్ళో నించి వస్తుంటే దారిలో ఒకదేవాలయంలో సభ జరుగుతున్నది. "వందేమాతరం" అన్న కేకలు వినబడ్డయి.

బయటరోడ్డు మీద పోలీసులు విచ్చుకత్తుల పారా లిస్తున్నారు. విద్యార్థులు రాజకీయ సభలలో పాల్గొనగూడదని ఆ సంవత్సరం పుట్టిన గవర్నమెంటు అర్డరు అమలు జరపటానికి కలెక్టరు, పోలీసు సూపరింటెండెంటు

పోలీసులతో సహా వచ్చారని బయట గుమిగూడిన జనం అనుకుంటున్నారు. లోపలికి పోలీసులు దూరి చేతుల్లో పుస్తకాలున్న పిల్లలందర్నీ బయటకు లాక్కొచ్చి "పోండి, ఇండ్లకుపోండి. ఇక్కడ వుండకూడదు" అంటున్నారు.

నిర్మలరావు ఏందో తమాషా చూద్దాం అని చేతులో ఉన్న పుస్తకాలు బొడ్లో దోపుకుని పైన చొక్కా కప్పుకొని నక్కి నక్కి పోలీసు వెనక మళ్ళా పక్కవాటున పోయి దేవాలయం ద్వారం దగ్గరికి జేరుకున్నాడు. అక్కడ ఒక ఇనస్పెక్టరు, ఇద్దరు పోలీసులు ఉన్నారు. అడిగినప్పుడు చెప్పొచ్చులే అనుకొని ఏదో మహా పనిమీద పోతున్న వాడిలాగ చేతులూపుకుంటు నిర్భయంగా పోతున్నాడు. అక్కడున్న ఇనస్పెక్టరు గబుక్కుని చేయి పట్టుకుని గుంజాడు. "ముందు చెయ్యి వదుల్తావా, లేదా" అన్నాడు నిర్మలరావు. "ఏందోయ్ దాష్టీకం చేస్తున్నావే. దాష్టీకం చేసినా నువ్వు చదువుకుండే పిల్లవాడివి కాదా" అన్నాడు. "ఎవర్నయితే నేం, దేవుడికి రెండు ప్రదక్షిణలు చేసి దణ్ణం పెట్టుకోకూడదా మీ రాజ్యంలో" అన్నాడు

చుట్టూ చేరిన వాండ్లంతా ఫక్కున నవ్వారు. "దేవుడికి మొక్కొటానికి కొచ్చిన వాండ్లను పోనియ్యకూడదని లేదు గదటయ్యా నీ వుత్తరాలలో" అన్నాడు పక్కనే ఉన్న శంకరరావు పంతులుగారు ఎందుకొచ్చిన పీడ ఎవరో వకీలు లాగున్నాడీయన దేవుడి దర్శనానికి గుళ్ళోకి ఎవర్నీ పోనీయకుండా అడ్డువచ్చిన ఇనస్పెక్టర్ ఫలాయనని పేపర్లలో తాటికాయంత అక్షరాలతో వేస్తారు. పైగా కేసుపెట్టి కోర్టులో అల్లరి పెడతారు. ఈ అప్రతిష్ట నాకెందుకని మనసులో అనుకొని "సరే పోవోయ్ పిల్లగాడా దేవుని దర్శనం చేసుకొని తొందరగా రా అన్నాడు ఇనస్పెక్టరు.

నిర్మలరావు పంతులుగారికళ్ళి నవ్వు కళ్ళతో వారి చూపులు చూస్తూ అట్లా ఒక ప్రదక్షిణ తిరిగినట్లు మెల్లెగా సందు జేసుకొని పోయి సభాధ్యక్షుడు కూర్చున్న కుర్చీ పక్కన కూర్చున్నాడు. ఒక ఉపన్యాసకుడు లేచి "భరత ఖండంబు పాడియావు, హిందువులు లేగదూడలా ఏడ్చుచుండ తెల్లవారను గడుసరి గొల్లవారు పితుకుతున్నారు మూతులు బిగియగట్టి అనే పద్యంతో ఉపన్యాసం ప్రారంభించాడు.

"సోదర సోదరీమణులారా మనం బట్టకట్టుకొని తిరగటం నేర్చుకున్న రోజులలో మనకిప్పుడు రాజులుగా వున్న ప్రభువులు చెట్ల మీద కోతులలాగు తిరుగుతుండేవారు. నాగరికత అంటే ఏమిటో తెలియని మూర్ఖ స్థితిలో

ఉండే వాండ్లు. ఎన్ని వందల ఏండ్ల నుంచో రత్నగర్భగా విలసిల్లుతున్న మన భారతభూమిని రెండువందల ఏండ్ల క్రితం దాసులుగా వచ్చి నేటికి దొరలై మన నెత్తిమీద కూర్చొని రాజ్యం చేస్తున్నారు. మన రాజ్యం మనకిచ్చి వెళ్ళి పొమ్మన్న మాటే రాజద్రోహం కిందకు వచ్చేరోజులు పోయి, వందేమాతరం మనదే రాజ్యం అని నిర్భయంగా గొంతెత్తి అరవగల రోజులొచ్చినయి. వ్యాపారం చేసుకుంటాం బాబో బారెడు స్థలం చూపమని వచ్చి బిచ్చమడిగిన భటులు మన దేశస్థులనే కొందరిని దొప్ప కింది దొప్పలుగా చేసుకొని మన వాండ్ల సహాయం తోనే మన మీద ఏకచ్ఛత్రాధిపత్యంగా రాజ్యమేలుతూ, మన సిరి సంపదలను కొల్లగొట్టుకుంటున్నారు. మన కోహినూరు వజ్రం దొంగిలించారు. అని యేమో చెప్పుచూ ఉద్రేక పూర్వకంగా ఉపన్యాసమిచ్చాడు. అంతా చప్పట్లు కొట్టారు. "వందేమాతరం " అని కేకలు వేశారు. అధ్యక్షుని అంత్యోపన్యాసంతో సభ ముగిసింది.

నిర్మలరావుకు అగమ్యగోచరంగా ఉంది. అందరూ నవ్వినప్పుడు నవ్వాడు. అందరూ చప్పట్లు కొట్టినప్పుడు తనూ కొట్టాడు. అందరూ వందేమాతరం అంటూవుంటే తనూ అన్నాడు. గుళ్లో నుండి బయట కొస్తూ "వందేమాతరం మనదే రాజ్యం" "రాజుకునై- రాణికి.. అంటూ వుండగా ఆ ఇనస్పెక్టరు చేయి పట్టుకున్నాడు. "నిన్నరెస్టు చేశా రా మా కలక్టరుగారి దగ్గరకు అని వాకిట్లో బెత్తం ఆడించుకుంటు పచార్లు చేస్తున్న ఒక తెల్ల దొర దగ్గరకు తీసుకెళ్ళాడు. సలాం కొట్టి "అయ్యా ఈ పిల్లవాడు దేవుడి దర్శనానికెళ్ళి లోపలికి పోయి సభ అయిందాకా వుండి ఉన్నాడు. పైగా అసందర్భమైన కేకలు వేస్తున్నాడు.

పోలీసు సూపర్నెంటు బెత్తం ఊపుకుంటూ కండ్లురిమి చూస్తు వచ్చీరాని తెలుగులో "నీపేరేమన్నాడు" దాష్టీకంగా "నాపేరు తిమ్మన్నండి"అన్నాడు నిర్మలరావు. "మీతండ్రిపేరు" "జాంబవంతుడు" "మీఇల్లెక్కడ" "కిష్కిందాపురి అగ్రహారంలో" అని జవాబు చెప్పాడు. తొణక్కుండా బెణక్కుండా నిర్మలరావు. చుట్టూ మూగిన జనం ఫక్కుమన్నారు. దొరగారు ఇనస్పెక్టరు కళ్ళి చూసి "ఏమిటి చెప్తున్నాడు" అన్నాడు.

ఇనస్పెక్టరు పట్టరాని కోపం వచ్చింది. నిర్మలరావు చేయి పట్టుకొని గట్టిగా వూపి "ఏం మహా తల బిరుసుగా మాట్లాడుతున్నావ్. వళ్ళు దగ్గర పెట్టుకొని మాట్లాడు. పేగులు తీస్తా ఏమనుకున్నావో సరిగా జెప్పు" అన్నాడు

నిర్మలుడు "ఉన్నది ఉన్నట్లు చెబితే వూరు అచ్చిరాదన్నారు పెద్దలు. చెప్పాల్సిన సమాధానమేదో చెప్పాం. మీ చేతనైంది జేసుకోండి. నా వళ్ళు నాద్గగరే వుంది. ఎక్కడికీ పోలా" అని వళ్లు తిప్పుతూ రొమ్ము విరిచి శ్వాస గట్టిగా పీల్చుకుని తల ఊపుతూ అన్నాడు.

"నీకు కాస్త గోరోజనమున్నట్లుందే. పెడసరంగా మాట్లాడుతున్నావు. చెంపలు ఫెళ్ళు మంటాయి జాగ్రత్త" అన్నాడు ఇనస్పెక్టరు. పక్కన నిల్చున్న పంతులుగారు "ఎందుకండీ అంత ఆగ్రహం. అత్తమీద కోపం దుత్తమీద చూపించినట్లు ఇప్పుడక్కడ కుండ బద్దలు కొట్టినట్లు ప్రభుత్వాన్నే లక్ష్యం చేయకుండా మాట్లాడిన పెద్దల్నేం అనలేక పిచ్చుకమీద బ్రహ్మాస్త్ర మన్నట్లు ఇహ ఈ పసికూనల మీదనా మీ అధారిటీ. కొట్టండి చూస్తాం. ఎట్లా కొడతారో. అతని వీపు మీద దెబ్బ పడితే ముప్పుతిప్పలు పెట్టి పేపర్లలో మీ చర్యను గర్హిస్తూ ఈకకు ఈక పీకకు పీక పీకి ఏకి ఏకి వదిలిపెడతాం. బెట్టుగా వున్నంత కాలమే మీ ప్రభుత్వం సాగేది. బెట్టు తప్పితే నిముషం పట్టదు. ఇంతలావు ప్రభుత్వం కూలిపోవటానికి" అన్నాడు

ఇది సందు చేసుకుని పిల్లలంతా "వందేమాతరం-మనదేరాజ్యం"అని కేకలు వేస్తూ ఎగురుతున్నారు. ఎగాల పోయి నిల్చున్న సూపర్నెంటు నిద్రపోయే కుక్కలను పడుకోనిస్తే మంచిదనే పద్ధతిలో పోతేగాని బాగుండదు. ఏదో శాంతంగా మీటింగు జరిగిపోయిం తర్వాత లేనిపోంది కెలికి తెచ్చుకోట మెందుకని అనుకొని పంతం తగ్గించుకొని "ఆకుర్రవాడ్ని పోనియ్యవయ్యా ఇనస్పెక్టర్, రాపోదాం" అని వెళ్ళి తన కారులో కూర్చుని వెళ్లిపోయినాడు. కలక్టర్‌గారు మీటింగు అయిపోగానే క్లబ్బుకు వెళ్లిపోయినాడు. ఇనస్పెక్టరు గారు పోలీసులను మార్చి చేసుకొని స్టేషనుకెళ్ళాడు. కొంత దూరం పిల్లలు వెంటబడి కేకలేస్తూనే ఉన్నారు. పంతులుగారు, నిర్మలరావు ఇంటి మార్గం పట్టారు.

దారిలో "జిట్టెడు లేవు నీకెంత గుండె పెట్టాడోయ్ భగవంతుడు. జిత్తుల మారోడివి లాగున్నావే. మొదట యుక్తిగా జవాబు చెప్పి లోపలికి పోయనావు. బయట కొచ్చి అదేమంటే ఆ ఏద్దంటి ఇనస్పెక్టరు ముండా కొడుకును హడలగొట్టావు. నీబోటి గుండెనిబ్బరం గలవాండ్లు నూటికి పదిమందున్నా ఈ పాటి స్వరాజ్యం కళ్ల చేసేవాళ్ళం. అంతా ఏద్చేదాని మొగుడొస్తే నామొగుడొస్తా దన్నట్లు వూరుకుంటారు గదా. తీరా తిలక్

మహరాజ్ బోంటి వాండ్లో కష్టపడి స్వరాజ్యం సంపాయిస్తే అంతా ముండ భరణాలకు తయారవుతారు. నానా రోగాలతో మంచంలో మురిగి చావటానికి సిద్ధమౌతారు గాని ఉడతా భక్తిన దేశసేవ చేసి ప్రాణాలర్పించటానికి సిద్ధమయ్యే వాండ్లు బహు కొద్దిమంది. ఈ వాళ ఎద్దులాగు కష్టపడితే రేపు గుఱ్ఱాలలాగు మెక్కొచ్చనే బుద్ధి ఎవరికీ తోచదు గదా! గుడ్డి గుఱ్ఱాలకు పండ్లు తోమమంటే తోముతారు. దొరలకు ఊడిగాలు చేస్తారు. ఇంటికుక్క ఇంటికుక్కను దగ్గరకు చేరనియ్య దన్నట్లు ఉద్యోగంలో ఉన్న మన వాండ్లు మనవాండ్లకు ఉంగరాల చేతితో మొట్టితే దెబ్బ తగిలినట్లు వొట్టి చేతితో మొట్టితే తగులుతుందా? వూక దంపుడు ఉపన్యాసాలతో స్వరాజ్యం ఏ ఆకాశం మీద నుంచో ఊడిపడుతుందా? దానికి తగ్గ కట్టుబాట్లు చేసుకొని అడిగే తీరుగా అడిగితే వస్తుంది లేదా ఒక మహావిప్లవం లేవదీస్తే వస్తుంది గాని" అన్నాడు

నిర్మలరావు "పంతులుగారు స్వరాజ్యం ఎట్లా వస్తుందో దానివల్ల లాభాలేమిటో దేశసేవ ఏవిధంగా చేయాలో తీరిక చిక్కినప్పుడు ఒక తడవ చెప్పండి" అన్నాడు

పంతులు "అట్లాగే చెబుతాలే గాని ఎట్లాగో కొంచెం ఇంగిత జ్ఞానం వున్న వాడివి కాబట్టి, పెద్దవాడివైన కొద్ది నీ అంతట నీవే తెలుసుకుంటావు ఏ ఆరువేలమైళ్ళ దూరం నుంచో వచ్చి మన మీద రాజ్యమేలుతున్న ఈ ప్రభువుల సంగతి, వీరి పరిపాలన కింద నానా ఇక్కట్లు పడుతున్న మన దేశపు ప్రజల సంగతి. అప్పుడు నీ శాయశక్తులా దేశసేవ, ప్రజాసేవ చేసి తరిద్దువు గాని. తిలక్ గారు వూరికే జెప్పారా. మనదేశపు ప్రజలు ఒక్క తడవ మేల్కొని కేకరించి ఉమ్మేస్తే ఆ వుమ్మిలో మునిగిపోతుంది ఆ బ్రిటీష్ ప్రభుత్వం. మన ప్రభువుల దేశం అని మన వాండ్లలో ఎప్పటికైనా రాజకీయ చైతన్యం కలుగక మానదు. ఈ ప్రభువులు మూట, మల్లెలు గూడ వదిలిపెట్టి మొండి చేతులతో పోక మానరు" అన్నాడు

ఇంతలోకి ఇల్లొచ్చింది. నిర్మలరావు పుస్తకాలు ఇంట్లో పెట్టి ఆడుకో టానికి వెళ్ళాడు. పంతులుగారు తల్లితో నిర్మలరావు చేసిన ఘనకార్యం చెప్పి సంతోషం పడ్డాడు. ఆమె ఉప్పొంగిపోయింది. నిర్మలరావు ఆసద్గృహస్తుల ఇంట్లో శంకరరావుగారి ఉద్బోదతో విద్యాబుద్ధులు నేర్చుకుంటూ, ఏప్రిల్ మాసంలో జరిగిన సంవత్సర పరీక్షలలో మంచి మార్కులతో ఫోర్తుఫారం పాసయినాడు.

పరీక్షలైన తరువాత పరీక్షా ఫలితాలు తెలుసుకునేందుకు పదిహేను రోజులదాకా అక్కడనే ఉన్నాడు. పరీక్షా ఫలితం తెలియంగానే శంకరరావుగారి వద్ద, వారింటివారి వద్ద సెలవు పుచ్చుకొని "మాదేశం వెళ్ళి చుట్టపక్కాలను చూసొస్తానండి" అని ఒకరోజు ఉదయం బయలుదేరి హంద్రీ నది అవతల రైలుస్టేషనులో రైలెక్కి ద్రోణాచలం స్టేషనులో దిగాడు. నిర్మలరావు కప్పటికి పదమూడేండ్లు దాటి పధ్నాలుగొచ్చింది. వారాలు చేసుకొని తిన్న తిండి వల్ల కాకపోయినా తన స్వశక్తి మీద ఆధారపడి తల్లిదండ్రులను కష్టపెట్టకుండా చదువుకోగలిగాననే సంతోషంతో మనిషి కొంచెం లావెక్కి దుక్కలాగున్నాడు. ఎదిగే ఈడు కాబట్టి కొంచెం పొడుగెదిగాడు. మొహం మీద బర్ధిమయ తేజస్సు వెల్లువ పారుతున్నది. కండ్లలో జ్ఞానమయ జ్యోతి వెలుగెత్తి పోతున్నది.

అనడక ఆ నవ్వు ఆ మాటలు అదో విధంగా అతని తెలివితేటలు చాటుతున్నయి. అతని విశాలమైన హృదయం మీద ధైర్యసాహసాలు తాండవ మాడుతున్నయి. ఒక జత గుడ్డలు, పది పుస్తకాలతో కట్టుకున్న చిన్నమూట నెత్తిన పెట్టుకొని అదది తిరిగి చెడుతుంది, మగవాడు తిరక్క చెడును అని పెద్దలు చెప్పిన ప్రకారం అటు గుంతకల్లు రైలెక్కి బొంబాయి పోదామా లేక పలుపు తెంచుకున్న దూడ తటపటాయించకుండ సరాసరి తల్లి పొదుగు దగ్గరికి చేరినట్లు ఇటు బెజవాడ బండెక్కిపోయి తల్లిదండ్రులను చూద్దామా అనే అలోచనలో ఎద్దు ఎండకులాగా ఎనుబోతు నీడకులగా అన్నట్లు బుద్ధి బొంబాయికి మనసు ఇంటికి లాగుతుంటే గుంతకల్లు పోయే రైలు, గుంతకల్లు నుండి బెజవాడ పోయే రైలు వచ్చి ప్లాటుఫారం మీద అటొకటి ఇటొకటి అగినై. నిక్కచ్చిగా ఏదీ తేల్చుకోకుండా తాత్సారంగా వూరుకొని అటు ఆ ఇంజను వైపు, ఇటు ఈ ఇంజను వైపు చూస్తూ నిల్చున్నాడు నిర్మలరావు.

❖❖❖ ❖❖❖ ❖❖❖ ❖❖❖

ఎంపరర్ హోటలు సర్దార్ భవన్ లాంటి మహారాష్ట్రుల హోటళ్ళలో కూడా మన దక్షిణ దేశస్థుల సౌకర్యం కోసం ఇడ్లీ సాంబారు, గోంగూర, చింతకాయ పచ్చళ్ళు కూడా ప్రత్యేకంగా చేయించి హోదాకోసం సర్దాకోసం అక్కడ బస చేసిన వారికి వడ్డిస్తుంటారు. మంగుళూరాయన దక్షిణదేశస్తుల సౌకర్యం కోసం "వెల్‌కం" హోటలని పెట్టాడు. అది గిర్‌గాం బాగ్ రోడ్ అనే వీధిలో వసతికి భోజనానికి తగ్గ ఏర్పాటుతో ఒక నాల్గు అంతస్థుల భవనంలో ఉంది.

ఉద్యోగాల ఆశతో దేశ దిమ్మర్లుగా వచ్చిన బ్రాహ్మణ పిల్లకాయలను పెద్దవాండ్లను, చదువుకానని వాండ్లను ఇతర ఆస్కారం లేని వాండ్లను చూచి తనే ఒక ఆస్కారం కలగ జేసిన వాడిలాగు దగ్గరికి తీసి వాండ్ల చేత 24 గంటల అరవ చాకిరి చేయించు కుంటుండేవాడు . ఒకరిద్దరు వంట వాళ్ళను మాత్రం మంచి జీతాలిచ్చి పెట్టాడు.

దక్షిణ దేశస్థుల రుచికి సరిపోయే పదార్థాలన్నీ చేయించి,పూటకు రూపాయి కూలి తీసుకొని పూటకూలి పెట్టి, అప్పటికి నాలుగు సంవత్సరాలలో బాగా భాగ్యవంతుడైనాడా యజమాని. యుద్ధ సమయం గాబట్టి ఆ మిలటరీ చవి సారం లేని తిండి తిని, ఇండ్లీ ఉప్మాలకు, సాంబారు రసానికి మొహమాచిన మనదేశవు సిపాయిలు, మొదలైనవారు ఎక్కువగా అక్కడికొచ్చి భోంచేసి పోతుండే వాళ్లు. ఒక గరిట వేసిన నెయ్యికని, పెరుగుకని, ఏదోపేరు పెట్టి వాండ్ల దగ్గర ఇంకా ఎక్కువగా గుంజుతుండే వాడా యజమాని.

ఒకరోజు ఎక్కడినుండి వచ్చారో ఒక మిలటరీ వాండ్ల తండొకటి వచ్చిపడ్డది. వంట చేసేవాళ్ళు ఎముకలిరిగేటట్లు వంటచేస్తున్నారు. వడ్డించే వాళ్ళు నడుములిరిగేటట్టు వడ్డిస్తున్నారు. "కమాన్ జల్దీ జల్దీ వడ్డించదని వచ్చిన వాండ్లు బల్లల పక్కనే నిలువు కాళ్ళ మీద నిల్చొని తిని పోతున్నారు. రాత్రి 9 గంటల సమయంలో మీసంకూడా సరిగారాని ఒక నల్లటి ఎద్దంటి కుర్రవాడొకడు మిలటరీ డ్రస్సులో చేతితో బెత్తం ఊపుకుంటూ తొలిగిపడుతూ తూలి పోతూ వచ్చి బల్ల దగ్గర నిల్చోని 'జల్దీ' అంటున్నాడు.

అక్కడ కింద బల్లలమీద గూడా కూర్చోని భోంచేసే ఏర్పాట్లున్నాయి. వచ్చినతని దగ్గర సారాయి కంపు కొడుతున్నది. ఆ వాసనకు తట్టుకోలేక ఆ వడ్డించే అతను ముక్కు మూసుకొని తల తిప్పుకొని అన్నపు పళ్ళేం తేవటానికి వంటింట్లోకి వెళ్ళాడు. అక్కడ కొంచెం ఆలస్యమైంది. ఇక్కడ మిలటరీ అతను తెలుగులో "ఏవడ్రావాడు తొందరగా రావేమిరా" అంటున్నాడు. కొంచెం దూరంగా కూచున్న పెద్దమనిషి తెలుగులో "మీరు తాగేది కొద్దిగైనా ఎంతో తాగిన వాళ్ళలాగ నటిస్తే అదొక దర్జా అనుకుంటారు. పోయి కుళాయిలో మొహం కడుక్కొని రావయ్యా నిషా కొంచెం తగ్గుతుంది" అన్నాడు. "ఎవరండీ మీరు తెలుగులో మాట్లాడుతున్నారు. మాది గుంటూరు" అన్నాడు. ఆమిలట్రీ అతను వడ్డించే కుర్రాడివైపు తేరపార చూచి "అరేయ్ నిర్మలరావు నీవట్రా" అని గట్టిగా కావలించుకున్నాడు. "తాగొచ్చి తందనాలాడుతున్నానని నేల

టపాకాయలు తెచ్చి నానెత్తిన నూకేవు పానం ఉద్దుగడుచుకుపోతుంది" అన్నాడు. "సరే పోరా కోటాయ్ పోయి కూర్చో అన్నం వడ్డిస్తా తర్వాత మాట్లాడు కుందాం" అన్నాడు నిర్మలరావు

పక్కనున్న పెద్ద మనిషితో "నాపేరు హవల్దార్ కోటయ్యనాయుడు మిషిన్‌గన్నరు" అన్నాడు. ఆ పెద్దమనిషి "నాపేరు సూర్యనారాయణ ఆర్టిస్ట్ ఫోటోగ్రాఫర్. మాది బందరు" అన్నాడు

నిర్మలరావు "మీరు పోయి కూర్చోండి. నేను కూరలు తీసుకొస్తా ఆ యజమాని వస్తే అడ్డమైన తిట్లు తిడతాడు"

సూర్య "నేనున్నా నీకేం ఫరవాలేదయ్యా. ఈ వెధవ చాకిరి ఇంకెక్కడైనా దొరకదనా నీ భయం. ఈయజమాని కర్కోటకపు ముండాకొడుకు. నీబోటి బొందలను తెచ్చి నూరి పోసుకుంటాడు. దిక్కుమొక్కులేని వాండ్లకు తానే దిక్కని ప్రగల్భాలు పలికి కొడుతుంటాడు" నిర్మలరావు "ఆయన్నని ఏం లాభం" అని వెళ్లిపోయినాడు.

సూర్య "రావయ్యా హవల్దార్ గారూ వచ్చి నాపక్కన కూర్చో అయన కొడ్డించటానికి వీలుగా వుంటుంది " కోటయ్య పక్కనొచ్చి కూచొని "చూడండి నిక్షేపంగా చదువుకుండే కుర్రవాడు ఎందుకొచ్చాడో వచ్చి ఈ నరకకూపంలో పడ్డాడు" అన్నాడు

సూర్య "నేనేదోక ఏర్పాటు చేస్తానులెండి. రేపీపాటికి అతనిక్కడ వుండకుండా చూస్తే సరికదా"

కోటయ్య "ఏదోతెలుగువాండ్లు కదా, అంత పుణ్యం కట్టుకోండి. తెలివిగల కుర్రాడు"

సూర్య "ఆసంగతి మీరు చెప్పాలా. అతని మొహం చూస్తేనే తెలుస్తుంటద. ఇన్నాళ్ళనుంచి ఎవరో గదా అని వూరుకున్నా. లేకపోతే అతనికి ఉద్యోగం ఇప్పించలేనటండీ." ఇంతలోకి నిర్మలరావు కూరలు తెచ్చి వడ్డించాడు.

సూర్యనారాయణగారు సెలవు తీసుకుంటూ "హవల్దార్‌గారూ రేపు మీరిక్కడుంటే ఒక తడవ మాఇంటికి తీసుకెల్తా. ఇదే వేళకు రాండి" అని వెళ్ళి పోయాడు. కోటయ్య భోంచేసి బయట బల్లమీద కూచున్నాడు. నిర్మలరావు స్నానంచేసి భోంచేసి రాగానే ఇద్దరూ కలసి చపాతీకెళ్ళారు. అక్కడ సముద్ర పొడ్డున ఇసుక తిన్నెలమీద కూర్చోని ఒకరి కథ ఒకరితో చెప్పుకున్నారు.

కోటయ్య "నేను అర్నెల్లక్రితం రమణయ్యకు ఉత్తరం రాస్తే నీ సంగతి

కూడా అంతా రాశాడు. నన్ను పోలీసతను పట్టుకొని మీఇంటికి తెచ్చి వొదిలి పెట్టిం తర్వాత ఇంటికి పోతే మా అమ్మ నానా తిట్లు తిట్టి కొట్టింది. వెంటనే బెజవాడ పోయి రైలెక్కి మదరాసు వెళ్ళా. అక్కడే మిలటరీలో చేరా. అక్కడనుండి వారం రోజుల్లో దేవలాలీ పంపారు. అక్కడ నుండి వజికస్థాన్ వెళ్ళా. ఇప్పుడక్కడ నుండి సెలవ మీద వెళ్ళుతున్నా. నీవిక్కడకెందుకొచ్చావో ఏమిటో వివరంగా చెప్పు వింటా"

నిర్మల "కొంతవరకు రమణయ్య ఉత్తరం ద్వారా తెలుసుకొనేవుంటావు. మా నాయన నన్నింకెక్కడైనా ఉంచి చదువు చెప్పించటానికి తాత్సారం చేస్తుంటే మెల్లిగా కర్నూలు చేసి అక్కడొక పంతులుగారింట్లో వుండి వారాలు చేసుకు చదువుకున్నా. సెలవులకు ఇంటికెల్దామని పుట్టి ద్రోణాచలం స్టేషన్లో అటు ఇంటికెల్దామా, ఇటు బొంబాయి వద్దామా అని పుట్టింది. ప్లాటుఫారం మీద నిల్చోని నిర్ధారణ చేసుకుండే లోపల అటునుండి ఇటునుండి వచ్చిన రెండు రైళ్ళల్లో గుంతకల్లు పోయే రైలు సాగిపోనే పోయింది. సరే, భగవంతుడు ఇంటికి పోయి నాకోసం అలవటిస్తున్న తల్లిదండ్రులను చూడమంటున్నాడు గదా అని బెజవాడ పోయే బండిలో కూర్చున్నా. మర్నాడు సాయంకాలానికి బెజవాడ చేరుకున్నా.

రెండిండ్ల చుట్టం ముద్దెండి మాడిన చందం అవుతుంది నా చదువు అని తోచింది బొంబాయికి వద్దామని బుద్ధి పుట్టింది. అంతగా అయితే బొంబాయి చూసయినా వద్దాం. సెలవు లాఖరకు ఇంటికి చేరుకోవచ్చు. అని రెండు రోజులు నాలో నేను మధనపడ్డా. ఆఖరికి ఇక్కడికిరావటానికి నిర్ధారణ చేసుకొని వొకరకోజు మానాయన భోంచేసి కర్ణీకపు లెఖ్ఖలు వ్రాసుకుంటుంటే పోయి దగ్గర కూచొని "నాన్నా నేను బొంబాయి పోయి వస్తానే. అది మహాపట్టణమంట. ఎట్లా వుంటుందో చూచి రావాలని బుద్ధి పుడుతున్నది" అని మొదలుపెట్టా.

మా నాయన ఉగ్రుడై "పుట్టింది నీకు మళ్ళీ దుర్బుద్ధి. తిరిగేకాలు, తిట్టే నోరు వూరుకోవట. కుక్క దాలిగుంటలో కూర్చున్నంతసేపు అక్కడికి పోగూడదు. ఇక్కడికి పోగూడదు అనుకుంటుందిట. చివరకు లేచి వళ్ళిదిలించు కొని సరాసరి పెంటల మీదకి పోతుందిట. అట్లాగే కుదురుగా వొకచోట వుండలేక పోతివి. నేనిక్కడ దగ్గిర్లో వుండి చదువుకుంటానే నాన్నా ఇహ మిమ్మల్ని వదిలి పెట్టి వెళ్ళనంటే, మొన్న బాపట్ల పోయినపుడు పూటకూలింట్లో మంచి చదువు చెప్పించటానికి ఏర్పాటు చేసొచ్చా. చివరకు నా కృషి తుంగలో తొక్కి

పోతానంటా వేమిరా. నీకు దయ్యమేమైనా పూనిందా" అని అన్నాడు

ఆరాత్రి మా పెద్దన్నయ్య పొలంనుంచి రాగానే "అన్నయ్యా నాకొక రెండు రూపాయలిప్పించు. నేను బొంబాయి పోతా" "ఎందుకురా బొంబాయి" ఇక్కడనే ఉండి చదువుకోరాదురా. నాయన చదువు చెప్పిస్తానంటుండెగా" అన్నాడు. "కాదులే పోయి మళ్ళీవస్తా. ఇక్కడ గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోట మెందుకు. వీలయితే ఎక్కడైనా వుద్యోగం చూసుకుంటా. లేదా చదువుకుంటా" అని ఏమోమో చెప్పి ఎట్లానైతేనేం రెండు రూపాయలు తీసుకున్నా. మర్నాడు ఉదయం దారిపట్టా.

ఎటు పోవటానికి తోచక రైలాగిన ప్లాటుఫారం మీద కూర్చోనుంటే ఏవరో పోర్టరు కాసేపటికి వచ్చి "కోన్‌హై టిక్కెట్ కిదర్‌హై" అన్నాడు. నేనేదో మామూలు పదం పాడా. నేను చెపుతున్నది అతనికి తెలియటంలా. అతనేమో అంటున్నాడు. నాగొడవ అతనికి, అతని గొడవ నాకు తెలియక కాసేపు బాధపడ్డా. చివరకు బిక్క మొహంవేసి సైగలతో ఏమీలేని వాడ్నని వాడికర్థ మయ్యేటట్లు చెప్పా. ఇక్కడుండోద్దు పో పట్టుకుంటారని సైగలతో చెప్పాడు. మెల్లెగా గేటు దగ్గర టికెట్టు కలెక్టరు వెనకాల్తే పోదామని పోబోతున్నా. సుస్..బుస్ అని నోటితో శబ్దం చేసి చప్పట్లు కొట్టి వెనక్కు పిలిచాడు. అవతల ప్లాటుఫారం కొనన పట్టాల కడ్డంగా నన్ను వెంట పెట్టుకొని పోయినాడు. గూడ్సు షెడ్డు వెనక మాళ్లగా ఒక చిన్న గల్లీ లోకి తీసుకెళ్ళాడు.అక్కడ పక్కనే పాయిఖానాలు గామాల వున్నయి. దర్గంధపు కంపుకు ముక్కులు పగలగొట్టుకుపోతున్నయి.

ఆ గల్లీ సుమారు 20 గజాల పొడవు, మూడుగజాల వెడల్పు వున్నట్లుంది. దాంట్లో అంతా ఎవరో మనుషులు పడుకున్నట్లున్నారు. అక్కడికి నన్నా పోర్టరు తీసుకపోంగానే "ఏయ్" అని ఒకకేక పెట్టాడు. కొంచెం దూరంలో నల్గురైదుగురు గుంపుగా కూర్చున్న వాండ్లలో ఒకడు 'వూ' అని కూత పెట్టి లేచి పరిగెత్తుకుంటూ వచ్చాడు. నన్నతనికి చూపించి ఆ పోర్టరు వెళ్లిపోయినాడు.

అతను నల్లగా పొట్టిగా బక్కగా, ఒక్కగానొక్క పీలిక మాత్రం మొలకు చుట్టుకోనున్నాడు. చింపిరి నెత్తి, సగం వదిలిన గడ్డం, సగంవరకు తెగిపోయిన మొండి చెయ్యి చూస్తే అడుక్కుతినే వాడిలాగున్నాడు. అతని దగ్గర గంజాయి కంపు కొడుతున్నది. నాకా నల్లగుడ్డల హైదరాబాదులో పట్టుకొని తీసుకుపోయిన ఫకీరు జ్ఞాపకమొచ్చాడు. గుండె ఝల్లుమన్నది. పోదామా, వద్దా అనిపించింది. అయితే ఆగి చేసేదేముంది. ఎక్కడికి పోయేది అనిపించింది. భగవంతుడి

మీద భారమేసి అతనితో పోతూనేవున్నా.

కొంతసేపటికి ఒక గల్లీలో ఒక పొగబారిన మూడంతస్తుల మేడ దగ్గర నిల్చోని నన్ను ముందు లోపలికి పొమ్మని సైగ చేశాడు. నేను అజ్జాయిస్తుంటే వెనక మాళ్ల వీపున చెయ్యేసి నెట్టాడు. నేను లోపలికెళ్ళా. అప్పటికింకా తెల్లవారల. కప్పకప్పరగా చీకటున్నది. వీధి వాకిలి మాత్రం వేసి లేదు. లోపలికి కొంతదూరం పోయిన తర్వాత అక్కడ వాకిలేసున్నది.ఆ సింగయ్య తలుపు దగ్గరగా వేలాడుతున్న ఒక తాడుపట్టి లాగాడు. కొంచెంసేపటికి జవానంటి మనిషొకడొచ్చి తలుపు తీశాడు. మేం లోపలికి పోగానే తలుపేసు కున్నాడు. అది చీకటి గది. తలుపు తీసినతను టార్చివేసి పైకెక్కే మెట్లు చూపాడు. ఆమెట్లు ఏటవాలుగా లేవు. నిట్టనిటారుగా ఉన్నయి. ముందు నన్నెక్కమన్నారు. ఆదృశ్యం చూస్తే నాకు భయానకంగా ఉంది. మృత్యుదేవత నెట్టకొచ్చింది. ఇదేదో నరబలి స్థలం లాగున్నది. ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకొని ఏమన్నా గానియ్యమని వొక్కొక్క మెట్టుగా పైకెక్కా. అదో హాలులా వుంది. అక్కడక్కడా మైనపు వత్తులు మాత్రం వెలుగుతున్నాయి. అక్కడమాత్రం టార్చివెలుగులో చూచి గదులోవో ఉన్నవని మాత్రం అనుకున్నా. మళ్ళీ ఇంకో మెట్ల నిచ్చెన వచ్చింది. అది ఎక్కా. అక్కడ అటు ఇటు గదులు. మధ్యహాలు వున్నట్లు అక్కడ వెలుగుతున్న రెండు లాంతర్ల మూలకంగా తెలుసుకున్నా. హాలు వాకిట్లో వొక మూలన వొక గంట కట్టి వుంది. దానికొక తాడు వొక కంతలోంచి కిందికి పోయినట్లుంది. బహుశ సింగడు క్రింద లాగిన తాడు అదైవుంటుంది. అక్కడ గంట మోగంగానే ఆ జవానంత మనిషొచ్చి తలుపు తీశాడు. అది బాస్ గది.

నావెంబడొచ్చిన సింగయ్య వంగి రెండు చేతులతో సలాములు చేసి "దూసరా షికార్ హుజూర్" అన్నాడు. అతను నాకళ్ళి తేరిపార చూసి "అచ్చాలేజావ్" అన్నాడు. మాకు తలుపు తీసిన మనిషి నన్ను ఆ హాలుకు బయట వరండాలోకి తెచ్చి, నాకొక గది చూపించాడు. దాంట్లో ఒక కుక్కి మంచం దానిమీద వొక జంపకాణ, దిండు వేసున్నది. ఆగది మాహా వుంటే మూడు గజాల పొడుగు, రెండు గజాల వెడల్పు ఉంటుంది. కిటికీ లేదు. మంచం వక్కన ఒక సీనారేకు గొట్టం, ఒక మట్టి కూజా దానిమీద అల్యూమినియం గ్లాసు మాత్రం ఉన్నయి.

నన్నక్కడ పడుకోమని చెప్పి సైగ జేసి ఇద్దరూ వెళ్ళిపోయినారు. నేనా

చీకటి గదిలో మంచం మీద పడుకొని ఆంజనేయదండకం అనుకుంటూ నన్నీ యమకింకరుల బారి నుంచి తప్పించు ఆంజనేయా అనుకుంటూ ఎప్పుడు పోయినానో వళ్ళు తెలియని నిద్ర పోయినా"అన్నాడు నిర్మలరావు.

కోటయ్య "ఉండు అపు, ఇప్పుడే నేను గుండె పగిలి చచ్చేట్టుగా ఉన్నా ఎన్ని కష్టాలుపడ్డావు" అని పక్కన చాయ్‌వాలా "చా" అని అరుస్తుంటే అతన్ని పిలిచాడు. ఇద్దరూ టీ తాగిం తర్వాత కోటయ్య వొళ్లిరుచుకొని ఒక నిట్టూర్పు విడిచి "ఇహ చెప్పు" అన్నాడు

నిర్మల "సరే, అట్లా నిద్రపోతుంటే ఏ పది గంటలకో ఎవరో నా పక్కలో కూచొని నన్ను లేపినట్లుగా తోచి కండ్లు తెరిచి చూచా. ఎవరున్నారూ? ఆ మొండి కాళ్ల సింగే. వొక్క క్షణం ఇదేంది ఎక్కడున్నాననిపించింది. కానీ సింగి సింగారించుకున్నట్లుంది. పొద్దున కబడడట్టులేదు. నెత్తికి నూనె రాసి మధ్య పాపిడి తీసి దువ్వింది. మొహాన బొట్టుపెట్టుకుని తెల్లచీర కట్టుకోనున్నది. కొంచెం చెమట కంపు కొడుతున్నా స్నానం మటుకు చేసినట్టుంది. నేను కండ్లు తెరిచి చూడంగానే చేతుల మీద దేకి దేకి మొద్దుపారి కాయలు కాసిన ఆ చెయ్యొకటి నా మొహాన రుద్దటం ప్రారంభిస్తే, ముళ్ళ కంపతో రుద్దినట్లుగా వుంటే దాని చెయ్యి పట్టుకొని విదిలించి కొట్టా.

"ఓ అందగత్తెను కాననా విదిలించి కొడతా" అని నా బుగ్గగిల్లింది. "లే నా మంచంమీద నుంచి లేచిపో" అన్నా కోపంతో "ఆ ఎందయ్యో యాడుం డావో సూసుకో. రాచ్చసిని మింగేత్తా తెలుసా" అన్నది. ఇదేదో నరక్కూపం లో వున్న సంగతి మరిచానే. ఏదో ఉపాయంగా ఇక్కడ్నుంచి వుడాయించాల గాని తగూలు పెట్టుకుంటే కాదనుకున్నా. "లేదులే సింగి చిలిపి చేష్టలు చెయ్యకుండా కూర్చుంటే కూర్చో" అన్నా. అది వికటంగా నవ్వింది. నా చెక్కిళ్ళు దాని రెండు చేతులతో దిగ తుడిచి అవి తన కణతల కానించుకొని మెటిక లొక్కసారిగా పెళ్ళున విరిచింది. వరాలంటి పిల్లోడివి దొరికావంది. దాని మొహం కేసి తేరిపార చూచా. పొద్దున కనబడ్డంత అసహ్యంగా ఇప్పుడు లేదు.

సింగి నవ్వుతూ "నాతో సరిగా వుండావా నీమీద పానాలిడుత్తా. నీ పానానికి నాపానం అడ్డేస్తా. లేకుంచే ఈడ మసే" అన్నది. నేను లేచి కూచొని దాని గడ్డంపట్టుకుని "సింగి నువ్వేం చేయమంటే అది చేస్తా. నీవెట్టా చెపితే

అట్లా ఇంటా. నావూపిరి పోకుండా చూసుకో” అని వగలేడ్చులేడ్చి దాని మెడ కరుచుకొని నా తల దాని వెడల్పాటి రొమ్ము భాగం మీద ఆనించా. అది నా తల మీద ముద్దుపెట్టుకుని “నీకాళ్ళు చేతులు ఇరగ్గొట్టకుండా సెక్కు సెదరకుండా వుంచే భారం నాది” అన్నది. “అయితే ఇక్కడ కాళ్ళు చేతులు ఇరగ్గొదతారా ఏమిటి?” అన్నా. “అయ్యో బాబో ఊపిరి పట్టి కూకో ఈడ జరిగే ఇసేసాలు ఎవరికీ సెప్పగాకు ఈడుండేదంతా రావణాసుళ్ళు నే సెప్పానని ఎవరికీ సెప్పగాకు” అన్నది. ఇంకొంచెం తర్కించడిగితే ఇవాళ చెప్పనని వూరుకున్నది. “ఎయ్ భాటీ” అని పిల్చింది. ఒక మొద్దాటి ముండాకొడుకు ప్రత్యక్షమైనాడు. ఏమో చప్పి పంపించింది.

కొంచెంసేపటికి బొత్తెడు పూరీలు, బంగాలాదుంపల కూర, చింతపండు పచ్చడి. నిమ్మకాయ వూరగాయ దొప్పల్లో తెచ్చి ఇద్దరి ముందర పెట్టాడు. ఇద్దరం కడుపునిండా తిని, ఆ కూజాలో నీళ్ళు తాగి తేపుతూ కూచున్నాం.

కనిపెంచిన వాండ్లను కాల్చుకుతిని పుట్టెడు దు:ఖంలో ముంచి వచ్చినందుకు ఫలితం ఎప్పుడోగాక ఇప్పుడే అనుభవించాల గామాల భగవంతుడా అనుకుంటూ మంచం మీద దొర్లుతున్నా.

“నీ కనుగుడ్లు పీకేత్తారు” అంది సింగి

నా వళ్ళు జలదరించింది. కాసేపట్లో ఏక్కడలేని చలి పెట్టుకొచ్చి వళ్ళు తెలియకుండా జ్వరమొచ్చి స్పృహ తప్పి పడిపోయా. దీపాలు పెట్టబోయే ముందు కొంచెం తెలివొచ్చి కండ్లు తెరచి చూస్తే సింగి నన్ను కరుచుకొని నా పక్కలోనే పడుకున్నది. సింగయ్య దాన్ని రమ్మని చెయ్యి పట్టుకు లాగుతున్నాడు. అది హిందూస్థానీలో ఏమోమో చెప్పుతూ అతన్ని రెండు చేతులు పట్టుకుని బతిమిలాడుతున్నది.

పక్క గదిలోంచి కెవ్...కెవ్ అనే కేకలు వినబడుతున్నాయి. మధ్యాహ్నం సింగి చెప్పిన మాటలు జ్ఞాపకమొచ్చి నాకండ్లు తీసెయ్యటానికి సింగయ్య వస్తే అతన్ని బతిమిలాడుతుందని గ్రహించా. నాకు ఎక్కడ్లేని భయం వేసింది. సింగి నా మంచం దగ్గర నా తల దిక్కున కూచొని వళ్ళు పట్టుకొని చూచి “ఎంత జరమొచ్చింది బాబూ. వొల్లు కాలిపోతుందదే. భయపడవాక. మా మహారాజుకు కచ్చితంగా చెప్పొచ్చా. కండ్లు పీకేయ్యరులే” అన్నది. “అయితే ఏం చేస్తా”రన్నా. కొన్నాళ్ళు బీదోణ్ణని టేసనుకాడ అడుక్కోమంటారు. అపైన యాదనన్నా మెళ్ళో

రుద్రాచ్చలు కట్టి కూకోబెట్టి సోది చెప్పిస్తారు. ఈ పిచ్చి బొంబాయిలో ఏలవెర్రిగా చేతులు సూపించుకుంటారు. ఎన్ని కాసులైనా ఇసిరి పుచ్చుకుపారేస్తారు. మనం ఎంత రూకలెక్కువ తెచ్చిస్తే అంత బాగా సూసు కుంటారీడ" అని ఎంతో విపులంగా దారి తప్పొచ్చిన నిర్భాగ్యులను, దొంగ తనంగా ఎత్తుకొచ్చిన పసి బిడ్డల్ని వికలాంగులుగా చేసి, వాండ్లు అడుక్కు తిని సంపాదించి తెచ్చిన దబ్బుతో నేను పొద్దున చూచిన మహారాజు ఈ వికలాంగు లెవ్వరూ పారి పోకుండా చూచుకొని వాళ్లు అడుక్కు తెచ్చిన దబ్బు జాగ్రత్తగా తెచ్చివ్వటానికిని యమకింకరుల్లాంటి మొద్దుముండా కొడుకులను ఎలా జీతాలిచ్చి పెట్టు కుండేది. ఇటువంటి రహస్యపు ముఠాలు పెద్ద పెద్ద పట్టణాల్లో ఉన్నాయి. అప్పుడప్పుడు అక్కడినుండి ఇక్కడికి, ఇక్కడినుండి అక్కడకు వికలాంగులను మారుస్తుంటారు. అన్నీ ఆ తాగిన నిషామీద, నామీదొక విధమైన ప్రేమమీద చెప్పింది. తన బోటి వికలాంగులైన ఆడవాండ్లను పగలల్లా బిచ్చమెత్త టానికి రాత్రిపూట వాండ్ల పక్కలో పడుకోటానికి ఏలా ఉపయోగించేది మొదలైన విషయాలన్నీ చెప్పింది. నాకేం ఫర్వాలేదని తనకు మహారాజు దగ్గర చనువుందని అతనితో నన్నేమన్నా చేస్తే తన స్వయంగా ప్రాణాలు తీసుకుంటానని నన్ను వికాలంగుడిగా చేయకుండానే తను నాతో వుండి ఎక్కువ సంపాదన అర్జించేట్టు చేస్తానని గూడా చెప్పింది.

మర్నాడుదయానికి జ్వరం తగ్గింది. ఆ సాయంకాలం దీపాలు పెట్టిన తరువాత సింగయ్య వచ్చి , సింగిని నన్ను ఒక చిన్న బండ్లో కూచోబెట్టి బోరీ బందరు స్టేషన్‌కు తీసుకెళ్లాడు. సింగిని పైనించి కిందికి దించే ముందు యధా ప్రకారం చింపిరి నెత్తి, చాలీచాలని చినిగిపోయిన మురికి బట్టలతో సింగారించాడు సింగయ్య. నేను మాత్రం నా గుడ్డల తోటే ఉన్నా. నన్నొక మొండి చేయి కుర్రాడికి అప్పజెప్పారు. నా ఉత్తరీయమే నా నెత్తిన ముసుగేసి నన్ను తయారు చేసారు.

బిక్కమొహం వేసుకొని పొట్ట నోరూ చూపిస్తూ "గరీబ్ కా బచ్చా మహరాజ్ ఖానా నహీ మహరాజ్" అని ఎట్లా బిచ్చమెత్తాల్సింది నా చేత రిహార్సల్ సహా చేయించి ఆ సింగే నాకు నేర్పింది. రైలు దగ్గర బిచ్చమెత్తటానికి పోయే ముందు ఒక కప్పుటీ, కొంచెం నానురొట్టె ఇచ్చారు. ఆ మొండి చేయి కుర్రాడు నేను ప్లాటుఫారం మీదకు పోయినాం. గొంతు కోసిన నక్కల్లాగా

"గరీబ్‌హై మహారాజ్... మహరాజ్" అని అరుస్తూ ఇద్దరం బిచ్చమెత్తాం. నా మొహం కళ్ళి చూచిన వాళ్ళు మళ్ళీ జేబుల్లో చేతులు పెట్టి అణాలు, బేడాలు కూడా ఇచ్చారు.

నడి ఝామునకు రైళ్ళ రణగొణ ధ్వని బాగా తగ్గింది.వికలాంగుల గుంపులు ఆ గల్లీ లోనికి చేరుకుంటున్నయి. మేము కూడా చేరుకున్నాం. అక్కడ 3 నుండి 12 ఎండ్ల వరకు ఈడుగల వికలాంగపు పిల్లలే ఎక్కువ. సింగితో పాటు ఇంకా వందమందిదాకా వుంటారు. అంతకన్నా అసహ్యంగా కనిపించే ఆడవాండ్లు, చేతులు లేనివాండ్లు, కాళ్ళు లేని వాండ్లు గూడా వొక పది మంది దాకా ఉంటారు. వీండ్లందిరి మీద వస్తాదులంటి మేస్త్రీలు పది పదిహేను మంది దాకా వుంటారు. అక్కడికి చేరుకున్న వాండ్లంతా ఆ మేస్త్రీల చేతుల్లో సంపాయించింది సంపాయించి బొత్తులు బొత్తులు పైసలు, కాన్లు పోస్తున్నారు.

నేను పోగానే సింగి "ఎంత తెచ్చా. సింగయ్య చేతుల్లో లెక్కపెట్టి పొయ్యమన్నది. నాజేబులోని చేతుల్లోది లెక్కబెడితే 2-10-0 లుంది. సింగి గుండెమీద చెయ్యి కొట్టుకుంటూ "నీ అంత తెచ్చిన నాయాళ్ళోరున్నారీడ!" అన్నది. సింగయ్య కూడా నా వీపున చరిచి సెహబాష్ అన్నాడు. ఆ వికలాంగపు పిల్లలు కొంతమంది నాచుట్టూ మూగి ఏదో కొత్త వస్తువును చూసినట్లు చూశారు. కాసేపట్లో ఎక్కడివాండ్లక్కడే పడి నిద్రపోయినారు. నాకు నిద్రరాలా. కింద పడుకోబుద్ధికాలా. కొంచెంసేపు సింగి పక్కనే కూచున్నా.

ఆ మనుషుల కంపు అవతల పాయిఖానాల కంపుతో తల పగల గొట్టుకు పోతున్నది. ముక్కుకు ఉత్తరీయం అడ్డంపెట్టుకుని కూచోని కూరేపాట్లు పడుతున్నా. తెల్లవారుఝామునకు మరీ చిన్నపిల్లల్ని కాకుండా ఏడెనిమిదేండ్ల దాటిన వాండ్లనులేపి మళ్ళీ రైళ్ళదగ్గరికి పంపారు. నేను, ఆమొండి చేయికుర్రాడు మళ్ళీవెళ్ళాం. నేనెక్కొచ్చిన మెయిలొచ్చింది. ఆ నిద్రకండ్లతోనే ఒకరిద్దర్నడిగా. ఎవ్వరూ ఏమీ ఇవ్వలా. ఎవరో అరవ బ్రాహ్మడు భార్యాసమేతంగా దిగాడు.

ఆయన దగ్గర నిల్చుని "అయ్యా బీదవాడ్ని" అంటున్నా. ఇంతలోకి ఎర్రటి ఎత్తాటి మనిషొకడు తెల్లటి దుస్తులు వేసుకున్నవాడు వచ్చి "సర్ వెల్‌కం సార్" అన్నాడు. "సౌతిండియన్ హోటలు సార్" అన్నాడు. ఆయన "కాల్ ఎ కార్ వుయ్ విల్ గో" అన్నాడు. అతను టాక్సీ అని కేకేసి చప్పట్లు కొట్టి ఒక

కారతన్ని పిలిచాడు. కారు రాగానే కారులో వాండ్ల సామాన్లు పెట్టుకొని వెనక సీట్లో కూచున్నారు. ముందు సీట్లో ఆ హోటలతను కూచున్నాడు.

నేను వాండ్లను వదలకుండా కారు దాకా పోయినా. తెలుగులో "అయ్యా బీద బ్రాహ్మణ్ణి. దిక్కు తెలియకవచ్చి ఇక్కడ చిక్కుకున్నాను" అన్నా "నీవు బ్రాహ్మణ పిల్లవాడివా" అవునన్నాను. "అయితే నీకు మంచి ఉ ద్యోగమిస్తాను" అని కారు తలుపు తీశాడు. అమ్మా బతికి పోయినానురా దేవుడా, రక్షించావురా అంజనేయా అనుకొని వెనకాముందూ ఆలోచించకుండా గబుక్కున ఎక్కి కూచున్నా. ఆయన తలుపేశాడు. కారు పురవదెక్కింది. నేను కండ్లు మూసుకుని వెనక్కు తిరిగి చూడకుండా ఆ కింకరుల బారినుంచి తప్పించుకొని ఈ నరక కూపంలోకి వచ్చిపడ్డా. ఇప్పటికి నెల రోజులయింది. మేడపైకెక్కిన వాడ్ని కిందికి రాలా. ఇవాళ నీతోపాటిక్కడికొచ్చా. ఇదీ నా కథ" అన్నాడు నిర్మలరావు.

కోటయ్య "ఓరి పూలమ్మినచోట కట్టెలమ్మాల్సొచ్చినట్టుందిగదా నీ బతుకు. ఇన్ని కష్టాలు పడుతూ ఇక్కడుండకపోతే నాతో రా పోదాం" అన్నాడు.

నిర్మల "ఎందుకులేరా రావటం. ఏదో ఇక్కడే ఇంకో ఉద్యోగం చూసుకుంటా"

కోటయ్య "మరిచిపోయా ఆ సూర్యనారాయణగారు ఇంకో ఉద్యోగం ఏర్పాటు చేస్తానన్నాడు. పోదాంపద, మీహోటల్లోనే పడుకుందాం" అని ఇద్దరు లేచొచ్చి హోటల్లో పడుకున్నారు. సృష్టికి వ్యతిరేకంగా దిక్కులేని అనాధలను నిర్దయతో అమానుషంగా వికలాంగులనుచేసి, వాండ్ల సంపాదన మీద ఆధారపడి సంపాదన గడించే కర్కోటకులు, దౌర్భాగ్యులు, ఈప్రపంచంలో ఉన్నారు గదా. భగవంతుడీ నిర్భాగ్యల మీద తన కరుణాకటాక్షాలను ప్రసాదించి రక్షించడు గదా. అటువంటి భగవంతుడు వుండేం? లేకేం? అనే ఆలోచనలతో ఇద్దరూ నిద్రపోయినారు. కోటయ్య ఉదయం లేచి, సాయంకాలం మళ్ళీవస్తానని వెళ్ళిపోయినాడు.

ఆసాయంకాలం 7 గంటలకల్లా కోటయ్య వచ్చిన కొంచెం సేపటికి సూర్యనారాయణగారొచ్చారు. వెంటనే ఆయన నిర్మలరావును కోటయ్యను వాండ్లింటికి తీసుకెళ్ళాడు "కోటయ్యనాయుడుగారూ నిర్మలరావును నా దగ్గర్నే వుండి ఫోంచేస్తూ పక్కన నైట్ స్కూల్లో చదువుకుంటాడు. ఎట్లాగో టిఫెన్

కారియర్‌లో అన్నం వస్తుంది తింటాం" అన్నాడు. కొంచెంసేపు ఏదో బాతాఖాని కొట్టి ఆ హోటలు నుంచి వచ్చిన అన్నం ముగ్గురూ తిన్నారు.

ఆరాత్రి పదిగంటల బండికే పోతున్నానని కోటయ్య వెళ్ళిపోయినాడు. అతను పోయేటప్పుడు నిర్మలరావు "నా చిరునామా ఎవరికీ చెప్పవాకురా బాగున్నానని మాత్రం చెప్పు" అన్నాడు

నిర్మలరావు రెండు రోజులకు పక్కనే ప్రయివేటు మిటిక్లేషన్ చదివే ఏర్పాటుగల బళ్ళో చేరాడు. సూర్యనారాయణగారితో పాటు ఒక అన్న తమ్ముడి లాగు కలిసి మెలిసి వుంటూ చదువులో నిమగ్నుడై కాలం గడుపుతున్నాడు నిర్మలుడు.



బిడ్డ పుట్టిన తర్వాత సీతయ్య, కాంతమ్మల మధ్య పొరపొచ్చాలొచ్చి వాండ్ల మధ్య తగువులు ప్రారంభమైనాయి. అందుకు పూర్తి బాధ్యత సీతయ్యదే. అతనికి కాంతమ్మ మీద ప్రేమ తగ్గిపోయి, ఆమెకు పురుడు పోసిన డాక్టరు పొన్నమ్మ మీదకు మనసు మళ్ళింది. మాటలతో ఆమెను వశపరచుకున్నాడు. వాండ్ల మధ్య అక్రమ సంబంధం మొదలై ఆ విషయం కాంతమ్మకు తెలియటంతో ఇంట్లో కాష్టం రగులుకున్నది. సీతయ్య పూర్తిగా కాంతమ్మను మరచిపోయి పొన్నమ్మ కోసం పరుగులు తీస్తున్నాడు. కాంతమ్మను ఎలా వదిలించుకోవాలా అన్న ఆలోచన కూడా అతనికి వచ్చింది. ఇంటి పనిమనిషిగా వున్న ఒక ముసలమ్మ సహకారంతో చివరికి అతనా కాంతమ్మను మోసగించి ఒక వేశ్యా గృహం వాండ్లకు అమ్మివేసి అక్కడికి పంపించి వేశాడు ఒకరోజు.



యుద్ధం తీవ్రమైపోయి జర్మన్ సైనికులు దాడులు తీవ్రం చేశారు. తెల్లవాండ్లకు ఓటమి తప్పదా అన్న వార్తలు వెలువడుతున్నాయి. యుద్ధంలో హవల్దారు కోటయ్య చనిపోయిన వార్త నిర్మలరావు చెవిన పడింది. బాల్యంలో అతని స్నేహం గుర్తొచ్చి బాధతో, అతన్ని చంపిన జర్మన్ పటాలాలపై కసితో నిర్మలరావు రగిలిపోయాడు. అంతలో సైనికాధికారుల నుంచి జారీ అయిన ఉత్తర్వుల ప్రకారం ఏసుదాసు యుద్ధానికి వెళ్ళాల్సిరావటంతో అతనికి సంతోషం వేసింది. ఇంతకాలంగా ఎదురుచూస్తున్నది అందుకోసమే కదా. యుద్ధంలో

భారతీయుల పటిమని చాటిచెప్పే అవకాశం వచ్చిందిపుడు. బాల్యస్నేహితుడు కోటయ్యను బలిగొన్న జర్మన్ పటాలాలను చీల్చి చెండాడే సమయం వచ్చింది అనుకొని ఏంతో సమరోత్సాహంతో తబ్బిబ్బవుతూ ఏసుదాసు యుద్ధభూమికి వెళ్ళినాడు.

జర్మన్ పటాలాలు చీమలదండులాగు చుట్టుముడుతూ తుపాకులు కాలుస్తూ బాంబు పేలుస్తూ బ్రిటీష్ సైన్యాన్ని చీల్చిచెండాడంతో ఏసుదాసు వాండ్ల గెరిల్లా యుద్ధ తంత్రానికి దీటుగా వ్యూహరచన చేస్తూ ఎదురుదాడులతో జర్మన్ పటాలాలను ముప్పుతిప్పలు పెడుతూ రెండు రోజులుగా వాండ్లను ముందుకు సాగనీయకుండా నిరోధించగలిగాడు. అటు తరువాత ఒకరోజు జరిగిన భీకర యుద్ధంలో ఏసుదాసు కుడికాలు తూటాల గాయాలతో ఛిద్రమై పోయింది. రక్తం వరదలా పారింది. వెంటనే అతన్ని సైనిక ఆస్పత్రికి తరలించారు. డాక్టర్లు ఇక తప్పదని కాలు తీసివేసి ఏసుదాసు ప్రాణాలు కాపాడినారు. ఆసుపత్రిలో అతను పూర్తిగా కోలుకున్న తరువాత జనరల్ రాబిన్‌సన్ గారి ఆజ్ఞల ప్రకారం ఏసుదాసుకు కృత్రిమ కాలు అమర్చి సైన్యం నించి విడుదల చేసి, అతనికి ధనం బహుమతిగా ఇచ్చి మదరాసులో సైనిక స్కూలు డైరక్టరుగా నియమించి పంపించినారు.

ఏసుదాసు ఇండియా వెళ్ళేందుకు హీత్రూ విమానాశ్రయంలో విమానం ఏక్కేందుకు వెళ్ళినపుడు మార్గరేటు కన్నీళ్ళు కారుస్తూ అతనికి వీడ్కోలు పలికింది. రాబిన్‌సన్ అతని భార్య ఏసుదాసకు ధైర్యం చెప్పి పంపించినారు. విమానంలో ఎక్కి స్వదేశానికి వస్తుండగా ఏసుదాసు మనసులో కాంతమ్మ మెదిలింది. ఎక్కడుందో, ఏం చేస్తున్నదో కాంతమ్మ. పేరయ్యశర్మ ఆకర్షణలో పడి తననంత నిర్దయగా దూరం చేసినా ఇంకా ఆమే గుర్తొస్తున్నదేంటబ్బా? అని అనుకొని అంతా ఆ విధి లీల అని అనుకొని ఢిల్లీలో విమానం దిగి అక్కడ్నుంచి గుంటూరు చేరుకొని కాంతమ్మ గురించి విచారించాడు. విషయం తెలుసుకొని కాంతమ్మ పరిస్థితిని తల్చుకొని జాలి పడ్డాడు. బాధతో కుమిలిపోయాడు. మనసు బాగోలేక తీర్థయాత్రలు చేస్తూ చివరకు రామేశ్వరం చేరాడు. అక్కడ కాంతమ్మ తారసపడింది. ఇద్దరూ ఒకళ్ళనొకళ్ళు గుర్తుపట్టి ముందుగా ఆశ్చర్యపోయి అటు తర్వాత తేరుకొని జరిగిందంతా ఒకళ్ళ కొకళ్ళు చెప్పుకొన్నారు.

కాంతమ్మ కన్నీళ్ళు కారుస్తూ బ్రహ్మసమాజ మందిరంలో తనకూ

సీతయ్యతో పెండ్లి జరగటం కామినీ విహార్లో కాపరం పెట్టడం కూతురు పుట్టడం ఈ సీతయ్యకు తనపట్ల ప్రేమ తీరిపోయి తనకు కాన్పు చేసిన డాక్టర్ పొన్నమ్మను వలలో వేసుకొని ఆ సీతయ్య తనను ఆ మసలి పనిదాని సహాయంతో వేశ్యా గృహం వాండ్లకు అమ్మటం అక్కడ్నించి పారిపోయి రామేశ్వరం చేరటం అంతా చెప్పింది.

ఏసుదాసుగా మారిన బండి అప్పలస్వామి యుద్ధంలో చేరి వీరమరణం పొందాలనుకుంటే భగవంతుడు అంగవైకల్యం మాత్రమే ప్రసాదించాడని చెప్పి ఆ యుద్దంలో తన కాలు దెబ్బతిన్న విషయం అంతా చెప్పి ఇప్పటికీ నీవంటే నాకు ప్రేమ అని కాంతమ్మను కౌగలించుకొని ఆమె కన్నీళ్ళు తుడిచి తన మనసులో ఆ కాంతమ్మకు పుట్టిన పిల్ల తన పోలికలతోనే పుట్టి ఉంటుందనుకొని అప్పుడా పిల్లను గురించి ఆరా తీశాడు. అందుకు కాంతమ్మ దిగులుగా నవ్వి అనుకోకుండా ఆపేరయ్యశర్మ రామేశ్వరం వచ్చి తలవని తలంపుగా నన్ను కలిసి నా చరిత్ర విని ఆ పిల్లని పెంపకానికి తీసుకొని పోయినాడు. దిక్కులేని దాన్నా పిల్లని పెంచలేనని మరో ఆలోచన లేకుండా ఒప్పుకొని పిల్లని ఆయన కప్పగించాను. పాలఘాటు పిల్ల అని ఆ పేరయ్యశర్మ భార్య బంధువులకు అబద్ధం చెప్పి ఒప్పించి అపురూపంగా ఇంట్లోనే పెంచుతున్నాడు. సంతానం లేని అతని భార్యక్కూడా ఆ పిల్లంటే ప్రేమ అని చెప్పినది.

వాండ్లా గతాన్నంతా మరిచిపోయి ఇద్దరు కలిసి పోయి ఏసుదాసు డైరక్టరుగా ఉన్న సైనిక పాఠశాలలో పనిచేస్తూ భార్యాభర్తల్లా ఒకటై పోయినారు.

సీతయ్య విషయం ఏసుదాసు అడిగినప్పుడు ఆ కాంతమ్మ భయంకరమైన నిజం చెబుతూ "పోలీసు అధికారిగా నయాన భయాన ఆ సీతయ్య చేసిన పాపాల నా భగవంతుడు గమనించక పోతాడా. అతనికి కుష్టువ్యాధిసోకి చాల దీనంగా హీనంగా చివరకా డాక్టర్ పొన్నమ్మ ఆసుపత్రిలోనే దిక్కులేని చావు చచ్చాడు. ఆ కాకాని కరణం అజాపజా తెలియకుండా ఎక్కడ ఏ ఇద్దరికో జుట్లు ముడేస్తుంటాడు" అని చెప్పింది.

❖❖❖ ❖❖❖ ❖❖❖ ❖❖❖

నిర్మలరావు బొంబాయి వీధుల్లో తిరుగుతూ "వందేమాతరం మనదే

భారతం" అంటూ పెద్దగా అరుస్తూ వీధి కూడళ్ళలో జనాన్ని పోగుచేసి స్వాతంత్రోద్యమం ఆవశ్యకతను జనానికి చెబుతూ పోరాటానికి సమాయత్త మవుతున్నాడు. "సోదర సోదరీమణులారా! 35 కోట్లమంది భారతీయులను వందల సంఖ్యలో బలగాలతో వచ్చిన తెల్లవాండ్లు దౌర్జన్యంగా మన మీద అధికారం చలాయిస్తూ ఆధునిక ఆయుధాలతో మనలను బెదిరిస్తున్నారంటే సహించేదెలా? విప్లవ పంథాలో దెబ్బకు దెబ్బ తీసి ఆ తెల్లవాండ్లను మన భూభాగాల నుంచి బ్రిటన్ వెళ్ళగొట్టటమే మన కర్తవ్యం. ఇతర దేశాలను వలస దేశాలుగా మార్చుకొని కండ కావరంతో ఆ బ్రిటిష్ ముష్కరులు దౌర్జన్యాలు కొనసాగిస్తున్నప్పుడు మనం ఆయుధాలు ధరించి పోరాడటం వాండ్లను నిర్మూలించటం తప్పు కాదు. ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే అని గీతాచార్యుడు చెప్పినట్లు ఆ రాక్షస గణాలను ఆయుధాలతో నిర్మూలించటం కోసం ప్రతి భారతీయుడు నడుం బిగించే సమయం వచ్చినది" అని ఉద్రేక పూరితంగా ఉపన్యాసం ఇస్తూ దేశభక్తిని ప్రేరేపిస్తున్నాడు.

అప్పుడెవ్వరూ వూహించలేదు గానీ ఆ నిర్మలరావు భారతదేశ స్వాతంత్ర్య పోరాటంలో తానొక్కడే నూరు తుపాకులై గర్జిస్తాడనీ, వ్యూహం ప్రకారం బ్రిటిష్ - ఇండియా సైన్యంలో చేరి యుద్ధ విద్యలు నేర్చుకొని ఆ యుద్ధ విద్యలను హిందూస్థాన్ రిపబ్లిక్ ఆర్మీ వాండ్లకు నేర్పుతాడనీ విప్లవోద్యమానికి భాధ్యత వహించి బ్రిటిష్ పాలకులను బెంబేలెత్తిస్తాడని ముందుగా ఎలా ఎవరైనా వూహించ గలరా! విప్లవ పోరాటంలో రాటుదేలి ఆ నిర్మలరావు జీవితం ధన్యమైనదని భరతమాత కండ్లలో ఎంత ఆనందపు మెరుపో!





## నవల వెనుక కథ

తంజావూరు స్పెషల్ జైలులో డిటెన్యూగా నిర్భంధంలో వున్న 1930వ దశకంలో అన్నాప్రగడ కామేశ్వరరావుగారు రచించిన నవలఇది. అప్పటి సాంఘిక, రాజకీయ పరిస్థితులను కళ్ళకు కట్టి చూపుతుంది. బ్రిటిష్ వలసవాదుల మాయోపాయాలకు, బ్రిటిష్-ఇండియా సైన్యంలో ఉన్న భారతీయ సిపాయిలను బానిసలుగా చూసిన తెల్లవాళ్ల అకృత్యాలకు అద్దం పడుతుంది. రెండవ ప్రపంచ యుద్ధంలో భారతీయ సైనికుల వీరోచిత పోరాటాన్ని, సాధించిన విజయాలను తెల్ల సిపాయిలకు ఆపాదించి యుద్ధ కీర్తినికూడా దొంగిలించిన బ్రిటీష్ వారి సాపత్యాన్ని తూర్పార పడుతుంది. నవలలో ఉన్న పాత్రలు, ప్రదేశాలు మనకు తెలిసినవే అనిపించటం రచనా సౌందర్యం. ఇక మీరే చదవండి.

INDIRA, 9160167999.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01B225 |
| పుస్తకం పేరు | జేబు పాట |
| తారీఖు | 22-8-23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 205 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, 197 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Jyothi |
| పేజీలు విడదీసినది | Jyothi |
| స్కాన్ చేసినది | manasa |
| పరీక్ష చేసినది | MOUNIKA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | |
| పరిస్థితి | |